శ్రీః

# కువలయాశ్వ చరిత్రము
## ఒక పరామర్శము


రచన :

భాషాప్రవీణ

**డాక్టర్ పుయ్యూరు లక్ష్మీనరసింహారావు,**

పి.ఒ.ఎల్., ఎమ్.ఏ., ఎమ్.ఫిల్., పి.హెచ్.డి.

సంస్కృతోపన్యాసకుఁడు, విజ్ఞాన్ రెసిడెన్షియల్ కాలేజి,

వడ్లమూడి - 522 213.






ప్రచురణ :

ందుమౌళి గ్రంథమాల,

సెలపాడు - 522 217,

ారు - తాలూకా & జిల్లా (ఆంధ్ర)

శ్రీః

ఇందుమౌళిగ్రంథమాల - ప్రథమపుష్పము

# కువలయాశ్వ చరిత్రము

## ఒకపరామర్శము

రచన :

భాషాప్రవీణ

డాక్టర్ పుల్యాక్యారు లక్ష్మీనరసింహారావు,

పి.ఒ.ఎల్., ఎమ్.ఏ., ఎమ్.ఫిల్., పిహెచ్.డి.,

సంస్కృతోపన్యాసకుడు, విజ్ఞాన్ రెసిడెన్షియల్ కాలేజి,

వడమూడి - 522 213




ప్రచురణ :

ఇందుమౌళి గ్రంథమాల,

సెలపాడు - 522 217,

గుంటూరు - తాలూకా & జిల్లా (ఆంధ్ర).

 1988 [ వెల రూ. 50-00

ప్రథమముద్రణ : ప్రభవ, జనవరి, 1988.

ప్రతులు : 1,000.

ఇది పిహెచ్.డి., పట్టముకొఱకు 27-12-1985నాఁడు
నాగార్జునవిశ్వవిద్యాలయమునకు సమర్పింపఁబడినసిద్ధాన్తగ్రన్థము

ప్రతులకు : 1. న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్,
అరండల్ పేఁట, గుంటూరు-2.
ఫోను : 22984.

2. ఇందుమౌళిగ్రంథమాల,
పెలపాడు-522 217,
గుంటూరు - తాలూకా & జిల్లా (ఆంధ్ర).

ముద్రణ : ఆదిత్య ప్రింటర్స్, గంగానమ్మపేఁట - తెనాలి.

శ్రీః

# ఆశీస్సులు

శ్లో॥ సారస్వతస్య తవస
సిద్ధిం దీర్ఘాయుషా సమం దిశతామ్ ।
నరసింహరాయనామ్నే
వాగర్థా దమ్పతీ శివా వస్మై ॥ 1

క. బుధరాట్సంసేవనమున
సుధి వై, నరసింహరాయ! సూక్తిసుధాశ్రీ
నిధి వై, శుభ్రయశశ్శ్రీ
నిధి వై కలకాల మీవు నిలువుము ధరపై. 2

క. కృత మది మఱవకు మెన్నఁడు,
మతి గర్వము చేర నీకు, మాన్యులయెడ ను
ద్ధతిఁ జూపకు, ధర్మపథ
స్థితి తప్పకు శ్రేయ మందుతెరు విది వత్సా ! 3

క. కూలంకష మగురీతుల
నాలోడనచేసి కువలయాశ్వచరిత్రం
బేలినవారలబిరుదం
బేలితి దీర్ఘాయు వందుమీ ! నరసింహా ! 4

చ. ఇల కలయంతకాలము మహేశ్వరిసత్కృపతోడ నెంతయున్
వెలసి, మహోత్తమంబు లయి విశ్వజనీనము లై నసత్కృతుల్
వెలయఁగఁ జేసి, సద్గురులవిశ్రుతకీర్తికి వన్నె వెట్టుచున్
వెలయుము శిష్యవర్య! కవివీరులవాక్కు లమోఘముల్ సుమీ! 5

'వ్యాకరణవిద్యాప్రవీణ' 'ఉభయభాషాప్రవీణ'
'సాహిత్యాలఙ్కార' 'సహస్రావధాని'
'విద్యావాచస్పతి'
'మధురావిజయ, ఉత్తరహరివంశాదిగ్రన్థవ్యాఖ్యాత'
పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి

తెనాలి,
1988.

శ్రీః

## అంకితము

సీ॥ ఎవ్వాని సాహసం బెల్లవిద్యార్థుల
ప్రగతికై వేసినరాచబాట,
యెవ్వానియూహమ్ము లెల్లవేళల నూత్న
విద్యాప్రమాణముల్ వెదకుచుండు,
నెవ్వానిదాతృత్వ మెచ్చుగా వ్యక్తమై
యర్థిసంఘములకున్ హర్ష మిచ్చు,
నెవ్వానిహాసమ్ము లెల్లవారికిఁ జంద్రి
కలవలెన్ హాయినిం గలుగఁజేయు,

గీ॥ నట్టిలావువంశాబ్ధిశశాంకునకును,
మహితరత్తయ్యనామసమంచితునకు,
ననుపమానవిజ్ఞానసంస్థాధిపతికి,
సుకృతి కంకితము మదీయసుకృతి యిద్ది.

ఇట్లు
గ్రంథకర్త

పెలపాడు,
సంక్రాంతి, 1938.

కీ॥ శే॥ శ్రీనీలిసెట్టి బసవేశ్వరరావు, B. A., గారు



జననము : 15-5-1944



మరణము : 26-12-1984

# సంస్మృతి

గీ॥ నాదువిద్యాభివృద్ధికి మోదమునను
సాయ మొనరించినట్టివిశాలహృదయ!
ప్రాణమిత్త్రమా। నాదువిద్యాభివృద్ధి
గాంచకమునుపె విధి కబళించె మిమ్ము;
నాఁటిసాయమ్ము మది నెంచి నేఁటివేడ్క
నిట్లు మిమ్ముల సంస్మరియించుచుంటి,
నీలిసెట్టివంశాబ్ధివినిర్మలశశి!
ప్రణతి శ్రీబసవేశ్వరరాయవర్య!

ఇట్లు

వుయ్యూరు లక్ష్మీనరసింహారావు

# ఒక్కమాట

Dr. Y. B. GANGADHARA RAO, M.A., Ph.D.,
READER, DEPARTMENT OF TELUGU
&
ORIENTAL LANGUAGES,
NAGARJUNA UNIVERSITY.
VICE-PRESIDENT, PLACE NAMES SOCIETY OF INDIA.
PRESIDENT, TELUGU PLACE NAMES SOCIETY.

రాజమహేంద్రవరంలో మోసులెత్తి, కొండవీట చిగురుదొడిగి, విజయనగరాన మొగ్గదొడిగి, తంజావూర పండబారింది తెలుగుకవిత. స్థూలంగా తెలుగుసాహిత్యచరిత్ర ఈనాలుగునాళ్లలోను పెనవేసుకుంది. తంజావూరులో పండబారినకవిత్వం సరిపడనికొందరిదారి వేరు.ఆదారి చాలమందికి సరిపడని సంగతి. అదలావుండగా ప్రకృతపరిశీలనాగ్రంథము కువలయాశ్వచరిత్రము ఆసీమకు అనతిదూరంలో గల చెంజిసీమలో పుట్టింది. కృతికర్త నవరము చిననారాయణ. పేరుకే చిన్న. కవిత్వం పలకడంలో ప్రౌఢుడు.ఇది నేనే అంటున్నమాట కాదు.కవిత్వతత్త్వ మెరిగినపండితు లంతమంది అన్నమాట. గ్రహించినఇతివృత్తమూ అందరెరిగినదే.దానిని విపులీకరించడానికి ఆతడెన్నుకున్న రీతి సామాన్యమైనదే. ఆమాటకొస్తే దక్షిణాంధ్రసాహిత్యమంతా చూడటానికి పైపైన అంతా ఒకేమూసలో ఉన్నట్లు కన్పిస్తుంది.నిజానికి అలా కన్పించేవి ఏవో కొన్నియక్షగానాలు తప్ప. అక్కడ వెలువడినవాటికి-దేనిగొప్ప దానికే వుంది,ఆతీరు కువయాశ్వచరిత్రంలోనువుంది.అదేదో తగుదునంటూ పనిగట్టుకుని నేను వివరింపనవసరం లేదు.ఏమంటే కొన్నికావ్యాలను పరిచయం చేయ పూను కోవడం వాటిని లఘూకరించడమే అవుతుంది.

అదలావుండగా మాలక్ష్మీనరసింహారావు దీనిపై 'డాక్టరేట్' పట్టంనిమిత్తం పరిశీలించడానికి పూనుకున్నాడు.అంటే ఇదికూడ కావ్యపరిచయం క్రిందనే జమ అవుతుంది గదా! మరి అలాంటిఅవసరం దీనికి వుందా? మరి పైన అలా అన్నారేమి? - అనవచ్చు. అదిగో ఆమాటే చెప్పబోతున్నాను.

నిజానికి ఈమాట ఆదిలో నాదగ్గర పరిశోధనకు చేరినప్పుడు నరసింహారావుతోనే చెప్పాను.కారణ మేమంటే, ఏదో కావ్యాన్ని గ్రహించడం—అర్థతాత్పర్యాలు (అవీ సొంతం కాదు)వివరించడం.ఇదీ సిద్ధాంతగ్రంథ మనడం నేడు పరిపాటి అయిపోయింది. కనకనే నీసిద్ధాంతగ్రంథం విలక్షణంగా ఉండకూడదు. సలక్షణంగా ఉండా లన్నాను.ఆమాటమీదే నడిచాడు,మాట నిలబెట్టుకున్నాడు. శీర్షిక లన్నీ సామాన్యంగానే కనిపించవచ్చు—పూర్తిగా చదవండి.మీకై మీరు నిగ్గు తేల్చండి.అతడు మాట నిలబెట్టుకున్నతీరు అర్థమవుతుంది. అందుకే నేను కూడ ఈపరిశోధనాగ్రంథంలో ఇది వుంది అది వుంది అని చెప్పాలనుకోలేదు.బహుశా నాఅభిప్రాయం కోరడంలో అతనిఅభిమతం కూడ అదై వుండదు.పదార్థం వడ్డించి వుంచగా, వండినతీరుగూర్చి ముచ్చట లెందుకు ?

అయితే ఒక్కమాట. ఈగ్రంథంపై ఇప్పటికి రెండుపరిష్కరణలు వచ్చాయి.ఇది మూడవపరిష్కరణ.తెలుగుదనంలో మూడు కెంతప్రాధాన్య ముందో వివరించాల్సిన అవసరం వుందనుకోను.దానినీ చదువరులకే వదిలి వేస్తున్నాను.

మాలక్ష్మీనరసింహారావు తనసిద్ధాంతగ్రంథాన్ని వదాన్యశేఖరులైన శ్రీఎల్. రత్తయ్య, ఎమ్.ఎస్సి., ఎమ్.ఇడి., డి.జె., గారికి అంకితమివ్వటం ముదావహవిషయం, ఔచిత్యవిలసితం.

ఇదేవిధంగా మానరసింహారావు సహృదయాహ్లాదకర మైనపరిశోధన గ్రంథాలు నిర్మించి వాగ్దేవి నారాధిస్తాడని ఆశిస్తున్నాను, ఆశీర్వదిస్తున్నాను.

"విద్యా గురూణాం గురుః"

—శ్రీభర్తృహరి

ఇట్లు

(సం.) యార్లగడ్డ బాలగంగాధరరావు

# భూమిక

**Dr. V. RAMACHANDRA CHOUDARY,**
M.A., Ph.D.,

PROFESSOR AND HEAD,
DEPARTMENT OF TELUGU,
UNIVERSITY OF MADRAS,
MADRAS – 600 005.

తెలుఁగులోని ప్రౌఢ ప్రబంధములలో 'కువలయాశ్వచరిత్ర' మొకటి. తత్కర్త సవరము చిననారాయణనాయకుఁడు. చెంజికి చెందినకవి. 17వశతాబ్ది ప్రథమార్ధమున (1645-49. చూ.పుట-32) చెంజిరాజ్య మేలినవరదేంద్రునికి సమకాలికుఁడు. బంధువు కూడ నై యుండవచ్చును. ఎంతపండితుఁడో అంతభావుకుఁ డతఁడు. అందుచేతనే, శ్లేషప్రియుఁ డైనను తనకవిత్వమున దానికి పెత్తన మీలేదు.

ప్రౌఢప్రబంధపరిశీలనము అంత సులభ మైనపని కాదు. గొప్పప్రతిభా పాండిత్యము లున్ననే గాని, కువలయాశ్వచరిత్రవంటి ప్రబంధమును జేపట్టి దానివైశిష్ట్యమును సమగ్రముగా నావిష్కరించుట కుదురనిపని. ప్రతిభావ్యుత్పత్తులతోఁబాటు విమర్శకుఁడు నిష్పాక్షికదృష్టి కూడ కలిగినసహృదయుఁడు గావలెను. చిరంజీవి లక్ష్మీనరసింహారావు అట్టివాఁడు. అతనికి వట్టికుతూహలమే గాక, ప్రౌఢప్రబంధపరిశీలనకుఁ గావలసినయర్హత లన్నియు సమరి యున్నవి. అందుచేతనే యీ విమర్శగ్రంథ మింత విశిష్టముగా రూపొందినది.

ఇది నరసింహారావు తన డాక్టరేట్ డిగ్రీ కొఱకై రూపొందించిన సిద్ధాంతవ్యాసము. తనరచన నతఁడు 16 దళములుగా విభజించినాఁడు. వీనిలో కువలయాశ్వచరిత్ర గొప్పఁదనమంతయు నించుకైనను పొల్లువోకుండ నావిష్కరింపఁ గలిగినాఁడు. ఈతఁడు తన గ్రంథమును సుపరిష్కృత మొనర్చుకొని, తరువాత నెతద్విమర్శకుఁ గడంగుట మెచ్చఁదగి యున్నది. ఆపాఠపరిష్కరణమున కొకదళమునే ప్రత్యేకించినాఁడు. పాఠపరిష్కరణ మందఱును చేయఁదగినపని కాదు. పాండిత్యప్రకర్ష గలిగి, కవిత్వరహస్యము

తెలిఁగినవారు చేసినపాఠపరిష్కరణమే ప్రశంసార్హ మగును. ఈపాఠపరిష్కరణవిషయమున నరసింహారావు ప్రదర్శించిన సూక్ష్మపరిశీలనశక్తి ప్రథమదళమున విశద మగును. ఈపరిష్కరణకార్యము ప్రామాణిక మైనతత్ప్రబంధ విమర్శలో నాతని కెంతో తోడ్పడినది.

తక్కినదళములలో ప్రబంధగతము లైనయన్యాంశములను తలస్పర్శముగాఁ బరిశీలించి అవి నారాయణనాయకుని ప్రతిభావ్యుత్పత్తుల నెట్లు నిరూపించు చున్నవో వివరించి యున్నాఁడు.

తృతీయదళమునందలి "భేదసాదృశ్యములు-సమన్వయమార్గములు" అన్న శీర్షికయు, చతుర్థదళములోని అలంకారపరిశీలనమును రచయితపరిశీలనాశక్తికిని, పాండితీపటిమకును చక్కనినిదర్శనములు. షష్ఠదళమునందలిపాత్రచిత్రణరసపరిపోషణములను గుణించిన రచన సంగ్రహసమగ్ర మైనది. ఏడవదళమునఁ బ్రదర్శింపఁబడినశ్లేషవైచిత్రి యెల్లరకును మెచ్చుగొల్పునది. అష్టమదళమునందలిరచన అచ్చతెలుఁగునకు సంబంధించినయితనియవగాహనను దెలుపు చుండఁగా, నవమదళములోనిసంస్కృతవిభాగమునకు సంబంధించిన వ్యాకరణవిశేషానుశీలనము నరసింహారావు తనసంస్కృతవ్యాకరణపరిజ్ఞానమును బ్రదర్శించినట్టి మగు చున్నది.

దశమదళములోని 'విడుపైటచెఱఁగు' పద్యమునందలి 'మొగమింతచేసికొను' అనుమాటల కీతఁ డిచ్చిన వివరణము సరస మై యున్నది. ద్వాదశదళమున నీఁబడినపర్యాయపదములపట్టిక యీపరిశోధనకార్యము నీతఁ డెంత శ్రద్ధాసక్తులతో నిర్వహించెనో తెలుపును.

త్రయోదశదళమున 1-75పద్యమున "సురపట్టణ + అధ్వ + అంత — రోధి" అని చేయఁబడినపదచ్ఛేదము సముచిత మై యుండి కవిహృదయమును బట్టి యిచ్చు చున్నది. 4-5లోనిఇక్షుధనుష్కరూపసమర్థన మితనివ్యాకరణశాస్త్రపరిజ్ఞానమును ప్రదర్శించును. "రహిఁ బాదమహిమచే" ననుపద్యమున "జాతి నారి నొనర్చ" ననుప్రయోగవిషయమున కతఁడు చేసినయర్థనిరూపణ మతని సూక్ష్మగ్రాహితకు నిదర్శనము. 'చేయెచ్చు' ప్రయోగస్వారస్యమును

అనుక్షణము ఆశీస్సు లందించుటయే కాక, నేను వేఁడినతోడనే ప్రామాణికవచనములతో భూమిక నిర్మించి యిచ్చి, యీపుస్తకమునకు నిండుదనమును చేకూర్చి, అతులితవాత్సల్యముతో ఆశీర్వచఃపీయూషధారలు కురిపించి నా కానంద మందించినారు.

ముందుగా ఈగురుత్రయమునకు కృతజ్ఞతాభివందనములు.

మఱియు పరోక్షముగ నాచదువును ప్రోత్సహించు చున్నపెద్దలు— శ్రీమాన్ నిమ్మగడ్డ రామమోహనరావుగారు (మంగళగిరి మండల ప్రజాపరిషదధ్యక్షులు), శ్రీమాన్ డాక్టర్ వయ్యూరు విజయభాస్కరరెడ్డి, M. B. B. S. గారు (తెనాలి), మా బాబాయి శ్రీమాన్ సింహాద్రి జగన్మోహనరావు, M. A, B. O. L., గారు (తెనుఁగుపండితులు, గోదావరిఖని), మా మేనమామ శ్రీమాన్ మాదు సూర్యప్రకాశరావుగారు (సంస్కృతోపన్యాసకులు, తాడికొండ) — వీరికివి కృతజ్ఞతాంజలి.

ఈగ్రంథరచనాకాలమున ఆర్థికముగను, హార్దికముగను సహకరించి ప్రోత్సహించినసహృదయవర్యులు ఈకృతిస్వీకర్త శ్రీమాన్ ఎల్. రత్తయ్యా, M. Sc, M Ed, D. J., గారు (విజ్ఞానవిద్యాసంస్థాధిపతి) — వీరికిని కృతజ్ఞతాంజలి.

ఇంకను గ్రంథరాజములు బహూకరించి ప్రోత్సహించిన మిత్త్రవరేణ్యులు—

శ్రీ ములుకుట్ల వేంకటవరప్రసాదరావు (ప్రొ॥ శ్రీఆంధ్రకాఫీవర్క్సు, తెనాలి)

భాషాప్రవీణ శ్రీకైనేని నాగభూషణం, P. O. L., (తెనుఁగుపండితుఁడు, కొల్లూరు)

,, శ్రీబృందావనం గోపాలాచార్యులు, P. O. L., (తెనుఁగు పండితుఁడు, పెనమఱ్ఱు)

,, శ్రీచిలుమూరు రామలింగేశ్వరరావు, P. O L., (తెనుఁగు పండితుఁడు, తెనాలి)

భాషాప్రవీణ శ్రీఅన్నదానం వేంకటసుబ్రహ్మణ్యం, M. A., P. L. O.,
(తెలుగు పండితుడు, హైదరాబాదు)
శ్రీమేళ్ళచెఱువు శివరామకృష్ణ, B. A., LITT., (స్టెనో, హైదరాబాదు)
సోదరి శ్రీమతి జ్యోతి, M. A., M. Phil., (తెనాలి)

శ్రీఈదర అప్పారావు(వేంకటకృష్ణాయపాలెము)[ఈమిత్త్రిపత్తముడు వారసత్వముగ తమకు సంక్రమించినరెండువందలగ్రంథములను నాకు బహూకరించినయుదారశీలి] - వీరి కందఱకును కృతజ్ఞతాంజలి.

ఈగ్రంథముద్రణార్థము ఆర్థికసాహాయ్యము చేసినసహాధ్యాపకులకు కృతజ్ఞతాంజలి, విద్యార్థులకు శుభాశీశ్శతములు.గతకాలమున లభించినయార్థికసాహాయ్యము చాలక ముద్రణకార్యము కుంటువడి యుండఁగా, నూతనవిద్యార్థులలోని చిరంజీవి యం. శ్రీకాంత్ మఱియు యస్. వీరేందర్ అనువిద్యార్థిద్వయము సహచరవిద్యార్థులనుండి చందాలు సేకరించి సమర్పించి సహకరించెను.వీరికిని, మా విద్యార్థులందఱకు మరల శుభాశీస్సహస్రములు.

ఈగ్రంథముద్రణకు అనుమతించినవిశ్వవిద్యాలయాధికారులకును, ఇందలి ప్రథమదళమును 1987ఆగస్టు, సెప్టెంబరు సంచికలలో ప్రచురించిన స్రవంతి సాహిత్యమాసపత్త్రికాసంపాదకులకును కృతజ్ఞతాంజలి.

ఈపుస్తకము నిట్లు అందముగ ముద్రించి యిచ్చినఆదిత్యప్రింటర్సు సోదరులకు కృతజ్ఞతాభినందనశతములు. విశేషించి యీసోదరత్రయములోని మధ్యముఁడు మాప్రియమిత్త్రము, సతీర్థ్యుఁడు, సహృదయచంద్రుఁడు భాషాప్రవీణ శ్రీకూర్మనాథ్, M.A.,P O.L., పెన్నోయిబ్బందులను ఎదుర్కొనినను ఈపుస్తకము నుచితముగ ముద్రించి యిచ్చినాఁడు. ఈతనిమేలు మఱవరానిది

ముద్రణకాలమున అడుగడున ధైర్యవచనములతో ప్రోత్సహించినమిత్త్రవర్యుఁడు శ్రీసహెచ్.నరసింహారావు, M.A.B.Ed .—ఇతనికిని, ఈ పుస్తక విక్రయబాధ్యత స్వీకరించిన న్యూస్టూడెంట్స్‌బుక్‌సెంటరు ప్రొప్రయిటరు శ్రీరమేష్ గారికిని కృతజ్ఞతలు!

ఇట్లు
వుయ.హ్గిరు లక్ష్మీనరసింహారావు

# నానుడి

శ్లో॥ వాచం వాణీం గిరం భాషాం భారతీం గాం సరస్వతీమ్।
బ్రాహ్మీం వర్ణాత్మికాం దేవీం వందే ప్రణవమాతరమ్॥

ప్రపూర్వకాలమునుండియు శ్రీమద్భారతభూమండలమందలివిద్వత్సభలలో విద్వద్గోష్ఠులు, విమర్శవినోదములు జరుగు చుండినవి. అధునాతనకాలమున సాహిత్యవిమర్శములు వేదికలమీఁదకన్న కాగితములమీఁద మిన్నగా సాగుచున్నవి. ఇట్టివిమర్శములయందు ఈసిద్ధాంతవ్యాసరచనావిధాన మొకటి. ఈవిధానమున నాసిద్ధాంతవ్యాసమునకై "సవరము చిననారాయణనాయకకవివిరచితకువలయాశ్వచరిత్ర" మనునయిదాశ్వాసములప్రబంధము గ్రహింపఁబడినది. చిత్రవిచిత్రకథాచమత్కృతులు గలిగి, అద్భుతజాతివార్తల కాలవాలమై, సహజసంభాషణాత్మక మయినయీప్రబంధముపై నేను నిర్మించినయీసిద్ధాంతవ్యాసము షోడశదళసమలంకృతము.

కథాకథనములో కళాపూర్ణోదయమును, సంభాషణానిర్వహణములో విజయవిలాసమును స్ఫురింపఁజేయున దీప్రబంధము. చేతుము(2–38) వంటి స్వేచ్ఛాప్రయోగములు, యుగప్రభావమును ప్రతిబింబించునతివేలశృంగారము ఈకావ్యమున కన్పించు చున్నను దాదాపు కావ్యమంతట కవిజాగరూకత కూడ కన్పించు చున్నది. ముంజేతికంకణమున కద్దము నిడుటవంటిప్రయత్నము నిట చేయక, చిననారాయణునిహృదయద్వారములను తెఱచి సహృదయవరేణ్యుల నాహ్వానించు చున్నాను.

ఈవ్యాసరచనలో విశ్రాంతికై అటనట విసంధి పాటింపఁబడినది. అక్కడక్కడ భావస్పష్టతకై 'అయితే' 'కాకపోతే' వంటివ్యావహారికములు ప్రయోగింపఁబడినవి. మఱియు (శిష్ట)వ్యవహారమున నున్నయన్యదేశ్యములు కూడ అచ్చటచ్చట నుపయోగింపఁబడినవి.

శ్రీగురుదేవులకృపావీక్షణము, బంధుమిత్త్రులప్రోత్సాహబలమును నాకుడియెడమల నండదండలుగా నుండుటఁజేసి నేనీచదువవఱకువచ్చి, యీవ్యాసము నిట్లు నిర్మింపఁగలిగితిని పర్యవేక్షకులవారిసహకారబలమువలన నిర్ణయించుకొనినసమయమునకు సమర్పింపఁగలిగితిని. ఇందలిబాగోగులనిర్ణయాధికారము సహృదయశిరోమణులదే.

సెలపాడు

సంక్రాంతి, 1988

సుధీజనవిధేయుఁడు

వుయ్యాపు లక్ష్మీనరసింహారావు

# కృతజ్ఞతలు

ఉ. పొందికమేలు తెండమునఁ బొందుగ మాటిమాటికిం దలం
చం దగు మానవాళికిల సత్తమశీలము వన్నె కెక్కఁగాఁ;
నిందుకు భిన్నరీతిఁ జరియించిన శీలవిభూష మాసిపో
వం దగు వ్యంగ్యవైభవము పొందనికావ్యలలామకై వడిన్.

సంస్కృతకళాశాలలోనే కాక, తాము ఉద్యోగవిరమణ చేసినతరువాత కూడ దశాబ్దకాలమునుండినాకు పాణినీయాదులు బోధించుచు, ఆర్థికసాహాయ్యము కూడ చేయుచున్నగురుదేవులు బ్రహ్మశ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రిల వారు.వారు ఉత్తరహరివంశవ్యాఖ్యానిమగ్నమానసు లయ్యు నాపలుసందియములు తీర్చినారు.ఈసందర్భమున అపరిమితవాత్సల్యముతో ఆశీర్వచస్సుధావృష్టి కురి పించి నూతనోత్తేజమును నాకు చేకూర్చినారు.

పరిశోధనకాలమున నపరిమితవాత్సల్యపీయూషధారలు కురిపించుచు, అడుగడుగున సముచితసూచన లిచ్చుచు నాసిద్ధాంతగ్రంథరచనావిధానమును ప్రోత్స హించినపర్యవేక్షకగురుదేవులు శ్రీమాన్ చూర్ణిగడ్డ బాలగంగాధరరావు గారు.ఎందరో పరిశోధనపర్యవేక్షకులు పరిశోధకవిద్యార్థులచేత వెట్టిచాకిరీ చేయిం చుకొను చున్నయీరోజులలో పరిశోధకవిద్యార్థులను పరిశోధనరంగముననే పరిమితము చేసినమహానుభావులు వీరు.అలనాఁటియాదరణయే కాక ఈనాఁడు 'ఒక్కమాట'లో పెక్కువాక్యములసారమును కూర్చి, యీముద్రణగ్రంథము నకు క్రొత్తవన్నె చేకూర్చి, ఆశీర్వచనామృతవృష్టి కురిపించి నన్ను మురి పించినారు.

అలనాఁడు మదరాసువిశ్వవిద్యాలయమున ఎమ్.ఫిల్., పరిశోధనకాలమున పర్యవేక్షకులై పరిపరివిధముల ప్రోత్సహించుటయే కాక ఈనాఁటికి అడుగడు గున ఆశీస్సులందించు చున్నగురుదేవులు శ్రీమాన్ పి. రామచంద్రచౌదరి గారు.వీరు కూడ పరిశోధకవిద్యార్థులను పరిశోధనరంగముననే పరిమితము చేసినమహానుభావులు. దూరదేశముననుండి ఉత్తరప్రత్యుత్తరముల ద్వారమున

గూడ నితఁడు సుసందర్భముగా గ్రహించినాఁడు. 'దాశాధినాథ' పాఠప్రతిపాద నము, తద్వివరణము గూడ సందర్భశుద్ధితో సరసము లై యున్నవి.

చతుర్దశదళమున నేఁబడిన 'అజునియనుగ్రహంబున' అనుభారతపద్య ములో అకాడెమీప్రతిలో నిపాఠము 'ఉదాత్తయశఃపరిపూరితంబులై' అని యే యున్నది. నరసింహారావు దానిని చూడకపోయినను పాఠరూపమును సరిగానే యూహించినాఁడు.

"అని మఱియుఁ బెక్కువేళ్లన్" అను పద్యమున "వినతశిరస్కుం, డను ముకుళీకృతహస్తుం,డను నై యే నుండ దేవుఁ డతిశయకరుణన్" అని యుండఁదగు నని నాయభిప్రాయము. కాని, అప్పట్ల నాల్గవపాదమున నఖండ యతి నంగీకరింపవలసివచ్చుటచే, అది యిష్టము లేక అకాడెమీప్రతిలో "దేవుఁడు ప్రసాదమునన్" అని తత్పరిష్కర్త యాపాఠమును మార్చి యుండు ననిపించును. లేదా "హస్తుండును" అనునదియే పాఠ మనుకొన్నచో "దేవుఁడు న్నతికరుణన్" అని యుండఁదగును. "దేవుఁడు ప్రసాదమునన్" అను కూర్పులో బిగువు లేదు. "ఒదుగక పగఱపై" అనుపద్యమున "రణమున వారిచే రాలు టొండె" అని గాని, "రణమున వారిచే నణఁగు టొండె" అనిగాని పాఠ ముండఁదగును.

'ఇంటికావలికి' అన్నపద్యములో నుత్తరార్ధమునఁ బ్రాసయతి యను కొన్నచోఁ "జనెదువారు", యతి యనుకొన్నచో "అరుగువారు" అని పాఠ ముండనోపును.

'ఇది మదాలస' అనుపద్యమున 'మఱి దీనిప్రాణ మైన' అని నరసింహా రావు చేసినసవరణము బాగున్నది. కాని, "అరుగుదెంచె నోకో! దీనిప్రాణ మైన,యల్లకుండల యిప్పు డే మయ్యె నొక్కొ!" అన్నచో రచన మఱింత లయాత్మకముగా నమరును.

'నంటున నొక్కవేళ' అనుపద్యమున "అరుగం గత మేమి యొకో" అనుసవరణము బాగుండు ననిపించును. 'రాజతాచలే' త్యాదిపద్యపాదమును "రాజతాచలరాజరాజహంసవ్రజ, రాజితతనుకాంతియోజ మెఱయ" అనియు సవరింపవచ్చును.

లక్ష్మీనరసింహారావు చేసినతక్కినసవరణ లన్నియు విశిష్టార్థసూచకము లై, రమ్యము లై, యున్నవి.

పంచదశదళములో వివరింపఁబడినసకవికాలమునాఁటిసాంఘికాచారవ్యవహారములు, షోడశదళమునఁ జేయఁబడిన సాభిప్రాయపదపరామర్శము, అనుశీలింపఁబడినయితరవిషయములు నరసింహారావుపాండితీపటిమను ప్రకటించుచున్నవి.

ఇంకను నితఁడటనట ఆధారములకై ఆంధ్రమహాభారతమునందలి పదునెన్మిదిపర్వములనుండియు నుదాహరణము లిచ్చి యున్నాఁడు. నాకు తెలిసినంతలో నేవిద్యార్థియు ఈపని చేయలేదు. ఈభారతప్రయోగప్రదర్శన మీతని నిరంతరసాహితీనిరతికి నిదర్శనము కాఁగలదు.

ఈవిమర్శగ్రంథమునందలిగుణములను స్థాలీపులాకముగా మాత్రమే చూపితిని. గ్రంథమున స్ఖాలిత్యములును ఉండవచ్చును. "గ్రహింపరు జాణలు జాలుపాటులన్".

చిన్నవయస్సులోనే యింతటిపాండిత్యమును సంపాదించినచిరంజీవి లక్ష్మీనరసింహారావు ఇతోఽధిక మగుసాహితీసేవలో తనజీవితమును పునీతమొనర్చుకొనఁగలఁ డనుటలో నాకు సందేహములేదు. పండితలోకము నరసింహారావుకృషిని మెచ్చుకొనఁగల దని యాసించుచు అతనికి నాహృదయపూర్వకమైనయాశీస్సుల నందించు చుంటిని.

ఈగ్రంథము శ్రీరత్తయ్యగారి కంకిత మగుట బంగారమునకు పరిమళమబ్బుట. సహృదయశేఖరు లైనశ్రీరత్తయ్యాగారీకృతినిఁ గైకొనుట కన్నివిధముల నర్హులు. ఈయుత్తమకృతికి స్వీకర్త యయినశ్రీరత్తయ్యగారిని అభినందించు చున్నాను.

"విద్వాన్ సర్వత్ర పూజ్యతే"

(సం.) వి. రామచంద్రచౌదరి

# సంకేతసూచిక

| | | |
|---|---|---|
| అ. తె. కో. | : | అచ్చతెలుఁగుకోశము |
| ఆం. సా. అ. | : | ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ |
| ఆది. | : | ఆదిపర్వము |
| | | అరణ్యపర్వము |
| ఆనుశాసనిక. | | ఆనుశాసనికపర్వము |
| ఉద్యోగ. | | ఉద్యోగపర్వము |
| కావ్య. | | కావ్యప్రకరణము |
| గుణ. | | గుణప్రకరణము |
| ప్రౌఢ. | | ప్రౌఢవ్యాకరణము |
| బాల. | | బాలవ్యాకరణము |
| మొ. | | మొదలగునవి |
| విరాట. | | విరాటపర్వము |
| శ్లో. | | శ్లోకము |
| సభా. | | సభాపర్వము |
| సూ. | | సూత్రము |
| సూ. ని. | | సూర్యరాయాంధ్రనిఘంటువు |

గమనిక : ౧. ఋగ్వేదోదాహరణసంఖ్యలు క్రమముగా మండలము అనువాకము, సూక్తము, ఋక్కు అనువానివిగా గమనింపవలయును.

౨. పాణినీయోదాహరణసంఖ్యలు క్రమముగా అధ్యాయము, పాదము, సూత్రము అనువానివిగా గమనింపవలయును.

సవరింపులు : ౩. ఈ గ్రంథభాగమున 4వపుటలో 'సహ్యం' అనుదానిని 'సహ్యః' అని సవరించుకోవలెను. 31వపుటలో "పృథుని పౌత్త్రుఁడు విశ్వగశ్వుఁడు. అతనికొడుకు అద్రి. అద్రి కుమారుఁడు యువనాశ్వుఁడు. యువనాశ్వునిసూనుఁడు శ్రావస్తకుఁడు. అతనినందనుఁడు బృహదశ్వుఁడు. బృహదశ్వుని సూనుఁడు కువలాశ్వుఁడు...." అని సవరించుకొనవలయును.

౫. 149వపుటలో 2వపంక్తిలో 'విష్ణుచ్' ను 'ఇష్ణు' అని, 167లో 14వపంక్తిలో 'జంటకవులు' అని: 17వపంక్తిలో 'గంచువదను' అని; 174లో 14వపంక్తిలో 'వజ్జులవారు' అని; 175లో 1వపంక్తిలో 'యమునది' అనియు చదువవలెను. 182లో చివరిపద్యమును 'భూపాలమథన! జంబూద్వీపేశ్వర!' అని సంబోధన చిహ్నములతో చదువవలెను.

౬. 191లో అధస్సూచికలో 3వది "శమ్బర స్వల్పహారిణః" అని: 199లో అధస్సూచికలో 1వది "సుత్రామా బిడౌజాస్సితకుఞ్జరః" అని; 205లో 8వపంక్తిలో ".... స్తంబేరమమూర్ధన్యుండును... " అని; 210లో 8వపంక్తిలో 'దంతమొసఁగ' అని; 214లో కడపటి పంక్తిలో 'కావ్యాదర్శము' అని; 215లో 6వ అధస్సూచికలో '....నాన్య ద్రసభఙ్గస్య ....' అని; 224లో 11వపంక్తిలో "లంచపంచంబులొసఁగి" అని: 229లో 24వపంక్తిలో "అవయవార్థగ్రహణమున సార్థకములు. కొమ్మ కనుకనే...." అని; 231లో 24వపంక్తిలో "తత్ర కుంజరయూథాని .." అని; 235లో 17వపంక్తిలో 'సంస్కృతప్రాకృతాదులలో....' అని; 237లో 4వపంక్తిలో '....వొందునప్పుడు' అని; 240లో 12వపంక్తిలో 'కూర్చుటలోఁ గూడ సీతఁడు....' అని; 241లో 14వ పంక్తిలో 'ఇందఱ కిన్నివిధముల....' అని; 242లో 11వపంక్తిలో '... గ్రహింపనగును' అని; 243లో 8వపంక్తిలో "నుపదేశ మొసఁగు" అని; 244లో 1వ పంక్తిలో 'మార్కండేయమునుండి' అనియు సవరించుకొనవలయును.

ఇట్లు

గ్రంథకర్త

# విషయసూచిక

— ౦ —

శ్రీః

# ప్రథమదళము

# పాఠపరిష్కరణము

శ్లో॥ వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే।
జగతఃపితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ॥

ప్రాచీనకావ్యపరిష్కరణ మనునది గ్రంథనిర్మాణమునకన్నను కష్టతరము మయినకార్యము. కవిహృదయము [illegible]పడకుండ, కవితాకన్యాసౌందర్యమునకు కళంకము కలుగకుండ, విద్వత్పరిశోధకులు వినుతించునట్లు, సహృదయావతంసము లాహా యనునట్లు పరిష్కరింపఁగలశేముషీమంతులే యేతత్కార్యమున కుపక్రమింపవలయును. ఇందులకితరులు సిద్ధపడినచో వారికే కాక కావ్యగౌరవమునకు కూడ హాని కలుగక మానదు.

ఆదికావ్యమునుండియు ఎన్నెన్నోకావ్యములు పరిష్కరణచికిత్సకు గురియయినవి. అందు కొన్ని స్వరూపము నందినవి, కొన్ని విరూపము నొందినవి. ప్రాచీనకావ్యములు నవీనపరిష్కరణములకు గురి యగుటకు వ్రాయసకాండ్రప్రమాదములు, కృమికీటకాదులదాడులు, ముద్రాపకులచిన్నచూపులు మున్నగునవి హేతువులు. పలుప్రబంధములకు పరిష్కరణ మావశ్యక మయినట్లే యీ ముద్రితకువలయాశ్వచరిత్రమునకును పరిష్కరణావశ్యకత కలిగినది. ఆంధ్రప్రదేశసాహిత్య అకాడమీవారు ముద్రించినట్టియీప్రబంధమందు లేఖకదోషములు, సంపాదకులప్రమాదములు, ముద్రణమునకు చెందినలొసఁగులు మున్నగునవి సవరణల నాసించు చున్నవి. పరిష్కృతి లేనిదే తక్కినపరిశోధన సాగని స్థితియందు ఈకృతి ముద్రిత మయి యున్నది. కనుకనే పరిష్కరణశీర్షకము కూడ ఈసిద్ధాంతవ్యాసమునం దొకభాగ మయినది. ఇం దతిముఖ్యము లయిన లొసఁగులను మాత్రము సవరించి సాధుపాఠము లిచ్చుటకు శక్తికొలఁది ప్రయ

త్నము జనగును. ఇప్పట్టున ఆశ్వాసక్రమము, పద్యసంఖ్యాక్రమము పాటింపఁ బడు చున్నవి.

౧. అవతారికయందు సరస్వతీప్రార్థనకు చెందినపద్య మిట్లు ముద్రితము—

శా. వీణాదండచలత్కరోజ్జ్వలవిభల్ వేల్లన్నఖోద్యద్రుచి
శ్రేణుల్ మించగ గానరక్తిఁ జిగిరించెం బూచె నంచున్ మదిం
గాణల్ మెచ్చఁగఁ బాట పాడి, పతికిన్ సంతోషముం గూర్చునా
వాణీనీరజనేత్ర నారసనరావజ్రిం గృపం బ్రోచుతన్ ! (1–6)

'వేల్లన్నఖోద్యద్రుచిశ్శ్రేణుల్' అన్నసమాసమునందు 'శ్శ్రేణుల్' అను చోట ద్విత్వశకారము ప్రమాదపతితము. 'రుచి' శబ్దము ఇకారాంతస్త్రీలింగమే కాని సకారాంతముకాదు. (1) కనుక శవర్ణాదేశమున కెట తావు లేదు. అందు వలన 'రుచిశ్రేణుల్' అని శకారరేఫసంయోగముతోనే యుండవలయును.

మూఁడవచరణమున "మదిం గాణల్ మెచ్చఁగఁ బాటపాడి పతికిన్ సం తోషముం గూర్చు" అనుచో "మదింగాణల్" అన్నచోట బిందులేఖనమునకంటె బిందుస్థానమున (నకార) సంశ్లేషలేఖనము యతిసంగతికి నావశ్యకము.(2) కనుక "మది న్గాణల్ మెచ్చఁగఁ బాట పాడి పతికి న్సంతోషముం గూర్చు" అను రీతిని పరిష్కృతపాఠము. పరిష్కరణవేళ మిది యనిపించినను యతినిర్వ హణమునం బ్రగస్థానము దీని కుండుటనుబట్టి యిదియు నిందు గణనీయ మనఁ దగినదే !

౨. కువలయాశ్వచరిత్రకర్త శ్లేషయందు మక్కువ కలిగినకవి. ఇతఁడు వసు చరిత్రాదులందువలె నక్లిష్టశ్లేషమును తనపద్యములందు నెలకొల్పుటకు ప్రయ త్నించినాఁడు. ఇది పరిష్కరణప్రకరణము. శ్లేషప్రకరణము వేఱు గా నున్నది. అందువలన పరిష్కరణమునుగూర్చియే యిచ్చట ముచ్చటింపఁబడును. హను మన్నుతికి చెందినపద్యమునందలి ప్రథమపాదము క్రిందివిధముగ ముద్రింపఁ బడెను.

---

(1) స్యుః ప్రభా రుగ్రుచిస్త్విట్ భా భాశ్ఛవి విద్యుతి దీప్తయః–అమరకోశము
(2) సంయుక్తయతి–అనంతునిఛందము, 1-108.

సీ. అల కురువ్రజనాథు నడఁగఁ ద్రొక్కె నటంచు
నల కురువ్రజనాథు నడఁగఁ ద్రొక్కె (1–8)

ఈ పద్యమునందు చగినరీతిని శ్లేషను సమన్వయించుటకు వ్రాయసకాండ్ర ప్రమాదము అడ్డంకు లగు చున్నవి. ఒకటిరెండక్షరములసంస్కరణము జరపిన సునంగతముగా సహృదయహృదయంగమ మగునట్లు శ్లేష పొందుపడును. భారతరామాయణకథావిశేషములు శ్లేషమూలమున నిందు పొందుపఱుపఁబడినవి. తనసోదరుఁ డగుభీముఁడు ద్వాపరయుగమున జరపఁబోవుమహాకార్యము లెట్టివియో యెఱుఁగఁజేయుచు నట్టిమహాకార్యములను హనుమంతుఁడు త్రేతాయుగమున నాచరించి చూపు చున్నాఁడు. అట్టిమహాకార్యములం దొకదానిని పేర్కొను చున్నది పైపద్యపాదము. ఇక్కడ 'కురువ్రజనాథుఁడు' అనునప్పుడు కురువంశస్థులసంఘమునకు ప్రభు వనునర్థము ప్రకటిత మై దుర్యోధనుఁడు చెప్పఁబడును. వాని నడఁగఁద్రొక్కు చున్నాఁడు భీమసేనుఁడు. భీమదుర్యోధనులగదాయుద్ధమప్పుడు తొడలు విఱిగి క్రిందపడినదుర్యోధనునితలను తనయెడమకాలితో తన్నినాఁడు భీమసేనుఁడు. ఇఁక నాంజనేయుఁడు చేసినమహాకార్య మిట్టిదే యీపాదద్వితీయార్థమున వచింపఁబడవలసి యున్నది. కాని, 'కురువ్రజనాథుఁడు' అనునప్పుడు ఆమహాకార్య మేదియు రెండవయర్థమున సరిగా ప్రతిపాదిత మవుట లేదు. అందులకే సంస్కరణ మావశ్యక మయినది. 'కురువ్రజనాథుఁ'డనునది అది యట్లే యుండునేమో అని యనునంతటిభ్రాంతిజనకము గా నున్నది. కాని, సూక్ష్మేక్షికతో పరిశీలించి చూచినప్పుడు కవి యిట 'కులవ్రజనాథుని'అనియే అనినాఁ డనిపించును. 'అలకుల' అనురీతిని అనుప్రాసము గూడ అనుగత మై కవిహృదయ మిట్టిదే యని విప్పి చెప్పును. నాచనసోమనాథునివలె చిననారాయణ యనుప్రాసముల ననర్గళముగ నడుపును. ఇఁక నిప్పుడు సమన్వయ మెట్లో చూడవలయును. అల కులవ్రజనాథుఁడు— 'అల' ప్రసిద్ధార్థక మిట. కులవ్రజనాథునితో అన్వయము గలది. కులవ్రజ మనఁగా (తన) వంశస్థులసమూహము అనఁగా కౌరవులు. వారికి నాథుఁడు ప్రభువు;దుర్యోధనుడు 'అల' అనునది ప్రసిద్ధార్థక మయి ఆతనిరాజరాజత్వమును సూచించును. ఆతని నడఁగఁద్రొక్కుట భీముఁ డొనర్చినాఁడు.(1)

(1) శ్రీమదాంధ్రమహాభారతము, శల్యపర్వము, 2-277, 278.

ఇఁక హనూమంతునిపక్షమున 'అల'పూర్వమట్లే ప్రసిద్ధార్థకము. 'కుల వ్రజ'శబ్దమునకు కులపర్వతములసమూహ మని యర్థము. 'కుల' శబ్దము 'కుల గిరి' అనుదానిలోనియేకదేశ మై 'నామైకదేశే నామగ్రహణమ్' అనున్యాయమున కులపర్వతమును చెప్పును. సత్యభామ 'సత్య' యగుటయు, భీమసేనుఁడు 'భీముఁడు' అగుటయు నీన్యాయము ననుసరించియే. కులగిరులలో శ్రేష్ఠ మైనది మహేంద్రపర్వతము. ఈ కులపర్వతములను___

శ్లో|| మహేంద్రో మలయః సహ్యం శుక్తిమాన్ ఋక్షపర్వతః ।
వింధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైవాత్ర కులాచలాః||

అని మార్కండేయపురాణము వచించు చున్నది.(1) కులపర్వతపరిగణనమునందు మొట్టమొదట లెక్కింపఁబడుటయే మహేంద్రపర్వతశ్రేష్ఠత్వమునకు నిదర్శనము. వేఱుగా దానిశ్రేష్ఠత నిరూపింపనక్కఱలేదు. ఆమహేంద్రగిరిని లంకకు పయనమగుచు నాంజనేయుఁడు పాదములతో గట్టిగా నదుముట వాల్మీకి రామాయణమునందును,(2)పాదములతో నడఁగఁద్రొక్కుట అయ్యలరాజు రామభద్రకవి రామాభ్యుదయమునందును(3) స్పష్టముగ వచింపఁబడెను. ఇట్లు 'కుర' అనుటకు 'కుల' అనుసంస్కరణ మవశ్యంభావి యగు చున్నది. ఈరామాయణభారతపురాణాదివిజ్ఞానము కరతలామలక మైననే కాని యివి యిట్టి దని తెలియరాదు. ఇట్టి పరిష్కరణములు సరిగా జరిగిననే కాని కవికావ్యములగౌరవము బోధపడదు.

౩. ఇం దొకపద్యమున కృతిపతి యయిననారాయణరాజు వర్ణింపఁబడు చున్నాఁడు. ఇందలి ప్రతిపాదము విష్ణ్వాదులతో శ్లేషభిత్తికను అభేదాధ్యవసాయ మేర్పఱచి అతిశయోక్తిని పోషించు చున్నది. ఆపాదములలో మూఁడవ దిట్లు ముద్రింపఁబడినది___

---

(1) అధ్యాయము 57, శ్లోకము 10. (ప్రాచీనాంధ్రచారిత్రకభూగోళము, పుట 259).

(2) కిష్కింధాకాండము, 67-43, 44.

(3) రామాభ్యుదయము, 6-84, 93.

సీ. ఏజగన్నుతిశాలియాజికేళిఁ బ్రచండ
పరదండమహతీయనఁ బ్రౌఢిఁ గాంచు—అని. (1-16)

ఇట 'ఆజికేళిఁ బ్రచండపరదండమహతి' అనియున్న అరసున్నతోడి పాఠము అనన్వితము. ఇందు 'ఆజికేళి' అనునది కర్తృవాచకపదము. ప్రథమాంత మనుట యింక చెప్పనక్కఱలేదు. తక్కినపాదములను కూడ పరామర్శించినచో నిది కర్తృవాచక మనువిషయము సుస్పష్టముగా తెలియవచ్చును. ఇట నారదునివిహారము (లోకసంచారము)నకు, నారాయణరాజురణవిహారమునకు శ్లేషతో నభేదము వచింపఁబడు చున్నది. 'జగన్నుతిశాలి' అనునది నారదునిపక్షమున కేళితో అన్వయించును. నారాయణరాజుపక్షమున నారాయణరాజును వచించును. నారదపక్షము - అజస్య అపత్యం పుమాన్ ఆజిః(1) = బ్రహ్మదేవుని కుమారుఁడు. దీనికి నారదుఁ డని యర్థము- ('దశరథస్య అపత్యం పుమాన్ దాశరథిః' వంటి దిది). అతనియొక్క కేళి = విహారము. (లోక) సంచారమని యర్థము. (ఇది విశేష్యము). ప్రచండ = బాగుగా దృఢ మయిన, పర = చాల గొప్ప దయిన, దండ = దండము కల, మహతి = మహతి యను వీణ కలది ('మహతి' యని నారదుని వీణకు పేరు).(2) అన్ ప్రౌఢిన్ = అనెడి గొప్పతనమును, కాంచున్ = పొందునో. నారాయణరాజపక్షము — జగన్నుతిశాలి యయిన నారాయణరాజుయొక్క, ఆజి కేళి = రణవిహారము, ప్రచండ = మిక్కిలి భయంకరు లయిన, పర = శత్రువుల యొక్క (కర్మణి

---

(1) అత ఇఞ్ (పాణి 4-1-95) (వృద్ధిః)

(2) మహతీ నారదస్య స్యాత్స్వరస్వత్యాస్తు కచ్ఛపీ—యాదవప్రకాశము. నారదుఁడు వీణానిక్వాణములతో లోకసంచార మొనర్చుట మాఘాదులు వర్ణించుచున్నవి.

శ్లో॥ రణద్భిరాఘట్టనయా నభస్వతః పృథగ్విభిన్నశ్రుతిమండలైః స్వరైః।
స్ఫుటీభవద్గ్రామవిశేషమూర్ఛనా మవేక్షమాణం మహతీం ముహుర్ముహుః॥
— మాఘకావ్యము, 1-10

షష్ఠి), దండ = దండనముచేత, మహతి = గొప్పది, అన్ప్రౌఢిన్(1) = అనెడి ఘనతను, కాంచున్ = పొందునో - అని యర్థము.

కావున నిట ప్రథమాంత పాఠముగా సంస్కరణ మవశ్యంభావి. చూడుఁడు! భాషావైచిత్ర్యము. ఒక్క అరసున్న యెంతపని చేసినదో! ఇట్టి యరసున్నల తార్మాఱు లిం కెన్నెన్నో యున్నవి.

౪. శ్రీ రంగరాయనిదేవేరులను పేర్కొనుపద్య మిట్లు ముద్రితము —

తే. అల్ల, శ్రీరంగరాయధరాధినేత,
దేవతాభక్తినికురుంబఁ దిమ్మమాంబ,
వరసరోవరకాదంబఁ దిరుమలాంబఁ
దనకు దేవేరు లై ముదం, బెనయ వెలసె. ( 1-55 )

ఇందు 'దేవేరులు' అనుదానితో తిమ్మమాంబాతిరుమలాంబల కన్వయము. వానికి విశేషణములు 'దేవతాభక్తినికురుంబ, వరసరోవరకాదంబ' అనునవి. ఇం దున్నయరసున్నలు వీనిని ద్వితీయాంతములుగా నొనర్చు చున్నవి. అప్డు దేవేరులు అనుప్రథమాంతమునకు తిమ్మమాంబ, తిరుమలాంబ అనునవి గాని; తిమ్మమాంబ, తిరుమలాంబలకు దేవతాభక్తినికురుంబ, వరసరోవరకాదంబ అనునవి గాని విశేషణము లగుట పొసఁగదు. ప్రథమాంతములు గావలయు నివి. అందులకే యిచటియరసున్నలను త్రోసిరాజనవలయును. ఈ యరసున్న ఏదో ప్రమాదపతిత మనుటకైనను ఒకటి కాదు, రెండు కాదు, మూఁ డున్నవి. కనుక పద్యాన్వయము నెఱుంగక కూర్చినవియే యని తలంపవలసి యున్నది. ఇఁక సవరింపు గలిగినపద్య మి ట్లుండును —

తే. అల్ల శ్రీరంగరాయధరాధినేత
దేవతాభక్తినికురుంబ తిమ్మమాంబ,
వరసరోవర కాదంబ తిరుమలాంబ
తనకు దేవేరులై ముదం బెనయ వెలసె — అని,

---

(1) ప్ర + ఊఢి = ప్రౌఢి = ఉక్తివైచిత్ర్యము (బహువిధముల కొని యాడుట).

"ప్రౌఢి రుక్తేః పరీపాకః, పరిపాకో (నామ) వైచిత్రీవిశేషః"
— ప్రతాపరుద్రీయము, గుణప్రకరణము ' 32.

౫. ఋతధ్వజునికోటను వర్ణించుపద్యముప్రథమ పాద మి ట్లచ్చయినది —
ఉ. కోటకు నస్థిరఖార మొనగూర్చుతఱిం బలియిష్ఫసేమస్తం (1—72)

ఇందు 'అస్థిరఖార' యనుపదములోని 'స్థి' తరువాతి 'ర' వర్ణ మదన ముగ ముద్రింపఁబడి అర్థహానినే కాక ఛందోభంగమును కూడ కలిగించు చున్నది. కావున దానిని తొలఁగించి 'కోటకు నస్థిఖార మొనగూర్చుతఱిం —' అనునట్లు రూపొందింపవలయును. ఈవిధముగ అదనపుటక్షరములు ముద్రింపఁ బడుటవలన కలిగినయసాధుపాఠములు ( 1-86 ) మొదలగు పద్యములందును గలవు.

౬. ఋతధ్వజునిదినచర్యను వర్ణించుపద్యమునందలితృతీయపాద మిట్లు ముద్రితము —

సీ. ఒకవేళ మంత్రిగాయకముఖు ల్గొలువఁగా
సుముఖుఁ డై నిండోలగంబున నుండు (1-93)

ఇందు ద్వితీయార్ధమునందలి 'నిండోలగంబున' అనునప్పటిబిందు పూర్వకబువర్ణకమువలన ఛందోనియమము భంగపడు చున్నది. అందువలన అబిందుపూర్వకబువర్ణక స్థానమున 'ము' వర్ణకమును చేర్చి 'నిండోలగమున నుండు' నని పఠించినయెడల ప్రాసయతి సమకూడి పైదోషము వై తొలఁగును.
౭. కువలయాశ్వుఁడు గాలవమునిసీమ కేఁగునపుడు పౌరపణ్యాంగనలు రతనాలు జాఱవిడుచుటను వర్ణనము చేయుపద్య మి ట్లచ్చువేయఁబడినది—

మ. చనవు ల్మీఱఁగ మ్రోల నూల్కొలుపుబల్ సామ్రాణిధూపంబువా
సనకు న్వేలుపుముద్దరాండ్రు కచము ల్లార్పంగఁ బణ్యాంగనా,
వనజన్యబ్జకరాపతచ్ఛితమణు ల్వర్ణింప ఛత్రంబుపై
ననువౌ బంగరుగుబ్బప్రొద్దుఁ దలఁప్రా లై ముంచఁ జంచద్గతిన్. (2-58)

ఇందలి తృతీయచరణారంభమున 'వనజన్యబ్జ' అనుచోటి 'న్యబ్జ' పదము అర్థసంగతి లేనిదిగా కానవచ్చు చున్నది. గ్రంథపరిశీలనమును బట్టి యీకవి పాణినీయపాఠగుఁ డని విశద మవును. తదనుగుణముగ నీతఁ డిచట 'న్యుబ్జ'

అని ప్రయోగించి యుండును. అది లేఖకాదుల ప్రమాదమున 'న్యబ్జ' అయినది.(1)

ఇట ముత్తయిదువలు పద్మములవంటితమచేతులు అధోముఖములు (న్యుబ్జములు) చేసి కువలయాశ్వునిశిరముపై వెల్లనిమణులు జాఱవిడుచుచున్నారు. అవి అతఁడు రాజచిహ్నముగా ధరించినఛత్త్రిముపై నున్న ఒంగరు గుబ్బపై పడు చున్నవి. ఆగుబ్బ సూర్యుఁ డనునట్లు దేదీప్యమానముగా ప్రకాశించు చున్నది. ఆసూర్యునిపై వోయు చున్నముత్యాలసేసఁబ్రా లనునట్లు ఆమణులు ప్రకాశించు చున్న వని యిట కవిపద్యమున. కవితన పాండిత్యప్రకర్షను వెలదవఱచుచు ప్రయోగించినయీమహాప్రయోగము ఒక్క కొమ్ము తొలఁగుటచేత నింతటిదురవస్థకు లోనయినది. అందులకే యిట్టివిద్వత్కవుల గ్రంథపరిశీలనమున తగినజ్ఞానము, తగినజాగరూకత చాల నావశ్యకము లని మనవి. ఇట్టివొసఁగులచటచట నీకావ్యముద్రణమున వొడలినవి. ఇందుండి అవి తొలఁగవలసి యున్నవి. మచ్చున కిది యొకటి యుదాహరింపఁబడినది ఈ 'న్యుబ్జ' శబ్దమును శ్రీహర్షుఁడు ప్రయోగించినాఁడు.(2)

లా. కువలయాశ్వునిరణసన్నాహములను గూర్చి చారులవలన వినినపాతాళకేతువు అహంకరించు చున్నవిధమును తెలుపుపద్యము క్రిందిరీతిగా నచ్చుకాఁబడ్డది —

మ. తనచారు ల్గని వచ్చి దైన్యమున నేతద్వార్త విన్పింపఁగా
విని, మీసంబులు దిద్ది, దైత్యుఁ డహహా వీరా వడిన్ వచ్చి పో
రను నన్నుం గదియించువారు ? మఱి వారా నన్ను మార్కొందు రం
చనుమానింపక వచ్చి నిల్వఁగలవీరాగ్రేసరు, ల్బాపురే ! (2—100)

(1) భుజన్యుబ్జౌ పాణ్యుపతాపయోః అని పాణిని (7—3—61).
'న్యుబ్జః కుబ్జే కుశస్రుచి అధోముఖేఽపిచ ....... ....' అని హైమము.

(2) శ్లో॥ ఊర్ధ్వార్పితన్యుబ్జ కటాహ కల్పే
యద్వోమ్ని దీపేన దినాధిపేన ।
న్యధాయి త ధ్భూమ మిలద్గురుత్వం
భూమౌ తమః కజ్జల మస్ఖలత్కమ్॥ నైషధము, 22—31.

'వీరా వడిన్ వచ్చి పోరను నన్నుం గదియించువారు?' అనునది మునులనుగూర్చి యను చున్నమాట. ఇఁక మునులు ప్రేరేపఁగా వచ్చి సందేహము లేక నాతో తలపడుదు మని నిల్వఁగలవీరాగ్రేసరులు వారా? అని కువలయాశ్వుని యుద్ధవీరులనుగూర్చి అహంకరింపుతోడ నను చున్నమాటలు. ఇచట 'వారా నన్ను మార్కొందు రం చనుమానింపక' అనుచో 'మార్కొందురు' అనునది పాతాళకేతునిమాట గాదు. వీరులవాక్యమున కనుకరణము. 'మార్కొందురు' అనుచో కర్త వారు. అప్పుడు 'మార్కొందు మం చనుమానింపక' అనిననే కాని అన్వయము సరిపడదు. అందులకే 'వారా నన్ను మార్కొందు మం చనుమానింపక....' అని సవరింపక తప్పదు.

౯. సమరాంగణమునకు సంబంధించినపద్య మొకటి యిట్లచ్చయినది—

మ. చదిసెం దేరులు, పాఱె వారణము, లశ్వమ్ముల్ ధరం గూలెఁ, గం
జెదరెన్ సైన్యము, వ్రాలె బాహువులు, త్రెస్సెన్ మాంసముల్, రాలె నం
గదముల్, దీలెఁ గిరీటముల్, పఱచె రక్తశ్రేణి, కయ్యపుంజొ
క్కు దనర్పన్ భుజదర్ప మొప్ప నిరువాగుం జేరి పోరాడఁగన్. (2—147)

ఇచట తృతీయపాదమున 'కయ్యపుంజొక్కు' అనుచో ఛందోనియమము తప్పిపోయినది. ఛందఃక్రమమునుబట్టి 'పు'వర్ణక మునకు వెనుక నున్నయరసున్న ముందునకు మాఱవలసి యున్నది. వ్యాకరణనియమమునుబట్టి పువర్ణకము వెనుక నరసున్నయుఁ జేరవలసి యున్నది. అప్పుడాపదము 'కయ్యంపుఁజొక్కు' అని రూపుదిద్దికొని మత్తేభగమనమున కాటంకము లేకుండును. ఇట్టివి చిన్నవిగానే కాన్పించినను ఛందోదోషములకు చెందిన వగుట నుపేక్షింపఁదగినవి కావు.

౧౦. యుద్ధవర్ణనమునకు సంబంధించినయొకసీసపద్యముక్రింద నున్నతేటగీతితొలిపాదము 'భూరిభూజశక్తి ప్రముచ్చిమిపోటు గాఁగ (3—9) అని యున్నది. భూజ' శబ్ద మిచట దోషభూయిష్ఠము. భూజ మనఁగా చెట్టు. దాని కిట ప్రసక్తి లేదు. ఇట 'భుజ'శక్తికి మాత్రమే ప్రసక్తి. కనుక 'భూ' అనునది 'భు' గా మాఱవలయును. అదియునుంగాక గణములక్రమము ననుసరించి చూచినప్పుడు కూడ నిట 'భుజ' శబ్దమే యుండవలయును గాని, 'భూజ' శబ్ద ముండరాదు.

కనుక నిచటిచరణము 'ఘూరిభుజశక్తి బ్రుచ్చిమిపోటు గాఁగ' అనునది మాత్రము.

౧౧. ఋతధ్వజభూజాని మదాలసాసౌందర్యమును గాంచి వలంచు చున్నవిధ మును తెలుపుపద్య మొకటి యి ట్లున్నది—

చ. ననుఁ గొనితెచ్చినట్టిమునినాయక! నిన్ను నుతింతునో, బలా!
మునిఁ గొనియాడ నేల? పెనుమొక్కలిరక్కసితేనికై కదా
యనుకలభావనాపరహయంబుగ వచ్చితిఁ, గాన నింక నా
తనియవదాన మెంచ వలదా, జలజాలక నిందుఁ గాంచుటన్. (3_51)

ఇందు తురీయచరణమున 'జలజాలక నిందుఁ గాంచుటన్' అనుచో నుండవలసినది జలజము కాదు. అలకలకును జలజములకును సంబంధము శూన్యము. ద్వితీయజకారము దకార మై 'జలదాలక' కావలసి యున్నది. జలద మనఁగా మేఘము. మేఘమువలె నల్ల నయినకురులు గలది (మదాలస) యని యర్థము. మేఘమునకును అలకలకును ఉపమానోపమేయభావము కవిసమయ సిద్ధ మనువిషయమును వేఱుగా చెప్పనక్కఱలేదు.(1) 'వలదా జలదాలక' అను ననుప్రాసము నయిత మీసవరణమును సమర్థింపఁజాలి యున్నది.

౧౨, మదాలసచెలి యయినకుండల మదాలసాసౌందర్యమును ఋతధ్వజునకు వచించు సందర్భమునం దొకపద్య మీవిధముగ కనఁబడు చున్నది—

క. ఏటికి మాటలు? నాఁటికి
నేఁటికి, మగవాఁడు వలచునే కద! వినుమా!
బోటి తటాలునఁ జూచిన
నాఁటది వలచున్ మనోంబుజాగ్రమునందున్. (3_70)

---

(1) అ) సీ. మెఱుఁగొప్పునెఱిగొప్ప నెఱగప్పు తఱిగప్పు
జలదమాలికచొప్పు దెలుపలేదొ —వసుచరిత్రము, 3_69.

ఆ) సీ. రాజరాజఖ్యాతి రాజిల్లు వక్త్రంబు
ఘనపాళి నిరసించుకచముఁ గల్గి
—అంకభూపాలునిఉషాపరిణయము, 3_132

ఈ గ్రంథమునందలివిరామచిహ్నములు పలుతావులలో నర్థావగతికి ప్రతిబంధకములుగా దీనిసంపాదకులసంపాదకతయందు వెలసి యున్నవి. అవి యన్నియు చూచినచో ఈపరిష్కరణప్రకరణము చేటభారతము కాఁగలదు. కనుక నీవిషయమున నీపద్య మొక్కటి మాత్రము విమర్శింపఁబడు చున్నది. ఇందు ద్వితీయచరణాంతమున 'వినుమా.' అనుచో ప్రార్థనార్థకచిహ్న ముంచి తృతీయచరణాదిలోని 'బోటి' యనుపదమును వేఱుపఱచినారు. కాని, యిచట "విను! మాబోటిఁ దటాలునఁ జూచిన నాఁటది వలచున్ మనోంబుజాగ్రము నందున్" అనవలయును. కుండల మదాలసచెలికత్తియ కనుక మదాలసను 'మాబోటి(=మావనిత)' అను చున్నది. కనుక ప్రార్థనార్థకచిహ్నము 'ను' తరువాత నుండవలసి యున్నది. ఇఁక 'మాబోటి తటాలున' అనునప్పుడు (మా) 'బోటి' కర్తగా స్ఫురించును. అది కర్త గాదు. చూచుటలో నిట కర్మ. ఇట్టి చోటుల పాఠకుల కిట్టి సందియమున కవకాశ మీయక స్పష్టముగా ద్వితీయాంతమని తెలియునట్లు 'బోటిఁ దటాలున' అనుట సంపాదకుల కర్తవ్యము. ఇట్టి వానియెడ శ్రద్ధవహింపక యున్నచో పాఠకుల కగుక్లేశము విపరీతము. అర్థబోధ కుపకరింపవలసినవిరామచిహ్నములు అస్థానపతితము లయినచో అర్థభంగక్లేశప్రదాయకములు కాఁగలవు. ఒకప్పు డిట్టిగుఱుతులు పొందుపఱపలేనప్పుడు మానుటయే మహోపకారము. ఇపుడు సవరణ కలిగినపద్య మి ట్లుండును—

క. ఏటికి మాటలు? నాఁటికి
నేఁటికి మగవాఁడు వలచునే కద' విను! మా
బోటిఁ దటాలునఁ జూచిన
నాఁటది వలచున్ మనోంబుజాగ్రమునందున్—అని.

౧౩. మదాలసావిరహము వర్ణింపఁబడు చున్నయొకపద్యమునందు సాత్త్వికాది భావములు పొందుపఱుపఁబడినవి, దానితృతీయపాదము—

సీ. విభుదానధారాంబు వితతికిఁ జోటిచ్చు
పొలుపున, శ్రమజలంబులు చెలంగ (౩—౮౨)

అని కలదు. స్వేద మిట నుత్ప్రేక్షింపఁబడు చున్నది. ఋతధ్వజునిదానధారాజలపూరమునకు అవకాశ మేర్పఱచువిధముగా మదాలసశ్రమజలంబు లున్న

ట్లుత్ప్రేక్ష. అర్థము సరిగానే యున్నది. కాని, 'వితతికిఁ జోటిచ్చు' అనుచో నున్నయర్ధబిందువు తొలఁగింపఁబడవలయు నని సవరణసూచి సూచించు చున్నది.(1) అపుడు 'వితతికి జోటిచ్చు' అని యగును. ఈపాఠము పైయర్థ మును భంగపఱచును. అర్ధబిందువు లేకుండ పైయర్థమును నిలుపవలయు నన్న 'వితతికి జోడిచ్చు' అనుపాఠము కావలయును. కాని, యిదే ప్రచురణకు చెందిన వేఱొకప్రతియందు 'టి' కి బదులుగా 'డి' కలిగినపాఠము స్పష్టముగా ముద్రింపఁ బడినది. ఆంధ్రప్రదేశసాహిత్యఅకాడమీవారి 1982వ సంవత్సరమునకు చెందిన యొకేముద్రణములోనివే యీరెండుపుస్తకములు. ఈభేద మెట్లేర్పడినదో తెలి యదు. ఇట్టివి కాన్పించుట విచిత్రముగ నున్నది.

౧౪. వసంతవైభవ మభివర్ణింపఁబడు చున్నపద్యములం దొకటి యిట్లున్నది—

తే. వఱలె, వనరాశిలోనఁ బ్రవాళపాణిఁ
గాంచి, యీనునబలెఁ బొడకట్టినట్టి
ముత్తియపుగుంపు లనుదలంపులు జనింపఁ
దారకత మోనివారకకోరకములు. (3—90)

ఇందు తొలిపాదమున 'ప్రవాళపాణి' అనుట కిట నర్థము లేదు. ఇట 'పాణి' 'పాళి' కావలసి యున్నది. ప్రవాళపాళి యనఁగా ప్రవాళముల(పగడ ముల) పంక్తి(గుంపు) అని యర్థము. సముద్రమునందలిప్రవాళపంక్తిని గాంచి యీర్ష్యతో నేర్పడిన ముత్తియపుగుంపు లనునట్లు తారకత మోనివారకకోరకములు వఱలె నని యన్వయము. ఇందే 'అనుదలంపులు' అనుట ప్రమాదము. 'అనుత లంపులు' అనవలెను.

౧౫. షష్ఠ్యాపచయము కావించినచంచలాక్షులు కాంచినసరోవరమును వర్ణించు పద్య మీవిధముగా కానవచ్చు చున్నది—

ఉ. మానవతుల్ గనుంగొని, రమందమరందనవారవిందబృం
దానుసరన్మిళిందనికరాంధుకబంధురగంధసాంద్రమం
దానిలమత్తసింధురవిహారవిలోలతరంగజాలడో
లానిళఖేలనాకలితహంసము, నొక్కసరోవతంసమున్. (3—131)

---

(1) చూ. సవరణసూచి.

ద్వితీయచరణమున 'అంధుక' శబ్దము అర్థరహిత మనిపించు చున్నది. కవి యిట 'అంధక' శబ్దమును ప్రయోగించి యుండును. 'అంధ' శబ్దముమీఁద స్వార్థిక 'క' ప్రత్యయము చేరంగా 'అంధక' శబ్ద ముత్పన్న మవును. అంధ(క)ము అనఁగా గ్రుడ్డివానినిగా చేయునది అని యర్థము.(1) మరందముతోడిన వారవిందములకొఱ కేఁగు చున్నతుమ్మెదగుంపులను మందానిలబంధురగంధము కన్నులు కానరానివానినిగాఁ జేయు చున్నది. అనఁగా తుమ్మెదకదుపులకు పారవశ్యమును కలిగించు చున్న దని భావము.

౧౫. కృతిపతి నారాయణరాజు వర్ణింపఁబడు చున్నఆశ్వాసాంతపద్యములం దొకటి క్రిందవిధముగ నచ్చుకాఁబడినది —

పంచ      వదావదాహిభోగిరత్నవర్ణవర్ణితక్షమాం<br>
చామ      గదా! గదాసిమద్విరోధిఖండనాత్తలోకస<br>
రము      మ్మదా! మదావళారివిక్రమస్ఫురద్యశఃకలా<br>
         పదా! పదానవద్రులోకపారిజాతవైభవా!      (3_167)

ఇందు మొదటిచరణమున 'అహి' శబ్ద ముండఁగా మరల 'భోగి' అనుట అనన్వితము. 'అహిభోగిరత్న' దోషాకరము. 'అహిభోగరత్న' దోషరహితము. ఆదిశేషునిపడగలయందలిరతనాలరంగులచేత ఆచ్ఛాదింపఁబడిన [రత్నములనెడియక్కరములచేత స్తుతింపఁబడిన (లేక) రత్నములయొక్క వర్ణము లనువర్ణములచేత స్తుతింపఁబడిన] భూమి యనునంగదము గలవాఁడని యిచటియర్థము. ఇఁక చతుర్థచరణమున 'పదానవద్రులోక' అనునది అనవధానపతితము. 'పదానమద్ద్రులోక' అనుట కవిహృదయము. పదములయందు వంగియున్న (నమస్కరించుచున్న—అనుట) వృక్షసమూహము (నాలుగుకల్పవృక్షములు) కలపారిజాతవృక్షముయొక్క గొప్పతనమువంటిగొప్పతనము కలవాఁడా! అని యర్థము.

దేవతావృక్షము లయిదు.(2) అయిదింటిలో పారిజాతము చాల

---

(1) 'అంధము' శబ్దము, సూర్యరాయాంధ్రనిఘంటువు.

(2) పఞ్చైతే దేవతరవో మన్దారః పారిజాతకః ।<br>
సన్తానః కల్పవృక్షశ్చ హరిచందన మస్త్రియామ్॥ వైజయన్తి.

గొప్పది.(1) అందులకే తక్కిననాల్గువృక్షములు పారిజాతమునకు దాస్యము చేయుచున్నవి. అట్టిపారిజాతపువైభవమువంటివైభవము కలవాఁడు కృతిపతి నారాయణరాజు. అకల్పవృక్షములు పారిజాతవృక్షమున కెట్లు దాస్య మొనర్చుచు కాళ్ళమీఁద పడి యున్నవో అట్లే యాతనిత్యాగమునకు లోఁగి యాతనిని గూడ అవి సేవించు చున్న వని భావము. 'పదానమద్ద్విలోకము' అనుట ఉభయులకును సాధారణవిశేషణము. ఇచట ద్రుమలోక మనఁబడినవి పారిజాతము గాక మిగిలిన నాలుగు దేవతావృక్షములే! ఇట్టియర్థబోధమునకై 'పదానమత్' అనుసంస్కరణ మిట తప్పనిసరి.

౧౩. మదాలసావిరహమును వర్ణించుపద్యములయం దొకటి యి ట్లున్నది —

క, వని సొచ్చుట, మరునకు న
 ర్చన లిచ్చుట, సొమ్మసిల్లి సకియలవలనం
 గను విచ్చుట, వా రచటికిఁ
 జను దెంచుట యెఱుఁగలేమి తన్మయదశచేన్. (4-3)

చతుర్థపాదమున 'చను దెంచుట' అర్థరహితము. 'తనుఁదెచ్చుట' అని యుండవలయును. 'సఖులు తన్ను పటకుటీరమునకు తెచ్చుట తెలిసికొనలేదు మదాలస' అని యర్థము. అదియుంగాక 'చను దెంచుట' అన్నట్లయిన యతిభంగదోషము కూడ దాపురించు చున్నది, కనుక 'తనుఁదెచ్చుట' అన్నదియే కవిహృదయము. ఈమార్పును 'వనిసొచ్చుట, ర్చనలిచ్చుట, కనువిచ్చుట' అను పదవిన్యాసము గూడ బలపఱచు చున్నది.

౧౪. సూర్యాస్తమయవర్ణనమునకు చెందినపద్య మి ట్లున్నది—

ఉ, ఈవనజాయతాక్షిఁ, దరుణేక్షుధనుష్కతురుష్కమౌళి, యా
 హా. వెతపెట్టె నంచు, హృదయార్ద్రదయాభ్యుదయాప్తిచేత రా
 జీవశరప్రహారగతిఁ జెందుట తెల్పఁగ నేగె నాఁగ గం
 గావిభుఁ జేరెఁ గింశుకనఖద్యుతిఁ జొత్తిలి మిత్రుఁడయ్యెడన్. (4-5)

సూర్యుఁ డెట్టువాటి పశ్చిమసముద్రము చేరినాఁ డని వర్ణన. పద్యము

(1) కల్పద్రుమాణా మివ పారిజాతః (రఘువంశము. 6-6)-అనికాళిదాసు.

చతుర్థపాదములో 'కింశుకనఖద్యుతి' అనుట తప్పు. 'కింశుకసఖద్యుతి' యిది 'సఖ' శబ్ద మౌపమ్యవాచకము.(1) కింశుక మనఁగా మోదుగుపువ్వు. దానితో సమాన మయినకాంతి ఎఱ్ఱనికాంతి. దానితో జొత్తిలి యనఁగా నెత్తుపడి యని యర్థము. ఇచట 'జొత్తిలి' కి ముం దర్ధబిందు వొకటి చేరి దీనిని 'చొత్తిలి' గా మార్చు చున్నది. ఈబిందువును తొలఁగింపవలయును. ఇట్లు పదస్వరూపము లను తాఱుమాఱు చేయఁగలయరసున్నలవిషయమున చాలజాగరూకత ఆవశ్య కము. ఇందలినాలుగవపాదము '... ....గం గావిభుఁ జేరెఁ గింశుకసఖద్యుతి జొత్తిలి మిత్తుఁడయ్యెడన్' అని సవరింపురూపుతో పఠింపఁబడవలయును.

౧౯. మదాలసాకువలయాశ్వులభావిప్రణయవిహారమును వివరించుచు కుండల కువలయాశ్వునితో పలుకుసందర్భమున నున్నపద్యము క్రింది విధముగ ముద్రిత మయినది—

సీ. రాచిల్క రాయబారమున దారికి రాక
చడ్డింపుకోరమీసములు దువ్వి,
యది గా దనుచు నింతటంతటఁ జేరరాఁ
గేడింప బిట్టుగాఁ గేక వైచి,
నీబంట నన్ను మన్నించవే యన విని
వినమి సేయుచుఁ దుంటవిల్లు వంచి,
దుదుకుగాఁ జెఱ గంట ముడిగొన్నబొమ్మ లా
నించి చూచిన తెగ నిండఁదీసి,

గీ. యతనుఁ, డీయింతి కలుక చల్లార్పు, నీవు
పాదముల వ్రాల, దీనబాష్పములు చూచి
యప్రసన్నాన్యస మొనరించునట్లు గాఁగ,
నింపుసొంపారఁగా, విహరింపుఁ డింక. (4-50)

ఈపద్యమునందు ప్రథమపాదముత్తరార్థమున 'చడ్డింపు' అనునది కోర మీసములకు విశేషణముగా నున్నది. 'చడ్డింపు' అనుదానికి 'సడ్డింపు' రూపాంత

(1) ఉపమావాచకములు కావ్యాదర్శములో 2-57 నుండి 65 వఱకుఁ గలవు.

రము. సడ్డింపునకు అలక్ష్యముచేయు(లెక్కచేయకయుండు)అనునది యర్థము.(1) ఈయర్థమునకును కోరమీసములకును సంబంధము లేదు. రెండు నాలుగుపాదము లందు కేడింపన్, చూచినన్- అని యసమాపకక్రియ లున్నవి. ఇచ్చటఁ గూడ నట్లే 'చడ్డింపఁ గోరమీసములు దువ్వి' అనవలయును. నాయిక ప్రణయకోప ముతో నున్నపుడు నాయకుఁ డామెకడకు రాచిలుకలచే సందేశ మంపఁగా దారికి రాక ఆరాయబారము నలక్ష్యము చేసినపుడు మదనుఁ డామెపై కోపముతో కోర మీసములను దువ్వుట యిచ్చటివర్ణన. కనుక 'చడ్డింపన్' అనినపుడే అన్వయ మిట సంగతము. లేనిచో క్రమభంగము కూడ.

ఇట్లే మూఁడవపాదమున 'వినివినమిసేయుచుఁ దుంట విల్లు వంచి' అని కలదు. వినివినమి సేయువాఁడు మన్మథుఁడు కాఁడు. నాయికగా నుండవల యును. అప్పుడే తుంటవిల్లు వంచుట సుసంగత మగును. 'నాయిక వినివినమి సేయఁగా ననవిల్తుఁడు తుంటవిల్లు వంచి' అనునర్థము ప్రకరణోచితము. అందులకే 'వినివినమి సేయఁగాఁ దుంటవిల్లు వంచి' అని సవరించుట అవశ్యం భావి. వినివినమిసేయుటలో కర్త నాయిక. ఈయసమాపకక్రియలయం దంతటను నాయికయే కర్తగా ననుగత మగు చున్నది. నాలుగవపాదమున 'చూచిన తెగ నిండఁ దీసి' అని కలదు. అది 'చూచినఁ దెగ నిండఁదీసి' అనుట వ్యాకరణ మర్యాద. ఇపుడు సవరణాత్మక మయినపద్య మి ట్లుండవలయును.

సీ. రాచిల్కరాయబారమున దారికి రాక
  చడ్డింపఁ గోరమీసములు దువ్వి,
యది గా దనుచు నింతటంతటఁ జేరరాఁ
  గేడింప బిట్టుగాఁ గేక వైచి
నీబంట నన్ను మన్నించవే యన విని
  వినమి సేయఁగాఁ దుంటవిల్లు వంచి,
దుడుకుగాఁ జెఱఁ గంట ముడిగొన్నబొమ్మ లా
  నించి చూచినఁ దెగ నిండఁదీసి

(1) సూర్యరాయాంధ్రనిఘంటువు, 'సడ్డింపు'పదము.

గీ. యాతనుఁ, డీయింతిరోలుక చల్లార్పి నీవు
పాదముల వ్రాల దీనబాష్పములు చూచి
యప్రసన్న్యాస మొనరించునట్లు గాఁగ
నింక్తసౌంపారఁగా విహరింపుఁ డింక.

అర్థసౌందర్యమునే అవకతవకలపాలు సేయునిట్టిదోసంగులు సవరించుట చాలశ్రమముతో కూడినపని. సవరింపఁబడ కున్నచో సహృదయులరసాస్వాదన మునకు అడ్డకట్ట లై యివి కవిప్రతిభనే శంకింపఁజేయును. ఇట్టిపరిష్కారణము వలననే కావ్యగౌరవము పరిరక్షింపఁబడును.

౨౦. ఋతధ్వజుఁడు మదాలసను పరిణయమాడుటకు తీసికొనిరాఁగా పాతాళ కేతునితమ్ముడు తాళకేతు వనుదనుజుఁడు తపసిరూపన వచ్చి, యజ్ఞరక్షణమునన కని యారాజును తనవెంటఁ గొనిపోవు చున్నాఁడు. ఆదృశ్యమును గాంచినపౌర కాంతలు కల్యాణసమయమున భూకాంతునిస్థితిని తలంచుకొని బాధతో ననుకొను చున్నమాటలను తెలుపుపద్యములలోనియొకదానిమూఁడవపాదము——

సీ. వ్రేలిమిఁ జెమరించుకీల నందెడులాజ
లందిచ్చునట్టిసోయగముఁ జూచి (4–80)

అని అచ్చయినది. ఇందు 'కీల నందెడులాజలు' అనుచో కీల యనఁగా జ్వాల. జ్వాల చెమరింపదు. అంతయు నసంగతము. ఇక్కడ 'కేల నందెడు లాజలు' అని యుండవలయును. లాజహోమసమయమునందు చెమరించు చున్న హస్తమునం దంటి యున్నట్టిలాజలను మదాలస యందించెడియందము చూచు ముచ్చట తీఱకుండఁగనే(మాయా)తపస్వి యగుతాళకేతువు ఋతధ్వజక్షితీం ద్రునిని వెంటనిడికొని పోవు చున్నాఁ డని పౌరకాంతలు బాధపడు చున్నారు. అరసున్న గాదు, శకటరేఫము గా దిది. అర్థగాంభీర్యము నంత మొందించిన అక్షరస్ఖాలిత్యము. అవశ్యము సవరణసూచిలో చేరవలసినయీముద్రారాక్షసము చేరలేదు. చిన్ననలుసులులే యివి యనిపించును గాని నలుసులబాధ చాలపెద్దది. "చెప్పులోనిఱాయి చెవిలోనిజోరీఁగ, కంటిలోనినలుసు కాలిముల్లు" ఇంతింత కా దన్నవేమన్నవాక్కు మిథ్య గాదు.

౨౧. ఊహ మెఱుంగని వ్రాయసకాండ్రఘంటములతీండ్రింపులకు లోనై ఛందో భంగయతిభంగప్రాసభంగము లిం దనేకస్థలములయందు చిందులాడు చున్నవి. వానిని పరిష్కరింపకయే ముద్రించుట జరిగినది. మచ్చునకు ఇచ్చుట నొకఛంద శ్శైథిల్యము చూపఁబడు చున్నది. ఒకతేటగీతితృతీయచరణము —

"నిన్ను వేవేగఁ దోడితె మ్మనఁగ వచ్చి" (4—90)

అని యున్నది. తేటగీతికి యతి గాని, ప్రాసయతి గాని సరిపడును. కాని అం దేదియు నీపాదమున పొందుపడలేదు. ఈపాదము "నిన్ను వేవేగఁ దోడితె మ్మన్న వచ్చి" అని యున్నయెడల ప్రాసయతితో సలక్షణముగా సరి పడును. ఈమాత్రపుసవరణను గూడ గుఱుతింపక ప్రాసయతిభంగము ప్రదర్శిం చుట ప్రమాద మనక తప్పదు.

౨౨. నాగపురమున ఋతధ్వజుఁడు మదాలసను చూచినసందర్భమందు ఆమెను వర్ణించునొకపద్యముద్వితీయచరణము —

సీ. నెలగోవ గలమోము తెలిదమ్మిఁ గలతుమ్మె
దలకు నమ్మికకమ్మ లలవరింప (4—138)

అని యున్నది. ఇక్కడ "నెలగోము"గలమోము అని యుండుట యుక్తము "జిగిచాలు దగుకీలు, నెఱికప్పుఁ గనుకొప్పు, నునుమోవి పైఠీవి" అని తక్కిన మూఁడుపాదములందను అనుప్రాసము సాగు చున్నది. ఇచట కూడ మోమునకు సరిపడునట్లు గోము అనుటయే తగును. 'నెలగోవ' అనునప్పు డర్థము కూడ సరిపడదు. 'నెలగోము' అనునప్పుడు చంద్రవికాసము(గలమోము) అనురీతి నర్థము. ఇదియే కవిపాఠ మని యనుప్రాససరణి తెలియఁజేయు చున్నది.

ఇందే క్రిందిగీతిలో "తళుకుచే మ్రొక్కుఁ గొనెడుముత్యాలరెట్టపేట" అనియున్నది. 'రెంటపేట' అని యిచట నుండవలయు ననిపించును. రెంటపేటను సూర్యరాయాంధ్రనిఘంటువు గ్రహించినది. ముత్యాలజమిలిహార మని యర్థము రెట్టపేట యనునప్పు డర్థసంగతి కనిపించుట లేదు. సూ.ని. 'రెట్ట' కిచ్చిన యర్థముల కిచట సంగతి లేదు.

౨౩. కుబేరుఁడు పాతాళకేతువుమూలమున పోయినతనపురావైభవమును సంత రింపఁజేయుటకై భటుల కాజ్ఞ లొసఁగుసందర్భమున నొకపద్య మి ట్లున్నది—

సీ. హరినీలములమేడయావల కెంపులసజ్జ
కడప కట్టఁగ సుమగర డొసఁగ,
పెఱచోట వడి దాఁచిపెట్టిననవనిధా
నములు దేవాప్తసంఘములఁ బనిచి,
కారుకు లెత్తి చక్కఁగఁ జేయుఁ డల చైత్ర
రథ మని తగుభటప్రతతిఁ బనిచి,
యారయమిచే నొక్క లంటిపెట్టుకయున్న
యిభకోటులకు మేపు లిడ ఘటించి.

గీ. పదమిఁ బాతాళకేతుండు గెడసినపుడె
నిత్యముగ నిచ్చె నలకాధిపత్య మనుచు
ననిమిషాధీశ్వరునిచెంత కనుపఁ దలఁచి
పుత్రుఁ బిలు పన్న, నూడిగంపుభటు లప్డు, (4_206)

ఇందు ప్రథమచరణమున 'సజ్జ' తప్పు. 'సజ్జ' ఒప్పు. సజ్జ యనఁగా సౌధము లేక శిరోగృహము,(1) కెంపులతో నిర్మింపబడు చున్నసౌధ మనుట. ద్వితీయ పాదములోని 'దేవాప్తసంఘములన్' తప్పు 'దేనాప్తసంఘములన్' ఒప్పు. నవ నిధానములను తేన్=తెచ్చుటకు, ఆప్తసంఘములను పనిచి యని యర్థ ముండ వలయును. (తేన్ + ఆప్తసంఘములన్ – తేనాప్తసంఘములన్. నవనిధాన ములు + తేనాప్తసంఘములన్ నవనిధానములు దేనాప్తసంఘములన్.) తృతీయ పాదమున 'కారుకులు' తప్పు. 'కారాకులు' ఒప్పు. కారాకులనఁగా పండు టాకులు.(2) ఒక్కపద్యమునందే ఎన్నియవకతవకలు చేరినవి అహో బత! ఇవి పరిశోధనపథమున కంటకతరువులు కదా!

ఇక, నలకూబరునికోడిపందెములసందర్భమున నొకపద్యము –

ఉ. పట్టెపుజుట్టు నిక్కుమెడ బాగునఁ జివ్వినయారెపొంకము
న్నెట్టలబల్మి, నెమ్మిఁ బురణించినయీఁకలజోకలున్, దగల్
గొట్టకయుండ మేపుపలుకోయపుమందులు గల్గుపుంజుఁజే
పట్టి గ్రహంబువెన్కఁ గనుపట్టఁగ నల్లులు దీసి యంతటన్. (4_208)

(1) ఆంధ్రపదకోశము, 'సజ్జ' పదము.
(2) శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు, 'కారాకు' పదము.

ఇందు 'గ్రహంబువెన్కఁ గనుపట్టఁగ' అనుచోట 'గ్లహంబువేడ్క గను పట్టఁగ' అని యుండవలయు నని తోఁచు చున్నది. గ్లహమువేడ్క యనఁగా పందెమునందలికుతూహలము, కనుపట్టఁగ నల్లలు తీసి అని యన్వయము. 'అక్షేషు గ్లహః'(3-3-70)అని పాణినిసూత్రము. ఈప్రయోగమీకవి వ్యాకరణ పాండిత్యమునకు నిదర్శనము వంటిది, ఇట్టిదానిని త్రోసిరాజని గ్రహ మనుట అర్థము లేనిమాట.

౨౫. అశ్వము నధిరోహించిననలకూబరుఁడు "నగుమొగంబున వీ యని నగరు వెడలి"(4_213)నట్లు కలదు. గుఱ్ఱమును తోలునపుడు 'వీ' యని కాక 'హే' యనుట లోకవిదితము. 'ధే' యని తోలుటను కవులు ప్రయోగించి యున్నారు. మచ్చున కొక్కటి—

చ. అది గని సైనికుల్ గడుభయంబునఁ జేరి మహోపలంబుతో
నదికినరీతి నున్నపవనాశ్వము 'ధే' యని కక్కసంబులన్
సదసద గాఁగ వ్రేసియును జాటులఁ బెట్టియు నేమి చేసియున్
కదలక యున్నయవ్విధము కవ్వడి కేర్పడ విన్నవించినన్.*

చిననారాయణయే మఱియొకచోట "...... కువలయాశ్వము 'ధే' యని చౌకు చేసినన్"(4_55) అని ప్రయోగించెను.'వీ' యని తేజిని తోలుట యెచటను కనుపట్టుట లేదు. ఇది వ్రాఁతకాండ్రచేఁతకు లోనయి యిట్లు రూపొంది యుండు ననిపించు చున్నది.

౨౬. ఆశ్వాసాంతపద్యమునం దొకచో కృతిపతి "పరిహృత కవిభూమా!" (4_220) అని సంబోధింపఁబడినాఁడు,కాని యిట 'పరివృతకవిభూమా ' అని యుండవలయును. కవులను పరిహరించుట కాదిట జరగుచున్నది. అనేకకవు లచే పరివృతుఁ డయినాఁ డని యిచటివర్ణనము. ఇట్టివిరుద్ధార్థములు బహుస్థల ములం దున్నవి.

౨౭. అమరావతీపురము చేరిననలకూబరుఁడు వీథులవెంటఁ బోవువిధము తార మదాలసతో వర్ణించి చెప్పుసందర్భమునందలియొకసీసపద్యముక్రిందనున్నగీతిక యొక్క ముగింపు —

* జైమినిభారతము, 4_77.

"........బిత్తరప్సాటు రొమ్ములో బిగువు నెగడ
నేఁగు నాకారివెంట నయ్యెమ్మెకాఁడు"(5—5)అనికలదు.

ఇచట 'నాకారివెంట' ననుట తప్పు. నాకారి యనఁగా నాకులకు(దేవతలకు) అరి(శత్రువు), అనఁగా రాక్షసుఁ డని యర్థము. కాని నలకూబరుఁడు రాక్షసునివెంటఁ బోయె ననుట అర్థము లేనిమాట.'పాకారివెంట' నేఁగు ననినచో ఇంద్రునివెంట నేఁగు ననునర్థము వచ్చును పాకారి. యనఁగా 'పాకుఁడు' అను దైత్యునకు శత్రువు అని యర్థము, లేదా 'ఏఁగు నాదారివెంట' నని యయినను అనవచ్చును.

ఇఁక 'బిత్తరప్సాటు' అనుదానిని ముగాగముద్రుతకార్యములు జరపి 'బిత్తరప్సఁబాటు' అనుట తగును. 'రొమ్ము' లో శకటరేఫ ముంచుట తెనుఁగు పరియాద.

. నలకూబరునిపై భవప్రాభవమును వర్ణించుతఱి నొకసీసపద్యపాదము
"సంగీతమేళ ముప్పొంగఁ దేజీ నెక్కి
కంప మంటుచు రవగాలు చూపు"(5—9)నని యున్నది.

ఈపాదమునందు ఛందోలక్షణము సరిగా నున్నప్పటికిని' కంప మంటుచు' ననఁగా భయపడుచు రవగాలు చూపు ననుట స్వరసముగా లేదు. ఇట 'కంపము' 'కందము' గావలయును, కందము 'స్కంధ'శబ్దభవము. దీనికి 'పశువులమూఁపు' అర్థము.* ఇచట గుఱ్ఱముమూఁపుర మని భావము నలకూబరుఁడు గుఱ్ఱము మూఁపు తట్టుచు రవగాలు(అశ్వగతివిశేషము) ప్రదర్శించు చున్నాఁ డని యిచటి వర్ణన. అందుల కుప్పొంగు చున్నది సంగీతమేళము. అశ్వగతివిశేషమును ప్రదర్శించునాఁడు తచ్ఛోదకముగా మూఁపు తట్టుట ప్రత్యక్షదృష్టము. కందశబ్దమిట కంపముగా మాఱుటతో గంభీరార్థము గంగపా లయినది.

౨౫, తార నలకూబరునియందలితనచాపల్యమును మదాలసతో వర్ణించి చెప్పు సందర్భమునం దొకసీసముక్రిందిగీతము క్రిందివిధమున నున్నది —

* శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు, 'కందము' శబ్దము.

గీ. మఱియు నొక్కొకవేళ సుమాళ మొదవఁ
బరిమళంబులబాగాలు పలక నుంచి
నే నొసంగఁగఁ గొరికినదానికరణిఁ
బ్రియునిచేతనె వాని కిప్పింతు నమ్మ! (5-17)

ఇందు కొరుకుట సందర్భసంగతము కాదు. 'కొంకినదానికరణి' ననునది యుచటిసాధుపాఠః పలకయందుంచినట్టి పరిమళాలబాగాలు నాయంతట నలకూబరున కొసంగుటకు (సిగ్గున)జంకు చున్నట్లు నటించుచు బ్రియుని(జయంతుని)చేతనే యిప్పింతు నను చున్నది తార.

౩౦. రంభావిరహవర్ణనాసందర్భమునందలియొకసీసపద్యముతృతీయచరణము—
"రా కున్న వానిఁ గోరకు మన్న, నయ్యెఁ బో.
నవ్వానిఁ గోర నా కేల? యనుచు" (5-59)

అని యున్నది, ఇం దుత్తరార్ధమున యతిభంగ మగుట గమనింపఁబడ లేదు. అది "యెవ్వానిఁ గోర నా కేల యనుచు" అని యుండవలయును.
౩౧. కొన్నితావుల నౌపవిభక్తికములు గూడ గుఱుతింపఁబడలేదు. తారానలకూబరులరహస్యశృంగారమును పసిగట్టినరంభ తారాదౌష్ట్యమును తలంచుకొను సందర్భమున నొకసీసముక్రిందితేటగీతికముగింపు—

"గైకొనుట గానలేక యాకాఁపురాల
గారవింతునె?నమ్మి నే వీరి డైతి"(5-44)అని యున్నది.

కాఁపు+ఆలు = కాఁపురాలు గృహస్థురాలు(గృహిణియనుట). దీనికి ద్వితీయైకవచనము పరమగునపుడు ఔపవిభక్తిక 'ఇ' వర్ణము వచ్చి కాఁపురాలి నగును.* ఇది సాధురూపము. కాఁపురాల ననుట అసాధువు. అదియునుంగాక 'కాఁపురాల' నననపుడు 'కాఁపురములను' అనువిపరీతార్థప్రతిపత్తి కలిగి కలుగవలసిన 'గృహిణి' అనెడియర్థము కలుగ కున్నది. వేశ్యయయిన తారను 'గృహిణి' అని యెకసక్కెమాడు చున్నది రంభ. కావున నిట 'కాఁపురాలి గారవింతునె?' అని సవరించుకొనవలయును.

* బాలవ్యాకరణము, అచ్చిక. 28, 29 సూత్రములు.

౩౨. తాళకేతువు కుండల నపహరించికొని పోవు చున్నప్డు బాలిక తనరక్షణకై యిట్లు మొఱయిడు చున్నది —

శా. అయ్యో! కావరె యాఁడుదాన నబలన్ హా! యెవ్వరిం గాన నా
కుయ్యాలింపరె నన్ను నెత్తికొని దిక్కుల్ చూచుచుం బాఱెడిన్
దయ్యం బీతని నెవ్వరేని నిజఖడ్గప్రోద్యదుగ్రాగ్నికిం
ధాయ్యం జేయక యాడుచీవెనలఁ బొందన్‌లేర నేఁ మ్రొక్కెదన్ (5-63)

తురీయచరణమున 'ధాయ్యం జేయక' అనుట విపరీతార్థప్రదము. 'ధాయ్యం జేయఁగ నాఁడుచీవెనల' నని యుండవచ్చు. 'ధాయ్యం జేయరె' అనుట మఱింత బాగుగా నుండు నని 'కావరె, ఆలింపరె, లేరె' అనువానింబట్టి యని పించు చున్నది. 'పాఱెడిన్' అని శకటరేఫముతో నుండవలయును. తొలిపాద మున 'నాఁడు' దానిలో నున్నయరసున్న నాలవపాదమున కూడ నుండవలెను.

౩౩. కొన్నితావుల శ్రద్ధతో సమీక్షింపకపోవుటవలన కొన్నిప్రమాదములు గుఱు తింప నలవి కానిరీతిని నెలకొని యున్నవి. జయంతనలకూబరులు తాళకేతువు బుజములు ఖండించినసందర్భమునందలిపద్య మి ట్లున్నది —

క. దేగ వెరచూప్ప నిగుడెడు
వేగంబున నిగుడుదనుజవీరెనిబుజముల్
ప్రోగువడఁ బంచికొనుచు వి
భాగించిరి తనువుతోడఁ బాసి చనంగన్, (5—66)

ఈపాఠమున ప్రథమపాదమున కర్థము చెప్పుట సాధ్యము కానిపని. 'వెర' యనుట ప్రమాదము. వెర గా దిది 'ఎర' 'చూప్పు' అనుదానికి బదులు 'చూప' అనవలయును, 'నిగుడెడు' అనునది బాలవాకృతి ననుసరించి 'నిగిడెడు' కావలయును.* ఇప్డ దీపద్యము "దేగ యెర చూప నిగిడెడువేగంబున...." అని సాగినయెడల కవిహృదయము కన్పట్టును. అర్థము సుగమము. 'వెర చూప్పు'అనుట విపరీతార్థప్రదాయకము.

౩౪. ఋతధ్వజునకు మంగళస్నానము సేయించుతఱి నొకపద్యము —

---

* బాలవ్యాకరణము, క్రియా. 85సూ.

క. ముందుగ నిగ్గులనీలము
లొందింపక చిక్కుపడకయుండ న్నెఱులన్
గందపుటటక లిడియె నొక
యందపునెఱవన్నెలాఁడి యన్నరపతికిన్. (5_90)

అని కలదు. ఇందు 'ఒందింపక' అనుటవలన వ్యతిరేకక్రియ యగుచున్నది. కాని సందర్భమునుబట్టి 'నిగ్గులనీలము లొందించుటకు' అనునర్థమున 'ఒందింపఁగ' నని యుండవలయును, "......... నిగ్గులనీలము లొందింపఁగఁ జిక్కు పడక యుండన్........." అని యుండవలయును.

౩౫. ఋతధ్వజునకు కల్యాణస్నాఁగై సేఁత ముగిసినసందర్భమునందలిపద్య మిట్లున్నది —

క. ఈరీతిఁ జెలులు నృపు సిం
గారించి యనంతభుజగకాంతుపనుపునం
దార మొదలైనవా రొ
య్యారింగై సేయ నిర్భరానందముగన్. (5_94.)

అనంతభుజగకాంతు(ఆదిశేషు)నకు ఈసందర్భమందు ప్రసక్తి లేదు. అసలాపాత్ర మీకావ్యమునం దెచ్చటను లేదు. 'సింగారించినయంత భుజగకాంతుపనుపునన్' అనునది యిచటి కవిపాఠము. భుజగకాంతుఁడనఁగా నశ్వతరుఁ డని యిచటియర్థము. అందువలన 'యనంత' 'నయంత' కావలయును.

౩౬. ఈకావ్యాంతపద్య మిట్లున్నది —

మలిని. పరివృఢభుజతేజా! భానుమద్బింబభానూ
ద్భవహరిదబలాంగస్థాయిఘర్మోదబిందూ!
భవదనభిముఖాసిభ్రామ్యద్దై భాగ్రహస్తా!
ప్రవివృతబలతేజా! ప్రౌఢకీర్తిప్రకాశా!

ఇం దాదిపాదమున ప్రాసభంగదోషము తొంగిచూచు చున్నది. తత్పరిహారమునకై 'పరి' ని 'పవి' గా గ్రహింపవలసి యున్నయది. అపుడు 'పవివృఢభుజతేజా' యని సిద్ధించును. పవి యనఁగా వజ్రాయుధము.* 'వృహా

* హ్రాదినీ వజ్ర మస్త్రీ స్యాత్కులిశం భిదురం పవిః—అమరము.

ఉద్యమనే*అనుధాతువునకుఁబై 'క్త' ప్రత్యయము చేసిన 'వృధః' యగును. వజ్రాయుధమును పూనెడిభుజము కలవాఁడు ఇంద్రుఁడు. ఆతనితేజస్సువంటి తేజస్సు గలవాఁ డని దీని కర్థము చెప్పికొనవచ్చును.

ఇవి యీప్రబంధమునందలిప్రముఖదోషము లని భావించి ప్రదర్శించి పరిష్కరించి సాధుపాఠములు నెలకొల్పుటకు చేసిన ప్రయత్న మిది. ఈకోవకు చెందిన వింకను గలవు. ఇవి గాక అరసున్న లుండవలసినతావుల నరసున్నలు లేకపోవుటయు, నరసున్నలుండఁగూడనితావుల నరసున్న లుండుటయు, శకటరేఫము లుండవలసిన చోటుల సాధురేఫము లుండుటయు, సాధురేఫము లుండవలసినచోటుల బండిఱా లుండుటయు, వ్యాకరణవిరుద్ధము లయినసంధు లుండుటయు మఱియు నితరము లగునొసఁగులు నూఱులకొలఁది ఈకృతిముద్రణమున నంకురించినవి. ఒక్కవాక్యములో చెప్పవలసినచో సామాన్యపాఠకున కీముద్రణము కొఱకరానికొయ్యవంటిది. ప్రాచీనసాహిత్యముతో ప్రగాఢపరిచయ మున్నవారు మాత్రము కొంతక్లేశము సహించినచో వానిని గుర్తించి సవరించుకొని పఠించుకొనవచ్చును. ఆదోసము లన్నియు నిచట నెత్తి చూపుటకు వలను కాదని భావించి, యీ భాగము నింతటితో ముగించి, అనంతరభాగము నందుకొనుచున్నాను.

శ్లో॥ యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్ ।
తత్సర్వం క్షమ్యతాం దేవ నారాయణ నమోఽస్తు తే॥

* పాణినిమునిధాతుపాఠము—1347వధాతువు.

# ద్వితీయ దశము

# కవిజీవితపరిచయము

ఏభాషాసారస్వతమునందయినను ఏకవిజీవితమునైనను గ్రహించుటకు ప్రకటించుటకు అన్నిటికంటె ఆకవికృతులే ప్రబలాధారములు. అనఁగా, ఆతని తలిదండ్రు లెవరు? వారివృత్తు లేమి? వారికిఁ గాని, ఆకావ్యకర్తకుఁ గాని సమకాలికులలో ఏరితో నేపరిచయమున్నది? ఆకావ్యమందు పూర్వు లెవరు స్మరింపఁబడిరి? ఆకృతికి పతి నరుఁడా? దేవుఁడా? నరుఁ డయినచో వానివివరము లేవి? ఒకవేళ భగవంతుఁడే కృతిపతి యయినయెడల పురాణమూర్తియా? లేక స్థానికమూర్తియా?—మున్నగువిషయము లన్నియు తిన్నతిన్నఁగ కనిపట్టవలెను. వీనిచే సమగ్రాధారములు వెలువడనియెడల, ఆకృతినిర్మాతను స్మరించినయనంతరకవివరు లున్నారా? వా రేయేవిషయములు వెలిబుచ్చిరి? ఇత్యాద్యంశములను కైకొని కవిజీవితవిశేషములను పరిశోధించి ప్రమాణీకరింపవలయును.

ఇట్లు కువలయాశ్వచరిత్రకర్త యయినసవరము చిననారాయణనాయకకవి జీవితవిశేషములను, కాలమును మున్ను పరిశీలించి యున్నచరిత్రకారులు, సాహిత్యవేత్తలు తమయభిప్రాయములను ప్రచురించి యున్నారు. అందు కొన్నిచిన్నితేడా లున్నవి. కావున, వానిని మఱియొకపర్యాయము పర్యాలోకించి సముచితాభిప్రాయము లున్నచోట సమర్థించుటయు, లేనిచోట స్వీయాభిప్రాయమును నివేదించుటయు ప్రస్తుతకర్తవ్యము.

చిననారాయణ శ్రీమన్మదనగోపాలకటాక్షవీక్షణములచే సంపాదింపఁబడిన సరసకవితావైభవము గలవాఁ డనియు, సవరము నారాయణభూపాలునితనూభవుఁ డనియు, శఠగోపతాపసేంద్రునిశిష్యుఁ డనియు, ఏల్లవేళల భారతభాగవతాదులు విను చుండువాఁ డనియు, మిక్కిలియందగాఁ డనియు, కాశ్యపగోత్రపవిత్రుఁ డనియు, జాతివార్తాకవిజనామోదసంధాయకుఁ డనియు ఆశ్వాసాంతగద్యమువలన తెలియు చున్నది.

వంశము :_ ఈతఁడు సూర్యుని వర్ణించి, సూర్యవంశములోని శ్రీరామ చంద్రునికుమారుఁ డయినకుశునివంశమునకు చెందినవాఁడ ననువిషయము క్రిందిపద్యమందు చెప్పుకొనెను —

శా. ఆరామాధిపమౌళికిన్ దశముఖాఖ్యగ్రావదంభోళికిన్
ధారావారపటీసమావృతకటీభారోజ్జ్వలద్ధారుణీ
ధౌరంధర్యసరీసృపాధ్యసమదోస్తంభప్రతాపప్రభా
శ్రీరాజద్ధిభుఁ డౌకుశుండు జనియించెం బ్రాభవోపేతుఁ డై (1—22)

తే. ఆకుశునియన్వయమున బాహాసహాయ
శౌర్యగాంగేయ వైరిరాజన్యగేయ
బలులు పెక్కండ్రు నృపతులు వెలసి, రందు
వినుతి వహియించె గోవిందజనవిభుండు. (1—23)

ఈగోవిందరాజుకొడుకు తిమ్మరాజు(1—24).ఈతఁడు పలుపర్యాయములు శత్రువిదళనము కావించినవీరవరేణ్యుఁడు(1-25). ఈతనికి కుమారస్వామి వంటిపరాక్రమశాలి యయినలక్కరాజు జనించెను(1-26). ఈవనిప్రతాపము కూడ శత్రుభీకరమే(1-27). ఈతఁడు తిరుమలదేవిని ఉద్వాహ మయ్యెను(1-28). ఆమెయందు తిప్పరాజును, లక్కరాజును, తిమ్మరాజును, కృష్ణరాజును, నారా యణరాజును సంతానముగ పొందెను(1-29)వీరిలో తిప్పరాజు అనుజుఁ డయిన లక్కరాజును తోడుచేసికొని హిందుఖానుని వధించి. తురకబంటులను నాకలోక మున కంపెను(1-32, 33, 34). ఈతిప్పరాజు కోనమాంబ నుద్వాహమై, తిమ్మ రాజును, వేంకటరాజును సంతానముగ పొందెను(1-35, 36). వీరియందు తిమ్మ రాజు కూడ తురుష్కవీరవిదళనవిహారి యై మించెను(1-39, 40, 41). ఈతఁడు తిరుమలదేవి, మూర్యంబ, రంగమాంబ, లక్ష్మాంబ, కొండమాంబ, గురువమాంబ అనునాఱుగురువిదలను పెండ్లి యయ్యెను(1-42). వీరిలో తిరుమలాంబయందు తిప్పరాజును, రంగరాయలను, కృష్ణరాజును కనియెను. మూర్తిమాంబయందు నారాయణరాజును(కృతిభర్తను), పెదరంగమాంబయందు రఘునాథునిని, లక్ష్మాంబ యందు రామరాజును, కొండమాంబయందు గోవిందరాజును, గురివమాంబయందు తిమ్మరాజును కనెను(1-45). ఇందు నారాయణరాజు వీరవెంకటరాయలకరుణ

వలన భూమిని పాలించెను(1-52). శ్రీరంగరాయలకు తిమ్మమాంబ, తిరుమలాంబ దేవేరులు(1-53). వీరిలో తిమ్మమకొడుకులు గోపాలరాజు, చిననారాయణరాజు(కృతికర్త), కస్తూరిరాజు, రఘునాథరాజు, తిమ్మరాజు-అనువారు (1-56). రంగరాయని తమ్ముఁడయిన కృష్ణరాజు రుక్మాంబవలన రంగరాజును, వెంకటపతిరాజును, వేంగళరాజును కనెను(1-57).

తిమ్మాధిపునికొడుకయిననారాయణరాజు చిననారాయణరాజును, కృష్ణాధిపునిపౌత్త్రుఁడయినవేంకటపతిరాజును కుమారులుగా స్వీకరించెను(1—58). అనఁగా పినతండ్రి యయిననారాయణరాజు చిననారాయణరాజునకు తండ్రియయ్యెను. అతనికే చిననారాయణ తనకృతి నంకితము చేసెను.

కాలము :— కృతిపతి యయిననారాయణరాజుకాలమునుబట్టి కృతికర్త కాలమును గ్రహింపవలసియున్నది. ఈనారాయణరాజు వీరవెంకటరాయల కృపాపాత్రుఁడని క్రిందిపద్యమున వచించుచున్నాడు నారాయణ—

సీ. చలపట్టెనా వైరిజనపాలకుల తెక్కె-
  ముక్కాడ నీయక యుక్కడంచుఁ
బూనెనా యరినరాధిపుల నంతఃకల
  హంబు కల్పించి పాయంగఁజేయు
నెంచెనా పరిపంధిపృధివీపతుల దాడి
  వెడలించి తనవెంటవెంటఁ ద్రిప్పుఁ
దలఁచెనా రిపురాజిఁ దనహజారంబునఁ
  బడిగాపు లై తడఁబడఁగఁజేయు
గీ. నితనితోడుత వైర మీడేల దనుచు
సకలధరణీశు లెప్పుడు నిచ్చక మొనర్ప
వీరవేంకటరాయభూవిభునికరుణఁ
బరఁగు నారాయణక్షమాపాలవరుఁడు (1—59)

మఱియు నీవిషయము "శ్రీరంగరాజకుమార వీరవేంకటేశరాయభుజాబలసహాయ బహువిధోపాయధురీణుండును(1—17)" అనువచనమునను, మూర్తమాంబయందుఁ గర్ణాటకాధీశ్వరదయసాంద్రుం డగునారాయణవసుంధరాదేవేం

ద్రుని(1-45) అనువచనమునను, 'వీరవెంకటరాయభూవిభునికరుణ నెలమిఁ బాలించె నిల నారణేశ్వరుండు(1-52)' అనుపద్యములోను, 'వీరవేంకటరాయ భూవిభునికరుణఁ బరఁగు నారాయణక్షుపాలమౌళి(1-59)' అనుపద్యములోను 'లక్ష్మీశోపమవీరవేంకటనృపాలశ్రీమహారాయదత్తక్ష్మామండల........'(3-165) అనునాశ్వాసాంతపద్యమందును వచింపఁబడి యున్నది.

క్రీ. శ, 1630 మొదలు 1642 పర్యంతము కర్ణాటసామ్రాజ్యమును పాలించినముమ్మడివేంకటరాయలే యీవీరవేంకటరాయ లనియు, నవరము నారాయణరా జతని కాశ్రితుఁడనియు, అందువలన కువలయాశ్వచరిత్రరచయిత చిన నారాయణనాయకుఁడును అప్పటివాఁడె కావలయు నని శ్రీనేలటూరి వేంకటరమణయ్యగారియభిప్రాయము.(1) ఆరవీటిచరిత్రలోనిఅళియరామరాయలమునిమనుమఁ డయినమూడవవేంకటరాయలు పట్టాభిషిక్తుఁ డయినకర్ణాటకాధీశ్వరుఁడు, ఈవేంకటరాయలే పైవీరవేంకటరాయ లని నేలటూరివారు.

కాని యితఁడు అళియరామరాయలమనుమఁ డయినవేంకటరాయలు కాఁడని శ్రీచాగంటిశేషయ్యగారియభిప్రాయము. కృతిపతి యయిననారాయణరాజునకు శ్రీరంగరాయ లనుసవతిసోదరుఁడు కలదు కదా అతనికుమారుఁడు వేంకటరాయలు, ఈవేంకటరాయలభుజబలసాహాయ్యముచేతనే నారాయణరాజు ప్రవర్తిల్లె నని శ్రీచాగంటివారివాదన.(2) దీనికి కారణము పైశ్రీరంగరాయలవైభవము మూఁడుపద్యములందు(1-47, 48, 49) వర్ణింపఁబడి యుండుటయే. ఈతఁడు మహావైభవోపేతుఁడే కాని, యీతనికొడు కయిన వేంకటరాయలే మూర్ధాభిషిక్తుఁ డయినవీరవేంకటరాయ లని కృతికర్త స్పష్టముగ నెచ్చటను చెప్పలేదు. తమవంశమునకు చెందినవీరవేంకటరాయలే కర్ణాటాధీశ్వరుఁ డై యున్నచో కవి విస్పష్టముగ చెప్పక విడుచునా? ఆరవీటివంశమునకు చెందిన వేంకటరాయలు జగమెఱిఁగినకర్ణాటాధిపతి కనుక అతనికృపకు పాత్రుఁ డగుట ఒకప్రత్యేకార్హతగా వాకొనినాఁడు నారాయణుఁడు. కనుక చాగంటివారివాదన కొంచెము డొంకతిరుగు డనిపించుచు, నేలటూరివారివ్రాఁతలే సమంజసము లని

(1) దాక్షిణాత్యాంధ్రసాహిత్యము, పుట 13.

(2) ఆంధ్రకవితరంగిణి, 11వసంపుటము, పుట 124.

పించు చున్నవి. మఱియు నారాయణరాజున కెవరెవరికడ నేపాటిచనవు కలదో క్రిందిపద్యమున చిననారాయణుఁడు తెలుపు చున్నాఁడు —

సీ. తనమాట కాంచికాతంజాపురీమధు
    రాధినాథులకు నెయ్యంబు నెఱపఁ
దనచీటి గోలకొండనరేంద్రముఖధరా
    ధవపద్మబంధు లౌదల ధరింపఁ
దనకీర్తి మట్లనంతనృపాలముఖ్యగో
    త్రామరేంద్రులు గొనియాడికొనఁగఁ
దనదానగుణము గోదావరీతీరభూ
    నిర్జరేశ్వరులు వర్ణించుకొనఁగ
గీ. వెలయు, వేదండగండనిర్గళదనర్గ
    ళమదధారాధునీనాథకుముదబంధు
కార్యకృద్డిండిమారావధుర్యసైన్యుఁ
డతఁడుప్రభుమాత్రుఁడే నారనాధినేత. (1—60)

ఇందు పేర్కొఁబడ్డమట్ల అనంతభూపాలుఁడు క్రీ. శ. 1580 ప్రాంతమునకు చెందినకకుత్స్థవిజయకర్త.(1) నారాయణరాజునకు సమకాలికుఁ డయిన అనంతరాజు చిననారాయణకంటె పెద్దవాఁడనుటలో సందియము లేదు. కనుకనే యీతనికకుత్స్థవిజయమును చూచి దీనికన్నా మిన్నగా తనకృతిని నిర్మింపవలయునని చిననారాయణ కువలయాశ్వచరిత్రమునందు కల్పనాశిల్పముల మెఱుఁగులు చూపుచు రచించెను. కువలయాశ్వచరిత్రమును ప్రకటించినసరస్వతీపత్త్రికాధిపతులు కూడ కకుత్స్థవిజయపీఠికలో "... ....చిననారాయణునికల్పనల కించుమించు సమకాలికుఁడగునీతని(అనంతరాజు)కల్పనలే కారణ మని తోఁచు చున్నది. కాని తరువాతివాఁ డగుటచే కాఁబోలు దీనికంటె నదియే(కువలయాశ్వచరిత్రయే) యందముగా నున్నది" అని వ్రాసిరి.(2) దీనింబట్టి చిననారాయణ అనంతరాజుకన్న కొంచెము తరువాతివాఁ డనక తప్పదు. లేదా-అనంతరాజు కవికి పితృవ్యుఁ డయిన

(1) ఆంధ్రకవితరంగిణి, 11వసంపుటము, పుట 123.

(2) ఆంధ్రకవితరంగిణి, 11వసంపుటము.పుట77.

నారాయణరాజుకు సమకాలికుఁ డయినప్పటికిని నారాయణరాజుకన్న వయః ప్రౌఢుఁ డై యుండును. అందువలననే అతనిచేత కూడ కొనియాడఁబడినాఁ డని లనపెంపుడుతండ్రిగొప్పతనము నంతగా కవి కొనియాడినాఁ డని తలంపవచ్చు యును. అనంతరాజు తనకృతిని తండ్రి కంకితము కావించెను. చిననారాయణ కూడ తనకృతిని తండ్రి కంకితము కావించెను, దీనింబట్టి చూడఁగా కథాకల్పనవిషయముననే కాక, అంకితవిషయమున కూడ అనంతరాజును చిన నారాయణరా జనుకరించినట్లు తలంపవచ్చును. కావున నారాయణరాజు వేంకట రమణయ్యగారిమతముప్రకారము క్రీ. శ. 1633–42 ప్రాంతములలో నుండుట చరిత్రవిరుద్ధము కాదు.

ఆరుద్రగారియభిప్రాయము కూడ "పరులు అసూయచెందేటంతపలుకు బడితో చెంజిగాని, సవరంవారు గాని క్రీ. శ. 1635నుండి1642 దాకా వెలుగు వెలిగారు. బహుశా ఆమధ్యకాలంలోనే చిననారాయణ కువలయాశ్వచరిత్రను రచించి పెదనారాయణకు అంకితం ఇచ్చాడు"(1) అనువాక్యములవలన నేలటూరి వారియభిప్రాయమునే బలపఱచు చున్నది. మఱియు "క్రీ. శ. 1630 దాకా చెంజి నాయకరాజులు రాయసింహాసనాన్ని ఎదిరిస్తూ వచ్చినా వీరవేంకటపతిరాయలకాలం లోనే చెంజి అత్యంతవిశ్వాసంగా కర్ణాటకచక్రవర్తికి సహాయం చేసింది. వీరవేం కటపతిరాయలకరుణకు పాత్ర మైనచెంజిరాజ్యం చక్రవర్తికి మరీ ఆత్మీయంగా మారడం చూసి మధురతంజావూరునాయకరాజులే కన్నుకుట్టు కున్నారు. మిత్ర భేదం పెట్టడానికి కుట్ర పన్నారు" అని కూడ ఆరుద్రగారు వ్రాసియున్నారు.(2) దీనింబట్టి కూడ విజయనగరరాజులకు చెందినవీరవేంకటపతిరాయలే కృతిపతిని కరుణించినకర్ణాటకచక్రవర్తి యని తెలియు చున్నది. ఇందువలన కూడ చిననారా యణ 17వశతాబ్దికే వచ్చును గాని ముందుకు పోఁడు.

"నారాయణరాజు 'మాట'కును, 'చీటి'కిని పని కలిగినకాలము ఆరాయలపరం డెండేండ్లకాలము, ముఖ్యముగ 1639–41మధ్యకాలమున. గోల్కొండసుల్తాను దండెత్తినది 1642 ఏప్రిలుమాసమున. అప్పటికి వేంకటరాయలు గతించెను.....

(1) సమగ్రఆంధ్రసాహిత్యము, 11వసంపుటకు, పుట145.

(2) ,, ,, ,,

కాగా, కువలయాశ్వప్రబంధము 1641 నాటికి పూర్తి అయినది. ఆనుగతిలో అప్రయత్నముగ రచించినప్రబంధము కాదు. శిల్పదృష్టితో తీర్చిన పద్యములు పెక్కులు. రెండుమూడేండ్లపంట ఏమో?వ్యవహారదక్షము, భావక్షమము నగు ఈరచనము కవి ముప్పదేండ్లప్రాయమువాఁ డని సూచించును. అనగా కవిజనన కాలము సుమారు 1610 కావచ్చును.

రాజకార్యఘటకు డై వాని కెక్కి యున్నపాలకపిత(కృతిభర్త) నలువ దేండ్లు పెద్దవా డయి యున్నచో అతనిజననకాలము సుమారు 1570 కావచ్చును, ఇతనిఘటనాచాతుర్యమును మెచ్చుకొన్నమట్లభూపాలకవి అప్పటికి ఎనుబదేండ్ల వృద్ధయి యుండవచ్చును. కావున నవరము నారాయణరాజు కాలము 1570—1640, నాల్గవఐదవఆశ్వాసాంతపద్యములు సూక్ష్మముగా పరిశీలింపఁదగ యున్నవి ప్రబంధాంతకాలమున కృతిభర్త 'పుణ్యాకృ'తి గా, 'ప్రౌఢకీర్తిప్రకాశుఁడు' గా మిగిలినట్లున్నాడు"అని డా. దేవళ్ళ చిన్నికృష్ణయ్యగారితీర్మానము.(1)

వీరవేంకటపతిరాయలతండ్రిపేరు శ్రీరంగరాయ లగుటవలన నేలటూరు వారు పొరపడినట్లు చాగంటివారు భావించిరి. కాని,నవరమువంశములోనివేంకట రాయలతండ్రిపేరు రంగరాయలగుటవలననే చాగంటివారు ప్రమాదపడి రనిపించు చున్నది. ఏమయినప్పటికి ఎక్కువమందియభిప్రాయముప్రకారము చిననారాయణ కవి 17వశతాబ్దికి చెందును.

మఱియొకవిషయము—చెంజివరదేంద్రుఁడు చెంజివెంకటప్పనాయకునితమ్ముఁడు. వెంకటప్పనాయకునకు పుత్రసంతానము లేదు. అందువలన క్రీ. శ. 1645 మార్చి 13వతేదీని అతఁడు దివంగతుడు కాఁగా తమ్ముడు వరదప్పనాయకుఁడు గద్దెయెక్కెను.(2) కావున వరదేంద్రునిపరిపాలనకాలము క్రీ.శ. 1645-1449. ఈతనికి కువలయాశ్వకర్త సమకాలికుఁడు.

---

(1) కువలయాశ్వచరిత్రము(ఆంధ్రప్రదేశ్‌సాహిత్యఅకాడమీప్రతి), సంపాదకీయము,పుట11.

(2) దాక్షిణాత్యాంధ్రసాహిత్యము,పుట12

"కువలయాశ్వచరిత్ర మనుప్రౌఢప్రబంధమును రచించిన సవరము చిననారాయణనాయకుఁడు నీవరదేంద్రుఁడును సమకాలికులును బంధువులును నైయుందు రనునూహకు కొంత యుపాధి గలదు" అని విజ్ఞానసర్వస్వమను చున్నది* దీనింబట్టి కూడ చిననారాయణ పదునాఱువందలకు తరువాతివాఁడే యని తెలియుచున్నది.

ప్రబంధావతారికలోనివీర వేంకటరాయలు నాయకరాజు కాఁడనియు, అతఁడు అళియరామరాయలమనుమఁ డయినమూఁడవ వేంకటపతిరాయ లనియు బాగంటివారు తప్ప అందఱు నంగీకరించినవిషయము. పలువు రంగీకరించినవిషయమున కనుకూలముగనే అవతారిక యున్న దని పయిని నుడువఁబడినది. 1610 ప్రాంతమున జనించినట్లు భావింపఁబడు చున్నచిననారాయణ కవిత్వవీరుఁడే కాని కదనవీరుఁడు కాకపోవుటచే షష్టిశరత్తులు చూచియుండు నని భావించుటలో తప్పుండఁబోదు గదా!

ఏతావతా తేలిన దేమనఁగా ఈకువలయాశ్వచరిత్రప్రబంధకర్త యయిన సవరము చిననారాయణ క్రీ. శ. 1610-1670 ప్రాంతములకు చెందినవాఁడు— అని.

శ్లో. యే పున ర్నవ్యకావ్యేషు కీర్తితాః కవిభిర్నృపాః।
తేషా మాచంద్రతారార్కం యశ స్సర్వత్ర భాసతే॥
—శంభురహస్యము

* నాలుగవసంపుటము, పుట 833.

# తృతీయ దళము

# కథానుశీలనము

వైదికము, లౌకికము అని కావ్యము ద్వివిధము. ఈశ్వరప్రోక్త మయిన యజుర్వేదశతపథాది వైదికము. ఆప్తోక్త మయినరామాయణమహాభారతాది లౌకికము. గద్యపద్యభేదముచేత ఆయుభయము మరల చతుర్విధము*గద్యమునుబట్టి మఱికొన్నిభేదములు వృత్తగంథ్యాదులు కలవు. వస్తువుంబట్టి పరిశీలింపఁగా ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము నని కావ్యము ముఖ్వివిధములు. భారతభాగవతరామాయణాదులయం దున్నప్రసిద్ధ మయినవస్తువు గలిగినది ప్రఖ్యాతము. నలచరిత్రాదు లిట్టివి. కేవలకవికల్పితవస్తువు గలిగినది ఉత్పాద్యము. కళాపూర్ణోదయాదు లిట్టివి. కొంతప్రఖ్యాతము, కొంత ఉత్పాద్యము నయినవస్తువు కలిగినవి మిశ్రము. వసుచరిత్రాదు లిట్టివి. ఇంచుమించు ప్రాచీనాంధ్రవాఙ్మయమున నున్న చంపూకావ్యము లన్నియు మిశ్రము లనియే భావింపవచ్చును.

భారతరామాయణాదులనుండి రమణీయకథాభాగమును కైకొని రసవర్ణనాలంకారాదులతో నత్యంతరమణీయకావ్యములు గా నిర్మించుటకే ప్రతికవియు ప్రయత్నించి యుండెను. అట్టివారిలో నొకఁడయిన మనచిననారాయణకవియు తన ప్రబంధేతివృత్తమును మార్కండేయపురాణమునుండి గ్రహించెను. దీనికి మూలము ప్రధానముగ మార్కండేయ మయినను, ఈకథ భారతభాగవతములందు కానవచ్చు చుండుటచే నందలికతలు కూడ నిట క్రమముగ పొందుపఱుపఁబడు చున్నవి.

## సంస్కృతమహాభారతములో కువలాశ్వుఁడు

వ్యాసమునీశ్వరనిర్మితసంస్కృతమహాభారతములో వనపర్వమున నాలు

---

* శ్లో॥ వైదికం లౌకికం చేతి ద్వివిధం కావ్య ముచ్యతే।
గద్యపద్యభేదేన తచ్చతుర్ధా వ్యవస్థితమ్॥ —కావ్యప్రబంధము, పుట 6.

గధ్యాయములందు కువలయాశ్వునియుదంతము వివరింపఁబడి యున్నది.(1) మార్కండేయమహర్షి ధర్మజున కీవృత్తాంతమును వివరించుచున్నాఁడు.(2)

ఉత్తంకమహర్షి తపస్సును మెచ్చి శ్రీహరి వరము వేఁడుమనఁగా ఆముని తనహృదయము సత్యధర్మములయందు నిలిచి శ్రీహరిభక్తితత్పరమై యుండఁ బ్రార్థించెను. శ్రీహరి తద్వర మొసఁగి మఱియు "ధుంధుఁడను దనుజుఁడు జగత్కంటకుఁ డగును. వానిని బృహదశ్వునితనయుఁ డయిన కువలయాశ్వునిచే వధింపఁజేయుము. ఆతఁడు మత్ప్రసాదసంలబ్ధయోగశక్తిచే నాయసురుని రూపుమాపును. నీవలన నిఖిలలోకములు సంతసించు"నని వచించి యంతర్ధానమయ్యెను. ఇక్ష్వాకునిపిదప నతనితనయుఁడు శశాదుఁడు రాజయ్యెను. వానికొడుకు కకుత్స్థుఁడు. వానితనయుఁడు అనేనసుఁడు. వానికొడుకు పృథుఁడు. పృథునిపుత్త్రుఁడు విశ్వకుఁడు. అతనికొడుకు ఆర్ద్రుఁడు. ఆర్ద్రునికుమారుఁడు యువనాశ్వుఁడు. యువనాశ్వునిసూనుఁడు కువలాశ్వుఁడు, అతనికి ఇరువదియొక్కవేవురు తనయులు.

బృహదశ్వుఁడు కువలాశ్వునకు పట్టము గట్టి తపోవనమునకు పోనున్న తరుణమున ఉత్తంకుఁడు వచ్చి మధుకైటభులపుత్త్రుఁడైన ధుంధునిదుశ్చర్యలను వివరించి వానిని వధింప రమ్మనెను. కాని బృహదశ్వుఁడు సన్న్యస్తశస్త్రుఁ డగుటవలన తనకొడుకయిన కువలాశ్వు నందులకు నియోగించి తా నడవుల కేఁగెను. కువలాశ్వుఁడు ఉత్తంకునివెంట నేఁగి నారాయణప్రసాదలబ్ధయోగబలమున ధుంధువును వధించి ధుంధుమారుఁడను ప్రశస్తిని పడసెను.

## ఆంధ్రమహాభారతములో కువలాశ్వుఁడు

ఆంధ్రమహాభారతములో అరణ్యపర్వమున చతుర్థాశ్వాసమునందు నలువది

---

(1) 201, 202, 203, 204 అధ్యాయములు.

(2) శ్లో॥ యథా స రాజా ఇక్ష్వాకుః కువలాశ్వో మహీపతిః ।
ధుంధుమారత్వ మగమత్ తచ్ఛృణుష్వ మహీపతే॥
శ్లో॥ "బ్రహర్షిః విశ్రుతస్తాతా ఉత్తఙ్క ఇతి భారత"
(అధ్యాయము 201-10, 11 శ్లో.)

మూఁడుపద్యములలో (373 నుండి 415 వఱకు) కువలాశ్వచరిత్రము వివరింపఁబడినది. మార్కండేయమహర్షి ధర్మరాజున కీకథ చెప్పుచున్నాఁడు—

ఉదంకమహర్షి తపమునకు సంతసించినశ్రీహరి ప్రత్యక్షమై వరమును వేఁడు మనెను. ఆముని తనమనము సత్యధర్మములయందు తిరమై శ్రీహరి భక్తికమై యుండ వేఁడెను. ఆవర మిచ్చి శ్రీహరి మఱియు 'ధుంధుండను దానవుఁడు జగములకుపద్రవకారి యగును. తద్వధార్థమై నీవు బృహదశ్వుని కొడుకయినకువలాశ్వు నుద్యుక్తునిఁ జేసెదవు. అతఁడు మత్ప్రసాదలబ్ధయోగబలమున, భవన్నియోగబలమున నయ్యసురను పరిమార్చును. నీవలన నఖిల లోకములు సంతసించు'నని పలికి అంతర్హితుఁ డయ్యెను. ఇక్ష్వాకుఁడు నాకమున కేఁగినతరువాత నతనినందనుఁడు శశాదుఁడు రా జయ్యెను. వానికొడుకు కకుత్థ్సుఁ డనువాఁడు. వానికొడుకు అనేనసుఁడు. అతనికొడుకు పృథుఁడు. అతనికొడుకు విశ్వకుఁడు. అతనికొడుకు ఆర్ద్రుఁడు. అతనికొడుకు యువనాశ్వుఁడు. అతనినందనుఁడు శ్రావస్తి, అతనికొడుకు బృహదశ్వుఁడు. అతని కొడుకు కువలాశ్వుఁడు. అతనికి మహాబలశాలురు ఇరువదియొక్కవేవురు పుత్త్రులు గలరు.

బృహదశ్వుఁడు కువలాశ్వునకు పట్టము గట్టి తపోవనమునకు బోనున్న సమయమున ఉదంకుఁడు వచ్చి 'మధుకైటభులతనయుఁ డయినధుంధుఁ డను నసుర పితామహునివలన వరము వడసి దేవదానవగంధర్వాదులకు నజయ్యుఁ డయినాఁడు. ఇప్పు డాతఁడు మదీయాశ్రమసమీపమున బహుయోజనవిస్తీర్ణ మగు సముద్రవాలుకాపులినతలమున మహావివరము గావించుకొని నిద్రించు చున్నాఁడు. వానివదననిశ్వాసవాయువు సధూమదహనజ్వాలాభీల మయి సంవత్సరమున కొకసారి వెలువడి నిరంతరసికతారజఃపటలము దూఁటుకొనఁజేయును. తదీయవేగమున తత్సమీపభూమిశైలకాననము లేడుదినములదాఁక కంపించు చుండును. వానిని వధియించి మాయాశ్రమమును కాపాడుము. వానిని వధించువానికి శ్రీహరి తనశక్తిని ప్రసాదించును. ఈపని చేసి లోకరక్షణ మొనర్పుము' అనెను. అందుకు బృహదశ్వుఁడు అస్త్రసన్న్యాసము గావించితి నని చెప్పి, తనకొడుకు కువలాశ్వునిని నియోగించి తపోభూమి కేఁగెను. కువలాశ్వుఁడు కొడుకులతో

చతురంగబలములతో నుదంకునివెంట నేఁగి సముద్రతీరమున విడిసి తద్వాలు కాస్థలినఖననమునకై తనకొడుకులను నియోగించెను. వారు వివిధాయుధముల నుపయోగించి ఆయుదగ్రసికతౌఘము నేడునాళ్లు త్రవ్వి, అందు నిద్రించుచున్న యసుర నాయుధములతో మోదిరి. వాఁడు లేచి యావులింపఁగా నాతనిముఖనేత్ర నాసికాద్వారములనుండి దారుణవహ్నిశిఖాకలాపములు వెల్వడి వారిని దహించెను. దృఢాశ్వకపిలాశ్వచంద్రాశ్వులు దక్కఁ దక్కినవారందఱు గతించిరి. అంత కువలాశ్వుఁడు ధుంధునిపై కేఁగెను. రక్కసుఁ డొక్కశూలము కైకొని కువలాశ్వునిపై కుఱికెను. ఆరక్కసునియొడలినుండి వచ్చిన యగ్నిని తనయోగ విద్యామహాప్రభవ మగుజలప్రవాహముతో ప్రశాంతము గావించి, బ్రహ్మాస్త్రము ప్రయోగించి అయ్యసురను కువలాశ్వుఁడు కూల్చెను. 'ధుంధుని పరిమార్చితివి గావున ధుంధుమారుఁ డనుప్రసిద్ధిని పొందు' మని సురమునులు కువలాశ్వుని దీవించిరి. ఇంద్రాదిదేవతలు తక్కినమునిముఖ్యులు ఆరాజు నభినందించి అభిమతవరము లీఁగా, బ్రతికినకొడుకులను వెంట నిడికొని కువలాశ్వుఁడు రాజధానికి వెడలెను. ఇది భారతమందలికువలాశ్వునికథ.

## సంస్కృతభాగవతములో కువలయాశ్వుఁడు

వేదవ్యాసమునీంద్రప్రణీతసంస్కృతభాగవతమునందు నవమస్కంధ షష్ఠాధ్యాయమున కువలయాశ్వునియుదంతము సూచింపఁబడి యున్నది.(1)

బృహదశ్వునికుమారుఁడు కువలయాశ్వుఁడు.(2) అతనికి ఇరువదియొక్క వేవురు కుమారులు. ఉదంకునిప్రీతికొఱకు కువలయాశ్వుఁడు 'దుందువు' అను రాక్షసునిని చంపెను.(3) అందువలననే యితనికి 'దుందుమారుఁడు' అనుపేరు కలిగెను. దుందువుముఖమునుండి బయలుదేఱినయగ్నివలన కువలయాశ్వుని సుతులు దృఢాశ్వుఁడు, కపిలాశ్వుఁడు, భద్రాశ్వుఁడు అనుమువ్వురు దప్ప తక్కినవారు దగ్ధులయిరి. దృఢాశ్వునికొడుకు హర్యశ్వుఁడు. అతనికొడుకు

---

(1) భాగవతము, 9-6-21 నుండి 32 వఱకు.

(2) బృహదశ్వస్తు శావస్తిః। తతః కువలయాశ్వకః (భాగవతము, 9-6-21)

(3) దుందుమార ఇతి ఖ్యాత స్తత్సుతా స్తే ప్రజజ్వలుః (భాగవతము, 9-6-23)

నికుంభుఁడు. నికుంభునిసుతుఁడు బర్హిణాశ్వుఁడు. అతనికొడుకు కృశాశ్వుఁడు. అతనికొడుకు సేనజిత్తు. అతనికొడుకు యువనాశ్వుఁడు. అతఁ డనపత్యుఁడు. ఇష్టిబలమున నాతనికి మంధాత జనించెను. ఈరీతిని ఈవంశము సాగినది.

## ఆంధ్రభాగవతములో కువలయాశ్వుఁడు

సహజపాండిత్యపోతనామాత్యప్రణీతభాగవతమునందు నవమస్కంధముతో ఇక్ష్వాకువంశక్రమమున మూఁడుపద్యములలో (163,164,165) కువలయాశ్వునియుదంతము సూచింపఁబడినది.

శశాదపుత్త్రుఁడు పురంజయుడు. వానికొడు కనేనసుఁడు. వానికొడుకు పృథుఁడు. వానికొడుకు విశ్వగంధుఁడు. వానినందనుఁడు చంద్రుఁడు. వాని సుతుఁడు యవనాశ్వుఁడు. వానితనూజుఁడు శవస్తుఁడు. వానితనయుడు బృహదశ్వుఁడు. వానికి కువలయాశ్వుఁడు జనించెను. అతఁ డుందకునిప్రేరణతో తనయిరుదియొకవేవురు కొడుకులతో కలసి ధుంధుఁ డనురాక్షసునిని చంపెను. అదికారణముగా ధుంధుమారుఁడనుపేరు వడసెను. అయ్యసురముఖానలమున కువలయాశ్వునికుమారులందఱు భస్మమైరి. అందు దృఢాశ్వుఁడు, కపిలాశ్వుఁడు, భద్రాశ్వుఁ డనుముగ్గురు జీవించిరి. అందు దృఢాశ్వునకు హర్యశ్వుఁడు, హర్యశ్వునకు నికుంభుఁడు, నికుంభునకు బర్హిణాశ్వుఁడు, బర్హిణాశ్వునకు కృశాశ్వుఁడు, కృశాశ్వునకు సేనజిత్తు, సేనజిత్తునకు యువనాశ్వుఁడును జనించిరి. ఈవిధముగా నీవంశక్రమము సాగినది.

## సంస్కృతమార్కండేయపురాణములోని కువలయాశ్వునికథ

వ్యాసభగవానులచే నిర్మింపఁబడినపదునెన్మిదిమహాపురాణములలో మార్కండేయ మొకటి. ఇందు కువలయాశ్వవృత్తాంతము మదాలసోపాఖ్యాన మనునామాంతరముతో పదునెనిమిదవయధ్యాయమునుండి నలువదియొకటవఅధ్యాయమువఱకు (అనఁగా నిరువదినాలుగధ్యాయములు కలిగి)ఉన్నది. ఇది సంపూర్ణమదాలసోపాఖ్యానము. కాని మనప్రబంధకథ మదాలసాకువలయాశ్వుల కల్యాణముతో (శుభాం

తము గా) ముగియు చున్నది. కనుక మార్కండేయమునుండి కూడ అంతమట్టు నకే గ్రహించిన వాఁడను. అనఁగా నిందు మదాలసాఋతధ్వజులపెండ్లితో నిరు వదిరెండవయధ్యాయము ముగియు చున్నది, కాఁబట్టి యింతవఱకే ప్రబంధేతివృత్త మున కాధార మనఁదగును. కనుక ప్రస్తుతమున కవసర మయినకల్యాణఘట్టము వఱ కున్నకథమాత్రమే యిందు పొందుపఱుపఁబడు చున్నది—

పూర్వకాలమున యజనశీలుఁడును, మహావీర్యవంతుఁడు నగుశత్రుజిత్తు అనుపేరు గలరా జుండెను. అతనికుమారుఁడు ఋతధ్వజుఁడు. ఇతఁడు శస్త్ర శాస్త్రాభ్యాసములు ముగించి సమానవయస్కు లగుబ్రాహ్మణక్షత్రియవైశ్యకుమా రుతో నాడు చుండెను. అతనికడకు నాగలోకమునుండి అశ్వతరునిపుత్త్రు లిరు వురు బ్రహ్మతేజస్కులు, తరుణవయస్కులు, ప్రియవాక్కులు వచ్చిరి. వారును వీరును కలసిమెలసి ప్రతిదినము వినోదింపసాగిరి. ఒకనాఁ డశ్వతరుఁడు తన కొమాళ్ళను పిలిచి 'బిడ్డలారా' మర్త్యలోకమున మిమ్ముల నింతగా నాకర్షించిన దెవరు? చాలకాలమునుండి పరిశీలించు చున్నాను. మీ రేదో ప్రియ మయిన వస్తు వును దర్శించి తనివిని బొందినట్లు కన్పడు చున్నారు' అని పలికెను. అందుల కా నాగకుమారు లంజలి రచించి తండ్రికి ఋతధ్వజునిసుగుణముల నెల్ల వివరించి "ఓతండ్రీ' పరమప్రీతితో ఋతధ్వజుఁడు చేసినసత్కారాద్యుపకారము లనుభవిం చినతరువాత మామనస్సు నాగలోకమును గాని, యితరలోకములను గాని యిష్ట పడుట లేదు. ఆతనియెడఁబాటువలన ప్రశాంతశీతల మగునీపాతాళము చీఁకటి గుహవలె పరితాపమును కలిగించు చున్నది. ఆతనితోడిస్నేహము పగటియందు సూర్యునివలె మా కమందానందము నందించు చున్నది"—అని పలికిరి. కొడుకు లచే కొనియాడఁబడినఆరాకొమరుఁడు కడుధన్యుఁ డని తలఁచి, అతని ననేక విధముల తాను కూడ కొనియాడి, అతని కేదైనప్రత్యుపకారము చేయవలయు నని నిశ్చయించుకొని అశ్వతరుఁడు తనయుద్దేశమును బిడ్డల కెఱుకపఱచెను. అందులకు వారు 'అతని కేమిటను కొదువలేదు. అతనికడ నున్నసంపదలు మన పాతాళమున కూడ లేవు' అని చెప్పిరి. అయినను అశ్వతరుఁడు ఏదయిన ప్రత్యు పకృతి చేయవలసినదే అని పట్టుపట్టెను. అప్పు డానాగకుమారులు "తండ్రీ' అ ట్లయినచో శ్లాఘనీయచరిత్రుఁ డయినయాఋతధ్వజునికౌమారావస్థయందు జరిగిన

కథను అతఁ డొకనాఁడు మాకు వినిచెను. దానిని చెప్పు చున్నాము విను” మని యావృత్తాంతమును ఇట్లు నుడువ మొదలిడిరి—

పూర్వ మొకనాఁడు ఋతధ్వజునిజనకుఁ డయినశత్రుజితునిచెంతకు గాలవుఁ డనుబ్రాహ్మణోత్తముఁ డొకయశ్వరాజమును తెచ్చి యిట్లు చెప్పెను— రాజా! రాక్షసాధముఁ డొకఁడు క్రూరజంతువులరూపముతో ఆశ్రమమునకు వచ్చి అనేకవిఘ్నములు కలిగించుచు నన్నెంతో బాధించు చున్నాఁడు. ఆతనిని దగ్ధ మొనర్ప సమర్థుల మయ్యు తపోవ్యయభయమున మిన్నకున్నాము. ఒకప్పుడు ఆరాక్షసునిచే కష్టపెట్టఁబడి క్లేశముతో ఆకాశమువంకఁ జూచి నిట్టూర్చితిని. వెంటనే గగనమునుండి యీగుఱ్ఱము నాచెంగట దిగినది. మఱియు గగనవాణి యిట్లు చెప్పెను—ఋషివరేణ్యా ఈయుత్తమాశ్వము సమస్తభూవలయమును క్షణములో నధిగమింప సమర్థ మైనట్టిది. దీని కలసట యనునది యుండదు. దీనిని సూర్య భగవానుఁడు నీకొఱకు పంపెను. పాతాళాకాశజలపర్వతాదులం దెందును దీనిగమనమున కడ్డు లేదు. మఱియు నిది భూవలయమునంతటి ననాయాసముగా సంచరింపఁగలుటవలన “కువలయము” అనుప్రసిద్ధనామము దీని కేర్పడఁగలదు.(1) శత్రుజిద్భూపాలునికుమారుఁడు దీని నధిరోహించి నిన్ను హింసించురాక్షసుని వధింపఁగలఁడు. ఈయశ్వమువలన నతఁ డఖండఖ్యాతి నందఁగలఁడు—అందువలన నాకాశవాణి నుడివినట్లు వచ్చి నిన్నాశ్రయించితిని. కావున ఓరాజా! తపోవిఘ్నకారి యయినయారక్కసుని నివారింపుము. దుష్టశిక్షణము, శిష్టరక్షణము మహీపతులకు విహితమే కదా· ఈగుఱ్ఱము స్వీకరించి ధర్మలోపము దాపరింపకుండ నీకొమరు నాజ్ఞాపింపుము—గాలవునిపలుకులు వినినశత్రుజితుఁడు ఉత్సాహవంతుఁ డయినతనకొడుకును అశ్వము నధిరోహింపఁజేసి గాలవునివెంట పంపెను. గాలవమహర్షి ఋతధ్వజునిని వెంట నిడుకొని తనయాశ్రమమునకు పోయెను.(2)

---

(1) శ్లో. యతో భూవలయం సర్వ మక్రాంతోఽ యం చరిష్యతి।
తతః కువలయో నామ్నా ఖ్యాతిం లోకేషు యాస్యతి॥
(మార్కండేయము, 18—51)

(2) ఇంతటితో పదునెనిమిదవఅధ్యాయము ముగిసెను.

ఋతధ్వజుఁడు ఆశ్రమవాసులకు కలిగెడియంతరాయములను బొలఁగిం చెను. ఋతధ్వజునియునికి తెలియనిరాక్షసుఁడు వరాహరూపముతో నాశ్రమమును ప్రవేశించెను. రాజకుమారుఁడు బాణప్రయోగము చేసెను. దెబ్బతిన్నపంది అడవులను దాఁటి పాఱిపోవు చుండఁగా నృపకుమారుఁడు వెంటాడెను. అది చాలదవ్వుపోయి ఒకచో నొకభూవివరమున ప్రవేశించెను. రాజకుమారుఁడు కూడ గుఱ్ఱముతో కూడ ఆబిలమున ప్రవేశించెను. అతనికి ప్రకాశవంత మయినపాతాళము కన్పించెను. అం దొక్కస్త్రీమాత్ర మతనికి కన్పించెను. అతఁ డామెను "నీవెవరు? ఎక్కడికి పోవు చున్నావు?" అని ప్రశ్నింపఁగా నామె బదులాడకయే పోయెను. అతఁడు గుఱ్ఱము నట నుంచి ఆమెను వెంటాడెను. ఒకచో నతనికి కాంచనపర్యంకముపై కూర్చున్నదియు, నిరుపమసౌందర్యవతియు నగుకన్యక యొకతె కాన్పఁబడెను. ఆతన్వి యతనిని చూచి లేచి నిలుచుండి లజ్జావిస్మయదైన్యములకు లోనై వెంటనే చిత్తక్షోభను పొందెను. పిదప నతనిసొగసు ననేకరీతుల భావించి మూర్ఛిల్లెను. అతఁడు కూడ మదనసాయకతాడితుఁ డయ్యు పైకి తెలియనీక ఆమెను చేరి యూరడించెను. ఇంతలో తాను మొదట చూచిన సుదతి వచ్చి ఆకన్యకను చేరువనుండి సేవింపసాగెను. "నీ విట్లు మోహవశవగుటకు హేతు వేమి?" అని యతఁడు పృచ్ఛింపఁగా నామె లజ్జించి చెలికత్తెకు తెలిపెను. ఆచెలికత్తె అతని కి ట్లనెను--

రాజకుమారా! విశ్వావసు వనుగంధర్వునికూఁతు రీమె. పేరు మదాలస. వజ్రకేతు వనురాక్షసునికొడుకు, పాతాళలోకవాసి పాతాళకేతు వనువాడు ఈమె నపహరించి తెచ్చి రా నున్నత్రయోదశినాఁడు పెండ్లాడ నిశ్చయించుకొనెను. అందువలన నీమె నిన్న ఆత్మహత్యకు పాల్పడెను. అప్పుడు కామధేనువు "క్షణ్యాశాలినీ ఇది తగదు, ఆరక్కసుఁడు నిన్ను చేరలేఁడు. అతడు కారణాంతరముచే భూలోకమున కేఁగినపుడు ఎవనిబాణముచే కొట్టఁబడునో ఆబాణప్రయోక్త నీకు త్వరలో భర్త కాఁగలఁడు" అని చెప్పెను. నే నీమెచెలికత్తెను. పేరు కుండల. మాతండ్రి వింధ్యవంతుఁడు. నాభర్త వీరపుష్కరమాలి. శుంభుఁ డనురక్కసుని చేత నాభర్త వధింపఁబడుటచే నేను తీర్థయాత్రలు చేయు చున్నాను. పాతాళకేతుఁ డొకమహాత్మునిచే కొట్టఁబడుట విని నిజమును తెలిసికొనుటకు వచ్చితిని. ఈమె

నీయందు ప్రీతి గల దయ్యెను. అందువలననే మూర్ఛిత యయ్యెను. ఈమె కల్యాణ మయినవెనుక నేను వెడలిపోఁగలను. ఇంతకు మీ రెవరు? ఎందుల కిచట కెంతకే చినారు?--అనెను,

కువలయాశ్వుండు తనవృత్తాంతమంతయు విన్పించెను. మదాలస లజ్జాత్మయై కుండలను చూచెను. ఆమె ఆరాజచంద్రునితో మదాలసాకల్యాణము గావింప నిశ్చయించి తుంబురుమహర్షిని ధ్యానింపఁగా నాతఁ డేతెంచి కల్యాణము కావించి వెడలెను. పిదప దంపతులకు నీతులు బోధించి కుండల వెడలెను. ఋతధ్వజుఁడు కువలయాశ్వముపై మదాలస నెక్కించుకొని పయన మగు చుండఁగా రాక్షసులు చుట్టుముట్టిరి. బ్రహ్మాస్త్రముతో పాతాళకేతువుతోసహ వారిని దగ్ధులను చేసి పట్టనమునకు వచ్చి తండ్రికి నమస్కరించెను. యశస్వి యయినపుత్రునిఁ గాంచి శత్రుజిత్తు సంతసించెను. దంపతులు ప్రణయాంబుధి నోలలాడసాగిరి.*

యమునాతీరమునందు ఆశ్రమ మేర్పఱచుకొని పాతాళకేతునను జుఁడు తాళకేతువు మునివలె నటించుచు ఋతధ్వజుని వంచించుటకు వేచి యుంచెను. ఒకనాఁ డాతనిని రాజపుత్రుఁడు చూచెను. అతనితో మునిరూపమున నున్నరాక్షసుఁడు 'రాజకుమారా! నే నొకయజ్ఞము చేయఁదలంచితిని. యజ్ఞదక్షిణార్థము నీకంఠాభరణము నిమ్ము. నే నీజలమున మునిఁగి వరుణదేవుని స్తుతించి వత్తు' ననెను. అతనిని నమ్మి కువలయాశ్వుఁడు కంఠాభరణము నిచ్చెను. 'నేను వచ్చువఱకు ఆశ్రమమును రక్షింపు' మని తాళకేతువు రాజకుమారునితో చెప్పి, జలాశయమున మునిఁగి కొంతదూరము పోయి బయటికి వచ్చి ఋతధ్వజునిపట్టణము చేరి, అంతఃపురము ప్రవేశించి అచటవారితో 'తల్లులారా! మునిజనరక్షితత్పరుఁడైనఋతధ్వజునిని రాక్షసుఁడొకఁడు వధించెను. అతఁడు మరణించుటకు ముందు నా కీయాభరణము నిచ్చెను' అనెను. అంతఃపురమంతయు దుఃఖాక్రాంత మయ్యెను మదాలస తత్కంఠాభరణమును చూచి వెంటనే అసువులు వదలెను. శత్రుజిత్తు వేదాంతబోధతో నంతిపురి నోదార్చి., కోడలికి అగ్నిసంస్కారము చేయించి, కొడుకునకు జలాంజలి యొసఁగెను. తాళకేతువు వచ్చినబాటనే పోయి రాజకుమారునితో 'నన్ను కృతార్థునిఁ జేసితివి రాజకుమారా! నీ విఁక వెడలవచ్చు' నని

* ఇంతటితో 19వ యధ్యాయము ముగిసెను.

మధురముగ పలికెను. అతఁడు కపటమౌనికి నమస్కరించి వాజి నెక్కి పట్ట ణము చేరెను.*

కువలయాశ్వుఁడు తలిదండ్రులను చేరి వారియాశీస్సులు స్వీకరించి మదా లసావృత్తాంతము గ్రహించి మిగుల శోకించి ఆమెకు జలతర్పణ మొసఁగి 'యీజన్మలో నింకొకస్త్రీని చేపట్టను' అని ప్రతిజ్ఞ చేసెను. అప్పటినుండి సమ వయస్కు లయినచెలికాండ్రతో క్రీడించుచు కాలము కడపసాగెను.

నాగకుమారు లిట్లు పలుకఁగా విన్నఅశ్వతరుఁడు 'మీమిత్రమునకు మరల మదాలసను కూర్తు' నని పలికి హిమవన్నగమున కేఁగిసరస్వతీదేవింగూర్చి తపస్సు చేసెను. ఆదేవి దర్శన మిచ్చెను. అశ్వతరుఁ డనేకరీతుల ఆతల్లిని స్తుతించెను. ఆమె వరము కోరుకొమ్మనెను. 'నాసహోదరుఁ డయినకంబలునకు, నాకు సమస్త స్వరసంబద్ధజ్ఞానమును ప్రసాదింపు' మని అతఁడు వేఁడెను. ఆదేవి వర మిచ్చి యేఁగెను. అశ్వతరకంబలులు కైలాసాద్రి కేఁగి ఒకేస్వరసాహిత్యములతో చిర కాల మీశ్వరు నారాధించిరి. ఆస్వామి కన్పడి వరము వేఁడుఁడనెను. అశ్వత రుఁడు 'దేవా! కువలయాశ్వునిధర్మపత్ని మృతి నొందెను. ఆమె అదేవయసుతో అదేరూపముతో నాకూఁతు రగునట్లు వర మిమ్ము, అనెను. అంత శివుఁడు 'పితృ దేవతల నారాధించి శ్రాద్ధపిండమును భుజింపుము. అప్డు నీఫణామధ్యమునుండి ఆబాలిక పుట్టఁగలదు' అనెను. అన్నదమ్ము లిరువురు ఆదిదేవునకు నమస్కరించి సంతసముతో వెడలిరి. అదేవిధముగ మదాలస అశ్వతరునిఫణామధ్యమునుండి ప్రభవించెను. ఆమె నాతఁడు రహస్యముగ నుంచి మంచిపనికత్తెంతో సేవ చేయించు చుండెను.

ఇక్కడ నాగకుమారు లిరువురు యథాప్రకారము ఋతధ్వజునికడకు వెళ్ళి క్రీడించి వచ్చు చున్నారు. అశ్వతరుఁడు తనకొడుకులతో 'ఆఋతధ్వజుని నాద గ్గఱ కేల తీసికొని రాలేదు? అతనికి మేలు చేయవలయు నంటిరిగదా.' అనెను. వారు కువలయాశ్వునికడకు వెళ్ళి ఆడుచు మాటలసందర్భమున తమగృహము నకు రావలసిన దని కోరిరి. అశ్వతరుఁ డంతటివాఁడు తనను చూడఁదలఁచె ననఁ

---

* ఇంతటితో 20వయధ్యాయము ముగిసెను.

గానే ధన్యుండ నని తలంచి యంగీకరించెను. అతనిని నాగకుమారులు తీసికొని పోయి తండ్రికి పరిచయము చేసిరి. రాజకుమారుఁడు నాగరాజుపాదములకు ప్రణమిల్లెను. అశ్వతరుఁ డాతనిని 'చిరంజీవ' అని దీవించి, అతనిగుణములను స్తుతించి, తరువాత అతనిచే స్నానాదులు ముగింపఁజేసి. కుమారులతోను రాజ కుమారునితోను కలసి మధురపదార్థము లారగించెను.(*)

భోజనానంతరము మహాత్ముఁ డయిననాగరాట్టును నాగకుమారులు, రాజ కుమారుఁడు సేవించిరి. నాగరాజు వినోదకథలతో కువలయాశ్వుని సంతసపఱచి 'నాయనా ఋతధ్వజా! తండ్రిచెంత కొడుకువలె సందేహము మాని, మాగృహ మున కేతెంచిననీకు మే మేమి చేయవలయునో చెప్పు' మనెను. అంత నతఁడు పన్నగేశ్వరా మీపాదధూళి నామౌళిని సోఁకినప్పుడే అన్నియు నాకు లభించినవి. నాకు కొదవ లేనే లేదు. అయినను ఏదయినవర మీఁదలఁచినచో పుణ్యసంస్కా రము నాహృదయమునుండి తొలఁగ కుండునట్లు వర మిమ్ము' అనెను. అంత నశ్వతరుఁడు 'అంతమాత్రమే కాదు. ఏది మనుష్యలోకమున పొందుటకు శక్యము కా దని భావింతువో అట్టిది నీ కీయఁదలంచితి ననెను. కువలయాశ్వుఁడు నాగ కుమారులవంకఁ జూచెను. అప్పుడు వారు 'తండ్రీ పతిదైవతయు. సర్వాంగసుం దయు నగుమదాలస నీతఁడు చూడఁగోరు చున్నాడు. కాని గతించినవారిని స్వప్న ములోఁగాని, శాంబరీమాయచేతఁ గాని చూడవలెనే కాని వేఱుదారి యే మున్నది?" అనిరి. అప్పుడు కువలయాశ్వుఁడు లజ్జాప్రేమములతో 'తండ్రీ! మాయామయి యైనను సరే. ఇప్పుడు మదాలసను చూపినచో నీవు నాయందు పరమానుగ్రహము కలవాఁడ వని తలంతు' ననెను. అంత నాగరాజు రహస్యముగ నుంచినమదా లసను తెచ్చి చూపెను. వెంటనే రాజకుమారుఁడు 'హా ప్రియా అనుచు ఆమె కెదురుగా పోయెను. అపుడశ్వతరుఁడు 'కుమారా! ఇది మాయ యని ముందే నుడివితిని గదా స్పృశించినచో నీమె అంతర్ధాన యగును' అనెను. ఆమాటల కాతఁడు 'హా ప్రియా!' అని మిగుల శోకించుచు భూమిపైఁగూలెను. తరువాత ఫణిరాజు కువలయాశ్వు నూరడించి ఆమె జీవించినవిధమంతయు వివరించి అతని

(*) ఇంతటితో 21వయధ్యాయము ముగిసెను.

కప్పగించెను. కువలయాశ్వుఁడు అమందానందకందళితహృదయారవిందుఁడై నాగపతికి నమస్కరించి, స్తుతించి, సెలవు తీసికొని భార్యతో కూడ కువలయము నధిరోహించి నిజనగరమున కేఁగెను.(1)

అనంతరాధ్యాయములందు మదాలసావేదాన్తజీవితము వర్ణితము.

## ఆంధ్రమార్కండేయ పురాణములోని కువలయాశ్వుని కథ

మహాకవిమారన ఆంధ్రీకరించినమార్కండేయపురాణము ప్రథమాంధ్రపురాణమని ప్రసిద్ధి కెక్కినది. మారనయనువాదము మధురతర మని మార్కండేయము లోనిఘట్టము లన్నియు రుజువుపేయు చున్నవి. ఇందు ద్వితీయాశ్వాసములోని '254వపద్యమునుండి తృతీయాశ్వాసములోని నూఱవ పద్యమువఱకు' మనప్రబంధమునకు సంబంధించిన కథ యున్నది.(2) ఆపయిని273వపద్యమువఱకు మదాలసావేదాన్తబోధ లున్నవి. ప్రబంధమున కాధార మయినకథాసారము ఇందు పొందుపఱపఁబడు చున్నది--

శత్రుజిత్తుకొడుకు ఋతధ్వజుఁడు విప్రరాజవైశ్యకుమారులతో క్రీడించు చుండఁగా నతనికడకు నాగలోకమునుండి అశ్వతరునికొడుకు లిరువురు విప్ర కుమారులవలె వచ్చి క్రీడించుచు చెలిమిని పెంచుకొనిరి. ఒకనాఁ డశ్వతరుఁడు తనకొడుకులను 'భూలోకమం దెవ్వనితో నాడు చున్నా'రని ప్రశ్నించెను. వారు ఋతధ్వజునింగూర్చి వాక్రుచ్చిరి. అందులకు సంతసించిననాగరాజు 'మీచెలికాని కేదైన మేలు చేయవలయును. ఏమి చేయవలయునో చెప్పుఁ' డనఁగా వా రిట్లు చెప్ప నారంభించిరి.

తండ్రీ ఒకనాఁడు గాలవుఁ డనుమునీంద్రుఁడు ఒకయశ్వమును గొని శత్రుజిత్తుకడ కరుదెంచి 'నరేంద్రా ఒకరాక్షసుఁడు సింహశార్దూలాదిరూపములతో మదాశ్రమమునకు వచ్చి విఘ్నము లాచరించు చుండఁగా నే నతనిని తపశ్శక్తితో

(1) ఇంతటితో 22వఅధ్యాయము ముగిసెను,

(2) సుమారు 190పద్యములు.

నిర్మూలింప సమర్థుఁడ నయ్యును, తపోవ్యయమున కోర్వక ఆకసమువంక చూచి నిట్టూర్చితిని. అప్పు డీయశ్వము అంబరతలమునుండి వచ్చి నాముందర నిలిచెను. ఆకాశవాణి 'మునీశ్వరా!ఇది రవి పంపినది. దీనిని ఋతధ్వజున కొసఁగుము అతఁ డీరాక్షసుని వధింపఁగలఁడు. ఇది సర్వప్రదేశములందును నిరాతంకముగ నేఁగఁగలదు-అనెను. కనుక ఓరాజా నీకుమారుని నావెంట పంపుము'-అనెను. శత్రుజిత్తు పుత్త్రు నాశీర్వదించి మునివెంట పంపెను. అతఁ డాశ్రమమునకు నేఁగఁగా రాక్షసుఁడు వరహరూపమున వచ్చెను. నృపతనయుఁ డర్ధచంద్రాస్త్రమును వదలెను. ఆబాణముదెబ్బకు నొచ్చి పంది అడవులు,గిరులు దాఁటుచు పోవు చుండెను. ఋతధ్వజుఁడు వెంటాడెను. అది యొక భూవివరమునుండి పాతాళమునకు దిగఁబడఁగా నతఁడు నందు ప్రవేశించెను. రత్నకాంతులతో రమణీయమయినపాతాళము కన్పడెను, అట నొకస్త్రీ వేగముగ పోవు చుండఁగా నీ వెవ్వరిదానవు?అని రాజకుమారుఁడు ప్రశ్నించెను. ఆమె బదు లిడకయే ఒకహర్మ్యము నెక్కెను. అతఁడును హయము నొకచో కట్టివెచి,హర్మ్యము నెక్కి,అందు మణిమయకాంచనపర్యంకమున నున్న చంద్రాస్య నొకర్తును చూచెను. ఆమె యతనిం గాంచి సంభ్రమభయవిస్మయరాగలజ్జావశ యై సఖిచాటున కేఁగెను. ఇరువురుచూపు లొకటైనవి. అమె మూర్ఛిల్లెను. సఖి యుపచారము లొనర్చెను. అతఁ డామెమూర్ఛకు కారణ మడుగఁగా నామె తనచెలివంక చూచెను. ఆచెలి యి ట్లనెను--

ఈమె విశ్వావసుఁ డనుగంధర్వరాజుకూతురు మదాలస. పాతాళకేతు వనురాక్షసుఁ డీమెను మాయాబలమున తెచ్చి యీవచ్చురేయి మనువాడ నున్నాఁడు పోయినరేయి యీమె మరణింప నుద్యమింపఁగా సురభి 'తలోదరి ఈతఁడు నీకు భర్త కాఁడు, నరలోకమున నితనిని బాణముతో కొట్టెడివాఁడు నీకు భర్త యగు' ననియెను. అంత నీమె మరణప్రయత్నమునుండి మరలెను. నే నీమెచెలికత్తెను. పేరు కుండల. వింధ్యవంతునితనయను. పుష్కరశాలిభార్యను. శుంభుఁ డనురాక్షసునిచే నాభర్త వధింపఁబడెను. అందువలన పరలోకార్థపుణ్యతీర్థములకు దివ్యగతి నేఁగుచు సూకరాకారుఁ డయినపాతాళకేతువు ఒకరాజకుమారుని

చేత నేయుపడుట చూచి అది తెలిసికొనుటకై మరలివచ్చితిని. ఇ(క నీమెమూ ర్ఛకు కారణము వినుము. నిన్నుచూచి యీమె మనసుపడెను. కాని రాక్షసు నేసి నయతనికి ఆలి నె ట్లగుదు నని వ్యథతో మూర్ఛిల్లెను. ఈమెపెండ్లి యయినపిదప నేను లపమాచరింప నే(గుదును. ఇంతకు నీ వెవ(డవు?ఇచ్చటి కేల వచ్చితివి?- అనెను.

ఋతధ్వజు(డు తనవృత్తాంతమును విన్పించెను. మదాలసాసంశయము మటు మాయ మయ్యెను. కుండల తుంబురుని ప్రార్థించి రప్పించి మదాలసాఋతధ్వ జులకు కల్యాణము చేయించి వెడలెను. ఋతధ్వజు(డు మరలివచ్చువప్పుడు రక్క సులు చుట్టుముట్ట(గా నందఱిని వధించి,వచ్చి తండ్రికి నమస్కరించెను. అతని విజయములు విన్నశత్రుజిత్తు చాల సంతసించెను.*

పాతాళకేతునితమ్ము(డు తాళకేతు(డు యమునాతీరమున మాయామౌని యై యుండ(గా నతనిని కువలయాశ్వు(డు చూచెను. తాళకేతువు అతనిచెంతకు వచ్చి 'వీరకుమార!నే నొకయజ్ఞ మొనర్చు చున్నాను. దానికి దక్షిణగా నీకంఠ హార మిమ్ము. నే నీజలమున మును(గి వరుణదేవునిని స్తుతించి వత్తును. అందా(క ఆశ్రమమును రక్షింపు' మనెను. నృపకుమారు(డు హార మిచ్చెను. రాక్షసు(డు జలములందు మును(గి మాయాబలముతో రాజమందిరమును చొచ్చి దైన్యమును కన(బఱచుచు ఋతధ్వజు( డొకరక్కసునిచే వధింప(బడె నని చెప్పి హారమును చూపెను. రాణ్మందిరము శోకాక్రాంత మయ్యెను. మదాలస వెంటనే మరణిం చెను. దుఃఖితులకు శత్రుజిత్తు వేదాంతబోధ చేసి,మదాలసకు సంస్కారము లాచ రించెను. తాళకేతువు యథాప్రకారముగ నాశ్రమవాటికను చేరి కువలయాశ్వుని పంపెను. తిరిగివచ్చినకువలయాశ్వు(డు మదాలసకై పరితపించి కడకు 'మఱి యొకమగువను మనువాడ' నని ప్రతిజ్ఞ చేసెను. అట్టిమదాలసను తెచ్చి మాప్రి యమిత్త్రుమున కొస(గుట పరమకార్యము-అని నాగకుమారులు పలికిరి.

అంత సురగేశ్వరు(డు హిమవంతమున కే(గి ప్లక్షావతరణతీర్థమున సర స్వతీదేవిం గూర్చి తపస్సు చేసి,ఆమెదయచే పరలోకప్రాప్తు( డై యున్నయనుజుని

(*) ఇంతటితో తృతీయాశ్వాసము ముగిసెను.

కంబళుని బ్రదికించికొని, యిరువురు మధురగీతవిద్యావిశారదు లై కైలాసమున కరిగి పరమేశ్వరుని నారాధించిరి. ఆస్వామి కన్పడి వరము వేఁడుకొనుఁ డనెను. అంత నశ్వతరుఁడు 'మదాలస పూర్వవయోరూపకాంతివిలసనములతో నా కిప్పుడు పుత్రిక యై ప్రభవించి, జాతిస్మరయు పరమయోగినియు యోగిమాతయు కావలయు' నని కోరెను. 'శ్రాద్ధమున మధ్యమపిండము భుజించినచో నీమధ్యమఫణమునుండి ఆసుమధ్య జన్మించు' నని యిందుమౌళి వర మిచ్చెను. భుజగరా జింటికి వచ్చి తత్ప్రకారమున మదాలసను కూఁతురుగా పొంది రహస్యముగ నుంచి యొకనాఁడు కొడుకులతో 'నాయనలారా! మీమిత్త్రునకు మేలు చేయవలయు నంటిరి గదా! మఱి యాతని నిటకు తీసికొనిరాలే దేమి?' అనెను. తోడనే వారు భువి కరిగి 'మాతండ్రి ర మ్మను చున్నాడు కనుక నీ వొకపరి మాయింటికి రావలయు, నని కువలయాశ్వునితో పలికిరి. వెంటనే పెద్దలయెడ గౌరవము గలిగినకువలయాశ్వుఁ డంగీకరించెను. వా రాతనిని గోమతీనదినుండి పాతాళమునకు తెచ్చి తమసత్య స్వరూపములను తెలిపిరి. కువలయాశ్వుఁ డశ్వతరునకు నమస్కరించెను. అతఁ డాశీస్సు లిచ్చి కుశలప్రశ్నలు వేసెను. పిదప మజ్జనభోజనాదులు ముగిసెను. అనంతర మశ్వతరుఁడు వరము వేఁడు మని కువలయాశ్వునితో పలికెను. 'తమ దయావిశేషమున సర్వవస్తువులు సమకూడియే యున్నవి' అని యతఁడు పలికెను భూలోకమున పొందఁజాలనిదానిని కోరు మిత్తు నని నాగనాయకుఁ డనెను. కువల యాశ్వుఁడు మిత్త్రులవంక చూచెను. వారు తమతండ్రితో మదాలసను రప్పించి యీతనికి సమర్పింపుఁ డనిరి. అందుల కహివల్లభుఁడు 'మరణించినవారిని చిత్తరువులలోను, స్వప్నములందును, మాయారూపముతోను చూడవచ్చును గాని సత్య స్వరూపముతో చూడ వీలుపడ' దనెను. మాయామదాలస నైనను చూపుఁ డని కువలయాశ్వుఁడు వేఁడెను. అపు డశ్వతరుఁడు మదాలసను రప్పింపఁగా కువల యాశ్వుఁ డామెను చేరఁబోయెను. మాయారూపము గనుక ముట్టినచో ఆమె మా యమైపోవునని ఫణిప్రభువు పలికెను. కువలయాశ్వుఁడు మూర్ఛిల్లెను. అంత నశ్వతరుఁ డతనిని తేర్చి ఊఱడించి, విషయమంతయు వివరించి, మదాలస నర్పించి ఆశిస్సు లందించి అవనికి పంపించెను.

# ప్రబంధకథ

శ్రీకర మయినసాకేతపురమును ఋతధ్వజుఁడు పరిపాలించు చుండెను. గ్రీష్మర్తువు వచ్చెను.* ఒకనాఁడు గాలవముని అశ్వము నొకదానిని వెంట నిడుకొని ఋతధ్వజునికడ కేతెంచి "రాజా! పాతాళకేతుఁ డనురాక్షసుఁడు మొదట మాతపోవనమున మాలిమికాఁ డై ఫలకుసుమాదు లందించెడివాఁడు. వాఁడు రానురాను మానియమ మనుచంద్రకళకు రాహు వై నాఁడు. ఒకనాఁడు ఒకలేడి ప్రసవవేదనపడు చుండఁగా ఆశ్రమవనితలు సేవచేయు చున్నారు. అంతలో నారక్కసుఁ డాఁడుదానివలె వచ్చి సింగ మై నిలిచెను. అందఱు బెదరిరి. అతనిని శపింప నుద్యుక్తుఁడను కాఁగా నాకాశవాణి 'మౌనికులపావనా! తపోవ్యయ మొనర్పకుము. ఇదిగో గుఱ్ఱము. దీనిని ఋతధ్వజున కిమ్ము. అతఁడే ఆరక్కసుని పరిమార్పఁగలఁ' డని వచించెను. వెంటనే యీగుఱ్ఱము గగనమునుండి దిగెను. దీనిఫాలమునందలిపట్టికనుబట్టి ఇది రవిచేత పంపఁబడె ననియు, ఇది కువలయమంతయు చుట్టివచ్చు ననియు, దీనిపేరు కువలయాశ్వ మనియు గ్రహించితిని. దీనిని గ్రహించి దానవుని జయింపు" మనెను. ఋతధ్వజుఁడు గుఱ్ఱమును సాహిణీకప్పగించి, ఋషిని ముందుగా పంపించి, మఱునాఁ డుదయము సమస్తబలములతో గాలవమునిసీమ కేఁగెను. నిజసచివుఁ డాశ్రమమును వర్ణించి చెప్పెను. రాజు సంతసించి మునుల కభయ మొసఁగి, డేరాలు వేయించి సైన్యమును విడియ నియమించెను. నరనాథుఁడు పట్టనాంతరములనుండి వచ్చునరపతుల కమ్మలు విను చుండఁగా నొకజోగి వచ్చి రాజుమ్రోల నొకగారడీ ప్రదర్శించి కైవార మాచరించి 'రాజా! నేను పాతాళకేతునిదూతను. మాసామిని గెలుచుట నీతరము కాదు. మాదొర తూర్పుదెసకు వచ్చు చున్నాఁడు. నీరాజులను బారుపెట్టు'

*ఇంతటితో ప్రథమాశ్వాసము ముగిసెను. ఇం దవతారికాపద్యము లెక్కువ

మని పలికెను, రా జతనికి కట్టువర్గ మిచ్చి పంపెను. పిదప రణ మారంభ మయ్యెను.*

సమరాన ఋతధ్వజుఁడు విజయలక్ష్మిని వరించి, దనుజపురిని తిలకించుచు నొకచంద్రశాలలో ప్రవేశింపఁగనే 'వనితా ఎంతబేలవే' ఆఁడుదాన వైనంతమాత్ర మున నింత చింతింపఁదగునా?అందని్రమానిపండులకు చేతులు చాతురా?ఇంతకు ఆదనుజోదంతము తెలియువఱకు నోర్పు వహింపుము' అనువాక్యములు విన్పిం చెను. కొంత ముందుకు సాగి యొకయపూర్వసౌందర్యవతిని చూచి తేఁడు నిలి చెను. మరల మఱుఁగున దాఁగి వారిసంభాషణ వినసాగెను. ఆలోలనయనహో రాశని చిక్కఁదీర్చి నెచ్చెలి 'ఇంతీ! మన మీనిశాచరునకు చిక్కి కన్పడ కుండు టచే తలిదండ్రు లెంత పరితపించు చున్నారో! వా రేమైనఁ గానిమ్ము. నీయాకారము నాశించి వీఁ డేమి చేయనున్నాఁడో! ఋతధ్వజుఁ డెక్కడ? నీ వెక్కడ? ఇంత కును మదనుఁడు ని న్నారాజునకు కూర్చ కుండఁడు. ఆదైత్యుని వధించుట కారాజు వచ్చె నని విని యుంటిని. ఆదనుజకామినులకలకలము వినఁగా రాజు జయించె నని తోఁచు చున్నది' అనెను. తన ప్రస్తావన వచ్చినందుకు రా జాశ్చర్య పడి వారియెదుట నిలిచెను. చెలికత్తె త త్తరముతో గద్దియ తెచ్చివైచెను. రాజు కూర్చుండెను. ఆమె తమవృత్తాంత మిట్లు చెప్పఁబొడంగెను —

అనఘా! విశ్వావసుఁ డనుగంధర్వరాజు దుర్గాపురి్రాత కలఁడు. ఆతని సతి హారిణి. వారికి కొడుకులు చాలమంది కలరు. లేకలేక కలిగినకూఁతు రీమె. పేరు మదాలస. ఒకనాఁడు భూలోకపువింతలు చూచుటకు తలిదండ్రు లనుమ తింపఁగా నేను, వేనవేలునెచ్చెలులు గొలువఁగా నీమె యిలకు డిగ్గెను. పుణ్య భూములు విలోకించుచు నందనమువంటి యొకవనమున విడిసితిమి. అట వేఁటకు వచ్చినయొకరాజు నీమె చూచెను. అతఁడు తురగముపై వేగముగ వెడలిపోఁగా వానివెనుక వెడలువారిమూలమున ఋతధ్వజుఁ డతఁ డని గ్రహించితిమి. ఆ

*ఇంతటితో ద్వితీయాశ్వాసము ముగిసెను.

రాజును చూచినప్పటినుండి యీమె మదనవేదనకు గురి యయ్యెను. వాసంత మేతెంచెను. ఈమె విరహవేదనకు గురి కాఁగా శిశిరోపచారములు సేయుచు నీవి డను ధవళవసనమందిరమునకు తెచ్చితిమి.*

ఈమదాలస విరహతాపాతిశయమువలన సొమ్మసిల్లి పాన్పున శయ నింపఁగా నేను కూడ ప్రక్కనే పవళించితిని. ఒడ లెఱుఁగనినిద్దుర పట్టెను. కన్నులు తెరచునప్పటి కీపాతాళకేతుసౌధమునం దుంటిమి. ఆపాతాళకేతువు మన్మ థునకు బదులుగ తనను పూజింపుఁ డని శాసించి వెడలెను. ఒకహెగ్గడికత్తె వచ్చి 'ఋతధ్వజుఁ డీదానవుని చంపుటకు వచ్చినాఁడు. మీరు బ్రదికితి' రనుచు వెడలెను. నాఁటనుండి యీవధూటి పడుచున్నవేదన నాచిత్తమును కలంచు చున్నది. నాపేరు కుండల యందురు. ఇది మావృత్తాంతము. ఇంతకు మీ రెవరో తెలుపుఁడు—అని కుండల యనెను, ఋతధ్వజుఁడు నిజచరిత్రము వివరించెను. మదాలస పులకించెను. ఆమెను కల్యాణమాడఁదలఁచి నిజనగరమునకు కొని పోయెను రాజు.

పాతాళకేతునితమ్ముఁడు తాళకేతువు కొలువుండెను. ఇంద్రుని కడకు తానుపంపినదూత తిరిగివచ్చి 'దొరా! మీ రడిగినతారారంభల నిచ్చుట కింద్రుఁ డంగీకరింపలేదు. దేవగురుఁడు 'తారారంభలవిటులచేతనే మీరజనీచరుఁడు అగ్ర జునికడకు పంపఁబడును గాక!' యని శపించెను. నేను పాఱిపోయి వచ్చితి' ననెను. ఇంతలో చారులు గొందఱు వచ్చి కువలయాశ్వుఁడు పాతాళకేతుని వధిం చినవార్తను తెలిపిరి. అంత కోపించినతాళకేతువు మదాలసను హరించి రాజును భంగపఱతు నని 'ముండవ్యుఁడు' అనుపేరితో మునిరూపు తాల్చి, తనయాశ్ర మమునకు రాక్షసబాధ వాటిల్లె ననియు, దానిని తొలఁగించుటకు రావలసిన దనియు కువలయాశ్వునకు చెప్పి వెంటనిడికొని పోయెను. మాయామౌని తేని నొకకొలని

---

*ఇంతటితో తృతీయాశ్వాసము ముగిసెను. ఇందు వాసంతవైభవము సుదీర్ఘముగ వర్ణితము.

చెంతకు తీసికొనిపోయి 'అధిపా! నీవు రాఁగానే రాక్షసులమాయ తొలఁగెను. నే నీకొలనిలో వరుణజప మొనరించి వచ్చునందాఁక నీ విట నుండుము. నేను వచ్చుట ఆలస్యమయిన నీవు వెడలదె వేమొ' నిన్ను నమ్మరాదు. కనుక నీకంఠహార మిమ్ము.' అనెను. రా జిచ్చెను. ఆముని కొలనిలో మునిఁగి అంతిపురముచెంత నున్నడిగ్గియలో తేలి మంత్రిరూపు ధరించి మదాలసాకుండలలకడ కేఁగి 'అమ్మా' మనరాజు రక్కసులను వధించెను. అందు కాముని సంతసించి యట నొకపట్టనమును తనతపోబలముచే నిర్మించి మీవివాహము చేయ నిశ్చయించెను. తేఁ డంగీకరించి నిన్ను తె మ్మని యీకంఠహార మానవాలుగ పంపె' నని హారము చూపెను వారు నమ్మిరి. అంత వారి నొకకృత్రిమవిమానముపై నెక్కించి కొనిపోయి మేరుపర్వతమం దొకగృహమున నుంచి రాక్షసస్త్రీలను కాపువెట్టి, మరల మౌనివలె రాజును చేరి ఆశీర్వదించి పంపెను. తిరిగివచ్చినిక్షితిపతి మదాలసకై విలపించుచు కరణీయములు మాని యుండెను. అతనినేస్తగాం డ్రయినయశ్వతరుని సుతు లిద్దఱు ఆతనివేదనను తమజనకునకు నివేదించి 'ఆతనియార్తి మాన్పవే' యని వేఁడిరి.

అశ్వతరుఁడు కైలాసగిరి కేఁగి అంబికాశశిభూషణులకు నమస్కరించి గానవిద్యచే వారిని మోదపఱచెను. అంత పార్వతి వరము వేఁడు మని అశ్వతరునితో పలుకఁగా 'నాథుఁడుండ నీవా వరమిచ్చుదానవు' అని గంగయధిక్షేపించెను. 'ఆమెమాటల కేమిలే వర మడుగు' మని గిరిజాదేవి అశ్వతరునితో మరల పలికెను. అశ్వతరుఁడు మదాలసాకుండలలను రప్పింపవలయు నని ప్రార్థింపఁగా నశ్వతరునికి ఆవర మిచ్చెను గౌరి. వెంటనే గంగ మదాలస వచ్చును గాని కుండల రా దని పలికెను. అంత శంకరుఁడు 'అహిరాజా! రెండునాళ్ళ తేడాతో ఆమె కూడ రాఁగలదు. ఇపుడు మదాలస వచ్చును. నీవు వెడలు' మనెను. నాగరాట్టు వెడలెను. అంతలో నుమాకాంతునివరబలమున నిద్రించు చున్నమదాలస పాతళమును చేరెను. ఆమెను తనతనయగా భావించి పాఁపఱేఁడు సేవకురాం

్రడను నియమించి, ఆవిషయము తెల్పకే తనకొమరులను పిలిచి కువలయాశ్వునిని తీసికొని రండనెను. వారతనికడ కేఁగి తపజనకునియాహ్వానమును తెలిపిగోమతీనదిద్వారా పాతాళమునకు తెచ్చి అంతొకయుద్యానవనమున నతని నుంచి 'ఇట నుండుము. నీరాక మానాయనకు తెల్పి స్వాగతమర్యాదలతో నిను గొనిపోదు' మని వెడలిరి. అట చెలికత్తియలతో పుష్పాపచయకేళి నున్నమదాలసను కువలయాశ్వుఁడు గాంచెను. కాంచి 'యీమె మదాలస యయినచో దీనిప్రాణ మయిన కుండల యేది? విధివశమున వీరు విడిపోయిరా? ఈమె యిచటి కెట్లు వచ్చెను? అని తలపోయు చుండఁగా మదాలసచెంతకు తార యనుస్వర్గస్త్రీ వచ్చెను. కుశలప్రశ్న లయినతరువాత ప్రసంగవశమున తారాజయంతవిలాసమునుగూర్చి తార తనమిత్త్రిరా లయినమదాలసతో నిట్లు చెప్పసాగెను —

కమలదళేక్షణా! ఆజయంతునియందచందములకు లోనయి నన్నే నతనికి గుత్త కిచ్చితిని. పూర్వప్రవిటులు నన్ను చేరకుండ జయంతుఁడు కావళ్ళ పెట్టి త్రాడు గట్టినవానిచందాన నేలసాగెను. జయంతుఁడు నన్ను బంధించె నని, నేనే జయంతుని బంధించితి నని యెవరికి తోఁచినట్లు వారు పలుకసాగిరి. ఈవిషయమంతయు కనుఁగొన్ననలకూబరుఁడు 'ఈనడుమ రంభ మదనకేళిలో పారవశ్యమును గనఁబఱచక నన్ను నిర్లక్ష్యము చేయు చున్నది. దీనిపొగ రార్పఁగలజగన్మోహనాంగికై దివిని వెదకు చున్నాను. ఈతార నేఁడు కలిగెను' అని తన నేస్తగాండ్రతో పలికెను. ఆమాటలు వారు నాచెంతకు చేర్చిరి. నేను నిర్లక్ష్యము చేసి వారిని పంపితిని.

ఒకనాఁడు కుబేరునికడ కొకబోయఁడు వచ్చి 'స్వామీ! కువలయాశ్వరాజు పాతాళకేతుని వధించెను. ఇంద్రుఁ డచటి కరుగుచు మిమ్ము రమ్మని యీయుత్తరమిచ్చె' ననీ యిచ్చెను. అది చదివి తనకొడుకును పిలువ భటులను పంపెను. వారు వెడలి కోడిపందెములం దున్న నలకూబరునికి తండ్రిపిలుపును తెలిపిరి. అతఁడు తండ్రికడకు రాఁగా నలకూబరుఁడు 'గుజ్జుస్వారీలో నే నలసి యున్నాను. నీవు అమరావతికి వెడలి ర' మ్మనెను. వెంటనే అతఁడు రంభ

యింటికేఁగి దానికి తనపయనముసంగతి తెలిపి, విమానము నెక్కి యింద్రుని కడ కేఁగి విడిదెలో నుండెను.*

అట నమరావతివీథులలో నలకూబరుఁడు షికారులు చేయు చున్నాఁడు. అతనియందచందాలు నన్ను మురిపించినవి. ఒక లేఖము వ్రాసి సంపంగిబంతిలో నమర్చి కుబేరకుమారునకు పంపించితిని. ఇట నే నుద్యానమునం దుండఁగా నలకూబరుఁడు వచ్చెను. ఇరువురము మదనక్రీడాపరవశుల మయితిమి. ఇట్లు దినదిన మతఁ డుద్యానమునకు వచ్చి న న్నానందపఱచు చుండెను. నాతనువు జయంతునిప్రక్కను, మనసు నలకూబరునికడను నున్నది. కొన్నాళ్ళకు జయంతుఁడు సందేహపడెను. అట రంభ నలకూబరవిరహముతో వ్యథపడు చున్నది. నారదుఁడచటి కేఁగి యొకచీటి నిచ్చి 'ఇది నీనాథునికడ నున్నది' అనెను. అది చదివిన రంభకు నావిషయము తెల్ల మయ్యెను. ఆచీటిని చేటిద్వారా జయంతున కంపెను. అతఁడు నాఱంకును గ్రహించి తోఁటకు వచ్చెను. నేను, నలకూబరుఁడు జయంతునికన్నులఁ బడితిమి. తరువాత జయంతనలకూబరులు యుద్ధమునకు సిద్ధపడిరి. ఇంద్రకుబేరులప్రార్థనమున బ్రహ్మదేవుఁడు వచ్చి వారిని వారించు చుండఁగా ఒకస్త్రీయార్తనాదము వినఁబడెను. అదిచూచి 'తాళకేతువర్తనమది. దేవగురునిశాపమిట్టిది' అనిగ్రహించిననలువ జయంతనలకూబరులను తాళకేతుహననమునకు పురికొల్పెను. వా రతనిని వధించిరి. దేవతలదంబు నలకూబరజయంతులకు మైత్రి ఘటించి వెడలిరి. ఆరక్కసునిబారినుండి రక్షింపఁబడినకాంతను నాయింట నుంచితిని. ఆమె జరిగినవిషయ మంతయు వివరించి 'ఒకనాఁటిరేయి మదాలస కానరాక నేను దుఃఖించు చుండఁగా 'దనుజుఁడు వచ్చి మదాలస పాఱిపోయె నని భావించి నన్ను వేతొకచోటికి కొనిపోవు చుండఁగా, అతఁడు జయంతనలకూబరులచే వధింపఁబడెను' అని చెప్పెను. ఆమె నీకై విలపించు చుండఁగా నే నూరడించి నిన్ను వెదకుటకు బయలుదేఱితిని. నడుమ నారదునివలన, నీవిషయ

---

*ఇంతటితో చతుర్థాశ్వాసము ముగిసెను.

మెఱుకపడి యిటకు వచ్చితిని. మనచింతలు తీఱినవి. నేను కుండలను తీసికొని వత్తును—అని పలికి తార వెడలెను.

అంతలో నొకచెలి వచ్చి 'అక్కా! ఋతధ్వజుఁ డిట వచ్చెనఁట. ఫణిరాజు స్వాగతము పలుకుటకై వెడలెనఁట' అని చెప్పెను. మదాలస మేడ నెక్కి చూచు చుండఁగా అశ్వతరుఁడు తగినమర్యాదలతో కువలయాశ్వుని విడిదికి తెచ్చి మదాలసవృత్తాంతమంతయు వివరించెను. తరువాత అచటనే మదాలసా కువలయాశ్వులకల్యాణము జరిపించెను. తారాకుండలలు పెండ్లికి వచ్చిరి. అశ్వతరుఁడు కానుక లిచ్చి దీవించి దంపతులను సాగనంపెను. వారందఱు గోమతీ నదీముఖమున నయోధ్యకు వచ్చిరి. మదాలస కేళీగృహమునకు పంపఁబడియెను. దంపతులు ధర్మశృంగారాబ్ధి నోలలాడిరి. కువలయాశ్వుఁడు మదాలసతో సౌఖ్య మనుభవించుచు ప్రజలను చక్కఁగ పరిపాలించు చుండెను. ఇది ప్రబంధకథా సారము.

## భేదసాదృశ్యములు - సమన్వయమార్గములు

ఈ కథావిధానములను పరిశీలింపఁగా చిత్రవిచిత్రము లయిన భేదసాదృశ్యములు పొడకట్టు చున్నవి. అవి యిట సమన్వయింపఁబడు చున్నవి. ముందు భారతభాగవతవిషయములను శీలించి, పిదప మార్కండేయవిషయమునకు రాఁదగును.

భారతములోనినాయకునిపేరు కువలాశ్వుఁడు, భాగవతములోనినాయకుని పేరు కువలయాశ్వుఁడు. ఏకాక్షరభేద మిది. 'అర్శ ఆదిభ్యోఽచ్ (5-2-127) అనుసూత్రమువలన "కువలయాశ్వ మనుగుణము కలవాఁడు కువలయాశ్వుఁడు" అని సాధింపవచ్చును. పిదప పృషోదరగణమువలన కువలాశ్వుఁడు గావచ్చును.

ఇట్లే భారతములోనిమహర్షి ఉత్తంకుఁడు కాఁగా భాగవతములోనిమహర్షి ఉదంకుఁ డై యున్నాఁడు. 'ఉత్తంక ఉదంక' శబ్దములు కూడ పృషోదరగణ

సాధ్యములే! ఇచటిమఱియొకవిశేషము-సంస్కృతభారతములోని ఉత్తంకుఁడు తెనుఁగుభారతమున ఉదంకుఁడు గా గ్రహింపఁబడుట.

ఇఁక భారతములోని 'ధుంధువు' భాగవతమున 'దుందువు' గా కన్పడుట యింకొకతేడా. ఇవి సంజ్ఞావాచకములు గావున వ్యవహారవశమున మహాప్రాణములు అల్పప్రాణము లగుటలో వింత లేదు. భారతము 'ధుంధువు' అనఁగా వ్యవహారవశమున నది 'దుందువు' గా మాఱి రూఢి యయినదానిని భాగవతము గ్రహించె ననవచ్చును. భారతభాగవతములు రెండును వ్యాసర్షిప్రణీతములే. రెండును పరమప్రమాణములే! అయితే, తెనుఁగుభాగవతము మాత్రము భారతము ననుసరించి 'ధుంధువు'ను గ్రహించుట యిచటిమఱియొకవిశేషము.(*)

ఇట్లీరెండుగ్రంథములలోను నామభేదమే తప్ప కథావిధాన మొక్కటే. కా కున్న భారతమున విపులము గా నున్నవృత్తాంతము భాగవతమున దిఙ్మాత్రముగ సూచింపఁబడినది. ఇఁక నీ వృత్తాంతమును మార్కండేయపురాణాంతర్గత వృత్తాంతముతో పోల్చి చూడఁగా కువలయాశ్వనామసాదృశ్యము తప్ప తక్కిన కథావిధానమునకు పోలికలే లేవు. మార్కండేయములోనిగుఱ్ఱము, గాలవుఁడు, పాతాళకేతుతాళకేతులు, మదాలస, కుండల, అశ్వతరుఁడు మున్నగువా రెవ్వరును భారతభాగవతములందు కనరారు. కడకు కువలయాశ్వునిజనకుని పేళ్ళలో కూడ తేడా కలదు. భారతభాగవతములందు కువలయాశ్వునితండ్రి బృహదశ్వుఁడు. మార్కండేయమున కువలయాశ్వునితండ్రి శత్రుజిత్తు. అట్లయిన ఈరెండుకథ లొక్కటి కావా? అన్నచో ఒక్కటే యని సమాధానము. ఒక్కటే యయినచో భేదములమాట యేమిటి? అని మఱియొక ప్రశ్నము. దానికి కల్పభేదమే కారణ

---

* కం. లావు మెఱసి యిరువదియొక
వేవురు నందనులు దాను వీరుఁ డతఁడు భూ
దేవుఁ డుదంకుఁడు వనుప దు
రావహుఁ డై చంపె ధుంధు నమరాబంధున్. భాగవతము, 9-164

మని సమాధానము.(1) అనఁగా భారతభాగవతములందలివృత్తాంత మొకకల్పము నకు చెందినది, మార్కండేయములోనివృత్తాంతము వేఱొకకల్పమునకు చెంది నది.(2) ఈకల్పభేద మొకటి భారతీయపురాణములందు జాగరూకతతో గమనింప వలసినయంశము. కల్పభేదమున వృత్తాంతభేదము సహజలక్షణము. ఈవిషయ మెఱుఁగనివిమర్శకు లీభేదములకు కారణము లరయఁజాలక భారతీయులవి పక్కిటిపురాణము లనుట శోచనీయము. ప్రకృత మనుసరామః। భారతములోని పలుసందియములను తీర్చుటకే మార్కండేయ మవతరించినది కనుక భారత ములో క్లుప్తముగ నున్నకువలయాశ్వచరిత్రము మార్కండేయమందు విస్తృత ముగ వివరింపఁబడి, కువలయాశ్వనికల్యాణవృత్తాంతాదులను వెల్లడి చేసిన దనియు భావింప నగును. ఎంత కల్పభేద మున్నను దేహములం దాత్మవలె నీవృత్తాంతములం దొక్కవిషయము సమానముగ నంతర్గముగ సాగినది. అది- ఒకఋషి కువలయాశ్వునిని ఆశ్రమమునకు కొనిపోయి రాక్షసునిని వధింపఁ జేయుట.

## ప్రబంధకవి చేసినమార్పులు-సాధించినప్రయోజనములు

ఈకథల నన్నింటిని పరిశీలింపఁగా ప్రబంధకథకు మార్కండేయకథ మూల మని తెలియు చున్నది. కనుక మార్కండేయము దృష్టియం దుంచుకొని ప్రబంధకథావిధానమునందలిమార్పుల ననుశీలింపవలసి యున్నది.

---

(1) "ఏకార్థాని పురాణాని, వేదా శ్చైకార్థసమ్మితాః" (మహాభారతము).

శ్లో॥ క్వచిత్క్వచిత్పురాణేషు, విరోధో యది దృశ్యతే।
కల్పభేదాదిభి స్తత్ర, వ్యవస్థా సద్భి రిష్యతే॥

ఆంధ్రపద్మపురాణము-ప్రథమభాగము పరిచయము-పుట VII

(2) భాగవతము సారస్వతకల్పవృత్తాంతమును, మార్కండేయము మాధురీ కల్పవృత్తాంతమును తెలుపు చున్నవి. (పై గ్రంథమే-పరిచయము-పుట X)

మూలమును, ప్రబంధమును పోల్చి పరిశీలింపఁగా కొట్టవచ్చినట్టు కన్పట్టు చున్నప్రధానభేదము మదాలసాఋతధ్వజులకల్యాణవిషయమునకు చెందినది. మూలమున పాతాళలోకమున కుండలయే స్వయముగ తుంబురుని రప్పించి మదాలసాఋతధ్వజులకల్యాణము చేయించి తాను నిష్క్రమించును. కాని ప్రబంధమున పాతాళకేతుని వధించి ఋతధ్వజుఁడు మదాలసాకుండలలను రాజధానికి తెచ్చును. అతఁ డామెను పెండ్లాకముందే పాతాళకేతునితమ్ముఁడు తాళకేతుఁడు మదాలసను కుండలను హరించుట ప్రబంధమందలివిషయము. కడకు అశ్వతరుని సమక్షమున మదాలసాకువలయాశ్వులకల్యాణము జరగుటతో ప్రబంధకథముగియు చున్నది. వసుచరిత్రాదిప్రబంధములు పెక్కులు నాయికానాయకకల్యాణములతో ముగియు చున్నవి. ఇది చాలశృంగారప్రబంధములకు సంప్రదాయ మై యున్నది. దానిని పాటింప నెంచినచిననారాయణకవి నాయికానాయకులకల్యాణమును కడకు చేర్చెను. మూలములో మధ్యమున నిష్క్రమించినకుండల ప్రబంధమున కడదాఁక ఉంచఁబడినది. దీనికి కూడ సంప్రదాయబద్ధమయినకారణ మొకటి కలదు. తెనుఁగులోనిశృంగారప్రబంధములయందు నాయికులకు ముఖ్య లయినచెలికత్తెలు కడవఱకు నుండుట కలదు. ఈనియమమును పాటింప నెంచినప్రబంధకవి మూలములో వివరింపఁబడినకుండలాకుటుంబవృత్తాంతమును స్పృశింపక కేవల మొక చెలికత్తియనుగా తీర్చి చివరిదాఁక నుంచెను. మఱియు తాళకేతువధమునకు కావలసినయానుషంగికకారణము గా ఈ మెను కూడ నతఁడు బంధించి తీసికొని వెళ్ళుట కవి చేసినమార్పులయం దొకటి.

మూలమున తాళకేతువు అంతఃపురమునకు వచ్చి కువలయాశ్వుఁడు మరణించె నని చెప్పఁగా మదాలస మరణించెను. కాని ప్రబంధమునందు తాళకేతువు మదాలసాకుండలల నపహరించి మేరుగిరిని దాఁచెను. మూలమున మదాలసామరణము ప్రత్యక్షము గనుక కువలయాశ్వునివేదన కరుణరసమునకు చెందిన దనవలయును. ప్రబంధమున నాయిక మరణింపలేదు. మాయ మైనది. కనుక

కరుణమున కవకాశము లేదు. నాయకునకు ప్రత్యాశ ఏకోశముననో కల దని భావింపవలసి యున్నది. అందువలన నిచట విప్రలంభ మనఁదగును. ఈయుద్దేశముతోనే మూలమున నీసందర్భమునం దున్నకరుణరసచ్ఛాయలను పూర్తిగ తొలఁగించి, విప్రలంభవికాసమును ప్రబంధకవి కల్పించినాఁ డనిపించును.

ఇఁక ప్రధానముగ చర్చింపవలసినది తారోపాఖ్యానము. మూలములో లేనియీయుపాఖ్యానము కేవలము చిననారాయణసృష్టి. తార దేవవేశ్య యనుట సత్యమే. కాని జయంతనలకూబరు లీమెవెంటఁ బడినట్లు ఏపురాణములోను కన రాదు. ఇది కేవలము రసాభాసశృంగారమును పోషించుటకై కవి కైకొన్న కత. దీనిని ప్రధానకథతో జతపఱచుతలంపుతో మదాలసాతారాలు స్నేహితురాం డ్రయినట్లు కల్పించి పాతాళమున సంభాషింపఁ జేసినాఁడు. మఱియు తాళకేతువు మూలమున వధింపఁబడకపోఁగా నతఁ డేమైనాఁడో కూడ తెలియదు. అతనిని కూడ వధింపఁజేసి శత్రుశేషము లేనివానినిగా నాయకునిని తీర్చిదిద్దవలసి యున్నది. అయితే, తాళకేతువును ఋతధ్వజుఁడే వధించినట్లు నిర్మించుట కీపథక మంతయు మాఱవలసి యుండును. విశేషించి తారోపాఖ్యానముతో పనియుండదు. గ్రంథమునిడివియు తగ్గును. అందువలన కవి యిట నొకకథాచమత్కారము కావించినాఁడు. తాళకేతువు తారారంభలను పంపు మని యింద్రునితో చెప్పుటకై ఒకదూతను దేవసభకు పంపును. అందుకు బృహస్పతి 'తారారంభలవిటులచేతనే వధింపఁబడి తాళకేతువు పాతాళకేతువు పోయినచోటికి పోవు' నని శపియించును. ఆవిషయము నెఱింగినతాళకేతువు తనయగ్రజుఁ డైనపాతాళకేతువు మరణించి నట్లు గ్రహించును. అదేసమయమున చారులు కూడ వచ్చి పాతాళకేతుమరణ వార్తను తెల్పుదురు. అందుకు కారకుఁ డయినకువలయాశ్వునిపై పగపట్టి అతనిని భంగపఱప నెంచి, తాళకేతువు మదాలసాకుండలల నపహరించును. మదాలస యాశ్వరవరమున అశ్వతరునియింటికి చేరినది. కుండలను తాళకేతువు మేరుభూధ రమునుండి మరల మఱియొకచోటికి తీసికొనిపోవునప్పుడు తారకై తగవులాడుకొను చున్న నలకూబరజయంతులకంటఁ బడెను. బ్రహ్మదేవుఁడు బృహస్పతిశాపమును తెలిపి అతనిని వధింపుఁ డనఁగా ఆనలకూబరజయంతులు తాళకేతువును వధిం

చిరి. వారితగవు చెలిమియయ్యెను. తారచెంతకు చేరినకుండలను మదాలసా కల్యాణమునాఁటికి వెంటఁబెట్టికొని పాతాళమునకు తెచ్చినది తార. ఇందువలన నిర్వహణసంధియందు అద్భుతరసము పోషింపఁబడినట్లయినది. ఇది యంతయు చిననారాయణునికల్పనాప్రతిభకు నికషోపలము. సర్వమును ఒకజానపదకథా సంవిధానమును కలిగి సహృదయులయుత్సుకత వినుమడింపఁజేయు చున్నది.

కనుకనే ఔచిత్యవిషయమున పెదవివిఱిచినఅరుద్రగారు కూడ కథాసంవిధానవిషయమున ఔననకుండ నుండలేకపోయిరి. "చిననారాయణ సరసకవితా వైభవుఁడు. జాతివార్తాకవిజనామోదసంధాయకుఁడు. ఏకావ్యంలోనైనా కొన్ని చోట్ల శబ్దనిగుంభనాలు, కొన్నిచోట్ల యుక్తిక్రియాగౌరవాలు, మరికొన్నిపట్లలో అవసరమైనరసప్రకరాలు కనిపిస్తేనే అది ఆహ్లాదమవుతుం దని అతనికి తెలుసు. ఆంధ్రప్రబంధహేలావిధులైనకవిత్రయంవారినీ, శ్రీనాధనాచనసోములను అతడు క్షుణ్ణంగా చదువుకొని కవితారహస్యాలు తెలుసుకొన్నాడు. బహువిధకథావిచిత్రమైనకువలయాశ్వచరిత్ర అనేకావ్యాన్ని సరసజనసేవ్యంగా వ్రాయాలని సంకల్పించుకొన్నాడు. నిజంగా ఈకావ్యంలో కథావైచిత్రి కనబడుతుంది. ఇది సరసజనసేవ్యమనే చెప్పాలి"— అనినా రారుద్రగారు(1) "బహువిధకథావిచిత్రం బగుకువలయాశ్వచరిత్రం బను కావ్యంబు సరసజనసేవ్యంబు గా రచియింపనూహించిన(2) చిననారాయణ కీతారోపాఖ్యానమే సముచితస్థానము నొసంగిన దనవలయును.

ఇఁక మూలమున నున్నయశ్వతరసోదరుఁ డయినకంబలునివిషయమిందు లేదు. ఆపాత్రమువలనిప్రయోజనము శూన్య మగుటచే విడువఁబడినది. పిండభక్షణమువలన మదాలస జనించుటవంటి శ్రాద్ధవిషయములు పురాణలక్షణములకు తగినంతగా ప్రబంధములకు తగవు. అందువలన నిదురించు చున్నమదాలస

(1) సమగ్ర ఆంధ్రసాహిత్యము, 11వ సంపుటము, పుట 146.

(2) కువలయాశ్వచరిత్రము- 1-13.

అశ్వతరుని గేహమున వెలసినట్లు మార్పు కావింపఁబడినది. మూలమున నాగ కుమారులు గౌతమీనదీముఖమున కువలయాశ్వుని నాగలోకమునకు చేర్చిరి.(1) ప్రబంధమున గోమతీనదీద్వారమున పాతాళమున కేఁగినట్లు కలదు.(2) మఱియు మూలములో కువలయాశ్వునిరాజధాని పేరు తెలుపఁబడలేదు. భాగవతము ననుసరించి అయోధ్యానగరము రాజధాని యని ప్రబంధకర్త నుడివెను. అయోధ్యాసమీపమున ప్రసిద్ధనది సరయూనది. దీనిని, మూలములోని గౌతమిని వచింపక గోమతిని చెప్పుట ప్రబంధమున జరిగినమార్పులం దొకటి. ఈమదా లసాఋతధ్వజులవృత్తాంతమును కుండలినీయోగవిద్యాసూచకముగా నన్వయించి "గోమతి యనఁగా మార్గదర్శకము (గమ్యత ఇతి గౌః - పొందఁబడునది. అది గలది గోమతి. అనఁగా అన్వేషకులచే పొందఁబడునది తనయందు గలది అని భావము)" - అని డా. దేవళ్ళ చిన్నికృష్ణయ్యగారు వ్రాసిరి.(3)

మూలమున యమునాతీరమున నాశ్రమ మేర్పఱచుకొని యున్న తాళకేతువును కువలయాశ్వుఁడు చూచును.(4) తాళకేతువు దానియందే మునింగి ఋతధ్వజునిపట్టణమునకు పోవును. ప్రబంధమున యమునప్రసక్తి లేదు. ఆశ్రమ మున్నది. దానిచెంగట నున్నకొలనిలో మునిఁగి తాళకేతువు ఋతధ్వజునియంతి పురికడ నున్నకొలనిలో తేలును.(5) మూలమున మునివేషమున నున్నవానికి పేరు లేదు. కావ్యమందు ముండవ్యుఁ డనుపేరు గలదు.(6) మఱియు గాలవ

(1) అప్రాప్తశ్చ గౌతమీం పుణ్యాం నిర్గమ్య నగరాద్బహిః ।
ఆ) తన్మధ్యేన యయుస్తే వై నాగేంద్రనృపనందనాః । అధ్యాయము 21-90, 91 శ్లో.

(2) చతుర్థాశ్వాసము - 128.

(3) కువలయాశ్వచరిత్రము, సంపాదకీయము - పుట 20.

(4) అధ్యాయము 20-6శ్లోకము.

(5) చతుర్థాశ్వాసము - 87.

(6) ,, 77.

మునిసీమను వర్ణించి చెప్పినపేరులేనికేళసచివుఁడు ప్రబంధకర్తృకల్పితుఁడు. ఇతనిప్రయోజన మింతవఱకే. ఇందువలన నొకింత నాటకలక్షణ మిచట స్ఫురింపఁజేయఁబడినది.

ఇట్టిచిఱుమార్పులు రసరంజకములుగాని, రసభంజకములుగాని కాక పోవుటచే నంతగా పట్టించుకొనవలసినపని లే దనవచ్చును.

మొత్తమునకు చిననారాయణకవి శృంగారరసమున్మేషముగ ప్రబంధమును నిర్మించుటకు కావలసినమార్పులు, కూర్పులు నేర్పుగా చేసికొనినాఁడు,

శ్లో॥ అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః ।
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే ॥

—ఆనందవర్ధనాచార్యులు

# చతుర్థ దళము.

## అలంకారములు

కావ్యమందాకినీవీచికానిచయమునందు అలంకారములు సువర్ణాంబుజములు అవి సతతము సహృదయభ్రమరాళికి సరసగతిని అమితామోదము నందించును. కృతియందు సముచితస్థానమున సముచితముగ ప్రయోగింపఁబడినయలంకారములు తచ్ఛిల్పి యయినకవియొక్క నైపుణ్యమును వ్యక్తపఱపఁగలవు.

ఆదివేద మయినఋగ్వేదమునుండియే మనభారతభారతికి అలంకారము లలరారి యున్నవి. "ఉపమా యత్ర సాదృశ్యలక్ష్మీ రుల్లసతి ద్వయోః" అను నుపమాలక్షణాదులు పూర్వపూర్వవాఙ్మయమందలియలంకారముల కనుగుణముగ నిర్మించుకొనినవే! అసలు ఋగ్వేదప్రారంభమే ఉపమాలంకారముతో నున్నది. చూడుఁడు -

ఋక్కు. అగ్నిమీళే పురోహితం। యజ్ఞస్య దేవ మృత్విజమ్
హోతారం రత్నధాతమమ్ ॥

పురోహితునివలె యజ్ఞమును నడిపించువాఁడును, (దేవతలను) పిలుచుకొనివచ్చువాఁడును, ఋత్విజుఁడై (యజ్ఞమును సాధించువాఁడును), రత్నములను (యజ్ఞములను) ధరించువాఁడు నగునగ్నిదేవుని స్తుతించు చున్నాను. (1)

ఈప్రథమఋఙ్మంత్రార్థములోని 'పురోహితునివలె యజ్ఞమును నడిపించువాఁడును' అనుచోట నుపమాలంకారము స్పష్టమే కదా! ఇట్లే - వెదురంత పొడవు గా నిన్నుఁ బొగడుదురు, (2) గర్భధారణయోగ్యత కలఆడపావురమును

(1) ఆంధ్రవేదములు (ఋగ్వేదము), ప్రథమసంపుటము, 1-1-1-1.

(2) ,, ,, ,, 1-3-10-91.

మగపావురము చేరునట్లు,(1) నపుంసకుఁడు పుంస్త్వము కలవాఁడు గాఁ గోరు నట్లు, (2) యుద్ధములలో ముసలిరాజువలె,(3) (బందిఖానాలో వేయఁబడిన) మనుష్యుఁడు రాజును స్తుతించునట్లు.(4) బహువక్త యగువిదూషకుఁడు(=హాస్య గాఁడు) వలె,(5) ఇద్దఱు సతులు (పెనిమిటిని బాధించు) నట్లు,(6) ఇత్యాదుల యం దుపమ కన్పించును. ఇతరాలంకృతులు కొన్ని అటనట నగపడును.

అసలు మానవవ్యవహారమే అలంకారసమలంకృతము. ఎందుకురా కాకిలా అరుస్తావు? ; అత్తమీఁద కోపం దుత్తమీఁద చూపినట్టు: పెద్దపెద్దమేధా వులే తల్లకిందు లయ్యారు, నీలాంటివాళ్ళసంగతి చెప్పేదేంటి? : వాడిగుట్టు వాడికే తెలుసు - ఇత్యాదివ్యావహారికవచనములలోని ఆయాచమత్కారములే కావ్యగతము లయినతరువాత వానికి లాక్షణికులు అలంకారము లన్నసంజ్ఞ లేర్ప ఱచి విస్తృతపఱచిరి. వేదములతరువాత వాల్మీకిరామాయణములోను, కావ్యా దులలోను రానురాను ఈయలంకారములు హెచ్చినవి. తదనుగుణముగనే లక్షణ వేత్తలు గమనించినవియు, గమనించినవానిలోనిభేదములు వింగడించినవియు కలసి అప్పయదీక్షితులవారినాఁటికి సుమారు నూటపాతిక(124) అలంక్రియ లయినవి. పనివడి ఏడఁగొట్టినచో వీనినుండి మఱికొన్ని యుద్భవింపక పోవు కనుకనే "ఆయలంకారములు ఈనాఁటికిని కల్పింపఁబడు చున్నవి. వాని నెవఁడు పూర్తిగ చెప్పఁగలడు?" అను చున్నాఁడు దండి(7) అంతర్గతాలంకారములకు భోజదేవునిసరస్వతీకంఠాభరణము నిలయము.

---

(1) ఆంధ్రవేదములు. (ఋగ్వేదము) ప్రథమసంపుటము, 1-6-30-332.
(2) ,, ,, ,, 1-7-32-375.
(3) ,, ,, ,, 1-7-34-402.
(4) ,, ,, ,, 1-11-59-684.
(5) ,, ,, ,, 1-15-105-1123.
(6) ,, ,, ,, 1-21-141-1514.
(7) కావ్యాదర్శము, 2-1.

'అలం కరో తీతి అలంకారః' లేక 'అలంక్రియతే అనేన ఇతి అలంకారః' అని అలంకారశబ్దమునకు వ్యుత్పత్తి. (1) అలంకరించునది కనుక అలంకారము. లేక దీనిచేత (కావ్యము) అలంకరింపఁబడును కనుక ఇది అలంకారమని యర్థము. 'సౌందర్య మలంకారః' అని వామనాచార్యునివక్కాణ. (2) అనఁగా కావ్యమునందు సౌందర్యమును స్థాపించుట అలంకారము. "కావ్య శోభాకరాన్ ధర్మానలంకారాన్ ప్రచక్షతే (3) అన్నఆచార్యదండివచనమునుబట్టి కావ్యశోభావిషయమున అలంకారములప్రాముఖ్యము ప్రస్ఫుటము.

ఈచిననారాయణుఁడు తనప్రబంధమున సందర్భానుగుణముగ చాల అలంకారములను కూర్చినాఁడు. సంకరాదులను కూడ సూక్ష్మేక్షికతో చూపినచో అర్ధశతమువఱ కుండును. అది వ్యాఖ్యాతృకార్యము. కనుక ప్రస్తుత మిచట అతని ప్రతిభాభివ్యక్తకము లగునేడెనిమిది యలంకారములు ప్రదర్శింపఁబడును.

(౧) ఉపమాలంకారము : ఉపమానోపమేయములకు సాదృశ్యమును చెప్పుట ఉపమాలంకారము. (4)

సీ. తనమందహాసనూతనకాంతి, కాంతకీ
    ర్తికలాపములను సంధించుకొనఁగఁ
దనయాస్యఘర్మంబు, ధవరాగరసఝరీ
    పటిమతోడుత మాట పలుకులాడఁ
దనతనూదీప్తిసంతతులు, నాయకమహస్
    స్తోమంబునకును విందులు ఘటింపఁ
దనయురోజాచలత్వంబు, మనోనాథ
    కఠినధైర్యముతోడఁ గలసిమెలఁగ

(1) చంద్రాలోకము, పీఠిక, పుట 8.

(2) ,, ,, ,,

(3) కావ్యాదర్శము, 2-1.

(4) చంద్రాలోకము - 11.

గీ. రాజులఁ దిరస్కరించుచు, రమణుఁ డున్న
యరద మెక్కెనుఁ రుక్మిణీసరసిజాయ
తాక్షి, సమరము నారాయణాధిపేంద్రు
శుభదయాపూర్ణవీక్షచేఁ జూచుఁ గాత। (1—2)

సీసభాగమున నాలుగుపాదములందును ఉపమాలంకారము ప్రయుక్తము. ప్రథమపాదమున రుక్మిణీమందహాసనూతనకాంతికి శ్రీకృష్ణునికీర్తికలాపములకు ఉపమేయోపమానసంబంధము విహితము. ఇట్లే మిగిలినపాదములందును గ్రహింపనగును. సంధించుకొనుట, మాటపలుకులాడుట మొదలగునవి ఉపమావాచకములు. మందహాసధర్మంబు లనుటవలన సాత్త్వికభావములు వ్యక్తములు. ఇచట రుక్మిణీకృష్ణులసౌందర్యప్రతాపాదులు పరస్పర సంయోగము కలవి కనుక వారిరువురు అనురూప మయినజంట అని ధ్వని. అందువలననే ఆమె రాజులను తిరస్కరించుట. శుభసమయము కనుకనే శుభదయావీక్షచే చూడవలయు ననుట కావ్యమునందలి అంగిరసము, కథావిధానాదులు కూడ నిందు సూచింపఁబడి యున్నవి.

౨. ఉత్ప్రేక్ష : ఉపమానమున కున్నధర్మములు ఉపమేయమునం దుండుట చేత ఉపమానముయొక్క తాదాత్మ్యమును ఉపమేయమునకు చెప్పుట.*

క. జడజననబంధువేఁడిమి
నుడికెడుప్రుడమికి నొకింత యూరట సేయన్
నడుమ నెలకొన్నవెన్నెల
వడువున శాల్మలులతూలవారము నెలసెన్ (1—104)

భూమ్యాకాశములనడుమ నున్నబూరుగుచెట్లదూదిగుంపు సూర్యునివేఁడికి నుడుకు చున్నప్రుడమికి ఊరట కల్పించుటకై వెన్నెలవలె నడుమ నున్న దని యుత్ప్రేక్షింపఁబడినది. అనఁగా ఉపమాన మయినవెన్నెలధర్మములు (తెలుపు,

* చంద్రలోకము 29

చలువ, వ్యాప్తి మున్నగునవి) ఉపమేయ మయినతూలమునం దుండుటచేత ఉప మానముయొక్క తాదాత్మ్య ముపమేయమునకు వచింపఁబడినది. సూర్యకాంతిని కూడ నిరోధింపఁజాలినంత తూలము శాల్మలీతరువులనుండి వెలువడు చున్న దని సూచితము. అందులకే సమూహార్థక 'వార'శబ్ద ముపయుక్తము. ఇది స్వరూపోత్ప్రేక్ష కుదాహరణము. ఇందుమూలమున అతిశయోక్త్యలంకారము ధ్వని మార్గమున వ్యక్తము.

౩. ఉదాత్తము : సమృద్ధిని వర్ణించుట గాని, మహాపురుషశ్లాఘ్యచరితము వర్ణ్యమున కుపలక్షణము(అంగము) గా వర్ణించుట గాని ఉదాత్తాలంకారము.(1)

కం. సకియలు సాహో! యనఁగా
నకలంక శశాంకమణిగణాంతఃప్రతిబిం
బకళాకలనాద్విగుణిత
సకలానురాగవార మౌ హజారముఁ జేరెన్. (2-7)

హజారముకుడ్యములు అకలంకశశాంకమణిగణఖచితములు. అందు ప్రవేశించినాఁడు ఋతధ్వజుఁడు. వెంట నున్నపరివారము మణిగణములయందు ప్రతిబింబించి రెట్టింపును కలిగించు చున్నది. సమృద్ధి యిట వర్ణింపఁబడెను. గనుక ఉదాత్తము.

౪. అర్థాంతరన్యాసము : సామాన్యముచేత విశేషము గాని విశేషముచేత సామాన్యము గాని సమర్థింపఁబడుట.(2)

కం. నళినాప్తువలన మండల
కలితుఁడ వై వెలయుచెల్లఁ గలిగినకరణిం
దలఁతువె? శంబరహారికిఁ
గలదే యుపకార మెందుఁ గమలకులారీ? (4-22)

---

(1) చంద్రాలోకము-115

(2) ,, 68.

జవివఁ, దదార్ద్రిబంధురవిశాలజట ల్దర జీరుకాడ వె
న్కానిచెవి ఓక్కరించి యుఱుకుం బొడకట్టిన పిల్ల దాఁటుచున్.
(2-65)

మృగజాతిస్వభావ మిందు చారుతరముగ వర్ణింపఁబడుటను బట్టి యిచట స్వభావోక్తి. మునులవెంట నవి నదులకు కూడ వెళ్లుననుటచే వారితపఃపరాకాష్ఠత సూచితము. అందుకే మునులు అనక 'మునివరులు' అనుట జరిగినది.

ఇంకను రూపకము(3–123), ఏకదేశివివర్తిరూపకము(3-126), కైముత్యము(3-150), తద్గుణము(2-27), కావ్యలింగానుప్రాణితో త్ప్రేక్ష (1-100), శ్లేషానుప్రాణితకైతవాపహ్నుతి (1-71). రూపక మంగము గా కలిగినయుత్ప్రేక్ష(4-11) మున్నగునర్థాలంకారము లెన్నియో కలవు. ఇఁక రెండు మూఁడు శబ్దాలంకృతులను కూడ చూడ నగును.

అ. ఛేకానుప్రాసము : అవ్యవధానము గా రెండేసి హల్లులజంటలను అనేక పర్యాయములు వచించుట చేకానుప్రాసము.(1)

శా. శ్రీరాధాధరబింబసంభృతసుధాబృందాతిమాధుర్యగా
ఖారీతుల్ ప్రకటించులీల మురళీధారేయుఁ డై, గీతసం
చారంబుల్ వెలయించుకృష్ణుఁడు దయాసర్వస్వతాగౌరవం
బూరన్ సౌరము నారనాధిపుఁ జిరాయుఃశ్రీయుతుం జేయుతన్

అని కావ్యప్రారంభపద్యము. ఊరన్ సౌరము, ఆయుఃశ్రీయుతున్ అనుచో ఛేకానుప్రాసము. ఇందు స్వరసాదృశ్యనియమ మానుషంగికము.

ఆ. వృత్త్యనుప్రాసము : ఒకేవర్ణమును గాని లేక రెండుమూఁడువర్ణములను గాని అనేకపర్యాయము లావృత్తి చేయుట.(2)

---

(1) ప్రతాపరుద్రీయము, శబ్దాలంకారప్రకరణము-1
(2) ,, ,, ,, -3

వ. మెండియుఁ దాండవఖేలనోద్దండఖండపరశుజటామండలాగ్రహీండమానస్పందరీకగంగాడిండీరపాండరాఖండరుచికాండకీర్తిని స్తంద్రచంద్రికా చక్రీకృతదుర్వక్రగర్వవిక్రమపరిపంథిరాజన్యసైన్యుండును ............" (1-17)

ఇందు బిందుపూర్వకడకారము పెక్కుసారు లావృత్తి చేయఁబడినది కనుక వృత్త్యనుప్రాసము. శ్రుతిమాధుర్యమును లయవిన్యాసమును నిలుపుటకై ఆంధ్రప్రబంధకర్త లందఱు దాదాపు సుదీర్ఘవచనముల నన్నింటిని వృత్త్యనుప్రాసవిలాసభాసురములు గానే వివరించిరి. రెండువర్ణము లావృత్తి యగుటకు తనకావ్యస్వరూపమును వివరించినపద్యము(1-12) ఉదాహరణీయము.

౧౦. ముక్తపదగ్రస్తము : విడిచినపదములను మరల కైకొనుట.

మ. మృదువాణీసుమచాప! చాపలపలాయిద్వేషిరాజన్యకా
న్వదితాశాంచలభాగ! భాగవతసంపన్నిత్యపూజాలస
త్సదనాధిష్ఠితవిత్త! విత్తమనుతస్వచ్ఛకీర్తిచ్ఛవి
చ్ఛిదురేందుద్యుతికాండఖండదతినాసీరైకభేరీరవా! (1-106)

ఇంకను యమకము(3-154) మొదలగుశబ్దాలంకారములు గలవు. నాచన సోములవలె నారాయణ యించుమించు ప్రతిపద్యమున శబ్దాలంకారమును కూర్చి నాఁడు శబ్దాలంకారములు రామాయణ మార్కండేయపురాణములందును కలవు.*
మొత్తమునకు చిననారాయణయలంకారము లతనికృతికన్య కలంకారములే!

"కావ్యం కల్పాన్తరస్థాయి జాయతే సదలఙ్కృతి"
— మహాకవి దండి

---

* అ) యౌవనోన్మత్తనయనాః సర్వాః సర్వాఙ్గశోభనాః। రామాయణము, బాల 9-17
ఆ) ఆరిరాధయిషుర్దేవ మనంగాంగహరం హరమ్। మార్కండేయపురాణము 21-59.

# వర్ణనలు

ఉన్నత మయినసౌధముయొక్క సౌందర్యమును విద్యుద్దీపపంక్తు లెట్లు స్పష్టముగ చూపు చుండునో అట్లే కావ్య మనెడిసౌధముయొక్క సౌందర్యమును వర్ణనలు స్పష్టముగ చూపు చుండును. వర్ణనావిషయములోనే కవిప్రతిభ సువ్యక్త మగును. కనుకనే "లోకోత్తరవర్ణనానిపుణకవికర్మ కావ్యమ్" అనినా రాలంకారి కులు. ఈలోకోత్తరవర్ణనానైపుణ్యము ప్రతిభావికాసద్యోతకము.

లాక్షణికకవి దండ్యాచార్యులు పదునెనిమిదివర్ణనములతో కృతినిర్మాణము జరగవలయు ననెను.[1] ఆదిప్రబంధకర్త యయిననన్నెచోడరాజకవియు ఆచార్య దండివలె అష్టాదశవర్ణనములే సూచించెను.[2] అనంతరవిపులవాఙ్మయమును పరిశీలించినయప్పకవి "ఇరువదిరెండువర్ణనములు కూర్చి చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస." అని వ్రాసెను.[3] కాని కొన్నికావ్యములందు లాక్షణికులు చెప్పనినూతనవర్ణనములు కూడ కన్పించు చున్నవి.

ఈవర్ణనము లన్నియు తప్పనిసరిగ ప్రతికావ్యమునందును ఉండవలసిన నియమము లేదు. కొన్నింట కొన్నితగ్గినను కావ్యత్వమునకు న్యూనత్వము రాదు. కావలె నని ప్రతివర్ణనమును కృతియందు చొనిపినయెడల కథకు పంగుత్వము దాపురించును. మనప్రబంధమండలిలోనివర్ణనములు భంగ్యంతరముగ తుల్యములే కనుక ఈకృతిలోనివర్ణనల కన్నింటికి లక్ష్యములు ప్రదర్శింపవలసినపని లేదు. అందువలన చమత్కారావహమై, కవిప్రతిభాస్ఫోరకము లగునాలుగయిదువర్ణనలు లక్ష్యపురస్సరముగ చర్చింపఁబడి, తక్కినవర్ణన లున్నసందర్భములు సూచింపఁబడును.

---

[1] కావ్యాదర్శము. - 1-16,17.

[2] కుమారసంభవము, 1-44.

[3] అప్పకవీయము, 1-28.

౧. పురవర్ణన : అయోధ్యాపురవర్ణనతో కథాప్రారంభము కావింపఁబడినది. ఇరువదిపద్యములలో సుదీర్ఘముగ సాగినయీవర్ణనలో పురము(1-69,70,71), కోట(72), అగడ్త[73-76], సౌధములు[77-80], చతుర్వర్ణములు[81], గంధకరులు[82], హయములు(83), రథములు[84], సైరంధ్రులు[85], వేశ్యలు[86,87], మందమారుతము[88] చెప్పఁబడెను. ఇందు సౌధవర్ణనమునకు చెందినయొకపద్యము ---

తే. రవిరథతురంగములు నిబ్బరముగ వచ్చి
హర్మ్యముల నిల్చి వేసవి నచటిముద్దు
గుమ్మ లచ్చపుఁజిమ్మనగ్రోవినీట
మురుఁగుఁ గడుగఁ బడిశ్రాంతి బొఱఁగి యరుగు. (1-80)

అతిశయోక్తిమూలమున హర్మ్యములయౌన్నత్యము సూచితము. అచ్చపునీట చిమ్మనగ్రోవియాట మేడలమీఁద కూడ నాడుట కవికాలపుముచ్చట యనవలయును.

౨. రాజవర్ణన : పురవర్ణన మయినతోడనే ఋతధ్వజనాయకవర్ణన అయిదు పద్యములయందు (89-93) చేయఁబడినది.

3. ఋతువర్ణనము : నాయకవర్ణన మయినతోడనే గ్రీష్మర్తువర్ణన పదునొకండుపద్యములందు (94-104)చేయఁబడి ప్రథమాశ్వాసము ముగింపఁబడినది. ఇం దొకపద్యము_

చ. మిటమిట యెండ వేఁడిబలిమిం దెలిదమ్ములతేకుసందులం
జటుకు మనంగ నోడి నివసించి తదగ్రమరంద మప్పటి
ప్పటికిని మూతిముట్టెపయిఁ బైఁ బడి, చల్లఁబడంగఁ బ్రొద్దుకుం
కుటఁ గని యంతట న్వెడలుఁ గోడెమిటారపుఁదేటు లత్తఱిన్. (1-97)

చల్లఁబడిన స్వాతేజుఁ డగుటచే సాయంసమయము నెఱింగి తామరతేకుల సందులనుండి తుమ్మెదలు వెలువడి వచ్చుచున్న వనుట చమత్కారసారము. కవికిఁ గల ప్రకృతిపరిశీలనాశక్తి కిది నిదర్శన మనఁ దగినది. వసంతఋతు వర్ణన పంద్రెండుపద్యములలో (3-87 నుండి 98 దాఁక) కలదు.

౪. ఆశ్రమ వర్ణన: ఋతధ్వజుఁడు గాలవమునియాశ్రమరక్షణము చేయుటకై వచ్చెను. అచట నతనికి సచివుఁ డామునిసీమను ఎనిమిదిపద్యములందు (2-62 నుండి 69వఱకు) వర్ణించి చెప్పెను. ఇందుండి యొకపద్యము—

కం. వేలిమియగ్గిపొగ ల్దగు,
వేలుపుడిగియ మునింగి వెలువడునమరీ
జాలముతిన్ననిపెన్నెఱి
వాలుఁగురుల కగరుధూపవెఖరి యగుచున్. (2-68

స్నానానంతరముయువతులు శిరోజముల కగరుధూపమును పట్టించుకొనుట ప్రసాధనమునం దొకప్రక్రియ. ఇచటిహోమాగ్నిధూమముచే వేలుపువిగ్గియలతో తానమాడి చేచినయమరస్త్రీలకురుల కగరుధూపము లయిన వనుట (సంబంధ) అతిశయోక్తి, దీనిమూలమున నెడతెగని హోమకార్యము లాశ్రమమునందు జరగుచున్న వని ధ్వని.

౫. యుద్ధవర్ణన: కువలయాశ్వపాతాళకేతులయుద్ధము సుమారు నలువది పద్యములందు (2-131 నుండి 3-14 దాఁక) వర్ణింపఁబడినది. ద్వితీయాశ్వాసాంతమున గ్రంథపాతము గలదు.

౬. నాయిక వర్ణన: పాతాళకేతువును భంజించినపిదప కువలయాశ్వుఁడు మదాలసను చూచును. ఆమెసొగసు నతఁ డాఱుపద్యములందు (3-27 నుండి 32 దాఁక) భావించుకొనును.

కం. నెమ్మికదా! నడ, తుమ్మెద
బొమ్మి కదా! పెడఁగుఁగురులు, రొలుకరిమించుం
గమ్మి కదా! మెయి, మరుదో
డుమ్మి కదా! తగినచూపు రొయ్యాలికి ఛీ ! (3-29)

అచ్చతెనుఁగున సాగినయీపద్యము ముప్పదిగోపుర నామోహాగమును వర్ణ యిప్పుడిద్దము వంటిది. ఏకొంచెము ప్రబంధమున సొగసువానము అతిలాఘవపదలాలసము యూహించుట కీను వియుట వినఁబడును.

౭. విరహాలంభనవర్ణన : మహాలసాపిరహవర్ణన ఆఱుపద్యములలో (3-79 నుండి 84దాఁక) కలదు. మఱియు వనవిహారానంతరము మదనమంత్రాద్యు పాలంభనములు పెక్కు పద్యములలో వర్ణింపఁబడెను.

౮. ఉద్యానవర్ణన : మదాసల చెలికత్తెంతో వనవిహారము గావించి పుష్పా పచయము చేసినసందర్భమున ఈ వర్ణన పదిపద్యములలో (3–119నుండి 128వఱకు) కన్పడును.

౯. సరోవరవర్ణన : పైసందర్భమునందే యీవర్ణన ఒకపద్యమునందును (3–131) ఒకవచనమునందును (3–132)కలదు. ఈవచనము సుదీర్ఘతరము

౧౦. జలకేళివర్ణన : పైసందర్భములోనే యీవర్ణన పదునొకండుపద్యము లలో (3-134 నుండి 144వఱకు) సాగినది. ఈ సందర్భమునుండి యొక పద్యము—

చ. చెలువ యొకర్తు క్రొందళుకుఁజెంబొవ బిట్టెగురంగవైవ, న
య్యలరు తదంఘ్రిచెం బడుట యద్భుత మయ్యె మదీయపద్మరే
ఖలఁ జెలరేఁగఁగాసి యిడఁగాఁ దగునే? యని యేగుదెంచి చే
తులపయి వ్రాలి వేఁడికొనుతోయజబాంధవబింబమో యనన్. (3—138)

ఎఱ్ఱగలువను సూర్యబింబముగ నుత్ప్రేక్షించుట యిందలి విశేషము. పద్మము సూర్యుని ప్రియురాలు గనుక పద్మములకు కలుగుకీడును తెలుపుటకు వచ్చుసూర్యునిగా పద్మమునే ఉత్ప్రేక్షించుట తగ దని తలఁచి చెంగావను గ్రహించిన ట్లున్నాఁడు కవి. జలకేళిలో తామరలను త్రుంచి విసరుకొన కుందురా? పీరాటలో తామరలను త్రుంచుట వసుచరిత్రమునందు (3_161,163 పద్యము లందు) కాననగును.

ఇట్లే సాయంసంధ్య (4_5నుండి 11వఱకు), తిమిరపటలము (4_12), నక్షత్రోదయము (4-13), చంద్రోదయము (4_14నుండి 17 దాఁక), విమాన గమనము (4-92), మేరుగిరి (4_92), నాగపురవిభవము (4-130 నుండి 133 దాఁక), కుక్కుటయుద్ధము (4_207 నుండి 211దాఁక), తారానలకూబరసురతము (4-29,30,31), రంభావిరహము (4-37,38,39), మంగళస్నానాదికము [5-88నుండి 94వఱకు], నాయికానాయక కల్యాణమహోత్సవము [5-97నుండి 101 వఱకు), కేళీగృహము [5-103], ధర్మయుతనాయికానాయక సంభోగ శృంగారము [5-109,110] ఈకావ్యమునందు సహృదయానందకరముగ వర్ణింపఁబడినవి. ప్రతివర్ణనలోను ఏదోఒకచమత్కారము చూపుటకు కవి ప్రయత్నించి యున్నాఁడు. దౌహృదసుతోదయాదివర్ణనలు రెండుమూఁడు తగ్గినను ఈ కథకు కావలసినంతవఱకు నిండుగనే యున్నవి. కథనుబట్టి కావలసినవర్ణనలు కైకొనుట ఉత్తమపద్ధతి గదా!

శ్లో. ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా మతా।
తదనుప్రాణనా జ్జీవే ద్వర్ణనానిపుణః కవిః॥

— భామహుఁడు

# రీతులు

ఓజఃప్రసాదాదిగుణసహితము అయినపదములకూర్పు రీతి[1]. ఇది వైదర్భి, పాంచాలి, గౌడీయ, ఆవంతిక, లాటీయ, మాగధి - అని ఆఱురీతులు భోజదేవునిచే పేర్కొనబడినవి[2].ఇట్లు దేశనామములతో రీతులను పేర్కొనఁ దలఁచినచో నివి యలంకారములవలె పెరిఁగిపోవును. అందుకని వైదర్భీగౌడీ పాంచాలు లనుమూఁడిటిలోనే తక్కినవానిని కూడ సంగ్రహించి ఆధునికులు ఈమూఁడురీతులనే ప్రసిద్ధములు గా భావించి గ్రహించుట జరిగినది. కనుక నీరీతిత్రయమే యిచట పరామర్శింపఁబడుచున్నది.

౧. వైదర్భి : బంధపారుష్యము లేక, శబ్దకాఠిన్యము లేక, నాతిదీర్ఘసమాసముల కూర్పు కలిగినది వైదర్భీరీతి.[3]

చ. దళములచాలు, మిద్దియలతండము మేలు, విచిత్రపత్రముల్
చెలఁగెడితీఱు, నీరములు చెందినసౌరును గాక రాజురా
కల విలసిల్లు నంచుఁ బురకంజముఁ జేరె రమావధూటి, త
జ్జలజగృహంబులం దళిమిషంబున లక్కను ముద్ర వెట్టుచున్. [1-71]

ఇఁదు బంధపారుష్యము, శబ్దకాఠిన్యము లేవు. సమాసములు దైర్ఘ్యము లేనివి. 'రమావధూటి' అనుచోట మహాప్రాణము [ధూ] స్త్రీపర్యాయవాచకము నందలిది కనుక వైదర్భీరీతికి దోషము నాపాదింపఁజాలదు.

౨. గౌడి : ఓజఃకాంతిగుణములతో కూడినది గౌడీరీతి[4]. అనఁగా దీర్ఘసమాసములు, ఉద్భటపదములు కలిగినది.

---

1. రీతి ర్నామ గుణాశ్లిష్టపదసంఘటనా మతా। ప్రతాపరుద్రీయము, కావ్య.పుట44
2. సరస్వతీకంఠాభరణము, 2-28.
3. ప్రతాపరుద్రీయము, కావ్యప్రకరణము-27శ్లో.
4. ఓజఃకాన్తిగుణోపేతా గౌడీయా రీతి రిష్యతే। ప్రతాప. కావ్య. పుట 45.

చ. అలిగిన క్రౌంచపక్కిజనవరా లదలించుచుఁ గాలఁ దన్నినం
బులకలు దాల్చుచందురునిపొంకము వ్రాసి,వసంతు,మత్తకో
కిలములఁ,దేఁటులం,జిలుకగేస్తులఁ,దెమ్మెరయాకతాయలన్
విలిపి యపుర్బి,తెచ్చినవనీకుసుమంబులు కుప్ప వోయుచున్. (3-147)

ఇట చిత్రపటగతచంద్రశృంగారముమూలము గా నాయికా శృంగారాతి శయము వ్యంగ్యమార్గమున సూచింపఁబడు చున్నది. శృంగారము కోమలరసము కనుక కైశికీవృత్తి కైకొనఁబడినది. పైపద్యమున మహాప్రాణాక్షర మొక్కటి కూడ లేకుండుట గమనింపఁదగినసంగతి.

౨. ఆరభటి : మిక్కిలి యుద్ధత మయినయర్థ(రస)మును వరించుట ఆరభటి(1). రౌద్రబీభత్సము లత్యుద్ధతములు(2).

సీ. ప్రేగుల మీఁదఁ గన్పించి నవ్వెడుతలల్
తూఁడులు గలతమ్మితుటుముఁ దెగడెఁ,
గెంపుటుంగరపుడా ల్గీల్కొన్నబాహువుల్
ఫణమణు ల్గలయహిప్రభులఁ దెగడెఁ,
బలుబుజముదాడిపోటుల మించువక్షముల్
నెఱియ లానినభూమినీటుఁ దెగడె
ప్రేటులరక్తము ల్వెడలించుతొడలు కుం
కుమనీటిచిమ్మనగ్రోవిఁ దెగడె
గీ. దనుజమనుజేంద్రసైన్యముల్ దైన్య మెడలి
కయ్య మొనరింప సంగరాంగణము చూచు
దివిజవర్యులు మొగములు ద్రిప్పికొనఁగ
నప్పు డమ్మక్క! యనిపించె నద్భుతముగ(3) (2-148)

---

1. అత్యుద్ధతార్థసందర్భా వృత్తి రారభటీ స్మృతా। ప్రతాప. కావ్య. 15శ్లో.
2. అత్యుద్ధతరసౌ రౌద్రబీభత్సౌ పరికీర్తితౌ। ,, ,, 17.
3. 'అమృతముగ' అని (ఆం.సా.ప.) ముద్రితప్రతిపాఠము.

ఇట రణనిహతు లయినదనుజమనుజవీరులశరీరఖండములు బీభత్స రసద్యోతకములు. కనుక నిట వృత్తి ఆరభటి.

3. భారతి: కొంచెపాటిమృద్వర్థమును వర్ణించుట భారతీవృత్తి(1). హాస్యశాంతములు కించిత్సుకుమారములు(2).

ఉ. కంటెఁ దగిల్చినట్టికొనగ్గినచందురుఁగావిజాళువా
జంటపయంటపై నిగిడి, చక్కనిజక్కవనిక్కుచొక్కపుం
జంట వెలంగుబంగరుపుచాయలు దూచి యనంగఁజాళువా
ల్గంటిమెఱుంగుఁజూపులు దళా రన వచ్చె మహాద్భుతంబుగన్. [2-92]

ఇది పాతాళకేతుదూతునిమాయావిశేషమునకు సంబంధించినది కావున అద్భుతరసావహము. కాఁబట్టి యచట భారతీవృత్తి. అద్భుతశృంగారముల కిచట సాంకర్య మూహ్యము.

4. సాత్త్వతి: కొంచెపాటిప్రౌఢార్థమును వర్ణించుట సాత్త్వతి(3). వీరభయానకములు ఈషత్ప్రౌఢములు(4).

చ. నిగళము లూడ్వ నెత్తి కరిణీపతి చేరినఁ దేజిపావడన్
మొగమునఁ గప్పి నూకి యొకమొక్కలపున్ నెఱరౌతు కుంభముల్
పగులగ నేసినన్ వెడలెఁ బట్టమువెంటనె మౌక్తికావళుల్
మగఁటిమి మెచ్చి చేరి జయలక్ష్మి సుమాంజలి యిచ్చుకైవడిన్. [2-141]

తేజిపావడ తీసి యేనుఁగుమొగమున కప్పి కుంభతలమును పగులఁ గొట్టుటలో నుత్సాహాతిశయము పరిస్ఫుష్టమై వీరము వ్యంజితమగుచున్నది.

---

1. ఈషన్మృద్వర్థసన్దర్భా భారతీవృత్తి రిష్యతే। ప్రతాప. కావ్య.. 16శ్లో.
2. హాస్యశాన్తాద్భుతాః కించిత్సుకుమారాః ప్రకీర్తితాః। ,, ,, 18శ్లో.
3. ఈషత్ప్రౌఢార్థసందర్భా సాత్త్వతీవృత్తి రిష్యతే। ,, ,, 16శ్లో.
4. ఈషత్ప్రౌఢౌ సమాఖ్యాతౌ రసౌ వీరభయానకౌ। ,, ,, 18శ్లో.

ఉత్సాహాతిశయమును 'నెఱరౌతు' లోని'నెఱ'కూడ బలపఱచుచున్నదనవచ్చును. మీఁది యుత్ప్రేక్ష వీరశృంగారముల సమ్మేళనమునకు సూచన.

## పాకములు

అర్థగాంభీర్యము పాక మని విద్యానాధునినిర్వచనము(1). అర్థగాంభీర్య మనఁగాశృంగారాదులయొక్క ఆస్వాద్యమానతావిశేష మనిసోమపీథివాఖ్య తెలుపు చున్నది(2). అనఁగా రసాభివ్యక్తి కనుగుణము లయినశబ్దార్థములను నిబద్ధించుట పాక మని భావము. రాజశేఖరునిమతమున పిచుమంద, బదర, మృద్వీకా, వార్తాక, తింత్రిణీ, సహకార, క్రముక, త్రిపుష, నారికేళములనితొమ్మిదిపాకములుగలవు(3). మనము భుజించుపదార్థములపేర్లన్నిటితో కావ్యపాకములను వ్యవహరించినచో వీని కంతుపొంతు ఉండ దని తలంచినవిమర్శకులు ద్రాక్షానారికేళకదళీ పాకములను మాత్రము స్వీకరించిరి. కనుక ఈమూఁడుపాకములకే యీకృతి నుండి యుదాహరణములు చూపి సమన్వయించుటకు ప్రయత్నము జరుగుచున్నది.

౧. ద్రాక్షాపాకము: వెలుపల, లోపలఁ గూడ రసము విలసిల్లుట ద్రాక్షాపాకము(4). అనగా రసాభివ్యక్తికి చెందినయర్థము గూఢముగా నుండక చదివిన తోడనే బోధపడవలయు ననుట.

ఉ. అయ్యయొ'మాకు దండ మిడినంతఫలంబు నరేంద్రచంద్ర! యీ
  దయ్యముతోడిజాగరము దాటఁగఁజేసి శుభమ్ము లిమ్ము లే
  వయ్య! కొమాళ్లతండ్రి వయి యాశ్రితరక్షణదుష్టశిక్షణా
  శయ్యదయాపరాక్రమవిశాలుఁడ వై మను మయ్య! యిమ్మహిన్. (2-79)

---

1. "అర్థగమ్భీరిమా పాకః" ప్రతాప. కావ్య. 36శ్లో.
2. అర్థస్య శృంగారాదేః గమ్భీరిమా ఆస్వాద్యమానతావిశేషః(ఇతిషష్ఠీసమాసః)
3. కావ్యాలంకారసంగ్రహము(సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి వివరణముతో) పుట 184.
4. ద్రాక్షాపాకః స కథితో బహిరన్తఃస్ఫురద్రసః। ప్రతాప.కావ్య.పుట48.

ఇందలియర్థము చదివినతోడనే బోధపడు చున్నది కావున ద్రాక్షాపాకము నకు చెందినరచన మిం దున్నది.మాకు దండమిడినంతఫలంబు అనుజాతీయము. కొమా శ్లరంద్రి వయి-అనుపలుకుబడియు నర్థస్ఫూర్తికి దోహదకారులే!

౨ నారికేళపాకము : అంతర్గూఢరసోదయము నారికేళపాకము(1). అనఁగా చదివినవెంటనే అర్థము బోధపడక,గూఢముగా నుండి మరలమరల చదువవల సినయవసర మేర్పడునట్లు పద్యనిర్మాణము గావించుట.

చ. ఇటువలెఁ జూచుచుఁ జనునరేశకుశేశయబాణుఁ జూడ్కి న
న్నిట మగిడించె,భోగిపరిణీతరుణీఫణధోరణీనవా
ఘటితమణీగణీభవదకంపఘృణీతవియత్ప్రశంగమో
త్కటఝురిణీసరోజమణికారి నమేరువనీరమారుచుల్(2). (4-133)

శబ్దాలంకారమును గమనించుచు,వ్యాకరణవిశేషములను సాధించుచు, క్రమాన్వయమును కూర్చుచు తిరిగితిరిగి చదివి అర్థమును గ్రహింపవలసినపద్య మిది. కనుక దీనిలోనిపాకము నారికేళము.

3 కదళీపాకము : కొంచెపాటిప్రయత్నమువలన నర్థము గోచరించిన కదళీ పాకము(3).

చ. అచటివియోగిభోగిజలజాక్షులు మారుని వ్రాసి కొల్చుచో
నచలితభక్తిఁ,జందురునియంద మెఱుంగమి మున్ వసుంధరా
రుచిఁ గరుణావలోకులు వరుల్ "చెలి!నీమొక మబ్జువంటి"దన్
వచనము లంతలోఁ దలఁచి వ్రాయుదు రున్మకురాగ్రవీక్షలై
(4-130)

1. స నారికేలపాకః స్యా దన్తర్గూఢరసోదయః।ప్రతాప.కావ్య.38శ్లో.

2. 'రమారుతుల్'అనిఆం,సా.అ.ముద్రితప్రతిపాఠము.

3. కావ్యాలంకారసంగ్రహము, పుట177.

ఇందు నాగినీమణులతో వారిప్రియులు పలికినపలుకులు కొంతప్రయత్నము చేత గ్రహించి,నాగస్త్రీలవదనములకు చంద్రునితోడిసామ్యమును సంపాదింప వలసి యున్నది కనుక నిచట కదళీపాకము.

## గుణములు

కావ్యశోభాయాః కర్తారో గుణాః (కావ్యమునకు శోభను కలిగించునవి గుణములు) అని వామనాచార్యునివక్కాణ. ఒడలిమీఁదినగల కన్న హృదయ మందలిగుణములే పిన లయినఆభరణము లయినట్లు, కావ్యశరీరమున కెన్ని యలంకారము లున్నను వానిసొగసు నినుమడింపఁజేయునవి గుణములే! ఉదారత, శ్లేషము, సుకుమారత, ప్రసాదము, మాధుర్యము, సమత, అర్థవ్యక్తి, ఓజస్సు, సమాధి, కాంతి—అని కావ్యగుణములు పదిరకములు(1). కాని భామహానందవర్ధనమమ్మటజగన్నాథాదు లీగుణగణమును మాధుర్యౌజః, ప్రసాదముల యందే అంతర్భవింపఁజేసినారు(2). భోజదేవునిమతమున నివి యిరువది నాలుగు(3). ప్రస్తుత మిచట మాధుర్య, ఓజః ప్రసాదముల కుదాహరణములు చూపఁబడుచున్నవి.

౧. మాధుర్యము : విడివిడిపదములతోడిరచనము మాధుర్యము(4).

చ. చిలుకలలోనఁ జిల్క లయి, చెల్వపుఁటంచలలోన నంచ లై,
తెలివిపొసంగుతీవియలఁ దీవియ లై, సరసంపుఁబల్కులన్
గులుకునడల్, పసిండితళుకుల్ గలమేనులు గానుపింపఁ జే
తులకసి వోవఁ దేనియలతో ననతోయము లెల్ల గిల్లుచున్. (4-141)

1. కావ్యాలంకారచూడామణి, 4-79.
2. భామహానికావ్యాలంకారము, 2-1,2.
3. సరస్వతీకంఠాభరణము, 1-62, 63, 64, 65.
4. యా పృథక్పదతావాక్యే తన్మాధుర్యం ప్రకీర్త్యతే। ప్రతాప. గుణప్రకరణము-8.

ఇందు పదజాలము విడివిడిగ నుండి చదువుటతోడనే హాయి నొసఁగు చుండెను గావున నిది మాధుర్యము.

౨. ఓజస్సు : సమాసభూయిష్ఠ మగురచన మోజస్సు(1).

సీ. అధిపభృత్యపరస్పరాన్వేషణాకార
ణప్రతివక్తృతన్నామకార్య,
మనునుగతస్వామిహయవేగభూరుహ
చ్ఛాయాసమాశ్రితచ్ఛాత్రకంబు,

ధావనాయాసాత్మజీవనవృత్తిధి
గ్వాచకాందోళికావహజనంబు,
సమ్మర్దబహుళాదిసరణికోభయపార్శ్వ
చారితవారణాధోరణంబు,

గీ. సరయసరదుష్టనిష్పతజ్జరఠధూర్త
గణ్యగాణిక్యసంభవత్కమనహాస్య
వారణక్షమతత్సూతక్రూరదృష్టి
సంవృతాశంబు సైన్య ముచ్చటికి వచ్చె. (2-84)

సీసమున నొక్కొక్కపాద మొక్కొక్కదీర్ఘసమాసముగను, క్రింది గీతిలో మూఁడున్నరపాదము లొకేదీర్ఘసమాసముగను కూర్పఁబడుటవలన నిది ఓజోగుణరచనము. కడపటిరెండుమాటలే తెనుఁగులు.

3 ప్రసాదము : ప్రసిద్ధార్థపదములతోడిరచనము ప్రసాదము(2). అనఁగా అర్థమును సుళువుగా బోధింపఁజాలినప్రసిద్ధపదములను కూర్పవలె ననుట.

---

1. ఓజః సమాసభూయస్త్వమ్। ప్రతాప. గుణప్రకరణము-17.

2 ప్రసద్ధార్థపదత్వం యత్ స ప్రసాదో నిగద్యతే। ప్రతాప. గుణ. 5.

సీ. అన్నియుఁ దెలిసినవన్నెలాఁడికి నీకుఁ
దెలిపెడి దే మమ్మ! కలువకంటి!
వినవమ్మ! మగవానిమనసు చూడఁగఁ గంచుఁ
బదనువంటిది సుమీ! పద్మగంధి!
యిన్నాళ్ళవలెఁ దోడియింతులతోడియా
టలు గావు గద!యిది తలిరుఁబోఁడి!
యిఁకఁ బతిమన మెట్టు లెనయించెదో!నేఁడు
నీనేర్పు చూతము నీరజాక్షి!

గీ. యిక్కడనె యింతసిగ్గైన హృదయనాథు
నెట్లు గరఁగింప నేర్చెదే? యిందువదన!
భావ మెఱిఁగినజాణవు గావె? సమయ
మెఱిఁగి తఱితీప్ప సేయుమీ! యిగురుఁబోఁణి! (౫—౧౦౯)

ఇందలిపదము లన్నియు ప్రసిద్ధములు. అర్థములు సులభగ్రాహ్యములు. విశేషించి యాఁడువారివచోవైఖరికిఁ దగినరీతిని సంభాషణములు కూర్చుట, అకూర్పున కను వయినతెనుఁగునుడులు, నుడికారములు ప్రయోగించుట లిచటి ప్రసాదగుణమును ప్రస్ఫుటపఱచు చున్నవి.

ఈగుణములు రసధర్మములు. గుణములు, రసములు చంద్రచంద్రికలవలె నవినాభావసంబంధము కలిగినట్టివి. అనఁగా రసములకడ గుణములు, గుణముల కడ రసములు నుండును. ఆనందవర్ధనాభినవగుప్తమమ్మటపండితరాజాదిసు ప్రసిద్ధాలంకారికులంద ఱంగీకరించినసిద్ధాంత మిది. ఈకావ్యమునందలి రీతి వృత్తిపాకగుణాదు లన్నియును లక్షణానుగుణములై అంగాంగిరసపరిపోషణ మునకు సహకరించుచు కవిజాగరూకతను వేనోళ్ల చాటి చెప్పు చున్నవి.

సీ. పొసఁగ ముత్తెపుసరుల్ పోహళించినలీలఁ
దమలోన దొరయుశబ్దములు గూర్చి,
యర్థంబు వాచ్యలక్ష్యవ్యంగ్యభేదంబు
లెఱిఁగి నిర్దోషత నెసఁగఁజేసి,
రసభావములకు నర్హంబుగ వైదర్భి
మొదలైనరీతు లిమ్ముగ నమర్చి,
రీతుల కుచితంబులై తనరారెడు
ప్రాణంబు లింపుగాఁ బాదుకొల్పి,

తే. యమర నుపమాదులును, యమకాదులు నగు
నట్టియర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవితఁ జెప్పంగ నేర్చుసత్కవివరునకు
వాంఛితార్థంబు లొసఁగనివారు గలరె?

—పింగళి సూరన

# పంచమదశమము - ఛందస్సౌందర్యము

శ్లో॥ శిక్షా వ్యాకరణం ఛందో నిరుక్తం జ్యోతిషం తథా ।
కల్ప శ్చేతి షడఙ్గాని వేద స్యాహు ర్మనీషిణః ॥ (1)

అనుటనుబట్టి వేదాంగము లాఱింటిలో ఛందస్సు కూడ నొకటి యని తెలియుచున్నది. 'ఛందః పాదౌ తు వేదస్య' అని వేదమూర్తికి పాదస్థానముగా ఛందస్సు చెప్పఁబడినది(2). ఈదశమున ముందుగా నీకువలయాశ్వచరిత్రము నందలిపద్యవైవిధ్య బాహ్యస్వరూపము పట్టికాఘట్టితము చేసి చూపఁబడు చున్నది-

| ఛందము | ప్రథమాశ్వాసము | ద్వితీయ | తృతీయ | చతుర్థ | పంచమ | మొత్తము |
|---|---|---|---|---|---|---|
| ౧. శార్దూలవిక్రీడితము | 6 | 2 | 3 | 6 | 3 | 20 |
| ౨. సీసము | 32 | 40 | 22 | 39 | 19 | 152 |
| ౩. చంపకమాలిక | 13 | 34 | 30 | 40 | 13 | 130 |
| ౪. మత్తేభవిక్రీడితము | 8 | 5 | 13 | 6 | 7 | 39 |
| ౫. కందము | 26 | 40 | 56 | 57 | 32 | 211 |
| ౬. వచనము | 6 | 4 | 3 | 3 | 6 | 22 |
| ౭ తేటగీతి | 12 | 19 | 26 | 45 | 22 | 124 |
| ౮. ఉత్పలమాల | 4 | 8 | 12 | 23 | 13 | 60 |
| ౯. మత్తకోకిల | 1 | 0 | 0 | 0 | 0 | 1 |
| ౧౦. లయగ్రాహి | 0 | 1 | 0 | 0 | 0 | 1 |
| ౧౧. మహాస్రగ్ధర | 0 | 1 | 0 | 0 | 0 | 1 |
| ౧౨. మాలిని | 0 | 1 | 0 | 1 | 1 | 3 |
| ౧౩. రగడ | 0 | 0 | 1 | 0 | 0 | 1 |
| ౧౪. పంచచామరము | 0 | 0 | 1 | 0 | 0 | 1 |
| మొత్తము | 108 | 155 | 167 | 220 | 116 | 766 |

1. శబ్దరత్నావళి, ఉపోద్ఘాతప్రారంభము.
2. ఛందఃపదకోశము, పుట 288.

ఈ పట్టికను పరిశీలింపఁగా కందమునకే ప్రముఖస్థాన మని తెలియు చున్నది. "కందము వ్రాసినవాఁడే కవి" యని కదా ! నానుడి. మఱియొక విశేష మే మనఁగా - వచనములను తొలఁగించినచో కేవలపద్యములు (766-22=) 744 అగును. ఇందు దేశీయచ్ఛందమునకు చెందినవీసము, కందము, తేటగీతి, రగడ కలిపినచో (152+211+124+1=) 488 అగును. అనఁగా దాదాపు మూఁడింట రెండువంతులు దేశిచ్ఛందోభేదము లున్న వని తెలియు చున్నది. ఇం దింకొక విడ్డూర మే మనఁగా - ఆటవెలఁది యీ కావ్యరంగమున వర్తింపకపోవుట. ప్రత్యేకముగనే కాక కవీసము పీసము క్రింద కూడ ఆటవెలఁది చోటుచేసికొనలేదు.

మత్తకోకిల, మాలిని, పంచచామరము ఆశ్వాసాంతములందే ప్రయోగింపఁబడినవి. లయగ్రాహి కువలయాశ్వముయొక్క వర్ణనమున గ్రహింపఁబడుట వృత్తౌచిత్యమునకు నిదర్శన మనఁదగినది. పంచగతులతో పరువెత్తు పంచకళ్యాణిని స్ఫురింపఁజేయుటకే యిచటిలయగ్రాహిగ్రహణ మని తెలియ వలయును. ఆపద్య మిది—

లయగ్రాహి. అంగజమదాపహశిరోఽంగసనటత్సరిద
భంగురతరంగఘనరంగపరిభారా
సంగతి మహీవలయముం గడఁకమీఱ నొక
యంగ గొను వేగ మెనయం గలిగి, తేవ
రంగు మెయిచందము మెఱుంగు మొగమందము చె
లంగ, ఘనగంధము పొసంగ, నిదిగో! మీ
చెంగటనె నిల్చెను దురంగమము, వచ్చినతె
ఱంగు నెఱుఁగంగఁ బలుకంగదవె మౌనీ (2-16)

అశ్వపంచధారావిశేషస్ఫురణార్థమై ఆరంభసమాసము అనుప్రాస భాసురముగ నిర్మింపఁబడినట్లు భావింపనగును. బిందుపూర్వకగకారమును

ప్రాసమున నిబంధించుట కూడ అంగలమీఁద వరుగులు తీయుతురంగమును స్ఫురింపఁజేయుటకే అనిపించు చున్నది. ఇంచుమించు చీకావ్యమునం దంతట సందర్భానుగుణముగనే ఛందఃస్వీకరణము జరిగిన దనవచ్చును. గాలవముని యాశ్రమవర్ణనమునకై - విశేషించి యజ్ఞకర్మప్రకటనమునకై మహాస్రగ్ధరా వృత్తము స్వీకృత మయినది.—

మహాస్రగ్ధర. జవవద్మానీంద్రవేదాక్షరయుతతతహస్తస్రువాజ్యాహుతిప్రో
ద్భవవహ్నిస్ఫారకీలాప్రకటితకరదీపప్రభ న్వత్తు రౌరా!
హవిరర్థాహూతు లింద్రాద్యమరు లవనికై యూన ప్రేరేపఁగా, మీఁ
దివపాంచద్ధోమధూమస్థితులు నిబిడ మై దృష్టి చీఁకట్లు గప్పున్.
(2-67)

సాధారణముగ శార్దూలమత్తేభస్రగ్ధరాదులు రౌద్రవీరభయానకముల యం దుపయోగింపఁబడు ననియు, చంపకోత్పలాదులు శృంగారహాస్యకరుణ శాంతములయం దుపయోగింఁబడు ననియు విమర్శకులయాశయము. ఇందుల కుదాహరణములు గా కాళిదాసు రతీవిలాపమున వియోగినీవృత్తమున్గ్రహిం చుట(1), మేఘదూతమును మందాక్రాంతమున రచించుట, తిక్కన సౌప్తిక పర్వమున స్రగ్ధరామహాస్రగ్ధరలను మెండు గా ప్రయోగించుట మొదలయినవి యుదాహరింతురు. ఇది సత్యమే!కాని, రసనిర్వహణమునందు ఛందఃపరిగ్రహ ణమునకంటెను (రసానుకూల) పదస్వీకరణమునకే ప్రాధాన్య ముండు నను విషయము మహాకవులప్రయోగములనుబట్టి గ్రహింపవచ్చును. నన్నయభట్టార కులవారు ఉత్పలమాలికయందు రౌద్రరసమును స్ఫురింపఁజేయుట గమనింపఁ దగినసంగతి—

1. కుమారసంభవము - చతుర్థసర్గము

ధారుణిరాజ్యసంపదమదంబున( గోమలి( గృష్ణ( జూచి రం
భోరు విజోరుదేశమున నుండ(గ( బిల్చినయిద్దురాత్ము దు
ర్వారమదీయబాహుపరివర్తితచండగదాభిఘాతభి
గ్నోరుతరోరు( జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్(1).

ఇది కోమలరసములయందు గ్రహింపవలసినవృత్తప అట్టి దిచట రౌద్రరసమునకై కైకొన(బడ్డది. ఇందు ఛందస్సునకు కాక పదములకే ప్రాధాన్యము. ధారుణి, ఇద్దురాత్మ, దుర్వార.........చండగదాభిఘాతభగ్నోరుతరోరు, ఉగ్రరణాంతరంబునన్ అనుపదములు రసానుగుణముగ ప్రయోగింప(బడినవి. మఱియు "దుర్వార........"అను సుదీర్ఘసమాసము సయితము భీమసేనుని క్రోధాతిశయమును వెల్లడించుచు తద్ద్వారమున రౌద్రరసస్ఫూర్తి నినుమడింప( జేయు చున్నది. రసానుగుణరచన మన(గా నిట్లుండును. కనుక రసపరిపోషణమునందు ఛందస్సుకన్న పదములకే మొదటిస్థాన మనవలయును. ఛందస్సునకే ప్రథమస్థాన మన్నచో మయూరునిసూర్యశతక మెన్న(డో చీకట్ల పాలయి యుండెడిది. ఈరహస్యమును సమగ్రముగ నెఱి(గినవారు కనుకనే పూర్వకవీశ్వరులు స్రగ్ధరామహాస్రగ్ధరలను కోమలరచనాసందర్భములయందును సముచితముగ ప్రయోగించి యున్నారు.

తిక్కన వసురుద్రాదిత్యాదులను మహాస్రగ్ధరలో బారులు నిలిపెను(2). మారనకవి మహాస్రగ్ధరలో మహాదేవునిని, మరుత్తావనిపతివైభవమును మనోజ్ఞముగ వర్ణించెను(3). తెనాలి రామకృష్ణు(డు స్రగ్ధరలో వాణీపూజను, నారదునితల(పులను;మహాస్రగ్ధరలో మామూలు సంభాషణమును, వడ్డ

---

1. సభాపర్వము, 2-249

2. స్వర్గారోహణపర్వము-34

3, మార్కండేయ పురాణము, 3-53; 8-275.

వవర్ణన నిర్వహించి యున్నాఁడు(1). ఇట్లు బోలెఁ దుదాహరింపవచ్చును ఆపలు మనతెమఁగుకవు లెక్కువమంది సౌభాగ్యాదుల నొసఁగునట్టి మగణమును కృత్యాదిని నెలకొల్పుటకై శార్దూలవిక్రీడితముతో కావ్యారంభము కావించి. యున్నారు గదా!(2). కనుక చిననారాయణ శాంతరసమున మహాస్రగ్ధరను గ్రహించుట విపరీతము కాదు.

**సీసవిలాసము :** సీసవిలాసములను చిత్రవిచిత్రముగ ప్రదర్శించిన కవీశ్వరులు నన్నయభట్టారకులవారు. వీనిలో పంచమాత్రాగణములతో సీస నిర్మాణము చేయుట యొకవిధ మయిన ఛందఃశిల్పమునకు చెందినవిశేషమనఁ దగినది. క్రిందినన్నయగారిపద్యము పరికింపఁదగును—

సీ. క్రోధంబు పాపంబు క్రోధంబుననచేసి
యగుఁ జువ్వె ధర్మకామార్థహాని
గడుఁగ్రోధి కర్జంబు గానండు క్రుద్ధుండు
గురునైన నిందించుఁ గ్రుద్ధుఁ డైన
వాఁ డవధ్యులనైన వధియించు మఱి యాత్మ
ఘాతంబు సేయంగఁ గడఁగుఁ గ్రుద్ధుఁ
డప్మాదృశులకు ధర్మానుబంధుల కిట్టి
క్రోధంబు దాల్చుట గుణమె? చెపుమ!

ఆ. యెఱుక గలమహాత్ముఁ డెఱుక యన్ననముల
నార్పుఁ గ్రోధ మనుమహానలంబుఁ
గ్రోధవర్జితుండు గుఱుకాని తేజంబు
దాల్చు దేశకాలతత్త్వ మెఱిఁగి(3).

---

1. పాండురంగ మాహాత్మ్యము, 2-159, 185; 3-128; 4-178.
2. "మగణంబుచెంతనె పగణంబు నిడఁ గల్గు
సౌభాగ్యజయకీర్తిచయము లెప్పుడు"—లక్షణశిరోమణి, 2-57.
3. ఆరణ్యపర్వము, 1-222.

ఇందు ఇరువదియయిదు పంచమాత్రాగణములు, మూఁడు మాత్రము చతుర్మాత్రాగణము లుంపఁబడినది. వీరిసీసపద్యములను పరిశీలింపఁగా కొన్ని పద్యములలో నొకపాదమున కేవలము పంచమాత్రాగణములు, ఒకపాదమున చతుర్మాత్రాగణములు, ఒకపాదమున అవియు నివియు కాన్పించుచున్నవి. చెప్పనదే మనఁగా - పంచమాత్రాగణబద్ధపద్యనిర్మాణశిల్పమును చూపినవారు నన్నయగారే. వీరిపద్యవిన్యాసములను పరిశీలించినయనంతరకవులు పరిపూర్ణ పంచమాత్రాగణవిలసితపద్యము లనేకములు నిర్మించినారు(1). పంచమాత్రా గణమండితసీసపద్య మీకావ్యమునందును కలదు. అది యిది—

సీ. దాఁచఁ బెట్టినవా? సుధామాధురీధురీ
ణమరందబృందసూనవ్రజములు,
కాణాచులా? యనర్గళపచేళిమఖిదే
ళిమచూతపోతావళీఫలములు,
సంతరించినవా? విశాలమార్దవనిర్ద
యోల్లాసకరుణార్ద్ర పల్లవమ్ము,
అప్పళించినవా? వియద్ధరాపద్ధతి
ప్రారూఢసంచారిసౌరభములు,

గీ. బొమ్మగాఁ దుమ్మెదలు మూగి త్రొక్కులాడు,
పొగరుతోఁ గీరములు చేరి జగడమాడు,
గొంటుగాఁ గోయిలలు రేఁగి కుమ్ములాడు,
మొనసి వలితెమ్మెరలు క్రెల్లి పెనఁగులాడు.

ఇం దింద్రగణము లన్నియు పంచమాత్రాసమన్వితములే. మఱియొక పద్య ముదాహరణీయము—

---

2. భీమఖండము, 3-10,17. వసుచరిత్ర, 2-7; 4-29; 6-84. కుకుత్స్థవిజయము, 1-29; 5-87 మొ.

సీ. ఏనవ్యగుణహారిదానవారి యవక్ర
చక్రసౌఖ్యకరప్రసక్తిఁ గాంచు
నేవైరిహరహేతిభావరీతి యమూల్య
కళ్యాణధరధర్మగరిమఁ గాంచు
నేజగన్నుతిశాలియాజికేళి ప్రచండ
పరదండమహతి యన్ప్రౌఢిఁ గాంచు
నేరమ్యతరకీర్తిమారమూర్తి యవేల
కమలాంబికామోదఘటనఁ గాంచు

గీ. నతఁడు వయిఖండుఖానసప్తాంగహరణ
కరణకారణరణరణద్ఘంటికాని
కాయవేదండముఖసైన్యకలితవిజయ
శాలి నారాయణక్షమాపాలమౌళి. (1-16)

ఇం దనుబంధగీతిలోనిద్వితీయచరణమున 'కారణ' అనున దొక్కటి మాత్రము చతుర్మాత్రాణము. తక్కినయింద్రగణము లన్నియు పంచమాత్రాన్వితములే. శబ్దాలంకారము, అర్థాలంకారము, వ్యంగ్యము, ఛందోవిశేషము, వ్యాకరణవిశేషములు, చారిత్రికవిశేషము, కవిపాండిత్యగరిమము, పురాణకథావిబంధనము అనునష్టవిలాసభాసుర మీసీసము. ఈరీతిగ నొక్కయింద్రగణము మాత్రము చతుర్మాత్రాక మై, తక్కిన వెల్ల పంచమాత్రాకము లగునట్లు వ్రాసిన సీసము లింకను విందుఁ గలవు(1).

మధురగతిరగడ : పూర్వకవులం దెక్కువమంది ప్రాస్త్యాపచయసందర్భము నందే రగడలు గ్రహించిరి. కొందఱు మాత్రము రగడపరిగ్రహణమున కొంత

1. ప్రథమశ్వాసము - 33; ద్వితీయశ్వాసము - 23 మొదలగునవి.

ప్రత్యేకతను పాటించిరి. నందిమల్లయ ఘంటసింగయలు రగడలో కైలాస వర్ణనము కావించిరి(1). దీనిని కైలాసాచలరగడ యను చున్నారు. పింగళి సూరన ద్విరదగతిరగడయందు లేఖమును వ్రాసెను(2). చింతలపూడి యెల్లనార్యుఁడు శ్రీకృష్ణసన్నుతి మధురగతిరగడలో మధురతరముగ వినిపించెను(3). భాస్కరాచార్యులు వైశ్యకాంతాజనములచేత భూనాధునకు రగడలో నీరాజన మిప్పించెను(4). పాలవేకరి కదిరీపతి పద్మరాగపుష్యరాగప్రవాళాదివస్తుజాతమును రగడలోనే వివరించెను(5). ఇట్లే మఱి కొంద ఱుందురు. ఈచిననారాయణ మధురగతిరగడలో పుష్పావచయము చేయించెను (3-128). ఇందు ప్రతి పాదమున చతుర్మాత్రాగణములు నాలు గుండును(6). కాని, చిననారాయణ యీనియమము నతిక్రమించి పంచమాత్రాగణములు కూడ కూర్చినాఁడు.

ఉదా : చాలుచాలు నీసంపెగమొల్లము - బాల! కంటివే పాదిరిమొల్లము
నెలఁత!రాఁగదే నిమ్మలనీడకు - నలుకసేలనే యంతటి ప్రోడకు

అయితే, పాదము మొత్తముమీఁద పదునాఱుమాత్రలు సరిపడు చున్నవి. విశేషించి యతికి ముందఱిభాగమునందే పంచమాత్రగణము లగపడు చున్నవి. ఇందువలన చతుర్మాత్రాగణములు గలిగినమధురగతిరగడ కలవడిన

1. వరాహపురాణము, 10-144
2. ప్రభావతీప్రద్యుమ్నము, 5-152
3. రాధామాధవము, 2-30
4. వైశ్యపురాణము, 7-28
5. శుకసప్తతి, 1-222
6. ఛందఃపదకోశము,పుట 242

గతి యీపంచమాత్రాగణములవలన మాఱిపోవు చున్నది. అందుకని దీనిని స్వచ్ఛందమధురగతిరగడ యని డా. దేవర్ల చిన్నికృష్ణయ్యగారు నిర్దేశించిరి(1).

యతులగతులు - ప్రాసవిలాసములు :

సంస్కృతమునందు విచ్ఛేదమే యతి(2). అనఁగా యతి చెప్పఁబడినస్థానములోనియక్షరముతో పదము ముగిసి, ఉత్తరాక్షరముతో వేఱొకపద మారంభింపఁబడవలయును. కాని యాంధ్రచ్ఛందస్సునందలియతివిధాన మమర భాషాఛందోయతివిధానముకంటె వే అయినది. ఇచటి'యతి' పదవిచ్ఛేదముతో నుండవలసినపని లేదు. పాదమునందు యతి నిర్దేశింపఁబడినస్థానమున ఆపాదారంభమున నున్నఅచ్విశిష్టవ్యంజనాక్షరము, లేదా దానితో 'చెలిమి' గలయక్కరము మరల ప్రయోగింపఁబడవలెను. ఈరీతిని మరల ప్రయోగింపఁబడుటనే 'యతిచెల్లుట' యందురు. ఇఁక పద్యపాదమునందలిద్వితీయాక్షరమునకు 'ప్రాస' మని నామము. అనఁగా పాదమునందలిప్రథమద్వితీయాచ్చులనడుమ నున్న వ్యంజనము, లేదా వ్యంజనసమూహము (= ఉన్నచో పూర్ణబిందు, అర్ధబిందు, విసర్గపూర్వకముగా-) ప్రాస మనఁబడును(3). ఈయంశమునే చెప్పుటకు, సామాన్యముగాద్వితీయాక్షరముప్రాసమనివ్యవహారము(4). ఈ ప్రాసనియమము సంస్కృతమునకు లేదు. అంత్యప్రాసము మాత్ర మున్నది. కన్నడమున ప్రాస మున్నది కాని యతి లేదు. కనుకనే "కన్నడక్కె యతి యిల్ల, కోణక్కె మతి యిల్ల" అనుసామెత కన్నడమున పుట్టినది. అనఁగా కన్నడమునకు యతి లేదు

---

1. కువలయాశ్వచరిత్రము (ఆం. సా. అ. ప్రతి) సంపాదకీయము పుట. 27
2. 'యతిర్విచ్ఛేదసంజ్ఞితః' - వృత్తరత్నాకరము, 1-12
3. ఛందఃపదకోశము, పుట 52
4. 'వళి', రాద్య మన్త్యక్షరం ప్రాసః' - ఆంధ్రశబ్దచిన్తామణిః, సంజ్ఞా. 41 సూ.

డున్నపోతునకు మతి లేదు-అనియర్థము.(1)తెనుఁగునందలియతులు సజాతీయాక్షరవిలసితములు గనుక శ్రవణానందసంధాయకము లగు చున్నవి. 'వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే' 'అథ ప్రజానా మధిపః ప్రభాతే'(2) మున్నగు సలఘులయందలిసజాతీయాక్షరములు తెనుఁగురూఁటులవలె శ్రుతిమధురము లయి యున్న వనుట పెద్ద లంగీకరించినవిషయమే. అటు గీర్వాణయతిపద్ధతివి. ఇటు ద్రావిడప్రాసపద్ధతివి ఏకత్ర కూర్చుకొని సాగినయాంధ్రకవితాహేలలు అనంత హృన్నయనానందసంధాయకము లనుట పరమసత్యము. ముందుగ నీకృతి యందలియతివిశేషములు ప్రదర్శింపఁబడు చున్నవి—

౧ నిత్యయతి : అప్యర్థక మయిన 'ఏని' శబ్దము పరమై సంధిఁగూడిన ఉత్తర పదాద్యచ్చునకు(ఏ), పూర్వపదాంతహల్లునకును యతి చెల్లుట.(3)

సీ. విడు పైటచెఱఁగు నే వెఱతు గాయము మాన
ని మ్మని ఛాయ యెంతేని వేఁడ　　(1-25)

మానన్ + ఇమ్ము—ఎంత + ఏని→ ఇచ్చట ఉత్తరపదాద్యచ్చుతో యతి చెల్లినది. ఈయతి (4-177)లోను గలదు.

౨. చతుర్థీవిభక్తియతి : పదములచివర చతుర్థీవిభక్తిలోని 'కై'(క + ఐ), చేరినచో 'ఐ' అనునచ్చునకే కాక, దానితో కలసి యున్నహల్లు (క)కు కూడ యతి చెల్లుట (4).

సీ. అశ్వినుల్ మందులకై ద్రోణగిరికి వి
చ్చలుఁ బోవుకతన వేసరుకొనంగ(1-25). ఇచ్చట అచ్చుతో యతి చెల్లినది. ఇట్టిది(3-92)లోను గలదు. మఱియు చతుర్థి'కై'ప్రత్యయమునకు మాఱుగా ప్రయోగింపఁబడిన'కినై' అనుదానికి కూడ నిందు ప్రయోగ మున్నది—

---

1. సారస్వతవ్యాసములు, తృతీయసంపుటము, పుట 29.
2. రఘువంశము, 1—1;2—25.
3. ఛందోదర్పణము, 1-103.
4. సుకవిమనోరంజనము. 3—78.

ఉ. "....మారుఁ డా/యాసముతో వశీకృతికినై రజ మెత్తఁగఁ బూజవెంబడిం (5–78). ఇట నచ్చునకు యతి(యా—ఐ→ సరసయతి.చూ. ఛందోదర్ప ణము, 1–107).

౩. పంచమీవిభక్తియతి : పైయట్లే పంచమీవిభక్తిప్రత్యయము(కన్నన్, కంటెన్)లకు యతి చెల్లుట.(1)

సీ. కలనిలోఁ బోలియుటకంటె భాగ్యమ్ములు
న్నవె? యంచుఁ దెగి యని కరుగువారు(ఇట హల్లునకు యతి2–144)

౪. ప్రభునామయతి : అమ్మ,అయ్య,అన్న మొదలగునవి వ్యక్తినామముల కడపట చేరినపుడు ఉత్తరపదాద్యచ్చునకు, ఆయచ్చుతోకూడిన హల్లునకును యతి చెల్లుట.(2)

కం. ................ ఆనన
హసితైందవబింబఁ గోనమాంబ వరించెన్,(1–35). ఇచట సరసయతి నియమానుసారముగ అచ్చునకు(హ—కోనమ + అంబ) యతి వేయఁబడెను. ఇట్టి వింకను వెందుఁ గలవు(1–42).

౫. నిత్యసమాసయతి : నిత్యసమాసములందు జరుగుస్వరసంధిలో పరాచ్చునకు, పరాచ్చుతో కూడినహల్లునకును యతి చెల్లుట.(3)

తే. అతులలేఖాతిచంద్రు నారాయణేంద్రు(1–51)(అ—నార + అయన).

౬. దేశ్యనిత్యసమాసయతి : పైయట్లే దేశ్యనిత్యసమాసములయందు యతి చెల్లుట.(4)

తే. ఇతనితోడుత వైర మీడేఱ దనుచు( 1–59)(ఇ—ఈడు + ఏఱు).

---

1. అప్పకవీయము, 3–238.
2. లక్షణసారసంగ్రహము, 1–యతులు, 18.
3. ఛందఃపదకోశము, పుట 42.
4. ఛందఃపదకోశము, పుట 42.

౭. అనుస్వారసంబంధయతి : పూర్ణబిందుపూర్వకము లయిన టఠడఢ లు తథదధ లు స్వేచ్ఛగా యతి చెల్లుట.(1)

మ. "...............తల్లిదం
డ్రులు దైవంబును నయ్యె నిద్దఱకు నెందున్ సందియం బేటికిన్(1—58).

౮. అనునాసికాక్షరయతి : టవర్గములోని మొదటినాలుగక్షరములు బిందుపూర్వకములై నకారమునకు, తవర్గములోనితొలినాలుగక్షరములు బిందుపూర్వకములై ణకారమునకును యతి చెల్లుట(2).

చ. " ...............సౌధమం
దిరములఁ జొచ్చి యందుఁ దరుణీతనుగంధము కాలిసంకెలై (1—76).

ఈయతు లింకను(1—96;2—82,111,128;3—28;4-19,176;5-1,37 అనుచోట్లఁ) గలవు.

౯. అభేదయతి : వబలకు, ళశలకు, లడలకు, శడలకు మాత్రము పూర్వలాక్షణికులు అభేదయతి నంగీకరించిరి. కూచిమంచి వేంకటరాయఁడు దడలకు కూడ అభేదయతి నంగీకరించి ప్రయోగములు చూపు చున్నాఁడు(3). ఈకువల యాశ్వచరిత్రమున కూడ మూర్ప వీలుగాని యతిస్థానమున వీనియభేదము నిబంధింపఁబడినది.

శా. దయ్యం బీతని నెవ్వరేని నిజఖడ్గప్రోద్యదుగ్రాగ్నికిం(5-63). ప్రాస యతియందు కూడ దడలయభేదమును ఒకేపద్యమున రెండుసారులు చూపు చున్నాఁ డీకవి(చూ2-116).

౧౦. రాగమయతి : రాగమసంధిరూపములయం దుభయయతి చెల్లుట(4).

చ. అగణితకేళిఁ ద్రోలిజవరాలిగముల్ వనపాళి నాడఁగా(1-75). (అ—జవ + అలి). ఈయతి(3-147)లోను గలదు.

---

1. అప్పకవీయము, 3—58.
2. అప్పకవీయము, 3-62.
3. సుకవిమనోరంజనము, 2-267.
4. అప్పకవీయము, 3-215.

౧౧. ఘూకస్వరయతి : విసర్గసంధియందు లోపించినపరపదాద్యచ్చునకు యతి చెల్లుట(1).

చ, అవిన 'రిపుక్షయోఽస్తు విజయోఽస్తు పతే!భవతే' యటంచు వా(2-83).
(అ—విజయః + అస్తు).

౧౨. కాకుస్వరయతి : పదాంతమందలియచ్చునకు ప్లుతోచ్చారణము(త్రికాలోచ్చారణము) కలిగినప్పు డుభయయతి చెల్లుట. దీనిని కూచిమంచి వేంకటరాయఁడు 25విధములుగా వివరించినాఁడు(2). అందు 'ప్రార్థన' మనుదానికి ఈకృతినుండి ప్రయోగము చూపఁబడు చున్నది—

శా. ఏమే నున్న నుపేక్ష సేయకయ మౌనీ'యాన తీవే దయన్ (2-14).

చ. అని తెలుపన్ మహీశుఁ డవుఁ గా' యని మెచ్చి పటానితేజి డిగినతఱి.....................(2-70). (ఇది నిశ్చయమున కుదాహృతి). ఇతర భేదములకు కూడ నిందు పెక్కు ఉదాహరణములు గలవు.

౧౩. ఋత్వసంబంధయతి : హల్లుతో కూడి యున్నఋకారమునకు ఇఈఎఏ ఋౠ అనునచ్చులు, ఈయచ్చులతో కూడినయకారహకారములు యతి చెల్లుట(3).

సీ. "హృద్యోత్సవంబు లనేకంబు లుండఁగా........(1-40)(హృ—న+ఏక)

౧౪. అంఖడయతి : సంధియందు పరపదాద్యచ్చునకు కలసినహల్లునకు కూడ యతిని చెల్లించుట.(4)

చ. ఉరగకులోద్వహుండు పగ యొప్ప దటంచును దార్ఢ్యసంగతిం
బరఁగఁదలంచి, వజ్రసుషమాతిరమాపరమానుషక్తిచే (1-84)
(బ—సుషమా + అతిరమా).

---

1. ఛందోదర్పణము, 1-76.
2. సుకవిమనోరంజనము, 3-258.
3. అప్పకవీయము, 3-26.
4. లక్షణసారసంగ్రహము, 1—యతులు 16.

కం. తగురా మగరానిగనిగ
    లగురా తొగరాచసాలలవ్విన్నువుం(3-24)
                                    (నిగనిగలు + అగురా—సాలలన్)

సీ. నే వచ్చువేళఁ దా నింట నుండక పోయి
        పొరుగింట నిరుగింటఁ బ్రొద్దుగడుప(4-195)(నే—తాను + ఇంట)

౧౫. రఱయతి : అప్పకవివంటిగొప్పకవి ఒప్పకపోయినప్పటికిని తెలుఁగు వాఙ్మయమున రేఫఱకారములకు యతిప్రాసములు కుప్పతెప్పలుగా వైవఁబడినవి. ఈప్రబంధమందును నివి లెక్కకు మిక్కిలి కలవు.

సీ. రేరాయఁ డెడలేర్పఱించువాఁడు(2-62). (ఇట ఱేరాయ పాఠాంతరము).

సీ. గీ. ఱేఁడు మాటికిఁ జవు లెచ్చరించువాఁడు(2-62).

సీ. గీ. త్రోవఁ బోనీక బల్లెముల్ ఱువ్వి తెచ్చి(2-108).

౧౬. విచ్ఛేదయతి : తెనుఁగులక్షణ మయినసజాతీయాక్షరముతోపాటు, సంస్కృతలక్షణ మయిన'విచ్ఛేదము' కూడ కలిగి యుండుట. ఇది సర్వాంధ్రపద్య కావ్యములయందు కన్పించువిషయమే అయినప్పటికిని ప్రత్యేకవిషయముగా పరిగణింపఁబడఁదగినదే అనుతలంపుతో నిచట గ్రహింపఁబడు చున్నది. దీనికి కూడ నన్నయ్యగారి భారతమునందు లక్ష్యము లున్నవి:

ఉ. రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజతే(ఆది. అవతారిక-3)

చ. తనరుఁ జళుక్యమన్మథుఁడు ధర్మదయార్ద్రనిబద్ధబుద్ధి యై
                                    (ఆది. అవతారిక-5)

మ. కారణంబును దద్భారతవిస్తరోక్తివిభవంబుం బాండవాడంబరంబును
        భీష్మాదికురుప్రవీరచరితంబుం జెప్ప ముద్యన్మతిన్ (ఆది. 1-74).

శా. స్రోతోమార్గవినిర్గతోగ్రదహనార్చుల్ పన్నగవ్రాతముల్
                                    (ఆదిపర్వము, 1-111).

పైయుదాహరణములయం దుత్పలమాలాచంపకమాలలయందున సంస్కృతలక్షణానుసార మయినవిచ్ఛేదము గలదు. మత్తేభశార్దూలవిక్రీడితములయందు

యత్యక్షరమును కూడ కలుపుకొనినవిఱుపు కలుగుట ఒకవిశేషవిషయముగ నెంచవచ్చును. ఇఁక నీప్రబంధమునుండి పైవిధముగనే క్రమముగ లక్ష్యములు చూపఁబడు చున్నవి—

ఉ. దుర్వారుని దిమ్మభూవరునిఁ బ్రస్తుతి సేయ వశంబె యేరికిన్? (1-37)

చ. చెలఁగెడితీరు నీరములు చెందినసౌరును గాక రాజురా(1-71)

మ. అతఁ డాతిమ్మమయందు వేంకటన్నపాధ్యక్షున్ రిపుక్షేపణో
ద్ధతు రంగాధిపుఁ దిర్మలాంబవలనన్ ధర్మాత్ము గోపాలు, స
న్నుతకీర్తిం జీననారనాఖ్యుఁ డగునన్నుం గస్తురీంద్రున్, సమం
చితకీర్తిన్ రఘునాథుఁ, దిమ్మవిభుఁ, గాంచెన్ సజ్జనాధారులన్. (1-56)

శా. కేళు ల్మేలగు, పాండురాజభవభక్తి న్మించియున్ పౌరభా (1-79)

ఇంకను అభేదవర్గయతి, ప్రాదియతి, పోలికవడి, ముప్పిధ క్త్రియతి మొదలగునవి చాల కలవు, యతిప్రకరణమున కుదాహరింపఁదగినలక్ష్యములు దాదాపు సగమువఱ కిందే లభింపఁగలవు. ఇఁక ప్రాసవిశేషములు ప్రదర్శింపబడు చున్నవి—

౧. ఋప్రాసము : సీ. గీ. మారమణి వింత యేఁచేనయాఋతధ్వ
జేంద్రుఁ జెనకంగఁజాల, వచేమొ కాని! (3-153)

౨. అభేదప్రాసము : చ. దళములచాలు, ముద్దియలతండము మేలు, విచిత్ర పత్రముల్
చెలఁగెడితీరు, నీరములు చెందినసౌరును గాక రాజురా
(1-71)

3. రేఫఱకారప్రాసము : కం. సురగాలి యేఁచెఁ బ్రజలం
గఱవుకుఁ దో డావపంట గలిగినకరణిన్. (1-101)

౪. ద్విప్రాసము : కం. కనమో? వినమో? ఘనమో?
ఘనమోహనమోదకారికచ! మగవాలిం
దినముం భువనంబుల, నా
మనమున్ హరియించువాని మఱి గంటి మఱే? (3-114)

౫. త్రిప్రాసము :* కం. నెమ్మి కదా! నడ, తుమ్మెద
బొమ్మి కదా! బెడఁగుఁగురులు, తొలుకరిమించుం
గమ్మి కదా! మెయి, మరుదో
దుమ్మి కదా! తగినచూపు తొయ్యలికి భళీ! (3-29)

౬. ఖండాఖండప్రాసము : తే. విన్ను వేవేగఁ దోడితె మ్మన్న వచ్చి
నాఁడ రావమ్మ! కుండలతోడఁ గూడి (4-90)

౭. దుష్కరప్రాసము : శా. లక్ష్మీశోపమవీరవేంకటనృపాలశ్రీమహారాయద
త్తక్ష్మామండలమండనాయితయశోదామాభిరామాంశునీ
(2-165అశ్వాసాంతపద్యములందలది).

౮. ప్రత్యేకప్రాసము : ప్రాసాక్షరములు నాలుగుపాదములందును మామూలుగానే యుండి, దానితరువాతి(మూఁడవ)యక్షరమునుండి పూర్వార్ధమునం దొక రీతిగను, ఉత్తరార్ధమునం దింకొకరీతిగను నిర్మించుట.

ఉదా:- కం. ఈకరణి నన్నృపాగ్రణి
యేకరణీయములు మాని, హిమకరవిలస
ద్రాకలకున్ వలిదెమ్మెర
రాకంకున్ జాలగొని విరాళిఁ బడంగన్. (4-102)

ఇందు ప్రాసమున 'క' వర్ణము సమానముగనే యున్నది. తృతీయచతుర్థాక్షరములు ప్రథమార్ధమున రకారణకారములు, ద్వితీయార్ధమున లకారకకారములు నై యున్నవి. అనఁగా ప్రథమార్ధమునం దొకవిధమయినత్రిప్రాసము, ద్వితీయార్ధమునం దింకొకవిధ మయినత్రిప్రాసము నిబంధింపఁబడెను. ఇట్టివి

* ప్రాసమునం దనేకవర్ణములను నిబంధించుట కన్నడమునందును గలదు. చూ. పంపభారతము, 5-89(ఇదిచతుష్ప్రాసకందము).

మనవాఙ్మయమునందు లెక్కింపఁదగినంత యెక్కువగనే కన్పడు చున్నవి. గ్రంథాంతరమునుండి మచ్చున కొక్కటి—

కం. ఆచంద్రుఁనివంశంబున
భూచంద్రుం డారవీటిబుక్కనరేంద్రుం
డాచక్రవాళశైల
క్ష్మాచక్రస్ఫూర్తికీర్తి సాంద్రుఁడు పుట్టెన్.(1)

ఇందు ప్రథమార్ధమున ద్విప్రాస మొకరీతిగను, ద్వితీయార్ధమున ద్విప్రాస మింకొకరీతిగను కూర్పఁబడెను. ఇట్టివానికి లాక్షణికులు పేర్లు పెట్టలేదు. ఈప్రత్యేకప్రాసములయందు-ఒకపగమున ద్విప్రాసము, వేఱొకపగమున త్రిప్రాసము-ఈరీతిగ చిత్రవిచిత్రగతులు కలిగినవిశేషములు కావ్యజాతమున కానవచ్చు చున్నవి(2). వాని నన్నింటి నిచ్చట పరిచయ మొనరింపఁ బూనుట తగ దని తలఁచి యిది యొకటి విశదపఱచి ప్రాసవిషయము వదలఁడ మయినది.

ఆంధ్రభాషాయోష కీయతిప్రాసహాసరేఖలు సహజాభరణములు కనుకనే మనసామెత లన్నియు యతిప్రాసవిలాసభాసురము లై యున్నవి. కవిరాజు కొఱవి గోపరాజు 'తెనుంగునకుఁ బ్రాల్పెక్కుంగడు న్వన్నియల్' అని యెలుఁగెత్తి చాటినాడు(3). ప్రాలువక్కు లేనిబేలు కవిత కాటుకవన్నె లేవిప్రతిమ యని నాఁడు(4). యతిప్రాసవిన్యాసభాసురము లయినయాంధ్రచ్ఛందఃకవితాహేలలు హృన్నయనానందసంధాయకము లై ఆంధ్రభారతీచారుభూషణము లై, మధుర వీణావినాదము లీనుచు, మధురతరమురళీరవళీతరంగములు సృజించుచు పండితపామరప్రజాశ్రవస్సీమలలోపల నిత్యవిహారములు సలుపు చున్నవి.

---

1. కళాపూర్ణోదయము, పీఠిక-19. కువలయాశ్వచరిత్రము, 4-147.
2. కువల. 3-84;4-197. కకుత్స్థవిజయము, 5-116.
కళాపూర్ణోదయము 2-184;5-111 మొ.
3. సింహాసనద్వాత్రింశిక, 4-189.
4. ,, 4-190.

వశ్యవాక్కు లయినకవివర్యులకు ఛందస్సు ఆటంకము గాక వోమ్యనదీ తరంగభంగిమలతో వారికావ్యకన్యకాకళావిలాసములను సహృదయాళికి సాక్షాత్కరింపఁజేయును. ఈకువలయాశ్వచరిత్రము విచిత్రకథావిన్యాసముల కాలవాలము గనుక అటవట ద్విప్రాసత్రిప్రాసాదివిచిత్రప్రాసలను కూర్చి కృతికాంత కొకవింతసొగసు కలిగించినాఁడు చిననారాయణుఁడు.

కం॥ విద్యలలోపల నుత్తమ
విద్య కవిత్వంబు, మఱి కవిత్వము ఛందో
వేద్యము, గావునఁ జెప్పెను
హృద్యంబుగఁ గవిత ఛంద మేర్పడఁ గృష్ణా!

—కవిలాక్షణికుఁడు అనంతుఁడు

....o.

# షష్ఠదళము

# పాత్రచిత్రణము – రసపరిపోషణము

భారతీయసాహిత్యమున పాత్రచిత్రణమునకు ప్రముఖస్థాన మీఁబడినది. రామాయణమునుండియే పాత్రచిత్రణకళావిలాసములు బయలుదేఱినవి. వాల్మీకి మహర్షి రామాయణములోని ప్రతిపాత్రమును ప్రత్యేకసజీవమూర్తిగా చిత్రించుట చేతనే అవి నేఁటికిని విశ్వవేదికమీఁద విహరించు చున్నవి. ఇఁక వ్యాసభగవాముని భారతపాత్రములనుగూర్చి వివరింపవలసినపనియే లేదు. విశేషించి భారత కథాపాత్రములు ఆంధ్రుల కభిమానపాత్రములు. అందులకు కారణములు-ఆవ్యక్తులగుణగణములకు తగినవిధముగా వారిని సంభాషింపఁజేయుట, ప్రవర్తింపఁజేయుట మొదలగునవి. ఈపాత్రములకు కొన్నిచోట్ల కవిత్రయమువారు మెఱుఁగులు దిద్దినట్లు కూడ విమర్శకులు భావించు చున్నారు. కవిత్రయేతరులు కూడ పలువురు పాత్రచిత్రణ మనుశిల్పకళయం దారితేఱినవారు గలరు. ఏడనో మార్కండేయపురాణమున మాఱుమూల డాఁగి యున్నవరూధినీప్రవరులను పెద్దనార్యుఁడే కదా! సజీవపాత్రములుగా తీర్చి యాంధ్రుల కందించినది. నందితిమ్మన్నగారిసత్యభామ, పింగళి సూరన్నగారికళాపూర్ణోదయపాత్రములు-ఇట్లెన్నియైన నుదాహరింపవచ్చును.

పాత్రచిత్రణము, రసపరిపోషణము అనురెండుకార్యములు పూవుతావి వలెను, చంద్రికాచంద్రులవలెను అవినాభావసంబంధము కలవే కాని పగలూరేయి వలె, తర్కసాహిత్యములవలె వేఱువేఱుగా నుండునవి కావు. ఎట పాత్రచిత్రణము సరిగా జరిగె నని చెప్పఁబడెనో అట రసపోషణము సరిగా జరిగె ననియే భావము. ఎట రసపోషణ సరిగా జ^గె నని రుజు వగునో అట పాత్రచిత్రణ సరిగా జరిగె ననియే తాత్పర్యము. ఒకప్రబంధమునందు నాయకుఁడుగాని, మఱొక పాత్రముగాని ఒకయుద్ధఘట్టమున జయించినట్లు చిత్రింపఁబడినచో నచట వీర రసము పోషింపఁబడినట్లే! అట్లే ఒకకావ్యమున ముఖ్యరసముగా శృంగారము

రుజు వయిన దనఁగా తదాలంబనవిభావము లయిన నాయికానాయకుఁడు శృంగార మూర్తులుగా చిత్రింపఁబడినట్లే! ఈసమన్వయమార్గమున ఈశీర్షికావిషయము చర్చింపఁబడు చున్నది—

చిననారాయణకవి 'ఋతధ్వజచరిత్రము' అనక కువలయాశ్వచరిత్రము అనుటలో ఒకవిధ మగువిశేషమును ధ్వనిమర్యాదతో దెలిపినాఁ డనవచ్చును. ఈనాయకునకు ప్రతినాయకుఁడు పాతాళకేతువు. అతనిసంహారమున లోకోద్ధరణ మిందు ప్రధాన మయినది. అందు కువలయాశ్వము ప్రధానస్థాన మాక్రమించు కొనినది. దేవతానుగ్రహమున ఈకువలయాశ్వము గాలవమునిద్వారమున పాతాళకేతుసంహారమునకై ఋతధ్వజునకు చేరినది. ఏతత్కథాసూచన జరిగి దేవతలకు కూడ సాధ్యము గానిపాతాళకేతుసంహారము దేవతాప్రార్థనతో ఋతధ్వజుఁ డొనర్చుట సూచించుచు ప్రతాపసంపన్నత్వ మను నాయకగుణమును ధ్వనింపఁ జేయు చున్న దీనామము.

శ్లో॥ కీర్తిప్రతాపసంపన్నః సమర్థత్రయతత్పరః।
ధురంధరశ్చ గుణవాన్ నాయకః పరికీర్త్యతే॥

అని నాయకగుణములను వక్కాణించినాఁడు వారణాసి ధర్మసూరి(1). కువలయాశ్వ మనునది కూడ ఈదివ్యాశ్వమునకు సార్థకనామమే. కువలయ మనఁగా భూమండలము. దాని నంతను తనపరిభ్రమణముచే లోఁగొనఁగలుగునది—అని దీనినిర్వచనము. ఈవిషయము మూలములోను, ప్రబంధములోను చెప్పఁబడియే యున్నది(2).

పాతాళకేతువును వధించినఋతధ్వజుఁడు పాతాళలోకమున మదాలసను చూచును. అక్కడ మదాలసచెలికత్తె యయినకుండల మదాలసావృత్తాంతమంతటిని వివరించును. దానిసారాంశ మే మనఁగా—ఒకనాఁడు మదాలస చెలికత్తియలతో కలసి భూలోకమునకు వచ్చి విహరించు చుండఁగా నచట వేఁటతమితో

---

1. సాహిత్యరత్నాకరము, 2—8.
2. అ) మార్కండేయపురాణము, 18—47.
   ఆ) కువలయాశ్వచరిత్రము, 2—42.

నేఁగు చున్నయుతధ్వజునిని చూచి ప్రేమించి, విరహముతో బాధపడుచుండఁగా పాతాళకేతువు బంధించి పాతాళమునకు తెచ్చెను.

ఇప్పటివఱకు నాయకుఁడు నాయికను చూడలేదు. నాయికమాత్ర మతనిని మును పెన్నఁడో చూచినది. చూచుటతోడనే వలచినది. అనఁగా శృంగారబీజాంకురము మొదట నాయికహృదయమున తలయెత్తినది. అంతే కాదు. ఆమె తన నగరమునకు పోయి విరహమున పడినది. భరింపలేనంతవేదన ననుభవించినది. మన్మథపూజ, పుష్పాపచయము. జలకేళి, శిశిరోపచారములు, చంద్రమన్మథమలయమారుతదూషణాదు లన్నియు నీకాలముననే జరిగినవి. మన్మథావస్థలన్నియు ఈభాగముననే చేర్పఁబడినవి. మూర్ఛావస్థ యిట్లు వర్ణింపఁబడినది—

తే. అనుచు నిక్కాంత వలవంతఁ బెనిచి వేఁడి
బొరలఁ జెందినకమ్మదెమ్మెరల దూఱి
ముమ్మర మ్మగుతాపమ్ము గ్రమ్మఁ దమ్మి
పానుపున సొమ్మసిల్లుచు మేను సేర్చె. (4—33)

ఈమూర్ఛావస్థలో నున్నపుడే పాతాళకేతుఁ డామెను, చెలికత్తెను అపహరించుట జరిగెను. ఇక్కడివిశేష మే మనఁగా—నాయికానాయకపరస్పరాలోకనము జరగకమునుపే నాయికావిరహము సుదీర్ఘముగ వర్ణింపఁబడుట. నూటపదునాఱు పద్యములం దీవిరహవర్ణనము జరిగినది(1). ఉభయులకు చక్షూరాగ ముదయింపక ముందుగనే మన్మథావస్థలన్నియు నిట్లు వర్ణింపఁబడవచ్చునా? యని ప్రశ్న ముదయింపవచ్చును. వర్ణింపఁబడవచ్చు ననియే సమాధానము. ఏల యనఁగా కేవలము వినుకలివలపుచేతనే వివిధమన్మథావస్థలకు నాయిక లోనగుట రుక్మిణీకల్యాణఘట్టమున చూడవచ్చును(2). నీలాసుందరి కూడ శ్రీకృష్ణునిగుణగణములను విని వలచి, విరహ మనుభవించుట, చంద్రాదుల నుపాలంభించుట జరిగినట్లు కూచిమంచి తిమ్మకవియు వర్ణించి యున్నాఁడు(3). స్వప్నసమాగమమాత్రము

1. తృతీయాశ్వాసము79నుండిచతుర్థాశ్వాసము33వఱకు.
2. శ్రీమదాంధ్రమహాభాగవతము, దశమస్కంధము, పూర్వభాగము.
3. నీలాసుందరీపరిణయము, తృతీయాశ్వాసము.

చేతనే వియోగావస్థకు లోనయిన ఉషాకుమారి వివిధరీతుల వేదన ననుభవించి నట్లు నాచనసోమన వర్ణించుచున్నాఁడు(1). దామర్ల అంకభూపాలుఁడు కూడ ఉషావిషయములో అనిరుద్ధదర్శనము సాక్షాత్తుగ లభింపకముందే ఉపాలంభాదు లన్నియు చేర్చియున్నాఁడు(2). ఇఁక కనుపర్తి అబ్బయామాత్యుఁడు కూడ ఉష విషయమునందిట్లే వర్ణించియున్నాఁడు(3). ఈకవులలో చిననారాయణకు ముందు కొందఱు వెనుక కొంద ఱున్నారు. అంకభూపాలుఁడు మాత్రము సమ కాలికుఁడు. ఏమయినప్పటికిని భాగవతోత్తరహరివంశాదులను పరికించి, తత్ప్ర భావమునకు లోనై ఉషాకన్యను చిత్రించినట్లే మదాలసను కూడ చిత్రింప నెంచి యిట్లు పూర్వారాగమునందే మన్మథావస్థల నన్నింటిని కూర్చినాఁ డన వచ్చును; సంతతభారతభాగవతాదిశ్రవణానందుఁడ నని యాశ్వాసాంతగద్యము నందు నారాయణకవి చెప్పికొన్నమాట నిచట స్మరింపనగును. ఇఁక వసుచరి త్రాదులయందు నాయికానాయకపరస్పరావలోకనాదు లయినపిదప విరహాదులు ప్రారంభ మగును(4). అచటిశృంగారము వేఱు, దానిని విమర్శింపవలసినతీరు వేఱు. ఇక్కడ మాత్రము చిననారాయణ ఉషాపాత్రచిత్రణపద్ధతి ననుసరించె నని వచింపవలసియున్నది. అయితే, ఉష తనప్రియుని కలలో మాత్రము చూచి నది. మదాలస తనప్రియుని నిలలోనే చూచినది. ఈసందర్భమున నారాయణ కల్పన తెలివిగనే వెలసిన దనవలయును.

ఇటుపైని కువలయాశ్వుఁడు మదాలసాకుండలలతో సాకేతమున కేఁగి మదాలసను మనువాడుటకు సిద్ధముగ నున్నసమయమున తాళకేతువు మునివలె వచ్చి యాగరక్షణకు రమ్మనఁగా నతఁ డామునివెంట వెడలును. ఈపట్టున నాయకుఁడు కామముకన్న ధర్మము మిన్న యని గుర్తించినక్షత్రియోత్తముఁడుగా చిత్రింపఁబడి అంగరస మయినవీరము సూచింపఁబడినది.

---

1. ఉత్తరహరివంశము, పంచమాశ్వాసము.
2. ఉషాపరిణయము, తృతీయాశ్వాసము.
3. అనిరుద్ధచరిత్రము, తృతీయాశ్వాసము.
4. వసుచరిత్ర, తృతీయాశ్వాసము.

తిరిగివచ్చిన కువలయాశ్వుఁడు మదాలసను గానక విలపించుటలో విప్రలంభశృంగారము విశేషముగా వర్ణింపఁబడ్డది. ఇది యౌచిత్యమే! ఏల యనఁగా_ నాయికానాయకచక్షూ రాగాదులు కడచినతరువాత కల్పింపఁబడినవియోగ మిది. కనుక నిచట విప్రలంభమును వర్ణించుటలో ననౌచిత్యము లే దనఁదగును. ఇచట మూలమునందువలెనే కరుణము వర్ణింపఁబడవలయు నని ఆరుద్రగారి అధిక్షేపణ(1). కాని, నాయికానాయకులయం దొకరు మరణించినప్పైన కరుణము, మరణించినవారు పునర్జీవితులగుదు రనునాశ యున్నచో కరుణవిప్రలంభము, మరణింపనిచో కేవలము విప్రలంభమునే వర్ణింపవలయును. మదాలస యెటు వోయెనో తెలియ దనుటయే కాని మరణించిన దనునిశ్చయ మిచట లేదు. కనుక నిచట విప్రలంభమును ప్రవేశపెట్టినందులకు కవిని మెచ్చవలయునే కాని నొచ్చుకొనవలసినపని లేదు. మరణించనివారికై విలపించుటలో శోకము పరిపుష్టము కాదు గదా! శోకము పరిపుష్టి చెందనప్డు కరుణ మెట్లు నిర్వహింపఁబడును? రామాదులయందును విప్రలంభచ్ఛాయలు కలవు. కాకపోతే. అవి నాయకరాజులకాలమునందలికావ్యములందు మోతాదు మించినవి. అందుకు కారణము కాలములో వచ్చినమా ర్పనవలయును.

ఇఁక నశ్వతరుఁడు పార్వతీపరమేశ్వరులను మెప్పించి, మదాలసను పాతాళమునకు రప్పించి, కువలయాశ్వునిని పిలిపించును. ఇచట వనవిహారమున నున్నమదాలసను చూచి, ఆమె యగునా? కాదా? ఆమెయే యైనచో కుండల యేమయ్యెనో? అని రాజుతలపోయు చుండఁగా తార మదాలసచెంతకు వచ్చుట, తన వృత్తాంతమును మదాలస యడుగఁగా విస్తరించి వచించుట మొదలయినకథాభాగము సుదీర్ఘముగ సాగినది.(2) నాటకమునందలిపతాకాస్థానమువంటి దిచట నాయికను నాయకుఁడు చూచుట.

ఇక్కడ కూడ నాయికపాత్రచిత్రణవిషయమును సూక్ష్మేక్షికతో చూడఁ దగును. పాతాళమునకు తెప్పింపఁబడినమదాలస తనయునికినిగూర్చి కాని, తన

1. సమగ్రఆంధ్రసాహిత్యము, 11వసంపుటము, పుట157.

2. 4_176నుండి5_77వఱకు(మొత్తము111పద్యములు).

ప్రియునివిషయములనుగుఱించి కాని అశ్వతరునివి అడుగనజాడలు కనరావు. దీనికి కారణము నిట్లూహింపవచ్చును—మేరుశిఖరమునం దున్నతాను హఠాత్తుగ అశ్వతరునింట వెలసినది. ఎట్లు వచ్చెనో తనకే తెలియదు. కాని, యిచట తన్ను హింసించువా రెవ్వరును లేకపోఁగా తనకు పరిచర్యలు చేయుట కెందఱో నియమింపఁబడి యున్నారు. తండ్రివలె సంరక్షించు చున్నయశ్వతరుఁడు, సోదరులవంటినాగకుమారు లున్నారు. ఇది యంతయు పరిశీలించినమదాలస తనయాపదలు గట్టెక్కుటకు ఇది తొలిమెట్టని భావించి యుండవలయును. కనుకనే గతస్మృతులతో కలఁతపడక, భావినిగూర్చి తహతహపడక ఒకవిధ మయిననిర్వితర్కస్థితియం దున్న దనవచ్చును. ఇఁక నిచట పుష్పాపచయ మొనరించు చున్నచెలికత్తియలవెంట తిరుగుట కేవలము వారిసంతసముకొఱకు, తనకాలక్షేపముకొఱకు ననవలయును. ఏది యెట్లు జరుగునో అట్లు జరుగునులె మ్మని అచటిపరిస్థితుల కనుకూలముగ నడచుకొను చున్నది. భావియందు మదాలస యోగిమాత కావలసి యున్నది. తచ్ఛాయలు స్ఫురింపఁజేయుటకే కాఁబోలు మదాలస నిచట నిర్వికల్పనుగా నిలిపినాఁడు ప్రబంధకర్త. ఇట్టిస్థితిలో నామెచెలి యయినతార వచ్చుటయు, తాళకేతుభంజనకుండలారక్షణమును విన్పించుటయు జరగెను. శత్రునిర్మూలన మయిన దనఁగా ప్రియసమాగమమున కాశ లేర్పడిన వన్నమాటే. ఇందువలన నిశ్చలముగ నున్నమదాలసా మానసహ్రదమున ప్రణయభావతరంగములు మరల కదలాడ సాగినవి. ఇట్లు మదాలసామానసమును రాగోన్ముఖము కావించుటకు తారాపాత్రప్రవేశము సహకరించిన దని చెప్పవచ్చును.

కడకు కల్యాణము పాతాళలోకమున అశ్వతరునిసమక్షమునందు జరిగినది. అందఱు నిచట కలసికొనిరి. అద్భుతరస మిచట పోషింపఁబడినది. దృశ్యకావ్యమునం దిది నిర్వహణసంధివంటిది. నిర్వహణసంధియం దద్భుతరసము పోషింపఁబడవలయును గదా! అందఱు ఆనందముతో అయోధ్యకు వచ్చిరి. కేళిగృహమున దంపతులధర్మశృంగారము పరిపుష్టి చెందినది. చిననారాయణుఁడు ఇచట ప్రదర్శించిననిగ్రహము ప్రస్తుతిపాత్రము.

ఇట్లు ప్రధానపాత్రము లయిననాయికానాయకపాత్రములను శృంగారలంబనములుగా చిననారాయణు పెద్దజాగరూకతతోనే చిత్రించినాఁ డనవచ్చును. నాయ

కుఁడు వేఁడువనితను గ్రహింపక మదాలసనే ధ్యానించుచు కడపినజీవితము కూడ ధర్మశృంగారమున కుద్దీపక మనవచ్చును. పూర్వరాగమందు నాయిక ప్రగాఢా నురక్త యగుటను కూడ ఆమ్రేడణయారాధన తత్పరత్వమునకు నిదర్శనముగా స్వీకరింప నొప్పను.

ఇఁక నితరపాత్రములయందు ఇంద్రునివిషయమున నొకింతయనౌచిత్యము పొరలుట చింత్యము. తారాజయంతులసరససల్లాపములకు ఇంద్రుఁడు నిండోల గమున సంతసించును. కొడుకు చెడిపొవు చున్నాఁ డని శచీదేవి అలుక వహిం పఁగా నామెముందే తారను పిలిపించి సొమ్ము లిచ్చు నింద్రుఁడు. అంతే కాదు. కోడలిని కోపగించును(1). మూలములోనియనుచితములను తొలఁగించుచు, ఔచితిని పోషించుచు కృతులు నిర్మించు ఁడని లాక్షణికులు కవులను హెచ్చ రించు చుండఁగా(2) నూతనకల్పనములయందే యిట్టియనౌచిత్యపుఘట్టములు పెట్టినచో నివి కావ్యవిలాసవతికాయముమీఁద కిలాసము లగును గదా! కాలప్ర భావ మనియు, అప్రధానపాత్ర మిది యనియు సరిపుచ్చుకోవలయును.

తారాజయంతనలకూబరులు స్వేచ్ఛాశృంగారమున కాలంబనములుగా చిత్రిం పఁబడుటచేత శృంగారాభాసము పరిపూర్ణముగ పోషింపఁబడినది.

కుండల పాతాళలోకమున సంభాషణాచాతుర్యము ప్రదర్శించి నాయికా నాయకసంధాత్రి యయినది.

పాతాళకేతుతాళకేతువులు రౌద్రమున కాలంబనములయి ప్రతినాయకులుగా చక్కఁగానే చిత్రింపఁబడిరి.

అశ్వతరుఁడు, అనామకు లయినయతనితనయులు ఆదర్శమూర్తులుగా చిత్రింపఁబడినారు.

---

1. చతుర్థాశ్వాసము_178.
2. శ్లో. యత్స్యా దనుచితం వస్తు నాయకస్య రసస్య వా।
   విరుద్ధం తత్పరిత్యాజ్య మన్యథా వా ప్రకల్పయేత్॥సాహిత్య
   దర్పణము, 6_50.

నారదునిపాత్రమున దేవత్వమునకన్న మానవత్వము మిన్నగా మేళవింపఁబడుట విశేషము. జయంతనలకూబరులు ద్వంద్వయుద్ధసన్నద్ధులు కాఁగా నెల్లరును చూడ వచ్చిరి. పోరు నాఁపుటకు ప్రయత్నింపవల దని వారిని హెచ్చరించుచు పోరుదిండి యి ట్లను చున్నాఁడు—

సీ. మన కేమి పని? చూచికొని యుండ, మీ వేమి
యనఁబోకుమీ' యని యనుసరించి,
నీకన్నె, మిచ్చట నీవగ్గె నెరయించి
పోరు దీర్పకు, మంచుఁ బొందుపఱచి,
మనచేతఁ గాదు వీరిని శాంతుల నొనర్ప,
నూర కుండెద, మంచు నొద్ద నిలిచి,
నానోటికడికి విఘ్నముఁ జేసినపుడె శ
పింతుఁ జుమ్మి! యని బెదరఁజేసి.

గీ. వారివైరంబుఁ బురికొల్పఁ జేరి, నార
దుండు వీణగవుసెనను దొలఁగఁజేసి,
మెట్లు తడఁబడ దుడుకుగా మేళవించి
నిలువ, వా రిద్దఱును రణోన్ముద్రు లైన. (5-60)

ఇట్టిసంభాషణము లవలీలగా నిర్మింపఁగలదక్షుఁడు చిననారాయణ అనుటకీప్రబంధమంతయు నుదాహరణమే. పాత్రచిత్రణమునకు ప్రధానముగ సహకరించునవి సంభాషణములే కదా!

ఇఁక నంగరసములు పరికింపఁబడవలయును. ఇవి యంగిరసమును ద్రిమింగకయే నడచిన నసవచ్చును. జయంతనలకూబరులు యుద్ధమునకు సిద్ధపడుట విని వారిగాయములు కట్టుటకు బొజ్జ లదరునట్లు వేలుపువెజ్జులు మందునంచులతో పరుగులెత్తుటలో హాస్యరసము(1). పాతాళకేతువులయందు రౌద్రము, యుద్ధఘట్టములో జితధ్వజునియందు వీరము; యుద్ధవర్ణనమున భయానకము. రణభూమిని వర్ణించుటలో బీభత్సము;(2). ఆకసమునుండి

1. పంచమాశ్వాసము-59.

2. ద్వితీయాశ్వాసము-148.

కువలయాశ్వము దిగుటలోను, తాళకేతువు కొలనిలో మునిఁగి అంతఃపురము నకు చేరుటలోను, విమానమునం దతఁడు మదాలసాకుండలలను మేరుధరణీధర మునకు తీసికొని పోవుటలోను, అశ్వతరునిగాన ప్రావీణ్యములోను, కడకు నందఱు నాగలోకమున కలసికొనుటలోను అద్భుతరసము; గాలవగిత పోవనవర్ణనా సందర్భమున శాంతమును చక్కఁగనే పోషింపఁబడి యున్నవి. కనుకనే కవితాకన్య నవరసాభిజ్ఞునే వరియించు ననువిషయమును పండితపెద్ది కృష్ణస్వామి యి ట్లను చున్నాఁడు—

సీ. శబ్దాపశబ్దవిచారి యైనట్టివ్యా
 కరణజ్ఞు జనకునిగాఁ దలంచు,
యుక్తివాదములచే నొప్పారుతార్కికు
 భ్రాతఁగా బుద్ధి నేర్పడఁ దలంచు,
నెఱి విరాదరవృత్తి నెఱపుమీమాంసకుఁ
 గదియంగ షండునిగాఁ దలంచు,
నొదిఁగి వైదికనిష్ఠ నుండునధ్యాపకుఁ
 గవలి దూరస్థునిగాఁ దలంచు,

తే. వివిధముగ నిట్టు లధిప ! కవిత్వకన్య
కావ్యనాటకలసదలంకారభావ
నవరసాభిజ్ఞు మది విజనాయకునిగఁ
దలఁచి, వరియించుఁ దను దానె వలపు మించి(1).

పాత్రచిత్రణరసపరిపోషణము లను రెండు కార్యములు పరస్పరసంబంధము కలిగిన వను విషయమును డా. వి. రామచంద్రగా రిట్లు తెలుపుచున్నారు-

"..... పాత్రచిత్రణము లేనిరసపోషణము లేదు. రసపరిపోషణము లేని పాత్రచిత్రణమును లేదు. అందుచేత నేకవి యైన చక్కఁగా రసమును పోషించె నని చెప్పినచో, అతఁడు పాత్రలను గూడ చక్కఁగా చిత్రించినట్లే, చక్కఁగా పాత్రలను చిత్రించె నన్నచో రసమును గూడ పోషించినట్లే"(2).

1. బిల్హణీయము-1-58.
2. వరూధినీ ప్రవరాఖ్యము-8. పుట 7.

కావ్యజీవితసౌందర్యమంతయు ఈరెండువిషయములపై నాధారపడి యున్నది కనుక కవియగువాఁ డీవిషయములయందు ప్రత్యేకదృష్టిని ప్రసరింపఁ జేయవలయును.

"వాగ్వైదగ్ధ్య ప్రధానే ఽపి రస ఏ వాత్ర జీవితమ్"

— అగ్నిపురాణము.



## సప్తమదళము

# శ్లేషవైచిత్రి

చమత్కారసారము కావ్య మనినా రాలంకారికులు. ఈకావ్యచమత్కార మంతయు శ్లేషపై నాధారపడి యున్నది. అందులకే యీ శ్లేషాలంకారము సాధారణాలంకారముగా పరిగణిత మైనది. విరోధాభాసముగాని, (శ్లిష్ట)ఉపమగాని, మఱి యితరాలంకారములుగాని శ్లేషవలననే తమయలంకారత్వమును నిలిపి కొను చున్నవి. శ్లేష లేనిచో కావ్యచమత్కారమే లే దనవచ్చును. వక్రోక్తి మున్నగున వెన్నియో యేతన్మూలకములే. ఈశ్లేష మప్రసిద్ధార్థము లాధారముగా కల దయి కేవలనిఘంటువులపయి నాధారపడినప్పుడు అధమములుగా పరిగణింపఁ బడినచిత్రకావ్యములపరణికి చెందిన దగును. అట్టికావ్యము లధమములని యాలంకారికులు నిందించుట జరగినది. కాని, యక్లిష్టశ్లేషయనునది కవియగు వానికి అభ్యర్థనీయము.

బాణభట్టు కవులకు కావలసినకావ్యసామగ్రిలో శ్లేషమును పరిగణించి నాఁడు కనుకనే కాదంబరిని శ్లేషాలంకారముతో నారంభించినాఁడు. అక్లిష్ట

శ్లేష-శక్తి యల్లే పూర్వజన్మ సుకృతమువలన కవి కలవడునది. అందులకే తెలుఁగున వసుచరిత్రకుఁ గలస్థానము మఱియొక దానికి లభింపలేదు. ఆరామ రాజభూషణుఁడే హరిశ్చంద్రనలోపాఖ్యానము కూడ రచించినాఁడు. అయినను దానిస్థానము వేఱు, వసుచరిత్రస్థానము వేఱు. ఆసొగసువేఱు, ఈసొగసువేఱు వసుచరిత్రపరఆమన్యాదృశము. తెనుఁగున శ్లేషకావ్యము లెన్నో యున్నవి. ద్వ్యర్థులు, త్ర్యర్థులు, చతురర్థు లనఁదగుకావ్యజాత మెంతో కలదు. ఐనను అవి కేవలము కవి కగుపాండిత్యప్రకర్షను చాటి చెప్పునవియే! చమత్కారసారము కావ్యమనుకావ్యస్థాయికి చేరునవి కావు.

కవిత యనునది రెండువిధము లగును క్తివైభవములు గలది. అవి వక్రోక్తి, స్వభావోక్తి యనునవి(1). శ్లేష దీనికంతకు పోషక మని, వక్రోక్తికి శోభాదాయక మని దండిప్రవచనము(2). దండి కూడ భామహానివలెనే వాఙ్మయము స్వభావోక్తివక్రోక్తులతో ద్వివిధ మనుట నంగీకరించినాఁడు. 'కావ్యమ్' అనునప్పుడు "కవేః కర్మ" (కర్మ=చమత్కారజనక మగు వ్యాపారము) అనువ్యుత్పత్తిని వ్యాకరణము చూపినది. మనమాటలే ఒకవిశిష్టతను వహించి శ్రోతల కానంద జనకము లై కావ్య మనిపించుకొను చున్నవి. మనము సంభాషించునప్పుడు అర్థవ్యక్తికై సరళ మగువాఙ్మయమును మన యభిప్రాయమునకు ద్యోతకముగా నుపయోగించుకొందుము. అందే సంస్కారము గలవ్యక్తి రమణీయ మగునట్లు సంభాషించుచు మనోరంజకముగా లోకమునకు సన్నిహిత మగునట్లు శ్రోతల రంజింపఁజేయునట్లు భాషించును. ఇట్టి సంభాషణమునకే ఆలంకారికులు స్వభావోక్తి యని పేరు పెట్టినా రనవచ్చును. "స్వభావోక్తి రసౌ చారు యథావద్వస్తు వర్ణన" మ్మని వారిలక్షణము. లోకరంజనమునందు మఱియొక వ్యక్తి బాగుగా సంస్కారము గలిగినవాఁడు ప్రయత్న పూర్వకముగా తనసంభాషణము నేర్పఱచి, ఋజువుగా కాక కాక్వాదులతో

1. యుక్తం వక్రస్వభావోక్త్యా సర్వ మేవైతదిష్యతే ।
కావ్యాలంకారము, 1-30.

2. శ్లేషః సర్వాసు పుష్ణాతి ప్రాయో వక్రోక్తిషు శ్రియమ్ ।
భిన్నం ద్విధా స్వభావోక్తి ర్వక్రోక్తి శ్చేతి వాఙ్మయమ్॥
—కావ్యాదర్శము, 2-363.

వక్ర మగురీతిని తనసంభాషణ మేర్పఱచి, యందుమూలమ్మున రమ్య మగు నర్థాంతరస్ఫూర్తి కలిగించుచు తనవాక్యరచన సాగించుచు, అదియే వక్రోక్తి. శ్రీనాథుఁడు_

తే. ఒల్ల ననుమాట కర్థ మోయుత్పలాక్షి!
వలతు ననుమాట గాదుగా వక్రరీతి?

ననుకాకువుచే వ్యతిరేకార్థమును స్ఫురింపఁజేసి, దమయంతి 'ఒల్ల' ననఁగా 'వలతు' ననిన ట్లర్థాంతరము నొకదానిని సూచించి, నలుఁడు దమయంతి సంభాషణమును తనయాశయమున కనుకూలముగా త్రిప్పికొనుటకు ప్రయత్నించుచున్నట్లు రచించినాఁడు. ఈవక్రోక్తి క్రమక్రమముగా పరిపుష్ట మై రంజనావ్యాపారమునందు ముందంజ వైచి అలంకారముగా రూపొందుటయే కాక 'కావ్యజీవితసర్వస్వ మిది' యనురీతిని రూపొందినది. "వక్రోక్తిః కావ్యజీవితమ్' అనినాఁడు కుంతకుఁడు. కావ్యకర్తలలో సంస్కృతకవులు పెక్కురు ఈవక్రోక్తిపరిపోషణమునం దగ్రయాయు లై పేరుప్రతిష్ఠలు గడించుకొనినారు. ఇట్టివారిలో మహామహు లయినవారిని_

శ్లో॥ సుబన్ధు ర్బాణభట్టశ్చ కవిరాజ ఇతి త్రయః ।
వక్రోక్తి మార్గనిపుణాః చతుర్థో విద్యతే న వా॥ అని యనేకులు ప్రశంసించుటయు జరిగినది*. ఈ వక్రోక్తి శ్లేషపై నాధారపడి యుండెను. పైఁజెప్పినరీతిని మనమాటలే చమత్కారజనకము లై యొకవైశిష్ట్యమును సంపాదించి కావ్యము లనిపించుకొను చున్నవి. కనుకనే ముగ్ధమధురమధుర వాక్యరచనాసరళియే కావ్య మనుట. అట్టిమాధుర్యసంపాదనమునందు ప్రధాన స్థానము శ్లేషదే. పైనివచించినదాని కంతకును పరమార్థ మిదియే!

ఒకపద మనేకార్థములను బోధించును. ఆపద మట్టియర్థములను చెప్పుట శ్లేష మనవచ్చును. "శ్లిష్యన్తి శబ్దాః అత్ర" అని శ్లేషశబ్దమునకు వ్యుత్పత్తి. ఆ_శ్లేషము భంగశ్లేష మనియు, అభంగశ్లేష మనియు రెండు విధములు. జతుంషము (లక్క_పుల్ల)వలె శబ్దములు విఱిగి యనేకార్థములను బోధింపఁగలుట భంగశ్లేషము. విఱుగకయే యనేకార్థములను బోధింపఁ గలుట

* సంస్కృత వాఙ్మయచరిత్రము, ద్వితీయసంపుటము, పుట 305.

అభంగశ్లేషము. "ఏకేన అనేకస్యార్థస్య యుగపదుక్తిః శ్లేషో భంగాభంగాభ్యాం ద్విధా అని వాగ్భటుఁడు(1). ఇచటి రెండర్థములు ప్రకృతములే యై వాచ్యము లయినచో నవిరెండును శ్లేషార్థములే యగును. ఈ యర్థములపై నాధారపడియే శ్లేషకావ్యములు వెడలినవి. ఈ రెండర్థములయందు నొకటి ప్రకృతిమైనదిగా నుండి, రెండవది గూఢముగా సాగినచో చమత్కారజనక మగును. వసు చరిత్రి మిట్టి (గూఢ) శ్లేషపై నాధారపడి తెలుఁగుకావ్యము లం దన్నిటను ఒక విశిష్టస్థానమును సంపాదించుకొని యున్నది. ఆలంకారికులు కొందఱు ప్రకృతా ప్రకృతము లనువివక్ష లేక బోధింపఁబడినయెన్నియర్థము లయినను శ్లేషార్థ ములే యను చున్నారు. మఱి కొంద ఱట్లు గాక ఒక శబ్దమునకు ఒకేయర్థము వాచ్యమని, రెండవయర్థము స్ఫూర్తికి చెందిన దని యభిప్రాయపడు చున్నారు మల్లినాథాదులు అర్థద్వయము ప్రకృత మయినప్పుడు ప్రకృతము, కానప్పుడు (అప్రకృత మయినప్పుడు) అప్రకృతశ్లేష మనియు, ప్రకృత మొకటి అప్రకృత యొకటి యయినప్పుడు ప్రకృతాప్రకృతశ్లేష మనియు నభిప్రాయ పడు చున్నారు. ప్రకృతాప్రకృతశ్లేషలోని అప్రకృతార్థము వ్యంగ్యార్థ మని వారియాశయము. విశ్వనాథుఁ డుభయశ్లేషముకడ విశేష్యము శ్లేషింపక తద్విశేష ణము మాత్రము శ్లేషించినపు డుభయశ్లేష మని యభిప్రాయ పడుచున్నాఁడు(2). మల్లినాథునియాశయమే చాలవఱకు సముచిత మనిపించు చున్నది. ఈయెడ వారి మార్గమే అనుసరింపఁబడును.

తెనుఁగున నన్నయభట్టారకులవారు భంగాభంగశ్లేషలకు నాంది యొనర్చి నారు(3). తిక్కనసోమయాజి దీనిని కొంచెము పెంచెను(4). నాచనసోమన బహుళముగా ఈశ్లేషల నుపయోగించి శ్లేషకావ్యముల కొకవిధముగ మార్గ మేర్పఱచినాఁ డనవచ్చును. ఇతనిగద్యరచనయందు, అచ్చటచ్చట పద్యరచన

1. కావ్యానుశాసనము, 4 అధ్యా. 14 సూ. (పుట 50)

2. ప్రకృతాప్రకృతవిషయే ఽన్యభేదే విశేషణమాత్రశ్లిష్టతా. ప్రతాప శ్లేషాలంకారః.

3. ఆదిపర్వము, 2-27 (సముద్రవర్ణన)

4. విరాటపర్వము, 2-325. (నర్తనశాలావర్ణన)

యందును శ్లేషము వెల్లివిరిసినది(1). ఎఱ్ఱాప్రెగ్గడ దీనిని కాదనలేదు(2). ఇఁక శ్రీనాథుఁడు శృంగారనైషధమున నేమి, భీమేశ్వరపురాణమునం దేమి, యించుమించు నన్నిగ్రంథములందును శ్లేషరచన సాగించినాఁడు(3). పోతన యాశ్లేషనెంతో బహూకరించుచు తనగద్యపద్యరచనలయం దచ్చటచ్చట పెంపుసొంపులు నిర్మించినాఁడు(4). ఇఁక పింగళి సూరన శ్లేషకావ్యములకే అంకురార్పణ మొనర్చి రాఘవపాండవీయము రచించినాఁడు. రచించుటయే కాక అద్వ్యర్థికావ్యమునందు తనకుఁ గలమక్కువను గూడ చాటిచెప్పినాఁడు*. ఆతరువాత ఈతని ఘనతను ఓర్వ కున్నాఁడో అనునట్లు రామరాజభూషణుఁడు హరిశ్చంద్రనలోపాఖ్యానమును రచించి సూరన్నను మించినాఁ డనిపించినాఁడు. అంతటితో సంతృప్తి చెందక రెండుకథలను కూర్చుట అనుగారడీవనిని విడిచిపైచి, యాశ్లేషకావ్యము లన్నిటిని త్రోసిరాజని శాశ్వతముగా తనకే కాక తెనుఁగుబాసకు కూడ సుస్థిరయశోవైభవ మాకల్పస్థాయిగా నిల్పఁగల్గి, శ్లేషకావ్యమయియు ధ్వనిప్రధానముగా నుత్తమకావ్యజాతమునకు చెందునట్లు వసుచరిత్రము రచించి, శ్లేషకుఁ గలగొప్పతన మెట్టిదో చాటిచెప్పినాఁడు. ఆతరువాత రాఘవపాండవయాదవీయము మున్నగుత్ర్యర్థికావ్యములు సైతము తెనుఁగునం దవతరించినవి. విజయవిలాసము, సారంగధరచరిత్ర మున్నగునవి యాశ్లేషవైచిత్ర్యమును ఆంధ్రరమణీమణి కౌకమణిహారముగా చిత్రించినవి. ఎంద తెన్నివిధముల దీనిని సాగించినను వసుచరిత్ర కిందుఁ గలస్థానము మఱి దేనికిని లే దనియే సహృదయులయాశయము. చాలవఱకు వసుచరిత్రము ననుకరించుచు చిననారాయణకవి కువలయాశ్వచరిత్రరచన సాగించినాఁడు. ఈతనికి శ్లేషపట్ల మక్కువ యెక్కువ యని క్రిందనుదాహరింపఁబడువద్యములే విశదపఱచును.

1. ఉత్తరహరివంశము, 2-110, 160 మొదలగునవి.
2. నృసింహపురాణము, 1-55 మొదలగునవి.
3. శృంగారనైషధము, 5-164,167 168,169 మొ. భీమేశ్వరపురాణము 1-110 మొ.
4. ఆంధ్రమహాభాగవతము, 6-326, 10పూర్వ. 758, 767 మొదలయినవి.

* ప్రక్కపుట చూడుము.

ఈగ్రంథమునం దంతట నున్నశ్లేషపద్యములు దాదాపు నలువది. వాని నన్నింటిని వివరించుట వ్యాఖ్యానప్రాయము కాఁగలదు, కనుక నీతని శ్లేషవైచిత్ర్యమును వెలువరించునవియగు నుపద్యములు మాత్రము వివరింపఁబడి వ్యాసవిస్తరభీతి పైఁ బొలఁగింపఁబడును.

సీ. ప్రతివాదిమర్మనిర్మథనకర్మఠ మైన
  బాణసౌశీల్యంబుఁ బ్రస్తుతించి
ఘనశబ్దసాంగత్యజనితాత్యధిక మోద
  గరిమఁ గన్నమయూరసరణి నెన్ని
మాలతీమాధవమహిమఁ బూజిత మైన
  భవభూతిమార్గంబుఁ బరిగణించి
సారవవార్థపోషణధురీణం బైన
  భారవియుదితవిభ్రమముఁ బొగడి

తే. వెండియును గాళిదాసాదివిబుధవరులఁ
దలఁచి, 'యుష్మత్కవిత్వసందర్భగౌర
వార్థ్యహం బలు దాతు మర్హథ' యటంచు
వారికృపఁ గొంతుఁ గవితాదివైభవంబు. (1-9)

ఇందు చిననారాయణ పూర్వసంస్కృతకవులను కొందఱను స్తుతించుచు వారికవితాదివైభవమును సవినయముగా నర్థించు చున్నాఁడు. ఈపద్యము నరస భూపాలీయములోని కవిస్తుతిని+ స్ఫురింపఁజేయుచు అభంగశ్లేషతో రూపొంది యున్నది. దీని కర్థద్వయము నిట్లు గ్రహింపవలయును—

* శా. రెండర్థ కృతియు నిర్మింపంగ శక్యంబు గా
కుండుం దద్గతిఁ గావ్యమెల్ల నగు నే నోహో! యనం జేయదే
పాండిత్యంబున నందునుం దెనుఁగుకబ్బం బద్భుతం బండు ద్ర
ఢిం దేవ్వాఁ డిల రామభారతకథల్ జోడింప భాషాకృతిన్.

రాఘవపాండవీయము, పీఠిక—10.

\+ సీ. బాణువేగంబును భవభూతిసుకుమారతయు మాఘుశైత్యంబు దండిసమత

— నరసభూపాలీయము, 1-15

"బాణసౌశీల్యంబు" అనుచోట బాణకవియొక్క మంచినడత యని యర్థము. బాణముయొక్క వేగముతోడినడక అని యర్థాంతరము. బాణునిపక్షమున ప్రతివాదులయొక్క రహస్యములను మథించుట యనెడివ్యాపారమున సమర్థమయి బాణునికవితాసరణి యున్నదని యర్థము. బాణముపక్షమున శత్రువులమర్మస్థానములను బాగుగా బాధపెట్టుట యనువ్యాపారమునందు సమర్థమై యున్నదని యర్థము. ఇట్లే—

మయూరసరణి = మయూరకవియొక్క కవితారీతి (ప్రకృతార్థము).
= నెమలియొక్క తెన్ను (రెండవయర్థము).

అని మయూరకవిపక్షమున గొప్పవయినశబ్దములయొక్క సంగతిచేత కలిగించెడి అత్యధికసంతోషాతిశయము కలిగి యున్నదని యర్థము. నెమలిపక్షమున మేఘశబ్దముయొక్క సాంగత్యముచేత (మేఘధ్వనిని వినుటచేత) కలిగింపఁబడిన అధికసంతోషాతిశయము కలిగి యున్నదని యర్థము.

భవభూతిమార్గంబున్ = భవభూతికవియొక్క త్రోవను (ప్రకృతము).
= శివునివిభూతివిధమును (అప్రకృతము).

భవభూతికవిపక్షమున 'మాలతీమాధవ' మనెడిగ్రంథముయొక్క గొప్పతనముచే (జనులచే) పూజింపఁబడు చున్నదని యర్థము. శివునివిభూతిపక్షమున జాజిపూవులయొక్కయు, తులసిదళములయొక్కయు (వాసనయొక్క) గొప్పతనముతో పూజింపఁబడు చున్నదని యర్థము.

భారవియుదితవిభ్రమము = భారవికవియొక్క వాగ్విలాసము.
= సూర్యునియొక్క ఉదయవిలాసము.

కవిపక్షమున శ్రేష్ఠమయిననూతనార్థములసృష్టిని వహించి యున్నదని యర్థము, సూర్యునిపక్షమున నూతనవస్తువులపరిపోషణమందు సమర్థమై యున్నది అని.

ఇట్టిశ్లేషస్థలములయం దప్రకృతార్థము నుపమానమునకు చెందినదిగా వచించి, ప్రకృతార్థము నుపమేయపరముగా సమన్వయింతురు కొందఱాలంకారికులు. ఈపద్యమునుబట్టి యీతఁడు బాణమయూరభవభూతిభారవులప్రౌఢకవితా

సరణిని తా ననుసరించినట్లు తెలుపుచున్నాఁడు. అట్టిప్రౌఢోక్తుల క్రింద చాలపట్టుల తావు కల దనుటకు సందియము లేదు. మొదటిపాదమునందే బాణసౌశీల్యమును కొనియాడుటవలనట్టి యీతనిశ్లేషప్రియత్వము చెప్పక చెప్పఁబడు చున్నది. ఈ పేర్కొనఁబడినవా రందఱును సంస్కృతములో ప్రౌఢకవితకు అవలంబన మయిన మహాకవులు. తరువాత స్తుతించు చున్నాఁడు కాళిదాసాదివిబుధవరులను. మునుముందు కాళిదాసాదులను పేర్కొనక యీకవి యిట్లు వెనుక పేర్కొనుట యీతనిశ్లేషప్రియత్వమునకు ప్రబలనిదర్శనము. ఈ గ్రంథము ప్రౌఢకవితాప్రియంభావుకముగానే చాలవఱకు సాగినది. కవిప్రయత్నము కూడ నట్టిదే యని తెలియవచ్చును.

కం. ఆరసికమౌళిముద్దుఁగు
మారుఁడు శరజాతవృత్తి మనియె, గ్గనియెం
దారకగర్వనివారక
సారకనత్కీర్తి లక్కజనపతి ధరణిన్. (1-26)

ఇందు లక్కరాజు వర్ణింపఁబడు చున్నాఁడు. అతఁడు కుమారస్వామివంటివాఁడుగా నున్నాఁ డని శబ్దశక్తిమూలధ్వని. లక్కరాజుపక్షము→ ఆరసికమౌళిముద్దుఁగుమారుఁడు= రసజ్ఞశ్రేష్ఠుఁ డగుతిమ్మరాజుయొక్క ప్రేమాస్పదుఁ డయిన కుమారుఁడు లక్కరాజు. కుమారస్వామిపక్షము → రసికుఁడు = చంద్రుఁడు [రసము=అమృతము*. అది కలవాఁడు రసికుఁడు. "అత ఇని ఠనౌ (5-2-115)" అని మత్వర్థమున 'ఠన్' ప్రత్యయము]. అతఁడు (రసికుఁడు) మౌళియందు కలవాఁడు=శివుఁడు. అతనియొక్క (శివునియొక్క) ప్రేమాస్పదుఁ డయిన(కుమారుఁ డను పేరు గల)కుమారుఁడు(కుమారస్వామి).

శరజాతవృత్తిన్ = (లక్కరాజుపక్షము) బాణసమూహములతో నయిన యునికితో
(కుమారస్వామిపక్షము)తెల్లుసమూహము(శరవనము)నందలియునికితో[కుమారస్వామి శరవణభవుఁ డగుట ప్రసిద్ధము].

శృంగారముఖ్యమధురాది. సుధాంబురసాఖ్యధాతు ష్విష్టో రసః
-నానార్థరత్నమాల.

మనియెన్=ఒప్పెను (ఇరుపక్షములందు సమానము). తారకగర్వనివారక సారకనక్షత్రకీర్తిన్=(లక్కరాజుపక్షము)నక్షత్రములయొక్క(1) గర్వమును వారించెడిశ్రేష్ఠమై ప్రకాశించెడికీర్తిని;లక్కజనపతి=లక్కరాజు; ధరణిన్=ఈలోకమున; కనియెన్=పొందెను. తారకగర్వనివారకసారకనక్షత్రకీర్తిన్ = (కుమారపక్షమున) తారకాసురునియొక్క(2) మదమును పోఁగొట్టెడిశ్రేష్ఠమై ప్రకాశించెడి కీర్తిని;కనియెన్=పొందెను.

ఇట్టిచోట్ల (విశేష్యము శ్లేషింపనప్పుడు) కొందఱాలంకారికులు శ్లేష యనక శబ్దశక్తిమూలధ్వని యందురు. వారిమతము చొప్పున శబ్దశక్తిమూలధ్వనికి చెందినది రెండవయర్థము. ఈరెండర్థములపరమార్థము ఉపమానోపమేయ భావమే!

సీ. సకలాగమస్ఫూర్తిఁ జరియించుభూసురుల్
వనసలు కొన్ని యేర్పఱచు టఁడె
యనుపమధైర్యశౌర్యాఢ్యరూఢి గలనృపుల్
ఘనచక్రవైభవం బెనయు టరుదె
రాజరాజప్రౌఢి రహిఁ గలకోమటుల్
వరవైభవంబున వరలు టరుదె
కువలయప్రఖ్యాతిఁ గొమ రొందుశూద్రులు
ద్విజరాజభక్తి భావించు టరుదె
గీ. యనఁగ సుమనఃప్రవృత్తిచే నతిశయిల్లి,
యచ్యుతస్థితిఁ జెంది, కర్ణాతిసఖ్య
సరణి గణనకు నెక్కుచు, సరసులందు
వెలసి, సన్నుతి గాంతు రప్పీటియందు. (1-81)

ఈపద్యము సాకేతపురీవైభవమునకు చెందినది. ఇందు బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులయతిశయము వర్ణింపఁబడినది. ఇందు శ్లేషించినపదముల కర్థప్రదర్శనము కావింపఁబడు చున్నది—

1. 'నక్షత్రే తారకం తారకేతి చ'అని విశ్వము.
2. 'తారకః కర్ణధారౌ చ దైత్యే చ'అని విశ్వము.

భూసురులు → సకల + అగమస్ఫూర్తి = అన్నిచెట్లయొక్క ప్రకాశము.
సకల + ఆగమస్ఫూర్తి = అన్నిశాస్త్రములయొక్క ప్రకాశము.
పనసలు = పనసచెట్లు; వేదమునందలిప్రశ్నములు.

నృపులు → అనుపమధైర్యశౌరి + ఆరూఢి = నిరుపమాన మయిన ధైర్యముచేత విష్ణువుయొక్క ప్రసిద్ధి.
అనుపమధైర్యశౌర్య + ఆరూఢి = సాటిలేనిధైర్యముచేత శౌర్యముచేత కలిగినప్రసిద్ధి.
ఘనచక్రవైభవంబు = గొప్ప దయినసుదర్శనమునకు (1) కైవలఅధిపత్యము (చక్రధారిత్వము); గొప్ప దయిన రాష్ట్రము(2) యొక్కఆధిపత్యము.

కోమటులు → రాజరాజప్రౌఢి = దుర్యోధనునియొక్క నేర్పరితనము,
= కుబేరునియొక్క గొప్పతనము.
వరవైభవంబు = శ్రేష్ఠ మయినప్రాభవము (ప్రభుత్వము) కలిగి యుండుట [దుర్యోధనపక్షము].
= గొప్పయైశ్వర్యము (నవనిధులు) కలిగి యుండుట [కుబేరపక్షము].

శూద్రులు → కువలయప్రఖ్యాతి = కలువ లనెడిప్రసిద్ధి.
= భూమండలమందలికీర్తి.
ద్విజరాజభక్తి = చంద్రునియందలిభక్తి.
= బ్రాహ్మణశ్రేష్ఠులయందలిభక్తి(3)

సుమనఃప్రవృత్తి = పుష్పములు కలిగి యుండుట.
= మంచిమనస్సుయొక్క నడవడిక.

అచ్యుతస్థితి = విష్ణువుగా నుండుట.
= భంగపాటు లేనియునికి.

---

1,2. "చక్రం రాష్ట్రం చ సంఘ శ్చ చక్రం రథాఙ్గం చక్ర మాయుధమ్" అని శబ్దరత్నప్రదీపము.

3. 'ద్విజరాజ' అనునప్పు డుత్తరపద మయిన'రాజ'శబ్ద మిట శ్రేష్ఠతావాచి.

కర్ణాతిసఖ్యసరణి = కర్ణునితో అధిక మయినస్నేహము(ప్రాణస్నేహము)తోడి ప్రవర్తన.
= చెవుల కతిస్నేహము కల దయినసరణి(చెవుల పందు వయినప్రీతితో గణన కెక్కుచు).

సరసులు = కొలఁకులు,
= సహృదయులు.

అర్థనిర్దేశమునకై పైపదములు ప్రథమాంతములుగా గ్రహింపఁబడినవి. ఈయర్థప్రదర్శనమునుబట్టి తాత్పర్య మూహ్యము. గీతికాభాగములో విశ్లేషించిన నాలుగుపదములు నాలుగువర్ణములకు క్రమముగా నన్వయింపవలసి యున్నవి. దీనింబట్టి యిందు క్రమాలంకారము(యథాసంఖ్యాలంకారము) గూడ నిబంధిత మనుట స్పష్టము. ఈప్రథమాశ్వాసమున నింకను శ్లేషచమత్కృతివిలసితము లైనపద్యములు పదునేడు గలవు*.

ద్వితీయాశ్వాసమున శ్లేషవాసన లేకుండుట వింతగ నున్నది.

తృతీయాశ్వాసమం దయిదుపద్యములందు శ్లేష భాసించు చున్నది. అం దొక్కదానియర్థ మిట ప్రదర్శింపఁబడు చున్నది—

మ. సరసాళుల్ నిజగంధ మానుచుఁ జరించం గుంభినీజాతముల్
వరుసం జుట్టుఁ జెలంగు చుండఁగ, మహావాలంబు గుంజా ప్తిచేఁ
గర మొప్పార, సుధాప్రభావమధువుల్ గ్రాలన్, విదాహోతివి
స్ఫురితం బై విలసిల్లె నోయబల! యీపున్నాగముం జూచితే? (3-122)

కథానాయిక మదాలస చెలికత్తియలతో కలసి వనవిహారము సేయు చున్నది. వారిలో 'కుండల' యనుచెలికత్తె పున్నాగవృక్షమును చూపి మదాలసతో ని ట్లను చున్నది. ఇందు పున్నాగవృక్షము, మగయేనుఁగు శ్లేషముతో వర్ణింపఁబడు చున్నవి. గమనింపుఁడు—

---

* కువలయాశ్వచరిత్రము, ప్రథమాశ్వాసము—౭,16,27,28,30,31,38,43,44,49,52,53,71,79,83,84,87పద్యములు.

సరసాళుల్ = ఆనందముతో కూడినతుమ్మెదలు(వృక్షపక్షము).
= (ఏనుఁగుపక్షమున కూడ పైయర్థమే).

నిజగంధము = తనయొక్క(పుష్పమకరందాదుల)వాసన.
= తన(మదపు)వాసన.

కుంభినీజాతముల్ = చెట్లు.
= ఆఁడేనుఁగులయొక్క సమూహములు.

మహావాలము(మహత్ + ఆవాలము)=గొప్ప దైన(విశాల మైన)పాదు.

మహావాలము (మహత్ + వాలము)=ప్రశ స్త మయినతోఁక.

గుంజాప్తి(గుంజా + ఆప్తి)=పూసలగురివెందతీఁగలను పొంది యుండుట.
= పూసలగురివెందతీఁగలను చుట్టుకొని యుండుట.

సుధాప్రభావ—మధువుల్ = సుధయొక్క గొప్పతనము కల(అమృత మట్లు తియ్య నయిన)మకరందములు.

సుధాప్రభా_వమధువుల్ = అమృతముయొక్క కాంతివంటికాంతి గల తుంపరులు[వమధువులు(1)=తుంపురులు].

వి—దాహ + అతి—వి—స్ఫురితంబు = పోయినతాపము గలచాలపక్షులచే ప్రకాశించునది[వి=పక్షి(2)].

విదాహ + అతి—విస్ఫురితంబు=విశేష మయినదాహము(శరీరమందలిదాహము) చేత అధికముగా ప్రకాశించు చున్నది.

ఏనుఁగుశరీరమునం దౌష్ణ్యమువలనిబాధ యెక్కువగా నుండును. అది యెండవలనితాపమును సహింపఁజాలదు. అందులకే అది సరస్సునందు బురద ఉఱక చల్లుకొనుట, తామరాకులు శరీరముపై వైచికొనుట జరపు చుండును. 'గజస్నాన' మనుట ప్రసిద్ధము. దీనిం బట్టి పైపద్యమునందలిశ్లేషవిశేషములు స్పష్టములు. ఇందు కొన్నిపదములకడ నభంగశ్లేషము, కొన్నింటికడ సభంగశ్లేషము నుండుట జరిగినది(3).

---

1. 'వమథుః కరశీకరః' అని హలాయుధము_216.

2. 'విశ్చ పక్షీ నిగదితో గగనం పరికీర్తితమ్' అని ఏకాక్షరకోశము_32.

3. ఈయాశ్వాసమున మిగిలిననాలుగుశ్లేషపద్యములు_120,132,157,160

మఱి చతుర్థాశ్వాసమున శ్లేషవేషాన్వితపద్యములు పదునెనిమిది కన్పట్టు చున్నవి. ఇందుండి యిట్టే రెం డుదాహరింపఁబడు చున్నవి.

తే. అమృతరామకమండలు, హరిణకృత్తి
కాసమన్వితు, నుద్దండకరుని నిన్నుఁ
గన్న సన్న్యాసిగతి దోఁచు చున్న దరయ
గగనమధ్యాభియుక్తి నీ కగునె చంద్ర? (4-21)

ఇది చంద్రోపాలంభనమందలిది. విరహిణి మదాలస చంద్రు నిం డుపాలంభించు చున్నది. ఇందు ఇందునకు శ్లేషమూలకముగ సంన్యాసితో పోలిక చెప్పఁబడు చున్నది.

అమృతరామ—క(1)—మండలుండు = అమృత మనెడిమనోహర మయిన జలసమూహము కలవాఁడు(చంద్రపక్ష మిది).

అమృత(2)రామ—కమండలుఁడు = నీటిచేత మనోహర మయినకమండలువు గలవాఁడు(సన్యాసిపక్ష మిది).

హరిణకృత్తికాసమన్వితుఁడు = లేడిలోడను, కృత్తికానక్షత్రముతోడను కూడినవాఁడు(చంద్రపక్షము).
= లేడిచర్మముతో కూడినవాఁడు(సంన్యాసిపక్షము).

ఉద్దండకరుఁడు = గొప్పకిరణములు కలవాఁడు(చంద్రపక్షము).
= ఎత్తయినదండము కలచేతులు కలవాఁడు(స.ప.).

గగనమధ్య + అభియుక్తి = ఆకాశమునడుమ అభియోగము(సంబంధము).
గగనమధ్యా + అభియుక్తి = స్త్రీలపైని అభియోగము(దండయాత్ర)(స.ప.).

ఇట్లు చంద్రుని సంన్యాసిగా చమత్కరించినకవులు తెనుఁగున లే రనిపించు చున్నది. సన్యాసులకు స్త్రీపీడనమే కాక, స్త్రీప్రసంగములు కూడ నిషిద్ధములు గదా! అందువలన చమత్కృతిమహిత మయినయీచంద్రోపాలంభము మిక్కిలియర్థవంతము, సహృదయానందసంధాయకము ననుట సత్యదూరము కాదు. ఈసందర్భమునందే మఱియొకపద్యము—

1. కం శిరో జల మాఖ్యాతం కం సుఖం చ పరికీర్తితమ్—అని ఏకాక్షరకోశము.
2. అమృతం యజ్ఞశేషే స్యా త్పయూషే సలిలే ఘృతే—అని విశ్వకోశము.

గీ. శరధిఁ దోఁచుట, నాళీకపరవిధంబు
గోరి కాంచుటయును, మ్రోయుగుణము గల్గ
వింట నంటుట, మ మ్మేఁచు చుంట తెలిసె
నేయువారలఁ గానమో తోయజారి! (4—21)

ఇందు చంద్రునకు మన్మథునితో శ్లేషమూలక మయినపోలిక గలదు. గమనింపఁదు—

శరధిఁ దోఁచుట=అమ్ములపొదితో తోఁచుట(మన్మథపక్షము).
=సముద్రమునందు తోఁచుట(చంద్రపక్షము).
నాళీకపరవిధంబు=బాణములయం దాసక్తి కలిగెడిరీతి(మ.ప.).
=తామరలతోడిశత్రుత్వము(చంద్రపక్షము).
మ్రోయుగుణము గల్గువిల్లు=ధ్వని చేసెడియల్లెత్రాదు(తుమ్మెదలు) గల్గుధనుస్సు(మన్మథపక్షము).
=శబ్దించుగుణము(*) గల్గువిన్ను(విన్ను- ఆకాశము)(చంద్రపక్షము).

ఇం దిందుని మదనునితో పోల్చుటలో నొకరహస్యము కలదు. విరహిణులకు చంద్రమన్మథు లిరువురును తాపకారులే కనుక విరహిణీతాపకారి యయిన చంద్రుఁడు విరహిణీతాపకారి యయినచంద్రునితోనే పోల్పఁబడుట ఔచిత్యచమత్కారములకు పరాకాష్ఠ. పైఁగా వారిరువురు బంధువులు కూడ. అందువలన నిరువు రేక మై బాధించు చున్నా రనెడిస్ఫూర్తియు లభించు చున్నది. మఱియు 'ఏయువారలఁ గానము' అనుటలో మన్మథుఁడు అనంగుఁడు(శరీరము లేనివాఁడు) కనుక కన్పించుట లే దనియు గ్రహింపవలయును. ఇంకను "ఓయి తోయజారి నీవు తామరలకు శత్రువవు. మదనుఁడేమో తామర లమ్ములుగా తాల్చినవాఁడు కనుక మదనునిబాణము లయినతామరలను రూపుమాపి, అతనికి (తామరస) బాణములు లేకుండఁ జేసి మాపైకి రాకుండఁ జేయవలసిననీవే అతనివలె ప్రవర్తించుట న్యాయ్యము కాదు" అని నాయిక వేఁడు చున్నట్లును ధ్వనివిశేషమును గ్రహింపవీలగు చున్నది. ఇట్లెన్నియో విశేషములు కలుగునట్లు

* శబ్దగుణక మాకాశమ్—అని తర్కసంగ్రహము,పుట13.

పద్యనిర్మాణము కావించుటయే "రమణీయార్థప్రతిపాదకశబ్దః కావ్య" మ్మనిన జగన్నాధునిలక్షణమునకు లక్ష్యము. ఈయాశ్వాసమునం దింకను శ్లేషగుంఫితము లయినపద్యములు పదునా ఱున్నవి*.

పంచమాశ్వాసమున నొకేపద్యమున నొకపాదమున నొకపదమందు మాత్రమే శ్లేష యున్నది. అది మదాలసను చెలకత్తియలు కేళీగృహమునకు నడపుసందర్భములోనిది. అది యిది—

తే. తార కుండల మొదలై నతలిరుఁబోఁడు
లమ్మదాలసఁ జూచి, రావమ్మ! నీకు
'వరశుభప్రాప్తి' చేకూరవలయు ననుచు
ననుచు వేడుకఁ దమలోన నవ్వుకొనుచు. (5–104)

ఇందు 'వరశుభప్రాప్తి' యన్నచోటనే యున్నది శ్లేష. 'శ్రేష్ఠము లయిన శుభములయొక్క లాభము' అని ప్రథమార్థము. 'వరునియొక్క శుభము కలిగించెడి(సంతానజనక మయ్యెడి)పొందు(సమాగమము)" అని ద్వితీయార్థము. మదాలస రక్కసులబారినుండి రక్షింపఁబడి, పెండ్లియై, కోరినరాజుతోడ కూడ నున్నది కనుక అటువంటివెత లింక రాకుండ శ్రేష్ఠ మయిన శుభములనే ఆమె యిఁకపై పొందవలయు నని చెలికత్తె లాకాంక్షించుచున్నట్లు భావింపవలయును.

ఈవిధముగా చిననారాయణ చిత్రవిచిత్రర్థాంతరములను శ్లేషమూలకముగ నిబంధించి నిరుపమప్రజ్ఞను ప్రదర్శించినాఁడు. ఒండు రెండుచోట్ల క్లిష్టశ్లేష లున్నను మొత్తముమీఁద నక్లిష్టశ్లేషలే మిక్కిలిగా నున్నవి. దీనింబట్టి శ్లేషనిర్వహణమునం దితనికిఁ గలసామర్థ్యము స్పష్టపడు చున్నది.

శ్లో. నవో ఽర్థో జాతి రగ్రామ్యా శ్లేషో ఽక్లిష్టః స్ఫుటో రసః।
వికటాక్షరబన్ధ శ్చ కృత్స్న మేకత్ర దుష్కరమ్॥
బాణభట్టు

* చూ. 7,8,9,10,11,13(ఇదిసీసము. ఇందు నాలవపాదముననే శ్లేషము)' 15,17,19,22,23,26,27,28,29,152.

# అచ్చ తెనుఁగుసొబగులు

'అచ్ఛః' అనుప్రకృతినుండి ప్రభవించినవికృతిశబ్దము 'అచ్చము'. దీనికి శుద్ధము లేక నిర్మలము అని యర్థము. ఈనిర్మలత్వమును భాషాపరముగా నన్వయించునప్పుడు అన్యభాషాసంపర్కము లేనియేభాష యైనను అచ్చమే! అనఁగా అన్యభాషాసంపర్కము ఏరూపములోను లేనిభాషయే అచ్చ మైనభాష. తెనుఁగునకు సంబంధించినంతవఱకు-సంస్కృతప్రాకృతసమములు, సంస్కృతప్రాకృతభవములు, ఇతరభారతీయభాషాపదములు, అన్యదేశీయభాషాపదజాలము లేని తెనుఁగుభాషాపదసముదాయమును, దానితో కూడినవాక్యసముదాయమును అచ్చతెనుఁ గనవలసి యుండును కాని లాక్షణికులు తద్భవపదసముదాయమును కూడ అచ్చతెలుఁగున చేర్చి యున్నారు*. అంతే కాక అచ్చతెనుఁగుకబ్బములందు తత్సమములు మాత్రము పరిహరించి, తద్భవములతోపాటు ఇతరభారతీయేతరపదసముదయమును కూడ నాదరించినారు కవులు. ఇట్లన్యభాషాపదసముచ్చయ మచ్చతెనుఁగు కావ్యముల కెక్కుటకు బలీయ మయినకారణ ముండి యుండవలయును.

ఒకజాతియొక్క సాంస్కృతికజీవనము భాషావ్యవహారమునకు సంబంధించి రెండువిధములు. లౌకికవ్యవహారము, కావ్యవ్యవహారము-అనునవి ఆరెండు లౌకికవ్యవహారమునందు 'వర్తకవాణిజ్యాది' అనేకకార్యకలాపములవలన అన్యభాషాపదసముచ్చయము స్థానికజీవనస్రవంతిలోనికి చొచ్చుకొని వచ్చును. కొంతకాలమున కది స్థానికభాషావ్యవహారముతో తాదాత్మ్యము చెందును. అట్టిస్థితిలో ఆపదసమాహారము దేశభాష(మాతృభాష)నుండి విడదీయరానిసంబంధము కలిగి, అది యాత్మీయముగనే భాసించుటచే కృతికర్తలచే స్వీకరింపఁబడి సాహిత్యములోనికి ప్రవేశించును. దీనిప్రభావ మెంతటిబలీయ మయిన దనఁగా కావ్యప్రారంభమున తాము తమకై నిర్దేశించుకొన్నలక్ష్యమును కూడ మఱపింపఁజేయునట్టి సామర్థ్యము కలిగినంతటిది. కావుననే పండితులయ్యు అచ్చతెనుఁగుకృతులు నిర్మించుచున్నా మని చెప్పినకవులు అన్యభాషాసముదయమును పరిహరింపలేక పోయిరి. ఇది వారిదోష మనుటకన్న జనజీవమునకు సన్నిహిత మయినభాషలో కావ్యములు నిర్మించినఘనతను వహించి రని వచింపవచ్చును.

* అప్పకవీయము, 1-110, 111.

ఈకువలయాశ్వచరిత్రములోనియచ్చతెనుంగుపద్దియములంగూర్చి చర్చిం చుటకు ముందు ముందుగా నచ్చాంధ్రపద్యమును నిర్మించిన దెవరు?అచ్చతెలుఁగు పద్యవికాస మెట్లు జరిగినది?అనుప్రశ్నములకు సమాధానములు రాఁబట్టుట కర్త వ్యము. ఆంధ్రకావ్యవాఙ్మయమున కాదికవి యయిననన్నయభట్టారకులవారే మొట్ట మొదటియచ్చతెనుఁగుపద్యనిర్మాత. వారిభారత భాగమున నచ్చతెమఁగుపద్యములు రెండు కన్పట్టు చున్నవి. అవి యివి—

ఆ॥ వె॥ ఎత్తికొని చనంగ నిమ్మగునట్లుగా
మెఱలు చున్నద్రయ్య లదిమి రెంటిఁ
గూడఁ బట్టె నవియుఁ గూడి యొంటొంటితోఁ
జక్కనంటి రెండు నొక్కఁ డయ్యె. (సభాపర్వము, 1-147)

ఇది తద్భవపదములు లేనిపద్యము.

కం. చెడఁగఱపువార చెలులం
గడుకొని నీయట్టివారికర్జంబులు పె
ప్పెడువారుఁ గాక నీకున్
మడవక మాయట్టివారిమాటలు గొఱయే. (సభా. 2-190)

ఇందు 'కర్జంబులు' అనుపదము తద్భవము. ఇఁకఁ దిక్కనమఖిభారత భాగమునుండి రెండుపద్యములు చూపఁబడు చున్నవి—

తే॥ గీ॥ పఱియ వాపంగఁ దునియఁగా వఱువవలయు
నెడలఁ గాళ్లలఁ జేతులఁ దొడలఁ బట్టి
కడఁగి యనువుగఁ జేసి ప్రోయ్యడుదుఁ గాని
కత్తి గొడ్డలి యడుగ నేఁ గట్టియలకు. (విరాటపర్వము, 1-78)

కం. పోయినమొగమున నచ్చటఁ
జేయుతెఱం గెల్ల నీకుఁ జెప్పితిఁ బిదపన్
మాయయ్య పెద్ద గొలువున
వా యోడక యి ట్టనంగవలయుం జుమ్మీ! (ఉద్యోగ. 1-369)

తిక్కయజ్వభారతభాగమున శుద్ధాంధ్రపద్యములు లెక్కకు మిక్కిలి యున్నవి(1). ఇఁక శంభుదాసునిభారతభాగమునుండి రెండుపద్యము లుదాహరింపఁబడు చున్నవి. ఈరెండే యెఱ్ఱనభారతమున నున్న యచ్చతెనుంగుపద్యములు—

ఆ॥వె॥ వారిఁ జూచి నగుచు వార లోరోరి! యిం
కెందుఁ బోవవచ్చుఁ బంద! నిలుపు
మిట్టికడిమి నమ్మియే ప్రల్లదంబులు
పేయఁ బొడఁగి తమచు డాయుటయును. (అరణ్యపర్వము.6-245)

కం॥ ఇంతకు మున్నెన్నఁడు నే
వింతతడవు వారిఁ బాసి యెందుఁ దడయ నేఁ
డింతవడి మసలుటకు వా
రెంతవడిరొ యేమి యైరొ యెట్లున్నారో! (అరణ్య.7-260)

తిక్కనయెఱ్ఱనలకృత్యంతరముల నీవిషయమున పునఃపరిశీలింపఁదగును. కవిత్రయకృతులలోనిపద్యములను సునిశితదృక్కులతో పరిశీలించి పఠించిన యనంతరకవులు తమతమకృతిమాలికలలో నటనట నచ్చతెనుఁగుపద్దియపురతనములను కూర్చి తెనుఁగుమదులపడఁతికి నుడుగరలు సేసిరి(2). వీని నన్నింటిని పరిశీలించిననాఁటిపరిశోధకులు వీని నెంతగానో కొని యాడినారు. కనుకనే పొన్నికంటి తెలగనార్యుఁడు తననాఁటివఱకు కృతులలో కాన్పించు చున్నయచ్చతెనుఁగుపద్యములను, ఆనాఁటికి కలిగినయన్యదేశ్యపదసముచ్చయమును ఆపోశనపట్టి సంపూర్ణస్వచ్ఛాంధ్రకృతినే నిర్మించి మెప్పించినాఁడు. ఆనాఁడు ఆంధ్ర

1. అ) విరాటపర్వము.2-80,214,337,348,351;4-107-248;5-89.
ఆ) ఉద్యోగపర్వము,1-312,340.
ఇ) మౌసలపర్వము-196మొద లయినవి.
2. అ) ఉత్తరహరివంశము,2-171,172.
ఆ) ఆముక్తమాల్యద,5-72 మొద లగునవి.

కృతులయం దొకయచ్చతెలుఁగుపద్య మున్నను మెచ్చుకొనెడివిమర్శకులు తన కృతియంతయు నచ్చతెలుఁగున నిర్మింపఁబడుట గొప్పమెచ్చికోలున కాస్పద మగు నని కృతిపతి నోట నిట్లు చెప్పించినాఁడు—

ఉ. అచ్చతెనుంగుఁబద్దె మొక టైనను గబ్బములోన నుండినన్
హెచ్చని యాడుచుందు రది యెన్నుచు, నేర్పునఁ జొత్తమెల్ల ని
ట్లచ్చతెమంగున న్నొడువ నందులచంద మెఱుంగువారు విన్
మెచ్చరొ! యబ్బురం బనరొ! మే లనరో! కొనియాడరో! నినున్
(యయాతిచరిత్రము, 1-12)

తెలగనార్యునియయాతిచరిత్రము నాదర్శముగఁ గొని యాంధ్రసాహిత్య రంగమున అచ్చతెనుఁగుకబ్బము లనేకములు వెలసినవి. యయాతిచరిత్రను చదివినయనంతరకవులు కొందఱు ప్రయత్నపూర్వకముగనే తమకృతులలో నచ్చతెనుఁగుపద్యములు కొన్ని పన్నిన ట్లవిపించు చున్నది. అట్టివారియం దీచిననారాయణ యొకఁడు. ఈతఁడు తనకబ్బమున పదునొకండు కందపద్యములు, ఆఱు తేటగీతులు, ఒకసీసము, మూఁడు చంపకమాలికలు అచ్చతెనుఁగులుగా నిర్మించినాఁడు. ఇవి క్రమముగా నుదాహరింపఁబడు చున్నవి—

కం. పడిఁ గట్టికవారలు పా
వడ మిడి హెచ్చరిక రాయవరగండ! యనన్
బెడయంకవన్నెపైఁ గా
లిడ కపుడు చివుక్కు మనఁగ నెక్కెం దేజిన్. (2–57)

ఇంకను కందపద్యములు ద్వితీయాశ్వాసమునందు నాలుగు, తృతీయాశ్వాసమం దయిదు, చతుర్థాశ్వాసములో నొకటియు కలవు(*).

---

*. కువలయాశ్వచరిత్రము, ద్వితీయ- 99,109,133,140, తృతీయ-3,22,29, 43,84; చతుర్థ-140.

తే. గీ. అట్లు వలపించి, లోనయ్యె నంచుఁ దెలిసి,
తఱచు కావళ్ళు పెట్టి, మాయిరుగుపొరుగు
చెలులతో నైన ముచ్చట పలుకనీక
త్రాడుగట్టినవానిచందాన నేలె. (4-182)

ఇట్టి తేటగీతు లింకను చతుర్థాశ్వాసమున మూఁడు, పంచమాశ్వాసమున మూఁడును గలవు(1).

సీ. విన వింపుగా మేళవించి యుంచినయట్టి
యల్లవీణియ యుంచినట్లె యుండ
వెర బొంతగా పెన వేసి మూసినయట్టి
యరలపెట్టియ మూసినట్టె యుండ
నెఱికగాఁ బెట్టి దండెముమీఁద వైచిన
యంగదట్టము వైచినట్ల యుండ
నెఱపుగా మూరి గిన్నియల నించినయట్టి
యరిదికుంకుమ నించినట్ల యుండ

గీ. వెందుపై విచ్చ లేక, యేమేమొ తలఁచు
కొనుచుఁ, జెలులను జంకించుకొనుచుఁ, జిలుక
కొసరుమాటకు గట్టిగాఁ గసరుకొనుచుఁ
దాళఁగూడనివింతవిరాళి యెతి. (5-37)

చ. విడిసినయంత నొక్కదొర వేఁటకు వచ్చెనొ కాని కొంచెపున్
వడగవి నెక్కి చేతను గనంబడునెట్టెము, మీఁదిడేగయున్,
బడలినమోము, గువ్వగుమిపట్టులఁ బాఱెడుచూపు మించఁగాఁ
బొడిఁబొడి మాడిగంపుఁదెగతోఁ జనియెన్, మముఁ జూడఁ
దేమియున్. (3-76)

ఇట్టి వింకను పంచమాశ్వాసమునందు రెండున్నవి(2). వీనిం బరిశీలింపఁగా నీకవి అచ్చతెనుఁగుపద్యములను కూడ అవలీలగా నిర్మింపఁగలిగినచతురుఁ

1. కువలయాశ్వచరిత్రము. చతుర్థ-70,209,211,పంచమ-29,46,109.
2. కువలయాశ్వచరిత్రము,5-31,92.

డనువిషయము విశద మవు చున్నది. ఇది కాదనరానిసత్య మవి తక్కినపద్యము లలోనితెనుఁగుపోఁకడలను కూడ పరామర్శించినచో తెలియఁగలదు.

ఆంధ్రమహాభారతమునందే అచ్చతెనుఁగుపద్యములతోపాటు, చిత్రవిచిత్రము లయినయచ్చతెనుఁగుపోకడలు గలిగినపద్యములు గూడ కవ్పించు చున్నవి. ఆపోకడలలో పద్యమునందు ఒక్కటి మాత్రమే తత్సమపద ముండి తక్కిన వన్నియు నచ్చతెనుఁగు లై యుండుట యొకటి. క్రమముగా ఈగతులు కూడ ప్రదర్శింపఁబడు చున్నవి—

కం. చక్కనగు మవిన ఠక్కునఁ
డక్కజముగఁ బెరిఁగి యయ్యనగు విప్పడు నీ
యుక్కును బీరముఁ జూచెదఁ
జిక్కన నిలు మనుచుఁ గడు విజృంభించి వడిన్.

(ఆదిపర్వము, 6-203)

ఇది నన్నయభట్టారకులవారిది. ఇందు 'విజృంభించి' అనునది యొకఁడే తత్సమము. తిక్కయజ్వపద్య మొకటి—

కం. చనువానిచేయుకార్యం
బున కడ్డము సొచ్చి నేరుపున మెలఁగుచుఁ దా
నును బయిఁ బూసికొనుటఁ దన
మును మెలఁగినమెలఁకువకును మువ్పగుఁ బిదపన్. (విరాట.1-125)

ఇందు 'కార్యంబు' ఒక్కఁడే తత్సమము. తక్కిన దచ్చతెనుఁగు. ఇఁక ప్రబంధపరమేశ్వరునిపద్య మొకటి—

కం. నావుడు నట్టుల యయ్యేడు
నీ విట రావలవ దుడుగు నెట్మొ నవి వెనం
బోవఁ దొడంగెను బిత్రృపతి
యావెలఁదియు నంత నిలువ కరిగెఁ బిఱుందన్.(అరణ్యపర్వము,7-226)

ఇట్టికందపద్యము లింకను భారతమునందు కలవు(1). ఈకువలయాశ్వ చరిత్రమునందును నిట్టికందము లందములను చిందించు చున్నవి. మచ్చున కొక్కటి—

కం. బిరు సైనయెండ మెండున
వరవర లై పోయి లేక యలజడిపడఁగా
సురగాలి యేఁచెఁ బ్రజలం
గలవుకుఁ దో డావపంట గలిగినకరణిన్. (1-101)

ఇందు 'ప్రజలన్' అనునది యొక్కటే తత్సమము. ఇట్లొక్కతత్సమ పదము మాత్రమే కలిగి తక్కినదంతయు నచ్చతెనుఁగుగా నిర్మింపఁబడినకందము లీప్రబంధమునం దింకను నిరువది యున్నవి(2).

తరువాత తేటగీతులను పరిశీలింతము. ఒక్కటి మాత్రమే తత్సమపదము కలిగి తక్కినభాగమంతయు నచ్చతెనుఁగుగా నిర్మింపఁబడినతేటగీతులు కవిత్రయభారతమున కానవచ్చు చున్నవి. క్రమముగ ప్రదర్శింపఁబడు చున్నవి.

తే. బాలుఁ డొక్కండు కొండొకకోల సేతఁ
బట్టికొని యేను రక్కసుఁ గిట్టి చంపి
చులుకఁగా వత్తు మీ రేడ్వవలవదనుచుఁ
గలయ నూరార్చెఁ దనతొక్కుఁబలుకు లొప్ప. (ఆదిపర్వము,6-260)

తే. ఇదియ నిశ్చయ మిమ్మాట వదల కుండు
మనిన నీ వాక్కరుండవ యరుగుదేర
వలయు లేకున్న నయ్యెడ నిలుచుదానఁ
గాను జూ! నిక్కువం బని పూని పలికి. (విరాటపర్వము,2-267)

తే. చెనసి మీరు వారికిఁ గీడు సేయుటయును
వారు మీ కెగ్గుసేఁతయు వగవ మేలు
గాదు వలసిన ఘోషరక్షణ మొనర్పఁ
దగినవారలఁ బుతము దడయ కందు. (అరణ్యపర్వము,5-367)

1. అ) ఆదిపర్వము,2-132. ఆ) సభాపర్వము,2-57.
ఇ) అరణ్యపర్వము,3-245,7-319.
ఈ) విరాటపర్వము, 1-128,130,224,250,260,275,299 మొదలయినవి.

2. ద్వితీయ - 131,132,136,తృతీయ-5,24,38,41.70,104,106,107,
చతుర్థ-14,81,100,110,125,143,145,పంచమ-73,87.

ఇందు క్రమముగా బాలుఁడు, విశ్చయము, ఘోషరక్షణము- అనుపదములే సాంస్కృతికములు. తక్కినభాగము లచ్చాంధ్రపదవిలసితములే! ఇట్టిపద్యము లింకను భారతమునం దగపడు చున్నవి(1). ఇప్పు డీప్రబంధమునందలి తేటగీతి యొకటి—

తే. ఊడిగపుటత్తికాఁ డొక్కఁ డొఱుఁగుఁ జేరి
విభునిచెవిలోన నేమేమొ విన్నవింప
నతఁడికనుసన్న గనుఁగొని, యయ్య! మంచి,
దతనిఁ బిలిపించెద నటంచు నరిగి వాఁడు. (2-88)

ఇందు 'విభుని' అనుపద మొండు మాత్రము తత్సమము. తక్కినపద్య భాగ మచ్చతెనుఁగు. ఇట్టితేటగీతు లీకృతియం దింకను నెన్మిది యున్నవి(2).

ఇఁక వృత్తములం బరిశీలింతము. నన్నయభట్టారకులవారి భారతభాగము లోనిక్రిందిదేశీయవృత్తమునం దొకేతత్సమపద మున్నది—

మధ్యాక్కర. తడయక పుట్టిననాఁడ తల్లిచేఁ దండ్రిచే విడువఁ
బడితి నిప్పుడు పతిచేతను విడువఁబడియెద నొక్క
నుడువులు వేయు నిం కేల యిప్పాటినోములు తొల్లి
కడఁగి నోఁచితిని గా కేమి యనుచును గందె డెందమున.

(ఆదిపర్వము, 4-102)

ఈపద్యమునందు 'పతి' అనుపద మొక్కటే తత్సమము. తక్కినపద్య మంతయు నచ్చతెనుంగుమయమే. ఇప్పుడు తిక్కనగారి దొకటి యుదాహరింపఁ బడు చున్నది—

---

1. అ) సభాపర్వము, 2-209.
   ఆ) విరాటపర్వము, 2-314.
   ఇ) ఆరణ్యపర్వము, 6-375 మొద లయినవి
2. తృతీయ-23, 126; చతుర్థ-16, 65; పంచమ-23, 41, 62, 72.

చ. ఎఱిఁగియెఱింగి న న్నడుగ నేమిటి కిప్పు డెఱింగి యింతకు
న్మఱచుట గల్గెనే నది వినం బని లే దటు గాక యున్నరూ
పెఱిఁగియు వేవ చెప్ప విన విష్టము గల్గుట చాల లెస్స య
త్తెఱఁ గెఱిఁగించెదన్ వినుము తెల్లముగా మొదలింటనుండియున్.
(విరాటపర్వము, 2-169)

ఇం 'దిష్టము' అనుపదమే తత్సమము. తక్కినపదము లన్నియు నచ్చ తెనుఁగులే. క్రిందిపద్దియము నన్నెచోడునిది.

ఉ. ఆడెదునమ్మఁ గగ్గొనకు మమ్మ బయల్పడ నాడుచిల్కతో
నాడకు మమ్మ తేఁటిగెడ నాలతి పేయకు మమ్మ వెన్నెలం
జూడకు మమ్మ తెమ్మెరలఁ జూడకు మమ్మ తలిర్చుమావిక్రీ
నీడకుఁ బోకు మమ్మ యని నెచ్చెలికత్తెకుఁ జెప్పె సమ్మతిన్*.

ఇందు 'సమ్మతిన్' ఒక్కటే తత్సమము. మిగిలినభాగ మచ్చతెనుఁగు మయము. ఇట్లొక్కపదము మాత్రము తత్సమ మై తక్కినపదజాల మచ్చతెనుఁగయినవృత్తములు ప్రబంధమండలిలో నచ్చటచ్చట గోచరించు చున్నవి. ఈకోవకు చెందినవృత్తము లీకావ్యమునందును దర్శన మిచ్చు చున్నవి. క్రమముగా నవి చూపఁబడు చున్నవి—

చ. తొలఁకెడు తావిగందవొడి తూరుపువాఱఁగఁ బట్టి మల్లెపూ
వలపులు కొల్లలాడి హిమవారిఁ గలంచి, మెఱుంగుఁబోండ్లగు
బ్బలపయిచంద్రకావిజిగిపయ్యెదకొంగు లెడల్చి, యెందు మై
దెలియక తూలుకొంచు వలిదెమ్మెరలాహిరికాఁడు త్రిమ్మరున్.
(1-88)

ఇందు 'హిమవారిన్' ఒక్కటి మాత్రము తత్సమము. మిగతమాట లచ్చతెనుఁగులు. ఇట్టిచంపకమాలిక లింకను ఈకబ్బమునందు పది యున్నవి.

---

*. కుమారసంభవము, 5-131.

ఉ. కంచెఁ దగిల్చినట్టికొనగల్గినచందురుఁగావిజాళువా
జంటపయంటపై విగిడి, చక్కవిజక్కవనిక్కుచొక్కపుం
జంటచెలంగుబంగరువుచాయలు దూచి యనంగఁ జాలువా
ల్గంటిమెఱుంగుఁజూపులు దళా రవ వచ్చె మహాద్భుతంబుగన్.

(2-92)

ఈపద్యమున 'మహాద్భుతంబుగన్' అన్నపద మొక్కటే తత్సమము. ఇట్టియుత్పలికమాలికలు ఈకావ్యమందు మఱి నాలు గలరారు చున్నవి(1).

శా. కైజాచేసినబొండుమల్లెవిరిబల్లిండాజగాజోదుతే
జీజాదం దల వాంచి, బోఁటి చెఱఁగుం జే గట్టిగాఁ జుట్టి, నున్
గాజుంగంబముచాటున న్నిలిచి, క్రేఁగంట న్నినుం జూచునం
భోజాతాక్షిని పెజ్జకుం దిగుచునేర్పుల్ గల్గునే? మీఁదటన్. (4-99)

అంభోజాతాక్షిని అనుపద మొక్కటే యిందు తత్సమము.

మ. పొలఁతీ! యాపొనగున్నపొన్నవిరికిం బూఁదేనె బల్కాల్వగా
వలరన్ సారెకు నెక్కుచుం దిగుచు చాలై తుమ్మెదల్ మించె ని
చ్చలపుంజాయలతావిజాజివిరినేజాజోదు గైకొన్నక్రొం
దళుకుంబచ్చలమేడఁ దార్చుజలయంత్రంబో యనం గంటివే!

(3-121)

'జలయంత్రంబు' ఒక్కటే యిందు తత్సమము. ఇట్టిమత్తేభవిక్రీడిత పద్యము మఱియొకటి యీకృతియం దున్నది(2).

సీ. పవిలేనివని గిఱుక్కున మోము ద్రిప్పుచోఁ
జెక్కుపైఁ గమ్మ తళుక్కు మనఁగ
సిగ్గునఁ దల వంచి చిఱునవ్వు నవ్వుచోఁ
గెలఁకులఁ జికిలివెన్నెలలు కాయఁ

---

1. ద్వితీయాశ్వాసము-93;తృతీయ-32;చతుర్థ-208,212.
2. తృతీయాశ్వాసము-134.

గెంగేలఁ బై(ఁటచెఱంగు బిగించుచో
విద్ధంపుఁజనుదోయి వికృ(ఁ)దోఁపఁ
బలికించువారి మోములు తేలఁ జూచుచో
వాలుఁజూపులు పూలవాన కురియ

గీ. నిలుచునొఱప్పను, గరువంబుఁ దెలియనీక
పలుకుబెళుకును, మొగమునఁ బొలఁకుఁదెలివి
యొదలియడఁకువ, నడలోనిబెడఁగు, వారి
కన్నుఁ(ద్రామఁగ మృగి యున్నకడకు నరిగె. (2-30)

ఇచట 'మృగి' యన్నపద మొకటే తత్సమము. ఇట్టివి మఱి రెండు గలవు(1). ఇట్టిసీసపద్యములు భారతమున నాచూచినంతలో గోచరింపలేదు. ఈకావ్యమునం దింకను విశేషములు గలిగినసీసపద్యములు కొన్ని గలవు. ఒక సీసపద్యమున సీసభాగమున నొకటి, అనుబంధగీతము నం దొకటి మాత్రమే తత్సమపదము లుండి కడమపదము లచ్చతెనుఁగు లయియున్నవి(2). మఱికొన్ని సీసములం దనుబంధగీతు లచ్చతెనుఁగు లై సీసభాగములందే తత్సమము లున్నవి(3). కొన్నిసీసములందు సీసభాగము లచ్చతెనుఁగు లై అనుబంధగీతుల లోనే తత్సమము లున్నవి(4). ఇవే కాక యీయచ్చతెనుఁగుప్రయోగములందు మఱికొన్నిపోకడలు కూడ కన్పించు చున్నవి. ఈపోకడలకు మాతృకలనఁదగినవి భారతాదులయందుఁ గానవచ్చు చున్నవి. వాని నన్నింటిని వివరింపవలయు నన్న ప్రత్యేకగ్రంథ మగు ననుతలంపున నింతటితో నిది విరమింపఁబడు చున్నది.

పరిశీలింపఁగా కవిత్రయపద్యములయం దన్యదేశ్యములు కన్పింపలేదు. నారాయణకవికృతియం దన్యదేశ్యము లనేకము లున్నవి. దీనికి కారణము సాం

1. కువలయాశ్వచరిత్రము, 3-27,100.
2. ,, 3-100. ఇందు 'మనసు' పదము గలదు.
ఆం.భా.దృష్టిలో నిది వైకృతమే
3. కువలయాశ్వచరిత్రము, 1-86;2-89;4-144,153,183:5-40.
4. ,, 1-20;4-50.

షికపరిస్థితులే. నన్నెచోడునికృతిలో 'నాయి' మున్నగుతమిళపదములు, శ్రీనాథునికృతులలో కన్నడపదములును గోచరించు చున్నవి. తురుష్కాలదాడులు మితిమీఱుటచే ప్రబంధయుగమునుండి ఉర్దూతురుష్కపదములు పెరుఁగుట కన్పడు చున్నది వాణిజ్య మభివృద్ధి చెందుటచే రామరా నితరభాషాపదము లిం కను నాంధ్రమున చొచ్చినవి. ఇవి యన్నియు నాంధ్రులవ్యవహారమున విడఁదీయ రానియనుబంధమున్ పొందినవి. అందువలన నాంధ్రకవులు వీనిని గూడ సగౌరవముగ ప్రయోగించిరి. అందును దక్షిణాంధ్రకవు లాంధ్రపదములతో పాటు సమానస్థాయి నిచ్చినంతపని చేసి, తెనుఁగుభాషామతల్లికి నూతనసౌందర్య మును చేకూర్చి మురిసిరి. ఈయుగమునకు చెందిననారాయణకవి ఉర్దూతురుష్క కన్నడాదిపదములను అనర్గళముగ ప్రయోగించి యుండుటను చూడఁగా నితనికి పదములతో మాత్రమే కాక ఆయాభాషలతోను విశేషపరిచయ మున్న ట్లని పించు చున్నది.

"దేశభాషలందుఁ దెలుఁగు లెస్స"

వినుకొండ వల్లభరాయలు.

# నవమదళము

## వ్యాకరణవిశేషానుశీలనము

"ఏక శ్శబ్దః సమ్యక్ జ్ఞాతః సుష్ఠు ప్రయుక్తః స్వర్గే లోకే కామధుగ్భవతి" అని మహాభాష్యము. ఒక్కశబ్ద మయినను ప్రకృతిప్రత్యయవిభజనాదులతో బాగుగా తెలిసి లోకమునందు ప్రయోగింపఁబడిన నది సర్వార్థములకు కామధేనువువంటి దగు నని యర్థము. శబ్దముయొక్క సమ్యక్జ్ఞానముకొఱకే వ్యాకరణశాస్త్రము బయలువెడలినది. వ్యాకరణశబ్దమును వైయాకరణులు "వ్యాక్రియతే(సంస్క్రియతే) శబ్దజాల మనేన" అనువ్యుత్పత్తితో నిర్వచించినారు. సాధుత్వాన్వాఖ్యానమే(ఈపదము సాధువు అని తెలియఁజెప్పుటయే) సంస్కారము. వ్యవహారమునందు కలగాపులగములుగా నున్నశబ్దములయందలి సాధుశబ్దములను వేఱుపఱచి అవి ప్రయోక్తవ్యము లని ప్రబోధించుటయే వ్యాకృతిపని. ఇందులకే యీశాస్త్రము.

ఆలంకారికులు వ్యాకరణదోషములను చ్యుతసంస్కారదోషములుగా పరిగణించిరి(1). "దోషా స్తస్యాపకర్షకాః" అని రసభంగమునకు ఈయపశబ్దములు హేతువు లని ఆలంకారికు లందురు. రసపరిపోషణము కావ్యకర్తల కవశ్యకర్తవ్య మని పెద్దలు వేనోళ్ల చాటిచెప్పు చున్నారు.

శ్లో॥ విశ్వశ్రేయః కావ్యం త దదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ।
సా వా గ్వ్యారసవృత్తిః సాధ్వ్యౌ హి రసో యథాతథం కవిభిః॥

అని నన్నయభట్టారకులవారు(2). కావున కావ్యములందు అపశబ్దములు కాఁగూడ దనియే మనవారిసిద్ధాంతము. ఐనను కవులు అనుప్రాసాదులయందేకతానహృదయు లై అచ్చటచ్చట "ప్రమాదో ధీమతా మపి" అనున్యాయ

1. ప్రతాపరుద్రీయము, దోషప్రకరణము—14.
2. ఆం ధ్రశబ్దచింతామణి, సంజ్ఞాపరిచ్ఛేదము—1.

మున ప్రమాదపడుట అనిచ్ఛాపూర్వకముగ సంభవించు చుండును. అది యెట్టి వారికిని త్రోసిరాజనరానిదిగా తోఁచును. మహాభాష్యకర్త భగవానుఁ డగుబుద్ధునకే "ప్రమత్తగత ఏష తత్రభవతః" అని ప్రమాదము కలిగిన దను చున్నాఁడు. అట్టియపశబ్దప్రయోగములు కావ్యములం దనిచ్ఛాపూర్వకములుగా క్వాచిత్కములై సంభవించు చున్నప్పుడు "ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీన్దోః కిరణే ష్వివాఙ్కః" అనురీతిని స్వీకార్యములు కావలసి యున్నవి.

ఇఁక నీగ్రంథమునందలికవివ్యాకరణపాండితిని ప్రకటించుప్రముఖప్రయోగములు స్వీకరింపఁబడి, వానికిఁ గలస్థాన మెట్టిదో అవి యెంతవఱకు సాధువులు కాఁదగి యున్నవో, యిం దేవి యపశబ్దము లనఁదగినవో యథాశక్తి పరిశీలించి చూపఁబడును.

## సంస్కృతము

౧. సైంధవ (1-8). ఈశబ్ద మిచట భారతార్థమునందు జయద్రథుఁడు(సైంధవుఁడు). రామాయణార్థమున సముద్రము అనునర్థములయందు ప్రయుక్తము. సింధూనాం అయం(రాజా) సైంధవః. తస్యేదమ్ (4—3—120)అనుసూత్రముచే 'అణ్' ప్రత్యయము. (ఆదివృద్ధియు) సైంధవము=సముద్రము—సింధు శబ్దమునకంటె స్వార్థమునందు (ప్రకృత్యర్థమునందు) ప్రజ్ఞాదిభ్యశ్చ(5—4—38) అని 'అణ్' ప్రత్యయము, సింధు రేవ సైంధవః(బంధు రేవ బాంధవః అన్నట్లు).

౨. వైరి(1—16)= వీరుఁడు. ఇచట వీరశబ్దమునకంటె భావార్థమునందు హాయనాన్తయువాదిభ్యో ఒణ్(5—1—130) అని వికల్పముగా 'అణ్' ప్రత్యయము. యువాదిగణపఠిత మిది కాకున్నను వైరమైథునికయోః(4—3—125) అనునిర్దేశమున యువాదిగణపాఠ మభ్యుపగతము. ఇట్లు నిష్పన్నమయిన'వైర'శబ్దమునకువీరత్వము(పరాక్రమము) అర్థము అది కలవాఁడు అనునర్థమున(వైర మస్యాస్తీతి—అను

నర్థమున) అత ఇని ఠనౌ(3–2–115) అనుసూత్రము వలన 'ఇని' ప్రత్యయము రాఁగా 'వైరీ'(వైరి–తెనుఁగు) అని యగును. పరాక్రమము కలవాఁడు(వీరుఁడు) అని యర్థము. ఇట్టి ప్రయోగము సాధిత మై యీతనికి వ్యాకృతియం దున్న వైదుష్యమును చాటిచెప్పు చున్న దన వచ్చును.

3. ఆజి (1–16)= నారదుఁడు. అజ శబ్దమునకంటె అపత్యార్థమునందు (అజస్య అపత్యమ్–అనునర్థమున) అత ఇఞ్ (4-1-95) అని 'ఇఞ్' ప్రత్యయము, (ఆదివృద్ధియు). బ్రహ్మదేవుని కుమారుఁడు(నారదుఁడు) అని యర్థము. ఇదేవిధిని కౌబేరి (1–46)=నలకూబరుఁడు(కుబేరునికుమారుఁడు).

౪. పాండర(1-17)= తెలుపు. "పాండుత్వ మస్యాస్తి" అనునర్థమున "నగపాంసుపాండుభ్యో రః"(వార్తికము2588) అని 'పాండు' శబ్దమునకంటె 'ర' ప్రత్యయము రాఁగా 'పాండురః' కావలసి యున్నది. హేమచంద్రాచార్యుఁడు కూడ "పాండురో వర్ణతద్వతోః" అను చున్నాఁడు*. ఇఁక 'పాండర' శబ్దము ఎట్లు సాధువు? అని యిట ప్రశ్నము. అమరము కూడ "హరిణః పాణ్డరః పాణ్డుః" అను చున్నది. అయినను 'పాండర' శబ్దము కూడ అర్థభేదముచే సాధువే! అమరమే అర్థభేదమును చూపుచు "శుక్ల శుభ్ర శుచి శ్వేత విశద శ్వేత పాణ్డరాః" అని పాండరశబ్దమును శుక్ల వర్ణపరముగా నుదాహరించు చున్నది. 'పాండర' శబ్దమునకు కేవలశుక్లవర్ణము కలది అర్థము. 'పాండుర' శబ్దమునకు పీతసంవళితము(పచ్చఁదనముతో కూడినది) అగు

---

* అనేకార్థసంగ్రహనిఘంటువు.

శుక్లవర్ణము కలది అర్థము. అమరమున సుధావ్యాఖ్యానము
కూడ ఇట్లే వ్యాఖ్యానించినది. ఇఁక పాండరశబ్దము
పడి-గతౌ(1)అనుధాతువుకంటె బాహుళక మగు 'అర'
ప్రత్యయము, దీర్ఘము వచ్చి ఔణాదికముగా సాధువఁ
దగినది. కనుకనే యీతఁడు ఈపాండరశబ్దమును పను
చితముగా నిట నుపయోగించుటయే కాక "చ. ....చారు
వజ్రపాండరరుచి గ్రమ్ముగుమ్మెతగుహారమువం గొలు
వుండి....(2-87)" అనుచోట నిర్ధారకముగా యతి
సంబద్ధము చేసినాఁడు.

౫. ఐందవ (1-35). ఇందుబింబము అనుటకు ఐందవబింబ మని యిట
ప్రయుక్తము. ఐందవ మనఁగా 'ఇందుసంబంధి' అని యర్థము.
తస్యేదమ్ (4-3-120) అనుసూత్రముచే 'ఇందు' శబ్దమునకంటె
'అణ్' ప్రత్యయము, ఆదివృద్ధియు. ఓర్గుణః (6-4-146) అని
గుణము. ఈ ప్రయోగము 1-108, 3-163 పద్యములయందును
కలదు. ఇట్టితద్ధితప్రయోగము అనేకము లిందు ప్రయుక్తము
లయినవి. [ప్రాభాకర(1-43)=ప్రభాకరసంబంధి=పద్మము. ఇది
అణ్ణంతమున కుదాహరణము. 'ప్రభాకర' ఉకారాంతము కానందున
గుణమునకు ప్రసక్తము లేకుండుట యిందు విశేషము]. ఇట్టి
ప్రయోగములు కవికిఁ గలతద్ధితప్రియత్వమును తెలుపు చున్నవి.
మహాభాష్యకర్త వార్తికకారునితద్ధితప్రత్యయప్రయోగములను
పరిహసించు చున్నవాఁడువోలె "ప్రియతద్ధితాః ఖలు దాక్షిణాత్యాః"
అను చున్నాఁడు.

౬. పరిశంసి (తత్కీర్తికాంతతోడ) (1-38). పరిపూర్వక శంసు-స్తుతౌ.(2)
అనుధాతువుకంటె సుప్యజాతౌ ణినిస్తాచ్ఛీల్యే (3-2-78) అని
'ణిని' ప్రత్యయము వచ్చి. ఋన్నేభ్యో ఙీప్ (4-1-5) అని 'ఙీప్'
రాఁగా 'పరిశంసినీ' అగును. దానికి 'పరిశంసినీ చాసౌ కీర్తికాంతా

---

1. ధాతుపాఠము, 281.
2. ,, 728.

చ' అని కర్మధారయసమాసము రాఁగా 'పుంవత్కర్మధారయ జాతీయదేశీయేషు (6-3-42) అని పుంవద్భావము వచ్చి 'పరిశంపి' అయినది. ఇక్కడియర్థమును పరికించినప్పు డీధాత్వ ర్థముయొక్క ఔచిత్యమును బాగుగా తెలియనగును.

౭. జాడ్యము (1-44) ఇచ్చట శ్లేషభంగితో జడత్వము, జలత్వము అను రెండర్థములు చెప్పవలసి యున్నది. 'జడస్య భావః' అనునర్థమున 'ష్యఞ్' ప్రత్యయము వచ్చి 'జాడ్య' మగును. 'డలయో రభేదః' అనున్యాయమున 'జల' శబ్దమునకంటె పైప్రత్యయమే వచ్చిన 'జాల్య' మగును. [గుణవచనబ్రాహ్మణాదిభ్యః కర్మణి చ (5-1-124)]

౮. కృపాళునకు (1-47). స్పృహి గృహి పతి దయి నిద్రా తన్ద్రా శ్రద్ధాభ్య ఆలుచ్ (3-2-158) అని పైధాతువులకంటె 'ఆలుచ్' ప్రత్యయము తచ్ఛీలార్థమునందు విహితము. 'కృపా' శబ్దము ధాతువు కాదు. ఇందు లేదు. ఎట్లిచట 'కృపాళు' శబ్దము సాధువు అని యొకప్రశ్నము. ఇది ఆలుచ్ ప్రత్యయాంతము కాదు. 'కృపాం లాతి' (స్వీకరోతి) (లా-ఆదానే) అని కృపా శబ్దపూర్వకమగు 'లా' ధాతువునకంటె మితద్ర్వాదిభ్య ఉప సంఖ్యానమ్ (3-2-180) అనువారిక్తమున 'డు' ప్రత్యయము వచ్చి "కృపాళుః" అగు చున్నది. సుధాదు లిట్లే దీనిని సాధించినవి."స్యా ద్దయాళుః కారుణికః సురత స్సమాః" అని యమరము. "కృపాలునా తేన దేవేన హిమవతి విసృష్టా...." అని లక్ష్మణసూరి ప్రయోగము(1). ఇట్టిదే 'క్షుధాళువు' 'భోః క్రవ్యముఖ! క్షుధాలు ర్భవాన్' అని పంచ తంత్రము(2).

---

1. రామాయణ సంగ్రహము, బాలకాండము (చూ. జూనియర్ ఇంటరు సంస్కృత వాచకము, పుట 40)
2. చూ. సంస్కృత వాచకము (సీ. ఇంటర్మీడియేట్, 1982-85), పుట 107

౯. నిరాకృతి (1-48)=నిర్ + ఆకృతి=విశ్వరూపము. ఇచట 'నిర్' అను నుపసర్గము 'నితరా' మర్థమును. "నిరతమ్" అమనర్థమును బోధించి విశ్వరూపము. నీరూపుఁడు-అను నర్థద్వయమును (శ్లేషలో) బోధించు చున్నది.

౧౦. మంజిమ (1-63, 2-75). "మఞ్జు" శబ్దమునకంటె భావార్థమున "ఇమనిచ్" ప్రత్యయ మనవలయును. ఇందులకు పృథ్వాదిభ్య ఇమనిచ్ (5-2-122) అని ఇమనిచ్ ప్రత్యయము భావార్థమున రావలసి యున్నది. కాని అందు "మంజు" శబ్దము లేదు. అది యాకృతిగణము కాదు. ఇట్టివే ముగ్ధిమ, ప్రౌఢిమ మొదలగునవి. కవులు వీనిని ప్రయోగించి యున్నారు. వామనుఁడు వీనినిగూర్చి "ముగ్ధిమాది ష్విమనిజ్ మృగ్యః" అని అసాధువు లను చున్నాఁడు(1). కవులేమో ప్రయోగించు చున్నారు. శ్రీహర్షుడు "యదస్య యాత్రాసు బలోద్ధం రజఃస్ఫురత్ప్రతాపానలమఞ్జిమ" అనుచున్నాడు(2). ఇచట నారాయణీయవ్యాఖ్య "వర్ణదృఢాదిభ్యః (5-1-123) ఇతి దృఢాదే రాకృతిగణత్వాత్ మఞ్జిమే త్యత్ర ఇమనిచ్" అను చున్నది. కనుక దృఢాదిగణ మాకృతిగణమని దీనిని సాధించుకోవలసి యున్నది. అసాధు వనఁగాదు. మల్లినాథుఁడు కూడ "మఞ్జుశబ్దా దిమనిచ్ ప్రత్యయః" అని యిచటి వ్యాఖ్యలో వ్రాసి యున్నాఁడు.

౧౧. పారగతుఁడు (1-65). "పార" శబ్దము నదీసముద్రాదులయావలిగట్టును చెప్పును. "పారీ పాత్ర్యాం పరతటే పారమ్" అని నానార్థ రత్నమాల. పారమును పొందినవాఁడు పారగతుఁడు. "గత" శబ్దముతో "పార" శబ్దమునకు సమాసము. "ద్వితీయా

1. కావ్యాలంకారసూత్రప్రవృత్తి, 5-54.

2. నైషధీయచరితము, 1-8.

శ్రితాతీతపతితగతాత్యస్తప్రాప్తాపన్నైః (2-1-24) అని సమాసము. వ్యాకరణపారంగతుఁడు, జ్యోతిషపారంగతుఁడు- మొదలయినవి వ్యావహారికములు. బహుజనపల్లి సీతారామాచార్యులుగారు "పారంగతుఁడు" గ్రహించుట పరిశీలనీయము(*).

౧౨. శిల్పకులు (1-72)=శిల్పులు (శిల్పకి+లు), "శిల్ప" శబ్దమునకంటె స్వార్థిక "క" ప్రత్యయము కలిగిన "శిల్పకమ్" అగును. దీనికి శిల్పము అర్థము. శిల్పక శబ్దమునకంటె మతుబర్థమున "ధన మస్యా స్తీతి ధనీ" అయినట్లు "శిల్పక మస్యా స్తీతి శిల్పకీ" అగును. దీనికి తత్సమరూపము శిల్పకి. దీనికి బహువచనరూపము శిల్పకులు (శిల్పు లని యర్థము). ఇట్టిశబ్దము సాధింపఁబడవలసి యున్నది. మఱియొకరీతిని గూడ దీనిని సాధింపవచ్చును. శిల్పశబ్దము "అర్శ ఆద్యజన్తము." అప్పుడు శిల్పశబ్దమునకే శిల్పము కలవాఁడు అర్థము. ఇట్లు నిష్పన్న మయినశిల్పశబ్దమునకంటె స్వార్థిక క ప్రత్యయము చేసి, తత్సమీకరించిన శిల్పకుఁ డగును. దీనికి బహువచనము శిల్పకులు.

కవి వ్యాకరణపారగుఁ డయిననే కాని యిట్లు ప్రయోగింపలేఁడు. కవికి శబ్దముమీఁదఁ గలయధికారము నిది తెలుపు ననవచ్చును.

౧౩. గారళ (1-94). గరళ మేవ గారళమ్। స్వార్థికాణ్ప్రత్యయః। ప్రజ్ఞాదిభ్య శ్చ (5-4-38). ఇట్లే మారందధునీ (3-130), మరందధున్యేవ మారందధునీ. కౌసుమవ్రణంబు (3-152). కుసుమవ్రణమే కౌసుమవ్రణము. కౌలాయము (4-6). కులాయ మేవ కౌలాయమ్. వైయచ్చరవీథి (4-55), వియచ్చరవీ థ్యేవ వైయచ్చరవీథిః. కౌసుమపుంజములు (5-78). కుసుమపుంజములే కౌసుమపుంజములు.

(*) శబ్దరత్నాకరము, "పారంగతుఁడు" శబ్దము.

౧౪. భవిష్ణు (1-34). భూ ధాతువునకంటె తాచ్ఛీల్యార్థమున భువ శ్చ (3-2-138) సూత్రముచే "ఇష్ణుచ్" ప్రత్యయము. దే శ్ఛన్దసి (3-2-137) అనుపూర్వసూత్రమునుండి "ఛన్దసి" అనుదాని కిట అనువృత్తి గలదు. కావున ఇది వేదమునందే ప్రయోగింపఁబడ వలసి యున్నది. కాని కవులు "జగత్ప్రభో రప్రభవిష్ణు వైష్ణవమ్" అనురీతిని దీనిని ప్రయోగించి యుండిరి.* ఇఁక లక్షణకర్తలు ఇచట "చ" కారము అనుక్తసముచ్చయార్థక మని (సముచ్చయ మును చెప్పునది యని) అపూర్వవిధానముతో దీనిని సాధు వను చున్నారు. అందులకు కారణము "చ" కారము అనుక్తసముచ్చ యార్థముగా మహాభాష్యకర్తచే వ్యాఖ్యానింపఁబడుటయే.

౧౫. ఘాతకుఁడు (2-20)=ఘాతుకుఁడు (హింసించువాఁడు). హన్తి ఇతి ఘాతకః। హన్ ధాతోః ణ్వుల్ తృచౌ (3-1-133) ఇతి ణ్వుల్ ప్రత్యయః। యువోరనాకౌ (7-1-1) ఇతి అకా దేశః। హనస్త చ (3-1-108) ఇతి తాన్తాదేశః। కుత్వం చ। "శ్లో. గౌరీమాధవయో ర్భర్తా రాధికా శివసన్నిధౌ। ఇన్దుః కుముదహన్తా చ సూర్యః కమలఘాతకః॥" ఇతి విదగ్ధముఖమణ్డనమ్। (చూ. హలాయుధవివరణము) "ఘాతుకః" ఇతి రూపాన్తరమ్। హన్తేః ఉకఞ్। (3-2-154 లషపత ... అనుసూ. చే ఉకఞ్)

౧౬. వియత్తలి (2-40). "తల" శబ్దము ప్రదేశార్థమునఁ గాని, స్వరూపార్థ మునఁగాని నపుంసకలింగము. "అథ స్వరూపయో రస్త్రీ తలమ్" అని అమరము. ఇట 'వియత్తలీ' అనుట ప్రమాద మనవలయును. లేదా 'వియత్స్థలి' గా నుండి లేఖకప్రమాద మున "వియత్తలి" అయి యుండును. అకృత్రిమభూమి 'స్థలి' అని సంస్కృతవ్యాకరణము. [జానపదకుణ్డగోణస్థలభాజనాగ కాల.... మైథునేచ్ఛాకేశవేశేషు (4-1-52)]. ఇట స్వరూ పార్థము గాని, ప్రదేశార్థము గాని సుసంగతము.

* శిశుపాలవధము, 1-54.

౧౭. పతయాళు, దయాళు (2-41). ఆళుచ్ ప్రత్యయము.

౧౮. వియోగము (2-69). ఎడబాటు అనువర్థమున నిది ప్రసిద్ధము. కాని యిట "విశేషేణ యోగః" అని 'గాఢ మయినకలయిక' అనువర్థమునందు ప్రయుక్తము. "వి" విశేషార్థక మిట (ప్రాదిసమాసము).

౧౯. కౌక్షేయక (3-50). కుక్షౌ భవః కౌక్షేయకః (కుక్షి శబ్దమునకంటె భవార్థమున "ఢకఞ్" ప్రత్యయము). కులకుక్షిగ్రీవాభ్యః శ్వాస్యలఙ్కారేషు (4-2-96). (కౌక్షః కూడ అగును).

౨౦. పాణిగృహీతి (3-65) గృహీతః పాణిః యస్యాః సా। పాణిగృహీత శబ్దాత్ భార్యావాచకాత్ ఙీష్ విధీయతే। పాణిగృహీతీ భార్యాయామ్ అను (4-1-52 సూత్రములోని) వార్తికము వలన ఙీష్ విధింపఁబడినది. ఇతర యగుదాసీ మొద లగునది పాణిగృహీత (భార్యకానిది) (టాబన్తము).

౨౧. పచేళిమ (3-96). పచ్ ధాతువునకంటె కేళిమర ప్రత్యయము. "కేళిమర ఉపసంఖ్యానమ్" అని వార్తికము. ఇచ్చట పైప్రత్యయము కర్మార్థకము. కాశికావృత్తికారుఁడు కర్మ కర్త్రర్థక మని యీ ప్రత్యయమును వచించెను. కాని అది భాష్యవిరుద్ధ మని దీక్షితులు. [కర్మణి ప్రత్యయః-వృత్తికార స్తు కర్మకర్తరి చా య మిష్యత ఇ త్యాహ।తద్భాష్యవిరుద్ధమ్। చూ. తవ్యతవ్యానీయరః (3-1-96)] ఇట్టిదే భిదేళిమ (3-96).

౨౨. జడిమ (3-98). జడస్య భావః। ఇమనిచ్ ప్రత్యయః। ఇట్లే మధురిమ (3-130)

౨౩. కైరవారములు (3-124). కీరాణాం వారః కీరవారః। కీరవార ఏవ కైరవారః। స్వార్థిక అణ్ ప్రత్యయః।

౨౪. కార్తికీ (3-165). కృత్తికానక్షత్రేణ యుక్తా పౌర్ణమాసీ కార్తికీ। నక్షత్రేణ యుక్తః కాలః (4-2-3) అణ్। లుబవిశేషే ఇతి లుగ్న భవతి। విభాషా ఫాల్గునీ శ్రవణా కార్తికీ చైత్రీభ్యః (4-2-23) ఇతి నిర్దేశాత్। (అని నిర్దేశించుటవలన లుక్కు రాదు).

౨౫. తరుణేక్షుధనుష్కతురుష్కవహాళి (4-5). ఇక్షుధనుష్కుఁడు= మన్మథుఁడు. 'ఇక్షుః ధనుః యస్య సః' అని విగ్రహము. సంజ్ఞావాచకమిది. బహువ్రీహి సమాసము సంజ్ఞావాచకములకు వా సంజ్ఞాయామ్ (5-4-133) అని అనఙాదేశము వికల్పము. అనఙాదేశము రానిపక్షమున శేషాద్విభాషా (5-1-154) అను సూత్రముచే "కప్" ప్రత్యయవికల్పము. "కప్" ప్రత్యయము వచ్చినపుడు 'ఇక్షుధనుష్కః' అని యగును. కప్ రానియపుడు ఇక్షుధనుః అని యగును. ఇక్షుధన్వా, ఇక్షుధనుష్కః, ఇక్షుధనుః అనుమూఁడు రూపములును సాధువులే. 'ఇక్షుధనుష్కః' అనెడి యీరూపము కవికిఁ గలవ్యాకరణపాండిత్యమును విశదపఱచును.

౨౬. నారి (4-15). నరా ఏవ నారాః। నారాః అస్మిన్ స న్తీతి। (అత ఇనిఠనౌ, 5-2-115). (శ్లేషయందిది ఒకయర్థమున స్త్రీ యనియు, వేఱొకయర్థమున నీరు కలిగినది అనియు చెప్పఁబడెను).

౨౭. భూరిక (4-15). భూరి ఏవ భూరిక। స్వార్థిక 'క' ప్రత్యయః। (శ్లేష) ఇట్లే రామక (4-20). స్వార్థిక క ప్రత్యయము (శ్లేష).

౨౮. పాండిమ (4-17). పాండు శబ్దమునకు ఇమనిచ్ప్రత్యయము.

౨౯. సాంగ్రామికుఁడు (4-64). సంగ్రామ మర్హతి ఇతి సాంగ్రామికః। తదర్హతి (5-1-63) ఇతి ఠక్ ప్రత్యయః। (సంగ్రామమును పొందుటకు అర్హుఁడు).

౩౦ పౌలోమి (4-67). పులోమ్నః అపత్యం స్త్రీ। తస్యాపత్య మిత్యర్థే పులోమన్ శబ్దాత్ అణ్ ప్రత్యయః।

౩౧. నైశాకర (4–131). నిశాకరస్య ఇయం నైశాకరీ। నైశాకరీ చాసౌ రుచి శ్చ।(ప్రంవద్భావము).

౩౨. మారందకణాళి (4–136). మరందస్య ఇమే మారందాః।తస్యేదమ్ (4–3–120) ఇతి అణ్ ప్రత్యయః।మారందా శ్చ తే కణా శ్చ।తేషా మాళిః।

౩౩. స్ఫాయజ్జగా (4–218). స్ఫాయీ-వృద్ధౌ అనునది ధాతువు(1). ఇది యాత్మనేపదిగా ధాతుపాఠమున పఠితము. అప్డు 'శానచ్' ప్రత్యయము వచ్చి 'స్ఫాయమాన' కావలయును. కాని, పరస్మైపదమున కగుశతృప్రత్యయము వచ్చి, 'స్ఫాయత్' అని యిచట ప్రయోగింపఁబడినది. సంస్కృతకవులు కూడ దీనిని ప్రయోగించినవా రున్నారు. భట్టమురారి '....ప్రౌఢరో మాఞ్చదణ్డస్ఫాయన్నిరోమకసన్ధిప్రసరదవిగలత్సమ్మదస్వేద పూరాః' అని ప్రయోగించెను(2). అందులకే కవికల్ప ద్రుమవ్యాఖ్య గణకార్య మనిత్య మని దీనిని సాధించినది. తెలుఁగుకవులలో లెక్కకు మిక్కిలిగానే దీని నీరీతిని ప్రయోగించినవారు కలరు. తటాకతరుకుసుమ........సలిల కల్లోలమాలికాస్ఫుటస్ఫాయత్ఛాయమాననానావిధోద్యానవాటికా ' 'కాలాంధకారంబులును–అని శ్రీనాథుఁడు(3). తదీశము రజిత్సద్మస్వనద్దుందుభిస్ఫాయత్కాహళికా ప్రతిస్వనత(4). కాంచె నైష్ణవుఁ డర్ధయోజనజటాఘాటోత్థ........మహా ఫలోపమస్ఫాయద్వటక్ష్మాజమున్(5).– అని శ్రీకృష్ణదేవ రాయలును ప్రయోగించి యున్నారు.

---

1. ధాతుపాఠము, 487.
2. అనర్ఘరాఘవము, 1-56.
3. శివరాత్రిమాహాత్మ్యము, 2-7.
4. ఆముక్తమాల్యద, 1-72.
5. ఆముక్తమాల్యద, 6-15.

౩౪. తాపని (4—219). తపనస్య అపత్యం పుమాన్।అత ఇఞ్(4_1_95). (కర్ణుఁ డని యర్థము).

౩౫. ధానము (5_2). డుధాఞ్ ధారణపోషణయోః।* ధాఞ్ ధాతువునకంబె భావార్థమున ల్యుట్ ప్రత్యయము(అమృతపురీతిని ధరించుట గాని- పోషించుటగాని కలది వచోరీతి—అని యిచటియర్థము).

౩౬. ప్రౌఢిమము (5—30). ఇదియు లక్షణవిరుద్ధముగ 'ఇమనిచ్' ప్రత్యయము కలిగినప్రయోగమే! తెనుఁగుకవులు దీనిని లెక్కకు మిక్కిలిగా ప్రయోగించి యున్నారు. గంభీరవాక్ప్రౌఢిమన్—అని శ్రీనాథుఁడు(1); మిగులఁ బ్రౌఢిమమున—అని శ్రీకృష్ణదేవరాయలు(2); సాహిత్యస్ఫురన్మాధురీచారుప్రౌఢిమఁ జెప్పి—అని ధూర్జటి(3); గంభీరరసగుంభసంభృతప్రౌఢిమతో(4). గేయవాక్ప్రౌఢిమన్(5) అని రామరాజభూషణుఁడు; సామిసంపుల్లమల్లిపాటలీచంపకోత్పలప్రౌఢిమములు- అని నందితిమ్మన(6); వరగుణప్రౌఢిమ(7). వచోనూనప్రౌఢిమఁ జెప్పి(8) —అని కందుకూరు రుద్రయ; సిరినిఁ బ్రౌఢిమఁ జెందె మురారి కృష్ణుఁ డై—అని దామర్ల అంకభూపాలుఁడు(9); దానగుణప్రౌఢిమవాసి—అని పట్టమట్ట

---

* ధాతుపాఠము, 1092.

1 శృంగారనైషధము, 1-12.

2. ఆముక్తమాల్యద, 4-98.

3. శ్రీకాళహస్తిమాహాత్మ్యము, 3-167.

4. వసుచరిత్ర, 2-106.

5. „ 3-59.

6. పారిజాతాపహరణము, 3—46.

7. నిరంకుశోపాఖ్యానము, 2-4.

8. „ 4-16.

9. ఉషాపరిణయము, 1-54.

సోమనాథసోమయాజి(1), సర్వజ్ఞతాపటుప్రౌఢిమ—అని నంది మల్లయఘంటసింగయలును(2) ఈ ప్రయోగము నాదరించిరి. ఇంకను వందలకొలఁదు లివి కలవు. ఇందఱీ ప్రయోగమును లక్షణవ్యతిరిక్తమని తెలియక ప్రయోగించి రనఁజాలము. ప్రీతిమై నీప్రయోగము నాదరించి రనవలయును. "........తే సర్వే స్వస్వప్రౌఢిమప్రకటనపూర్వకం శాస్త్రవిచారం కుర్వన్తు... ........అని యొకసంస్కృత పుస్తకమువను కల దీపప్రయోగము(3).

౩౭ ధ్యాయ (5-63). ధీయతే అనయా సమిత్—అని విగ్రహము (సామిధేనీ)ఋక్కు. పాయ్యసాన్నాయ్యకాయ్యధాయ్యాః మానహవిర్నివాససామిధేనీషు(3—1—129) అను సూత్రముచే నిది సాధితము. సమిత్ప్రక్షేపణార్థ మయినమంత్రము దీని కర్థమైనను లక్షణచే నిచట తదర్థక మగునది. తత్తుగానే వ్యవహరింపఁబడుచు నిది సమిధను చెప్పుచున్న దనఁదగి యున్నది.

## ఆంధ్రము

౧. కలుగున్ లాయుష్పఁదేజీ (1-7)
తళుకున్మేడలు (1-77)
మిటారంపున్మునుంబల్కులన్ (1-77)
అద్దపున్ముడుప్పలు (1-77)
గాలాపున్వేఁట (2-109)
మేలుపున్మదిత (2-120) స్థిరంబుపరంబగునప్పుడునుగాగమంబు
మొక్కలపున్ నెఱరౌతు (2-141) (బాలవ్యాకరణము, సంధి. 25సూ.)
కొంచెపున్నడగని (3-76)

---

1. బ్రహ్మోత్తర ఖండము(చూ. ఆంధ్రకవితరంగిణి-11వసంపుటము, పుట20).
2. వరాహపురాణము, 1-39.
3. భాషామంజరి,పుట.22

పౌరతనప్రస్వరవులు (4-81)
జవ్వనప్రన్‌రాచకొమరుఁడు (4-134)
కులుకున్‌సంగాట (5.98)
అబ్బురప్రన్‌వలిగుబ్బెతల్ (4-137)
విక్కప్రన్‌రంగొ (5-110)

౯. అన్‌ప్రౌఢి (1-16) ధాతుజవిశేషణాంత్యోకారమునకు
అశ్వతరుఁడన్‌వ్యాళేంద్రపుత్త్రిల్ (1-9) లోపము(ప్రౌఢవ్యాకరణము
అన్‌వాక్యముల్ (3-25) సంధి13)
అన్‌వచనముల్ (4-130)

౧౦. హేమకరగండాంకవర్యుఁడు (1-17) మనుజబిరుదవాచకములకు సమాసము
వజీరామాత్యులు (1-17) (అథర్వణకారికావళి,హలన్త 9)
హిందుఖానసేనాధిపతులు (1-17) హైదరుఖానవిభుఁడు-తపతీ. 1-23.
మత్తఖానపుంగవ (1-17) హిమవద్వీర్యావకృద్యశశ్రీః గర్భితజగ
రాయవరగండ (2-57) దండ-తపతీసంవరణము,4-96.

హిమకరగండా (4-219)
౧౧. పోల్కి (1-20)
చెల్మి (1-20,2-43)
తిర్మలదేవి (1-42, 6)
మర్లి (5-50.54)(2-29)
తర్లి (2-83) పదమధ్యాచ్చులకు లోపము.
కెర్లి (3-96) (బాలవ్యాకరణము,ప్రకీర్ణకపరిచ్ఛేదము,
కోర్కి (3-101) 17,18).
తుంగ్లీకు (4-13)
గుండ్లు (3-3) ఇప్పొలిండ్లుదల పట్టియాడ్చి-ఆశ్రమవాస
చెల్కత్తె (4-139) పర్వము,1-168
ఇండ్లు (4-76)
చీట్లు (4-101)

౫. సారాయికొాపెర(1-41)　　జడ్డకు లోపము(బాల. ప్రకీర్ణక. 8).

౬. చినదారనాఖ్యఁ దగునన్ను(1-56) } ఉత్తమపురుషకు బదులు
　పీరి దైతివి　　(5-44) } ప్రథమ పురుష

౭. పద్మబంధులు　(1-60) 'వు'వర్ణేతరవిభక్తిపరకమున 'వు' లోపము.
　ప్రభుల　(2-148) (బాలవ్యాకరణము,తత్సమపరిచ్ఛేదము-49)
　ఊరుల　(3-159) చచ్చినబంధులఁ గొని రావచ్చునె?-అశ్వమేధ. 1-135.

౮. గుడి వెడలివచ్చు(1-86)=గుడివి వెడలివచ్చు. (బాల. కారక. 24)

౯. ఊడిగాల్　(1-93)
　ముత్యాల　(1-99;4-139,188)
　అడపాల్　(2-49) లులనలు పరము లగు చుండఁగా ముగాగ
　ముత్యాలయందు (2-56) మమునకు లోపము. పూర్వస్వరమునకు దీర్ఘము
　గంటాల　(2-110) (బాలవ్యాకరణము,తత్సమపరిచ్ఛేదము-43).
　ఇచ్చకాలకు (2-126)
　కుంతాన　(2-138) ధేనునివహానఁ ద్రొక్కించి-అనుశాసనిక. 3-48.
　శవపదాల్　(2-151)మూలబలంబున్ను మొత్తాలవారును-ఆశ్రమవాస.1-73.
　హజారాన　(3-20) సీసానఁ బట్టియు నుప్పళించు-విరాట. 2-15.
　చందాన(3-62,4-182) అలుపాలఁ బొనుపడునట్టిచిచ్చె యిది?-ఉద్యోగ. 3-117.
　పరాగాలు　(3-72) సీ. ఫెళఫెళవీరణాల్ ఖళఖెళి వాయించి
　ఆగడాలు　(3-100)　　పోటుబోఁ గొమ్ములు నాట నూఁది
　కయ్యాన　(5-10)　　——హంసవింశతి,2-89.
　జగడాన　(5-35)

౧౦. కటువుకు (1-101) కువర్ణకము పర మగునపుడు నుగాగమము రామి(ప్రౌఢ వ్యాకరణము,శబ్ద-19). "కామినీ! జనులున్ రాజు కవధ్యు లీగగనభాష ల్నమ్మఁగా వచ్చునే? (వరాహపురాణము. 4-171). అగ్రపూజకుం! గానుకుఁ బోనియీపసులకాపరి పేదరి గొల్లఁ దర్హుఁడే ? (వరాహపురాణము.4-220).

౧౧. కోనమాంబ(కోన + అమ + అంబ)(1-35)
రంగమాంబ(రంగ + అమ + అంబ)(1-42)   పూజ్యార్థకశబ్దములపై
గురువమాంబ(గురువు + అమ + అంబ)(1-42) మరల శ్రేష్ఠతావాచకములు
మూర్తమాంబ(మూర్తి + అమ + అంబ)(1-44, 4-219)   (అహోబల పండితీయము, పుట 444, 445).
పెదరంగమాంబ(పెదరంగ + అమ + అంబ) (1-54)
తిమ్మమాంబ(తిమ్మ + అమ + అంబ) (1-55)

౧౨. మొగమందము (2-16) షష్ఠీసమాసమునం దుకారమునకు నుగాగ లేనడగొయారము (3-58)మము రామి. (ప్రౌఢ. సంధి. 10) "ఏమందము మందయానమొగమందము మీఱు నవారవిందమున్" - విజయవిలాసము, 1-149.

౧౩. గంజాపొడుల్(గంజాయి + పొడుల్)(1-41)
వాతప్పు(వాయి + తప్పు)(2-24)
అందాఁక(అంత + దాఁక)(3-62)
కడికండలు (కండలు + కండలు) (2-40)   ఆచ్ఛికసమాసవికారములు (ప్రౌఢ. సమాస. 36)
బలుగుండ్లు (బలువు + గుండ్లు) (3-18)   (బాలవ్యాకరణము, ఆచ్ఛికపరిచ్ఛేదము-21)

౧౪. చెట్టునన్ (2-20)=చెట్టునందుండి. "నావదనంబున నిర్గమించి" - అనుశాసనిక. 4-408.

౧౫. సురంగ (2-34)
చామరలు (2-53)   చరిత్రాదులమువర్ణకలోపము (బాలవ్యాకరణము, తత్సమపరిచ్ఛేదము-58)
పులకలు (3-147, 4-46)   శా. సారథ్యంబు వహింప భీష్ముఁడు
వేగ (4-180)   సితచ్ఛత్త్రంబు గాండీవి చె
అలకల (4-195)   ల్వారం బట్టఁగఁ జామరల్ కవలిడన్
(శాంతి, 1-349)

౧౬. ఓ వెఱ్ఱికాన' (2-39) స్త్రీ సమము మీఁద, స్త్రీ వాచకము మీఁద 'కాన'
ఇంతికాన! (1-167) (ప్రౌఢవ్యాకరణము, శబ్ద. 15)

౧౭. సళ్లి (2-59) = సడలుటచేత. హేత్వర్థకక్త్వార్థము
ఘర్మము గ్రమ్మి (4-139) = ఘర్మము (ప్రౌఢ. క్రియా. 18)
క్రమ్ముటచేత.
వీడి (5-68) = వీడుటచేత.

ఇది సంస్కృతమునను కలదు.

1. శ్రీశైలశిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే.

2. శ్లో. భారతామృతసర్వస్వం విష్ణోర్వక్త్రాద్వినిస్సృతమ్।
గీతాగంగోదకం పీత్వా పునర్జన్మ న విద్యతే॥
(—భగవద్గీత, స్తోత్రశ్లోకములు_3)

3. శ్లో. సేతుం దృష్ట్వా సముద్రస్య గంగాసాగరసంగమమ్।
బ్రహ్మహత్యాం ప్రముచ్యేత మిత్రద్రోహో నాత్ర ముచ్యతే॥
(—సింహాసన ద్వాత్రింశిక. పీఠిక. xxxvii)

౧౮. పట్టుక (2-80) కొనునకు 'క' ఆదేశము. లక్షణాతిక్రమణము
కనిపెట్టుక (4-113) (బాల క్రియా. 60). కాని ప్రబంధములం
దివి పెక్కులు.
అంటిపెట్టుక (4-206) "గరళం బెత్తుక క్రోలఁగాఁ"
- భాస్కర)రామా.అరణ్య 2
"చేతులు గట్టుక నిలిచియు"
— వసుచరిత్ర, 4.23
"ఈరీతి నిశ్చయించుక"
- ఉషాపరిణయము, 3-31
"దంతములఁ బోరఁ బట్టుక"
- ఉషాపరిణయము, 5-2

౧౯. చిక్కటారి (2-95). చికి + కటారి (అవి సూ. వి.)
    చికటారి (రూపాం)=చిన్నకత్తి.

౨౦ నాసామి కెదిరి (2-99)=నాసామి నెదిరించి. (బాల .కారక. 21).

౨౧. విద్దురలు (2-11?) (బహువచనము విశేషము)

౨౨ అందియిచ్చు (2—138. 5-
    అందిచ్చు (3-20, 4—    ఇప్రత్యయాంతావ్యయమునకు సంధి
    అందియ్య (3-78)    (ప్రౌఢవ్యాకరణము, సంధి, 2)
    అ దియాయ (5-54)
    ఏచింత (ఏచి + ఇంత) (3—25)    సంధి రా దని చిన్నయసూరి
    (బాల. సంధి. 8)

౨౩. అత్వసంధి→ఉన్న + ఎడన్ = ఉన్నెడన్ (2-87)
    అంత + అరిగాపులమే?= అంతరిగాపులమే?(3-44).
    వచ్చిన + అతడు = వచ్చినాతడు(3-81).
    నెఱజాణ + అవును= నెఱజాణవును(5-6).
    బావబావ + అనుచు=బావబావనుచు(5-45).
    సురటుల + అంతల=సురటులంతల(5-43).
"అలుబిడ్డనః"—అశ్వమేధపర్వము. 4-244
"అచటఁ బుట్టినచిగురుఁగొమ్మైనఁజేవ"—మనుచరిత్రము. 1-50.

౨౪. ఇత్వసంధి→తెలవి + ఒంది= తెలివొంది(2. 149).
    పెదవి + ఎత్తి= పెదవెత్తి(3-83).
    మవ్వంపుపి + అని= మవ్వపు వని(3-132)
    మల్లి + అంటు=మల్లంటు(5-38).

తెలివిపదాంత మందలియిత్వమునకు సంధి చేసినప్రయోగములు తిక్కన భారతమున మిక్కిలిగా నున్నవి. మన మీపదనం దెలివొందఁగాఁదగున్—(ఉదోగ్యం. 1-293). తెలివొందినఁ గాక యెట్టిధీమంతులకున్ (అనుశాసనిక) (5-163) తెలివార భవాదృశుల తగుదు రర్మిలిఁ జెప్పన్ (అనుశాసనిక. 4-416.)

దెలివొందినచనంబు(అశ్వమేధ.1-221). మనమునఁ దెలివొంది(అశ్వమేధ. -220). తెలివొందం జేయుండు(ఆశ్రమవాస. 1-13). అట్లు తెలివొంది(ఆశ్రమ. 1-44). మాతెలి విట్లు(ఆశ్రమ.1-96). తెలి వగ్గలింప(మహాప్రస్థానికపర్వము. 7,19).

౨౫. బలుగుండ్లకై డాఁగన్(3-18)=బలుగుండ్లనుండి డాఁగన్.

౨౬. గోరున (3-27)
మేనున (3-82)
చేయిఁ జేర్చి (5-24) అనౌపవిభక్తికములుగ ప్రయుక్తము లివి.
నీపేరునన (5-48)
వ్రేలున (5-65)

౨౭. ఇలలోన ఋతష్వజేంద్రులు(3-54). 'ఋ' 'ర' తుల్యము(బాల.ప్రకీర్ణక.1)

౨౮. తలఁపుచు(3-81) శత్రర్థపరకచువర్ణమునకు పత్వము.
వహింపుచుండె(3-59) (ప్రౌఢవ్యాకరణము,క్రియాపరిచ్ఛేదము-17)
పాలింపుచు(5-111)

౨౯. మీసలు(3-113) బహువచనము పర మగు చుండఁగా తుదియక్షరము నకు లోపము(బాలవ్యాకరణము,అచ్చిక. 22).

౩౦. చరించన్(3-123) (యతిస్థానఘటితము)(పత్వమురానిరూపములు)
ఒనరించ కున్న(4-123) (ప్రౌఢవ్యాకరణము,క్రియా. 16).

౩౧. ఇయ్యఁగా(3-133) ఇచ్చునకు సర్వంబున కీ(బాల.క్రియా.92)రా కుండుట. పలుకనియ్యఁడు(4-183) ఇట్టిప్రయోగము లధికముగనే కన్పడు చున్నవి. ఉండనీయరాదు(3-162)

౩౨. గ్రుడ్డికంటి (4-61) = శుక్రాచార్యుఁడు (సమాసాంతకార్యము. బాల. సమాస. 22)

౩౩. ఏమోయి (4-64) స్వతంత్రయోగమునం దోయి. (బాల. తత్సమ. 16)
తే. సంగతియె యోయి ! యిసుమంతతింగణావు - ఆముక్త. 4-60.

౩౪. ఎక్కడ వచ్చె (4-79)= ఎక్కడనుండి వచ్చె (ఉండికి లోపము ప్రౌఢ. కారక. 11)

౩౫. అబ్జువంటిది (4-130)= అబ్జుని (చంద్రుని) వంటిది.

౩౬. కూర్మిక త్తియ (4-165) (మతుబర్థమున కత్తియ. బాల. తద్ధిత. 11)
వేగిరకత్తె సూ. వి. 'కూర్మికత్తియకు' ఈ ప్రయోగ మొక్కటే చూపెను.

౩౭. డిల్లబొట్టు (4-188) (డిల్లము+బొట్టు) సూ. వి. దీనిని గ్రహింపలేదు. నిక్కలాదులకు చెందినది (బాల. సమాస. 20)

౩౮. పలుక్క (5-54) (పలుక్కము-అనుట) (మధ్యమపురుషవర్తకమునకు లోపము బాలవ్యాకరణము, సంధి. 47)

౩౯. వల్ల 5-68)= వలన.

౪౦, కోరికి (5-73) ('కోరు'నకు 'ఇకి' ప్రత్యయము. బాల. కృదంత. 16).

౪౧, తలబ్రాలునకు (5-95) (ఏకవచనమునందు ప్రయుక్తము).

౪౨ ముంగై (5-99) (ముందు+కై)

పారగతుఁడు (1-65, వనజమ్యబకర (2-58). తరుణేక్షధనుష్క (4-5). గ్రహింబువేడ్క (4-208). సుధావిధానధానవచోరీతి (5-2) మున్నగు ప్రయోగములు చిననారాయణకవీశ్వరునిపాణినీయపరిచయప్రగాఢత్వమును ఋజువుపఱచు చున్నవి. ఇవి పాణినీయపఠనశీలత్వమువలన ప్రయోగింపఁదగినవే కాని కేవలకావ్యపరిశీలనమున పట్టువడునవి కా వనవచ్చును. మఱియు స్వార్థికాణ్ ప్రత్యయాద్యుద్భాసితప్రయోగము లీతనిని కరతలామలకీకృతసంస్కృతవ్యాకరణునిగా చెప్పక చెప్పు చున్నవి.

ఇట్లే ఆంధ్రవ్యాకరణప్రయోగవిశేషములుకూడ చాలవఱ కీతని వ్యాకృతిపాండితిని ప్రకటించుచు, నటనట నూతనప్రయోగప్రియత్వమును కూడ చాటి చెప్పు చున్నవి.

శ్లో. కేయూరాణి న భూషయన్తి పురుషం హారా న చన్ద్రోజ్జ్వలా
న స్నానం న విలేపనం న కుసుమం నాలఙ్కృతా మూర్ధజాః।
వాణ్యేకా సమలఙ్కరోతి పురుషం యా సంస్కృతా ధార్యతే
క్షీయన్తే ఽఖిలభూషణాని సతతం వాగ్భూషణం భూషణమ్॥
- శ్రీ భర్తృహరి

# దశమదళము

# జాతీయములు - సామెతలు

జాతీయములందును, సామెతలలోను మానవజీవనవికాసము ప్రకృతిపరిశీలనవిధానము ఉల్బణములవును. ప్రకృతికి, మానవజీవనగతికి ముకురప్రాయములయినకావ్యములకు లోకోక్తులు లోకోత్తరకాంతిని ప్రసాదించి ప్రసన్నగుణవంతములుగా చేయును. కృతికన్య కిట్టిసద్గుణములు ఆవశ్యకములు గావున కవులు సందర్భమును పురస్కరించుకొని చక్కనిజాతీయములను, సామెతలను, పలుకుబడులను గ్రహించి రచించి రాణింతురు.

వీనిని కావ్యగతములు చేసి, రససహకారులివి యని రుజువు చేసినకవీశ్వరులు నన్నయభట్టారకులవారే! ఎఱుక గలరె మగువలెందు(1). క్రోధిగాఁదపస్వికిఁ జన్నె(2), గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్(3), కాముశక్తి యుడివింపఁగ శక్యమె యెట్టివారికిన్(4), కామికి నయంబున నొందు దలంపఁబోలునే(5), కుంతికడుపుచల్లఁగాఁ బుట్టినఘనభుజుండు(6), విశ్రృంఖలయలుకయుఁదృణహుతాశనంబు దీర్ఘ మగునె(7), వృద్ధులబుద్ధులు సంచలింపవే(8), విలాసినులసహోలాపసహాసనసహాయానములు బంధనములు గావే(9), కొండలు వడి

1. ఆదిపర్వము, 2-34.
2. ,, 2-173.
3. ,, 5-159.
4. ,, 7-58.
5. ,, 4-214.
6. ,, 6-18.
7. ,, 6-90.
8. సభాపర్వము, 2-9.
9. ఆరణ్యపర్వము, 3-111.

నట్లు వడిరి(1). ఇత్యాదు లన్నియు నన్నయభట్టారకులవారిమంగళకరకరసరసిజ ములతో వ్రాయఁబడి నేఁటికిని నిఖిలాంధ్రజనామోదము నంది యున్నట్టివి. నన్నయగారు ప్రయోగించినవానిలో కొన్నిలోకమునుండి గ్రహింపఁబడినవియు, కొన్నిసందర్భానుగుణముగ తాము రచించినవియు నుండవచ్చును. దాదాపు అట్టి వానిలో నర్థాంతరన్యాసములు చాలవఱకు కవికృతము లనియే అనవచ్చును. కావుననే అనంతరప్రబంధకవిసింధురములు నడచినకృతిపథములలోనియర్థాంతర న్యాసములు పెక్కులు సూక్తులై, లోకోక్తులై సర్వజనరసనాగ్రములయందు విహరింపఁజొచ్చినవి. 'బుద్ధిజాడ్యజనితోన్మాదు లగుదా శ్రోత్రియుల్(*) ఇత్యా ద్యర్థాంతరన్యాసములు క్రమేణ జాతీయస్థాయికి పెరిఁగినవి.

జాతీయములను పొందుపఱచుటలోను, సామెతల నందముగా ప్రయోగిం చుటలోను ఈప్రబంధకవిది అందెవైచినచెయి యని యీగ్రంథము చాటు చున్నది. ముందు ఒండురెండుజాతీయములు, సామెతలు కవిత్వదీప్తికి సహక రించినరీతిని వివరించినపిదప ఈకృతిలోనిజాతీయాదు లన్నియు పట్టికాఘట్టితము చేయఁబడును. క్రిందిపద్యమునందు తిమ్మనృపశౌరిపరాక్రమము వచింపఁబడు చున్నది—

సీ. "విడు పైటచెఱఁగు నే వెఱతు గాయము మాన
        వి" మ్మని ఛాయ యెంతేవి వేఁడ,
    నశ్వినుల్ మందులకై ద్రోణగిరికి ని
        చ్చలుఁ బోవుకతన వేసరుకొనంగ,
    నిరుపద్రవము గామి నిలువరా దవి రమా
        పతి వేఱ పాలెంపుఁబట్టు వెదక,
    'నాయయ్య కిదియ పాటా' యంచు వల సింహి
        కాతనూభవుఁ డౌడు కఱచికొనఁగఁ,

---

1. అరణ్యపర్వము 4-73.

* మనుచరిత్రము, 2-16.

గీ. జెలఁగి తొగకొమ్మ మొగ మింత చేసికొనఁగఁ
దిమ్మనృపశౌరిదినదివోద్భిన్నవైరి
వారబహువారభేదనవర్ధమాన
మైవరవిమేవిపెనుగండి మాన దయ్యె. (1-25)

ఇచట 'మొగమింత చేసికొనఁగ' ననుట జాతీయము. కళ్లింత చేసికొను, నోరింత చేసికొను—మొద లయిన వీకోవలోనివే! ఇచట 'ఇంత' అనునది పరిమాణార్థకము గాదు. భృశార్థకము. మొగము పెద్దది చేసికొనుట యని యర్థము. నిజముగా మొగము పెద్ద దగునా? కాదు. ఆనందముతో ముఖము వికాసమునందుటే దీనికైనపరమార్థము. సూర్యునిశరీరములోనిపెద్దరంధ్రమును (గాయమును) చూచి కలువచెలువ సంతసపడె నఁట! ఎందుకు? అతఁడు తనకు శత్రువు. అతఁ డిప్పుడు వ్యాధిగ్రస్తుఁ డగుటవలన అతనిప్రతాపము తగ్గిపోవుట జరగెను. అందుకవి కలువ కమితానందము. ఇచట కలువపడఁతి అమితానందపడె నని వాచ్యముగా వచింపక 'మొగమింత చేసికొవినది' అనుజాతీయముమూలమున ధ్వనిమార్గమున చెప్పఁబడినది. దీనివలన పద్యములోనిఉక్తివైచిత్రి కంతటికి దీప్తి ప్రాప్తించినది అర్థగాంభీర్యమును పోషించుట కిట్టి జాతీయములను ప్రయోగించుట కవిత్వమర్మ మెఱిఁగినకవులు చేయుపని. ఈమొగమింత చేసికొనుట—అనుజాతీయము కోపమునందును ప్రయోగించుట కలదు మొగమింతయినది—అనుటలో లజ్జాలక్షణము కూడ సూచింపఁబడును. ఇవి యన్నియు నాయాసందర్భములనుబట్టి గ్రహింపవలసి యుండును. మఱియొకయుదాహరణము—

సీ. ఎన్ని నేర్చినది తా నిన్నటిమొటిక గా!
ముఁకొమ్మఁ గడకుఁ బో మ్మనఁ గదమ్మ!
పడుచుదూడలచేతఁ బని యౌనె! వీ రేల
యనసూయఁ దోతేరఁ బనుప రమ్మ!
యీప్రొద్దు నక్షత్ర మేమి? లగ్నము మంచి
దే? యంచుఁ దగువారిఁ దెలియ రమ్మ!
శుద్ధవేళ సుఖప్రసూతి గావలె నంచు
నిలువేల్పులకు మీఁదు లెత్త రమ్మ!

గీ. అనుచు గుమిగూడి మ్రొగి నొక్కయెలరుఁదోఁటఁ
బూవుఁబొదరింటఁ దార్చి, యింపులు జనింప
నున్నతఱి మాయ గైకొని యుట్టె పడిన
సరణిఁ జెట్టునఁ దెగిపడ్డకరణి వాఁడు (2-26)

ఈపద్యము జాతీయములపట్టు. విన్నటిమోటికగా, పడుమమూడంచేతఁ బను లౌనె, మీఁదు లెత్తరమ్మ, ఉట్టె పడినసరణిన్, చెట్టునఁ దెగిపడ్డ కరణిన్ ఇవి యన్నియు నచ్చపుజాతీయములు. ఇవి అవయవార్థములను వీడి అర్థాంతరము లందు పర్యవసించు చున్నవి. జాతీయములను బ్రయోగించుటలో లోకములో స్త్రీలదే మీఁదిచేయి. ఈసంగతి నెఱిఁగిననెఱజాణ నారాయణ స్త్రీప్రకృతిని పట్టి చూపు చున్నాఁడా యనునట్లిచట జాతీయసముచ్చయమును నిబంధించినాఁడు. అద్భుతజాతివార్తల కాలవాల మగునట్లు తనకబ్బమును రూపొందింతు నని చేసిన ప్రతిజ్ఞను (1-12) ఏమఱనిగడుసరి యీతఁడు.

ఇపు డొండురెండుసామెతలను సంశీలింపఁదగును.

చ. పదరకు మన్న! మౌనికులపావన! 'కుమ్మరి కొక్కయేఁడునుం
గుదియకు నొక్కపెట్టు' నని కోవిదు లాడరె? ఘోరసాధనా
ధ్యుదితతపోబలం బిటు లయో! యొకరక్కసుపాలు చేతురే?
మదిమదినుండి మే మెఱుఁగమా మఱి వీని ఖరాపరాధముల్? (2-38)

ఇట 'కుమ్మరి కొక్కయేఁడునుం గుదియకు నొక్కపెట్టు' అనునది సామెత. ఆఱుగాలము శ్రమించి నిర్మించి పేర్చినకుండలు ఒక్కగుదెదెబ్బకు బ్రద్దలయిపోయినట్లు - అని దీనియర్థము. శ్రమించి సంపాదించిన దంతయు క్షణములో నశించు సందర్భమున ఈమెత ఉపయోగింపఁబడు చున్నది. ఇచట కోపావేశమున గాలవముని పాతాళకేతువును శపింపఁబోవుసమయమున గగన భారతి యీమాట లనెను. ఏండ్లుపూండ్లు నియమనిష్ఠలతో తపించి సంపాదించిన తపశ్శక్తిని ఈరక్కసుని వధించుటకై వ్యయపఱపవల దను చున్నది వాణి. అనఁగా నిట్టిపనులు సామాన్యులే చేయరే మౌనికులపావనుఁడ వయిననీకు తగు నటయ్యా? అని హెచ్చరించుట కీసామెత గ్రహింపఁబడిన దనియు తెలియవల

యును. 'మౌనికులపావన' అని సంబోధించుట లందులకే. వ్యయ మయినతపో బలము తిరిగి సంపాదించుటకు (తిరిగి కుండ లన్నియు నిర్మించుటకు వలె) బహుకాలము శ్రమింపవలయును సుమా! అని సూచించుటకును ఈసామెత యిచట ప్రయోగింపఁబడిన దని భావింపవలసి యున్నది. మఱియొకటి—

చం. వనజకృపాణ చల్లనయి వర్తిలఁగాఁ దడిపాఁత గొంతుగో
 సినగతిఁ దమ్మివాలు గొని చిమ్మెదు పాంథులమీఁదఁ, దేనెపూ
 సినపెనుఁగత్తి కావలయుఁ జేతికి నీకది, విప్రయోగమొం
 దినయలమద్దియుం దగిలి నెయ్యముఁ జూపఁగ నెట్టు లోర్చితో?

(4-29)

'తడిగుడ్డతో గొంతు కోసినట్టు' అని సామెత. దానినే 'తడిపాఁత గొంతు గోసినగతి' ననినాఁడు కవి ఇది సామెతగాను, జాతీయముగాను వాడఁదగినవిశిష్ట వాక్యము. 'తడినగుడ్డతో గొంతు కోసినట్టు' అనినచో సామెత యగును. చివరి యుపమావాచకమును తొలఁగించి 'తడిగుడ్డతో గొంతు కోసినాఁడు' అనినచో జాతీయమగును. పైపద్యమున కవి సామెతగానే ప్రయోగించెను. 'తేనెపూసిన పెనుఁగత్తి' అనునది జాతీయము. పైకి మృదువుగను (మంచిగను), లోన కఠిన ముగను (చెడుగను) ఉండువ్యక్తులపట్ల దీనిని ప్రయోగింతురు. 'తేనె పూసినకత్తి ధ్యాత్రీసురుండు' అని నిగమశర్మవిషయములో తెనాలిరామకృష్ణుఁడు*. మఱి యొకపద్యము—

సీ. అన్నియుఁ దెలిసినవన్నెలాఁడికి నీకుఁ
 దెలిపెడి దే మమ్మ కలువకంటి!
 వినవమ్మ మగవానిమనసు చూడఁగఁ గంచుఁ
 బదనువంటిది సుమీ పద్మగంధి
 యిన్నాళ్లవలెఁ దోడియింతులతోడియా
 టలు గావు గద యిది తలిరుఁబోఁడి!
 యిఁకఁ బతిమన మెట్టు లెనయించెదో నేఁడు
 నీనేర్పు చూతము నీరజాక్షి!

* పాండురంగమహాత్మ్యము. 3-45.

తే. యిక్కడనె యింతసి గ్గెవ హృదయనాథు
నెట్లు గరఁగింప నేర్చెదే యిందువదన!
భావ మెఱిఁగినజాణవు గావె! సమయ
మెఱిఁగి తఱితీపు సేయుమీ! యిగురుబోణి! (5-106)

ఈపద్యము కూడ జాతీయములకు ఖని యని తెలియు చున్నది. ఇందు 'మగవానిమనసు (చూడఁగఁ) గంచుపదనువంటిది' అనుదానివి కొంత విమర్శింప వలసి యున్నది. మదాలసను శోభనమ్మగదికి పంపుచు చెలికత్తియ లను చున్న మాట లివి. కాంస్యలోహము మిక్కిలి గట్టిది. కాని కావలసిన రూపములకు అనుకూలముగా ద్రవీభవించునట్టిది. అట్లే మగవానిమనసు తీక్ష్ణ మయిన దయిన ప్పటికి తెలివితేటలనుబట్టి అనుకూలవఱచుకొనుట కనువయినట్టిది. కనుక జాగరూక వై మసలుకొనుము-అని చెలికత్తెలు బోధించు చున్నా రనిపించు చున్నది.భావ మెఱిఁగినజాణవు గావె! సమయ మెఱిఁగి తఱితీపు సేయుమీ' అను మాటలు కూడ ఈభావమునే సూచించు చున్న వనవచ్చును.ఇదే 'కంచుపదను'ను ఇంటకవులు కాంతాహృదయమున కంటఁగట్టి యుండుటను క్రిందిపద్యము తెలుపు చున్నది.

కం. చంచలము మానయుతమును
గంచుదనువంటి దరయఁ గాంతలహృదయం
బంచు నొకమాట యాడఁ ద
లంచియుఁ జెప్పంగ మదిఁ దలంకెద నన్నన్. *

వివేకుఁడు మతితో నను చున్నమాట లివి.ఇది కులకాంతల కన్వయింప దనుభావమును తరువాతిపద్యమునందు వ్యక్తము చేయు చున్నది మతి. జంటకవుల ప్రయోగమునకు హెచ్చుతగ్గుల కోర్వనిది-అనునర్థము నిచ్చినది సూర్యరాయాంధ్ర నిఘంటువు. ఈయర్థ మెంతవఱకు సరిపడునో పెద్ద లాలోచింపవలయును. 'మొగమింత చేసికొనుట'వలె నిదియు సందర్భానుగుణముగ స్త్రీపురుషహృదయ ముల కన్వయింపఁదగిన దేమో!ఇట్లు సందర్భానుగుణముగ జాతీయములు, సామెతలు మున్నగునవి ఈకువలయాశ్వచరిత్రలో చాల ప్రయోగింపఁబడినవి. అవి అకారాదిక్రమమున నిట కూర్పఁబడు చున్నవి.

---

* ప్రబోధచంద్రోదయము, 1-80.

# జాతీయములు :

౧౦౮. వలపు చెడ్డది సుమ్మా ! (4-185)
౧౦౯. వాఁ డిటు వచ్చి యెంత ? రా కెంత ? (5-39)
౧౧౦. విడెముమీఁద వీడియము (2-89)
౧౧౧. వెలకొమ్మలమనంబులు నమ్మవచ్చునే ? (5-59)
౧౧౨. సవసవఁగా నెఱింగి (4-178)
౧౧౩. సిగ్గులపెండ్లికొమార్తెయుంబలెన్ (2-28)
౧౧౪. సొమ్ము సొమ్మునఁ గూడఁ జేర్చుటయె నీతి (2-43)
౧౧౫. సొమ్మెల్ల వెట్టియెత్తినరీతి వెచ్చపెట్టి (5-58)
౧౧౬. హరి సాహిణి! నీవశము (2-47)

(గుఱ్ఱముబాధ్యత నీది-అనుట)

## సామెతలు :

౧. అడిగినఁ జెప్పఁగూడ దకటా! మరు లెత్తినయాఁటదానికిన్ (3-101)
౨. అడుగులకున్ మడుగులు వఱచినకైవడి (3-87)
౩. ఇందు రమ్మన్నచోట నిల్లెలఁ గొనుట (2-23)
౪. కఱవుకుఁ దో డావపంట గలిగినకరణిన్ (1-101)
౫. కుమ్మరి కొక్కయేఁడునుం గుదియకు నొక్కపెట్టు (2-38)
చుక్క తెగిపడ్డవిధంబున (4-92)
౬. తడిపాఁత గొంతు గోసినగతిన్ (4-2[illegible])
౭. త్రాడుగట్టినవానిచందాన నేలె (4-182)
౮. నారదం డాసుఁ గ్రోవిచందమునఁ దిరుగు (1-41)

జాతీయములు, సామెతలు సూక్ష్మభేదముతో విడదీయరానివి. పాతెడుబండ్ల కెదురు కాళ్లు సాతురె, ముక్కు మొకముఁ జూడకయె తఱుమ నిత్యాదులు ఉపమా వాచకములు లేకుండ ప్రయోగింపఁబడినందున జాతీయములయందే చేర్పఁబడినవి. పాతెడుబళ్ల కెదురు కాళ్లు సాచినట్లు, ముక్కు మొకముఁ జూడకయె తఱిమినట్లు- ఇత్యాదిగ ప్రయోగింపఁబడి యున్నచో సామెతలుగా చూపనగును. వేనియందు చేర్చినను ఇవి తెనుఁగుసామెతలే కనుక తెనుఁగుతనము వీడనివలుకుబడు లనుట మఱవరానిది.

ఇట్లు తెనుఁగుసామెతలను కూర్చినచిననారాయణ సంస్కృతశ్లోకోక్తులను కూర్చుటలో నంతగా ప్రయత్నింపలేదు. ఈతనికృతిని చూచియే కాఁబోలును గట్టు ప్రభు వనుకవి కుచేలోపాఖ్యాన మను తనమూఁడాశ్వాసములలఘుకావ్యములో 68 సంస్కృతశ్లోకోక్తులు, 5 6 తెనుఁగుజాతీయాదులు కూర్చినాఁడు (1). జాతీయాదులనిట్లు పద్యములందు కూర్చుటవలన వానిని సులభముగ కంఠగతములు చేయుటకు కూడ వీ లగును. ఈవిషయములో కవిపరిశోధకుఁ డయినఆరుద్రయభిప్రాయ మి ట్లున్నది.

"—— కువలయాశ్వచరిత్రలో ఎక్కడ చూసినా కవికి ఉన్నఅసమాన వస్తుపరిశీలనాశక్తి గోచరిస్తుంది. గొల్లసివాలు, దమ్మరాజుకతలు, కోడిపందాలు, కొల్లారుబళ్లు, పరంగిపీటలు, నమ్మికకమ్మలు. త్రోవబత్యాలు ఇలాంటి పెన్నో కనబడతాయి. ప్రతిపద్యంలోను జాతీయత సజీవంగా కనబడుతుంది. ఇది తెలుగువాడే తప్ప యింకొకడు వ్రాయలేడ న్నంత చక్కగా దేశ్యాలు ఇందులో గుదాళిస్తాయి. నాచనసోమునితరువాత అంతవిరివిగా సామెతలు, జాతీయాలు గుప్పించే కవి చిననారాయణే అని చెప్పాలి" (2).

ఈవ్యాసమున కూర్పఁబడినజాతీయాదులపట్టికను పరిశీలింపఁగా పైయభిప్రాయము నిజ మని తేలు చున్నది. సంభాషణాదులను ప్రజాహృదయములకు చేరువగా నుండునట్లు తీర్చిదిద్దుటకు యత్నించినపుడే యిట్టి జాతీయాదులప్రయోగములు సమృద్ధిగ నుండును. ఈయత్నమున చిననారాయణ సఫలుఁ డయినాఁ డనవచ్చును.

మ ఒకచో శబ్దనిగుంభనంబు, లొకచో యుక్తిక్రియాగౌరవం,
బొకచో సద్భుతజాతివార్త, లొకచో నుజ్జృంభితత్త్వద్రస
ప్రకరంబుం గనిపించినన్ మదికి సంభావింప నవ్వాంబు గా,
కకటా! యేమియు లేనికబ్బ మది యాహ్లాదంబు గావించునే?

\- సవరము చిననారాయణ

---

1. ''కుచేలోపాఖ్యానము-ఒకపరిశీలన" (అముద్రితలఘుసిద్ధాంతవ్యాసము, మదరాసువిశ్వవిద్యాలయము), చతుర్థాధ్యాయము-లోకోక్తులశీర్షిక.
2. సమగ్ర ఆంధ్ర సాహిత్యము. XI - 155, 156.

# ఏకాదశదళము :
# అనుసృతులు

మానవుఁ డనుకరణశీలి. అనుకరణ మనఁగా తనకన్నభిన్ను లొనర్చినట్లు తాను కూడ నొనర్చుట, అనఁగా నొకరు వ్రాసినట్లు వ్రాయుట, ఒకరు పాడినట్లు పాడుట, ఒకరు చేసినట్లు చేష్టలు తానును చేయుట మున్నగునవి కళలై యీకోవకు వచ్చును. కాని- 'అనుసరణ' మని యొకఁ డున్నది. ఇది యనుకరణమునకన్న భిన్నము. అనుసరణ మనఁగా తనకన్న భిన్నులు పోయినదారిని వారివెనుక తానును పయనించుట. ఈయర్థభేదము మూలధాతువులవలన నేర్పడినది. మొదటిది 'అను' ఉపసర్గగా కలిగిన "(డు) కృఞ్-కరణే"(చేయుట)(1) అనుధాతువువలన నేర్పడినది. రెండవది 'అను' ఉపసర్గముగా కలిగిన "సృ-గతౌ" (వెళ్లుట, పరుగెత్తుట)(2) అనుధాతువునుండి యేర్పడినది. కాని, యీరెండింటి నొకేయర్థమునందు వాడుట విమర్శకజగతిని కనఁబడును. పూర్వకవుల ననంతరకవు లనుసరించుట యనఁగా తమకు నచ్చినవిషయములందు వారిమార్గమున పయనించుట (వెళ్లుట): అనుసరించుట) యని భావము. కనుక నిది సమంజసమే! వఝలవారు 'అనుసృతులు' అనియే పే రిడినారు(3)

సంస్కృతమున వాల్మీకివ్యాసభాసులను కాళిదా సనుసరించినట్లే కాళిదాసును అనంతరకవులును అనుసరించిరి. అట్లే ఆంధ్రవాఙ్మయమునందును పూర్వపూర్వకవిపుంగవుల నుత్తరోత్తరకవిపుంగవు లెంతగానో అనుసరించి తమతమకృతులు నిర్మించిరి. ఆంధ్రకవులనే కాక సంస్కృతకవులను కూడ అనుకరించుట ఆచార మయి యున్నది(4). జీవితమునందువలెనే కావ్యజీవితమునందును అనుకరణ మొకతప్పనికార్య మయినట్లు వాఙ్మయములు చాటు చున్నవి, మంచి ననుకరించుట మంచిది. చెడు ననుకరించుట మంచిది కాదు. ఈనియమము జీవితమందైనను, కావ్యజీవితమందైనను తుల్యమే.

1. శబ్దరత్నావళి, పుట
2. ,, పుట 311.
3. వసుచరిత్రవిమర్శనములో రెండవభాగము.
4. చూ. పైపుస్తకమే.

ఈయనుసృతి యలునది కావ్యజీవితమునందు భావము, పద్యపుఎత్తుగడ, కారకపై చిత్రి, ప్రయోగవిన్యాసము మున్నగురీతులలో కానవించును. నన్నయభట్టారకులవారికవితావిన్యాసముల నెన్నింటినో తిక్కనగా రమకరించి భారతాంధ్రకు క్రొత్తసొగసులు కూర్చిరి(1). ఈయనుకరణకలావిలాసములలో అందెవైచినచేయి శ్రీనాథునిది. "వచియింతు వేములవాడ భీమనభంగి, నుద్దండలీల నొక్కొక్కమాటు(2) ఇత్యాదిపద్యములో భంగ్యంతరముగా నాయాకవులను తానమకరించి నవిధానములను కూడ శ్రీనాథకవిసార్వభౌముఁడు చెప్పిన ట్లయినది అనంతరకవు లదేపనిగా నదేపని, నొనర్చిరి. ఈయనుసరణ మనునది. కష్టసాధ్య మయినకళ. కావుననే కొంద ఱీకళలో మెఱుఁగులు చూపఁగలిగిరి, మఱి కొందఱు తఱుఁగులపా లయిరి.

ఈకువలయాశ్వప్రబంధకవిపై సైతము కొన్నిసందర్భములందు పూర్వకవిశేఖరులప్రభావము తొంగిచూచు చున్నది. ఈయనుకరణమునం దితనికి సంస్కృతకవులు కూడ అనుకార్యు లయిరి. కనుక నితనిపై నాయాకవులప్రభావములు దిఙ్మాత్రముగా చూపఁబడు చున్నవి.

## సంస్కృతకవులప్రభావము

౧. కాళిదాసు : దుష్యంతుఁడు శకుంతలాసక్తమగు చున్నతనమనస్సునుగూర్చి తడఁబడి, సందేహములయందు సత్పురుషులకు అంతఃకరణప్రవృత్తులే ప్రమాణమనుకొనును(3). ఈసందర్భమున భట్టారకులవారు 'ఇది మునికన్య యేని మఱి యేలొకొయీలతాంగియందు నా హృదయము దద్దయుం దవిలె—"(4) నిత్యాదిగా రచించిరి. ఈపట్టును స్ఫురింపఁజేయునట్టు చిననారాయణ పాతాళమందు మదాలసను కాంచినకువలయాశ్వునిచే ననిపించు చున్నాఁడు.

1. చూ. "నన్నయభట్టురాచదారి-నానాకవులపయనము" వ్యాసము, సమాలోచన పక్షపత్రిక (1-6-84)
2. కాశీఖండము, 1-13.
3. అభిజ్ఞానశాకుస్తలము, 1-19.
4. ఆదిపర్వము, 4-30.

శా. ఔనేకా! మను పెన్నఁడో ఛెలిచాయం జూచిన ట్టయ్యెడున్.
గా నన్వచ్చె మదాలసావయవరేఖావైభవం, బింతయే
లా నామానస మీలతాంగివయి లీలాడోలికాకేళికా
శ్రీనై పుణ్యముఁ జూపఁగా హవణుఁ గాంచెం దద్గుణాలంబ మై (4-155)

మదాలసావయవరేఖావైభవము తోఁచినను నమ్మలేనిరాజు తనమన సామె పై లగ్న మగుటనుబట్టి ఆమెయే యీమె యని నమ్ము చున్నాఁడు. "సతాం హి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మంతఃకరణప్రవృత్తయః" అనుదుష్యన్తునిలక్షణము నకీకుపలయాశ్వునిమాటలు లక్ష్యప్రాయము లనవచ్చును. 'ఇంత యేలా' అనువైచిత్రియే యీవిషయమును బలపఱచు చున్నది.

౨. గంగాదేవి : ఈమె నాచనసోమనాథునకు సమకాలిక. మధురావిజయ మనుమధుర కావ్యమునకు కవి. కాకతీయులఆడపడుచు. బుక్కరాయలకోడలు. కంపరాయనిపట్టమహిషి. ఈమె వ్రాసినమధురావిజయము నీప్రబంధకర్త పదేపదే పరించినాఁ డనిపించు చున్నది. అందు కొండురెండునిదర్శనములు చూడఁదగును గంగాదేవి తనకావ్యస్వరూపమును భంగ్యంతరముగ నిట్లు తెలుపు చున్నది.

శ్లో. క్వచి దర్థః క్వచి చ్ఛబ్దః క్వచి ద్భావః క్వచి ద్రసః।
యత్రైతే సన్తి సర్వేఽపి స నిబన్ధో న లభ్యతే॥ *

కొన్నికావ్యముల నర్థముఁ గొన్నికావ్యముల శబ్దముఁ, గొన్నికావ్యముల భావముఁ గొన్నికావ్యముల రసము నిం పయి యుండును. వీనియన్నిటితో మనోజ్ఞ మగుకావ్యము లోకమున దుర్లభము-అని యనువాదము. 'స నిబన్ధో న లభ్యతే' అనుటఁజేసి, తనకావ్యము వీనియన్నిటితోఁ గూడి కావ్యములన్నిటికంటె అన్నివిధముల గొప్పతనము వహించి యున్న దనుట తెలియనగును. అందువలన ఎన్నికావ్యములు లోకమం దున్నను ఇట్టి కావ్యము లేనందున సర్వజనాదరణీయము తనకావ్యము కావలసి యున్న దనుట తెలియనైనది-అనునది వ్యంగ్యార్థ మని యిచట వ్యాఖ్యాతృవివరణము. ఈవ్యంగ్యమునే స్ఫురింపఁజేయుచు తెనుఁగు కవి తనకావ్యస్వరూపము నిట్లు తెలుపు చున్నాఁడు-

---

* మధురావిజయము, 1-17.

మ. ఒకచో శబ్దనిగుంభనంబు, యొకచో యుక్తిక్రియాగౌరవం,
బొకచో నద్భుతజాతివార్త, యొకచో నుజ్జృంభితతత్తద్రస
ప్రకరంబుం గనిపించినన్ మదికి సంభావింప నర్హంబు గా,
కకటా! యేమియు లేనికబ్బ మది యాహ్లాదంబు గావించునే!
(1-12)

అనఁగా తనకబ్బమునం దీలక్షణము లన్నియు నున్న వని భంగ్యంతరముగ నక్కాణించినట్లే కదా! అందలిక్వచిత్, క్వచిత్-అను శైలి నిందు ఒకచో, ఒకచో అనురీతిని పొందుపఱచినాఁడు. మఱియొకనిదర్శనము—

చ. ఇనహరిణాంకరశ్మి కెడ మీఱని యవ్వనిఁ బంకజాకరం
బునఁ గనఁజక్కనవ్వగనఁ బ్రొద్దులు గ్రుంకుటదెల్లవాఱుటల్
గనమి, జలాగతక్షికులకాంతలమో మనుకల్వరాయనిం
గనుఁగొని విచ్చిపోవుటయె కాని వియోగ మెఱుంగ వెన్నఁడున్
(2-69)

గాలవమున్యాశ్రమవర్ణనమునకు చెందిపద్య మిది. ఇచ్చటివియోగపదము విశిష్ట మగుకలయిక(సంయోగము) అనునర్థము గలది [విశేషః(విశేషయుక్తః) యోగః=వియోగః। విశేషో నామ ఆధిక్యమ్] [చక్రవాకపక్షులకు రాత్రియందు వియోగము రామునిశాపమువలన కలిగినదిగా పద్మపురాణము వచించును. రాత్రి వేళ రామునివియోగదుఃఖమును చూచి పరిహసించిన వఁట చక్రవాకములు, రాముఁ డందులకు కోపించి తనవియోగదుఃఖమువంటి దుఃఖము వానికి (రాత్రి వేళ)కలుగునట్లుగా శపించె నని అగాధ]. ఇచ్చటియరణ్యము సూర్యకిరణములకుఁ గాని, చంద్రకిరణములకుఁ గాని యెడ మేమాత్ర మీయనిదిగా నున్నది. ఇచటి సరస్సునందలిఱక్కవకవలు అందువలన ప్రొద్దులు క్రుంకుట తెల్లవాఱుట(ఏవేళ ఏదియో) తెలియని వై కలయుటయో, వేఱుపడుటయో తెలియక వగచు చున్నవి. ఆసమయమునందు ఋషిపత్నులు నీటికై రాఁగా వారిముఖచంద్రునిఁ జూచి యెప్పుడు విడిపోవుటయే జరపు చున్నవి. ఇఁక నేనాఁడును వానికచ్చట కలయిక యనునదియే కానవచ్చుట లేదు.(సాక్షాచ్చంద్రునియంతటిసౌందర్యము గలముఖము

లచటిఋషిపత్నులకు కల పనియు, ఆయడవి వృక్షలతాదులతో క్రిక్కిరిసి యున్న దని చెప్పుట దీనికైనపరమార్థము). ఈభావము కొంతవఱకు క్రిందిశ్లోకభావమును మూలముఁగా గ్రహించినట్లు కానవచ్చును—

శ్లో. యద్దీర్ఘికాసు మాణిక్యమయసోపానచారిభిః।
క్షణదాస్వపి చక్రాహ్వై ర్విరహో నానుభూయతే॥ (1)

ఆనగరిబావులందు మణిమయసోపానములపైఁ గ్రీడించుచక్రవాకములు రాత్రులయందును విరహ మనుభవింపక సుఖ ముంటు-నని తాత్పర్యము.

ఆమణులప్రకాశములు నలుదెసలకు వ్యాపించి రాత్రులందును అట సూర్యకాంతులనే వెలువరించు చున్నవి. అందువలన రాత్రులును అచ్చట దిన ములుగానే పరిణమించినవి. ఆకారణమున వియోగ మందక యున్నవి చక్రవాక పక్షులు. ఒకవిధముగ ఈభావమునే వ్యత్యస్తము చేసి, ఋషిపత్నులముఖచంద్రుని దీప్తి నాధారముగాఁ జేసి చక్రవాకములకు సంయోగ మనునదే లే దను చున్నాఁడు తెలుఁగుకావ్యకర్త. దాని కైనహేతుకల్పనమునకు చెందినదే ఇనశశిరశ్మలు చొరనివని అనుట.

3. బాణభట్టు : బాణునికాదంబరి శ్లేషాలంకారములకు మందిరము. సుమారు నలువదిపద్యములలో శ్లేషవైచిత్రిని నిబంధించుట, కవిస్తుతిలో ముందుగా బాణునకు స్థాన మిచ్చుట తత్ప్రభావమునకు లోనైయే యని భావింపవచ్చును.

4. దండి : దశకుమారచరితమునందు అవంతిసుందరీపరిణయకథలో ఇంద్ర జాలమును ప్రవేశపెట్టినాఁడు మహాకవి దండి (2). చిననారా యణయు పాతాళకేతుదూతచేత ఇంద్రజాలమును ప్రదర్శింపఁ జేసినాఁడు(2-92నుండి97దాఁక). లాక్షణికకవి క్షేమేంద్రుఁడు "తత్ర తర్క-వ్యాకరణభరత.... గజతురగపురుషలక్షణద్యూతేంద్ర జాలప్రకీర్ణేషు పరిచయః కవిసామ్రాజ్యవ్యంజనః" అని కవులకు పరిచయమై యుండవలసినవిషయములలో వింద్రజాలమును కూడ

1. మధురావిజయము, 1-60.

2. దశకుమారచరితము, పూర్వపీఠిక-పంచమోచ్ఛ్వాసము.

చెప్పినాఁడు (1). ఇట్లే ఇతనిచే మతింపఁబడిన(1-9)మయూరా దులచాయలును కలవు.

## ఆంధ్రకవులప్రభావము

౧. నన్నయభట్టారకులు : భట్టారకులవారు పాదమువంతటిని షనరావృత్త మొనర్చి పద్యనిర్మాణము కావించుప్రక్రియను ప్రసాదించిరి.

నారలు గట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులోఁ దపో
భారమునం గృశుండయినబ్రాహ్మణుఁ డీలలితాంగిఁ బెండ్లియై
నారలు గట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులోఁ దపో
భారము దాల్చి యుండు మని పంపక మిన్నక యుండ
నేర్చునే ? (2)

ఈరచనాచమత్కారమునకు, నడబెడంగులకు ముగ్ధ లయినకవు లనేకులు తమశక్తికొలంది శ్లేషయమకాదుల ననుబంధించి యీరచనావిలాసము ననుసరించినారు. అద్దంకి గంగాధరకవి యీశిల్పము ననుకరించినవిధము చూడఁ దగినది -

చ. వనరుహనేత్రతోఁడుత నవశ్యము న న్నిటఁ గూర్చెనేని న
మ్మనసిజుఁడే ధనుర్ధరుఁడు, మాధవుఁడే చెలికాఁడు వానికిన్ ;
వనరుహనేత్రతోఁడుత నవశ్యము ని న్నిటఁ గూర్ప కుండినన్
మనసిజుఁ డేధనుర్ధరుఁడు? మాధవుఁ డేచెలికాఁడు వానికిన్ ?(3)

ఈసొగసునే గంగాధరుఁడు మఱొకవిధముగ మఱియొకచోట కూడ మలఁచినాఁడు (4). ఈరచనాశిల్పచమత్కృతిని పెద్దనగారు (5), చేమకూర వారు (6) మొదలయినవా రాదరించి యున్నారు. ఇఁక నీకవిపద్యము -

---

1. కవికంఠాభరణము, పుట 99.
2. అరణ్యపర్వము, 2-326.
3. తపతీసంవరణము, 2-70.
4. ,, 3-43.
5. మనుచరిత్రము, 3-77.
6. విజయవిలాసము, 2-53.

చ. హితగతి నిందు బింబరుచు లింపు ఘటింప మనోజకాండసం
గతిఁ దగు కైరవారములగర్వము మించె వధూటి! కంటివే?
హితగతి నిందుబింబరుచు లింపు ఘటింప మనోజకాండసం
గతిఁ దగు కైరవారములగర్వము మించుట చోద్యమే? చెలీ!
(3-124)

అనుకర్త లందఱు ఆదికవి శిల్పమును శృంగారరసపరిపోషణకే వినియోగించుట గమనింపఁదగినయంశము.

౨. తిక్కనసోమయాజి : అర్జునుఁడు కౌరవవీరులను ఉత్తరునకు వేఱువేఱుగా చూపినాఁడు (1). అదేవిధముగ వేగువారు పాతాళకేతుని సైన్యవిభాగములను ఋతధ్వజునకు చూపిరి (2). దృశ్యకావ్యలక్షణ మిది.

3. ఎఱ్ఱాప్రెగ్గడ : రావణుఁడు జానకిని కొనిపోవుసందర్భమున నామె యీవిధముగ విలపించుచున్నది -

ఉ. దేవతలార! యోధరణిదేవతలార! జగత్త్రయోన్నతుం
డై వెలుఁగొందురామునికులాంగన జానకి నేను నన్ను మో
హావిలుఁ డొక్కరక్కసుఁ డనర్గళుఁడై కొనిపోయెడుం గృపం
గావరె! పుణ్యమున్ యశముఁ గైకొనరే! యిదె మీకు
మ్రొక్కెదన్ (3).

దీనికి ఛాయానుసరణము కలిగినభాస్కరునిపద్య మిది -

శా. ఓహో! నా మొఱ యెవ్వరున్ విననియట్లున్నారొ కం డైన మీ
బాహాదర్ప మెలర్పఁ దాఁకఁ దగదే బందీమోక్షంబు మీ
కాహా! పుణ్యము గాదె కీర్తి యగుదే యాలింపరే యోరి నై
దేహిం దెత్తువె యంచు నడ్డపడరే దిక్పాలు రీద్రోహికిన్ (4).

1. విరాటపర్వము, 5-4.
2. ద్వితీయాశ్వాసము, 2-128.
3. అరణ్యపర్వము, 6-343.
4. భాస్కరరామాయణము, అరణ్యకాండము, 2-?

దీనికి చిననారాయణుని ప్రతిబింబానుసరణము—

శా. అయ్యో! కావరె యాఁడుదాన నబలన్; హా! యెవ్వరిం గాన నా
కు య్యాలింపరె, నన్ను నెత్తికొని దిక్కుల్ చూచుచుం బాఱెడిన్
దయ్యం బీతని నెవ్వరేని నిజఖడ్గప్రోద్యదుగ్రాగ్నికిం
ధాయ్యం జేయరె యాఁడుదీవెనలఁ బొందన్ లేరె నే మ్రొక్కెదన్ (5-63)

తాళకేతుఁ డపహరించుకొనిపోవు చుండఁగా కుండల చేయు చున్నయా ర్తనాద మిది. ఈపద్యము భాస్కరరామాయణపద్యముతో పోల్చినపుడు బింబాను సరణముగను, అరణ్యపర్వపద్యముతో పోల్చినపుడు ఛాయానుసరణముగను తోఁచును.

ర. మారన : మార్కండేయమందు నాగకుమారులు కువలయాశ్వుని తమ యింటి కాహ్వానింపఁగా అతఁడు వారితో నను చున్నమాటలు—

కం. శ్రీయుత! నీవు ప్రియమున
న్మాయింటికి రాఁగవలయు నావుడు మాయి
ల్మీయి ల్లని వేఱుడ మిటు
సేయుదురే యిది సఖత్వశీలము తెలుఁగే? (3-60)

ఇదేసందర్భమున ప్రబంధనాయకునిమాటలు—

కం. మాయురె? తా రావలెనా
యాయెడ కే నరుగుదెంతు, నాయి ల్లనఁగా
నీయి ల్లనఁగా వేఱా?
వోయఁగరా పిట్టు లైన భువి సఖ్యంబుల్. (4-126)

మారన 'మాయిల్లు మీయిల్లు' అనిపించెను, నారాయణ 'ఆయిల్లు ఈయిల్లు' అనిపించెను. మారన 'స్నేహ మనఁగా నిట్టిదా?' అని యనిపించినదానిని 'ఇట్లయిన స్నేహములు పెంపొందవు' అనిపించినాఁడు నారాయణుఁడు. 'మాయురే! తాను రావలెనా? నేనే అచటికి వత్తు' ననుటలో పూజ్యులపట్ల (అశ్వతరునిపట్ల) కువలయాశ్వునిభక్తివినయములు వ్యక్తములై ఉత్తమనాయకత్వమును స్ఫురింపఁ జేయు చున్న వనవచ్చును.

౫. నాచనసోమన హంసడిభకులు చూచినసరోవరమును సోమనాథుఁ డిట్లు వర్ణించెను—

చ. కనిరి కుమారు లంత శశికాంతశిలాతలశీతలస్థలీ
వనఘనపాదపాదపనివారితవారితరంగరంగన
ర్తనపరివర్తనద్విరదదానసదానముదాళిమాలికా
తనువనజాతనూతనబలాకముఁ బుష్కర మన్ తటాకమున్.(1)

మదాలసామదాలసాసఖులు చూచినసరోవరమును నారాయణుఁడు ఇట్లు వర్ణించెను—

ఉ. మానవతుల్ గనుంగొని రమందమరందనవారవిందబృం
దానుసరన్మిళిందనికరాంధకబంధురగంధసాంద్రమం
దానిలమత్తసింధురవిహారవిలోలతరంగజాలడో
లానిశఖేలనాకలితహంసము నొక్కసరోవతంసమున్. (3-131)

క్రియావైచిత్రితోపాటు శబ్దాలంకారము కూడ నాచనను తలఁపించుచు పాటింపఁబడినది. అచట బలాకపక్షులు, ఇచట హంసములు తరంగమాలికాడోలికలయం దూఁగుచున్నవి. రామరాజభూషణుఁడు కూడ నిట్లే సరోవరమును వర్ణించెను గాని యేకసమాసనియమును పాటింపలేదు(2).

౬. శ్రీనాథుఁడు : కుడంగ మనఁగా పొదరిల్లు. ఈ 'కుడంగ' శబ్దమును సంస్కృతనిఘంటువులు అన్మధ్యమముగానే చూపుచున్నవి(3). కాని శ్రీనాథుఁడు దీనిని ఉన్మధ్యముగా యతిస్థానమున ప్రయోగించినాఁడు.

కం. భూపాలమథన? జంబూ
ద్వీపేశ్వర? విమతరాయవేశ్యావిటఘా
టీపటహాడాన్నినాదా
టోపప్రక్షుభితదిక్కుడుంగక్రోడా!(4)

---

1. ఉత్తరహరివంశము, 4-30.
2. వసుచరిత్రము, 3-153.
3. కుడంగో ఒస్త్రీ నికుంజః-అని వైజయన్తి.
4. కాశీఖండము, 2-166.

గ్రంథాంతరమున కూడ దీని నిట్లు శ్రీనాథుఁడు ప్రయోగించియుండెను(1). ఈతని ననుకరించు చున్నవాఁడువోలె ఈకవియు దీనిని ఉన్మధ్యమ్మ‌ఁగానే ప్రయోగించెను -

వ. '....నాయకులతోడిపొలయలుకలం బొలంగి చని వనజకుడుంగంబులం గపటనిద్రాముద్రిత లై ....' (3-132). ఇది వచనమునం దున్నను సందేహింప వలసినపని లేదు. ఈతఁ డిట్టివిశేషప్రయోగముల నాదరించుటలో వెనుకాడఁ డని ప్రకరణాంతరములయందు సూచింపఁబడెను.

౭. నందితిమ్మన్న : జాఱుదుబండలపై జాఱు చున్ననీరజాక్షులను తిమ్మకవి నాకధునీశీకరములచెమ్మ లొలుకుపలుకులతో నిట్లు వర్ణించెను -

చ. అలకలు నాసికామణియు నన్నువకౌనుఁ గుచద్వయంబుఁ గుం
డలములుఁ జంచలింప జతనంబున హస్తము లూఁది జీరుఁగంబ
డల దిగజాఱ్ రొండొరులకడం దరలాక్షులు దోనివింటఁ బిం
జలు గొన నేయుపువ్వుశెరుసంపెఁగవాలికతూపులో యనన్(2)

చినసారాయణ కూడ ఈ సన్నివేశమును సృజించినాఁడు -

గీ. బాలికలు మేలిజీరుకురాలనుండి
నీటికై జారుసారు వర్ణింపఁ దగియె
నలమదాలసపై నదరంట నేయు
నలరుపిలుకానినునుదోనియమ్ము లనఁగ. (3-143)

ఈజాఱుదుబండ్లవృత్తాంతము అలనాటి సాంఘికవాతావరణమునకు చెందిన దయినను, మన్మథాస్త్రసాదృశ్యము మాత్రము తిమ్మకవి ననుసరించిన జాడను పట్టి యిచ్చు చున్నది. ఇట జాఱు చున్నజాణలు మదాలసపై మదనునిచే ప్రయోగింపఁబడు చున్నదోనియమ్ము లనున ట్లున్నా రని యుత్ప్రేక్షించుట మాత్రము మూలాతిశాయి, ప్రతిభాస్ఫోరకము, రసానందసంధాయకము ననుటలో సందియము లేదు.

---

1. చూ. శివరాత్రిమాహాత్మ్యము, 4-34.
2. పారిజాతాపహరణము, 4-38.

౮. తెనాలి రామకృష్ణుడు : రామకృష్ణకవీశ్వరుఁడు గ్రంథాంతరనామముల
తోను, గ్రంథాంతరనాయికానాయకులనామముల
తోను చమత్కృతులు సాధించినాఁడు -

కం. గిరికానుషక్తబుద్ధి ను
పరిచరునిం బోలునొక్కపన్నగ మొకనాఁ
డురవడి నెచ్చటనుండియొ
మురమర్దనుదివ్యభవనమున కేతెంచెన్.

కం. యమదండచండ మగుభుజ
గమునకు వెఱచెఱచి యాఖుకన్యక కమలా
రమణాంఘ్రిఁ జేరె గురుభీ
తమతికి నాముక్తమాల్యదకు నెన యగుచున్. *

ఈచమత్కృతిని చిననారాయణ శ్లేషగర్భిత మొనర్చె నిట్లు-

కం. కాదంబరి స్వాదించియు
మోదంబునఁ గౌముదీసమున్మేషము సం
పాదించియుఁ దబ్బిబ్బుగ
వాదింతురు రేల వారవనితలు వీటన్. (1-87)

సాకేతపురీవారనారీవర్ణనాసందర్భమునందలి దీపద్యము.కాదంబరి యనఁగా కల్లు, బాణభట్టారకునికాదంబరీగ్రంథ మనియు; కౌముది యనఁగా వెన్నెల, మహామహోపాధ్యాయ శ్రీభట్టోజిదీక్షితులవారి (వైయాకరణసిద్ధాన్త) కౌముదీగ్రంథ మనియు నర్థాంతరములు.

ఇఁక మదాలసాకువలయాశ్వుల మంగళస్నానాదులనుండి కల్యాణపర్యంతము గిరికావసురాజులకల్యాణఘట్టము నాదర్శముగా స్వీకరించెను. మఱియు నితరకవీశ్వరులవై చిత్రులు కూడ అఱనట చూపట్టు చున్నవి. అవి యన్నియు ప్రదర్శించుట వ్యాఖ్యాప్రాయమ్ము,

* పాండురంగమాహాత్మ్యము, 4-242, 244.

ఎల్లెండటి ననుసరించినను చిననారాయణ స్వకీయపదప్రయోగచాతుర్యమును, చమత్కారచారుత్వమును, ఉభయవాక్సమ్మేళనశిల్పమును జోడించుచు పీయూషముద్రను భద్రముగ నుంచుకొనివనెఱజాణ.

చ. చతురకవిత్వతత్త్వపటుసంపద యొక్కరిసొమ్ముగాదు, భా
రతిదయ సౌధవార్ధి, కవిరాజులమానసముల్ ఘటంబు, లా
యతమునఁ గొలంది లబ్ధమగు నయ్యమృతం, బటుగాఁ దలంచి యు
ద్యతనకవీంద్రులార! కృప దప్పక మత్కృతి నాదరింపుఁడీ!

- కనుపర్తి అబ్బయామాత్యుఁడు

## ద్వాదశదళము

# పర్యాయపదపర్యాలోకము

పర్యాయ మనుపదమునకు 'భేదము' అనునొకయర్థము గలదు (1). పర్యాయపదప్రయోగము చేయుట యనఁగా ఒకపదమునకు బదులుగా ఇంకొకపదమును ప్రయోగించుట. ఇక్కడ భేదము పదవిషయములోనే కాని, పదార్థ (పదము యొక్క అర్థ) విషయములో కాదు(2). కవులు ఒకేయర్థము గలిగినయనేకపదములను ఒకచోటఁగాని, పలుచోట్లఁగాని ప్రయోగించుట సంప్రదాయ మయియున్నది. ఇందులకు కొన్నికారణము లున్నవి. అవి 1) చందస్సున కనుకూలమయినపదములను గ్రహించుట, 2) అవయవార్థస్ఫోరకము(సార్థకము; సాభిప్రాయము) లయినపదములను గ్రహించుట, 3) శ్రుతిలయలను గమనించి

1. పర్యాయస్తు ప్రకారే స్యాత్-అని విశ్వము.
2. పర్యాయః క్రమనిర్యాణప్రకారావసరేష్వపి, ఏకార్థవాచి శబ్దే చ-అని నానార్థరత్నమాల.

ముందువెనుకల నున్నపదముల కనుగుణ మయినపదములను నిబంధించుట. 4) రసాభివ్యక్తికి సమర్థము లయినపదములను స్వీకరించుట. 5) పఠితృశ్రోతృవర్గమునకు విసువు కలుగకుండుటకై మాటిమాటికి పదములను మార్చుట- మొదలయినవి. ఇందుకు నిదర్శనము లాదికావ్యమందే కన్పడు చున్నవి. మచ్చునకొక్కటి-

శ్లో. కాచి ద్వశం పరిష్వజ్య సుప్తా కమలలోచనా।
రహఃప్రియతమం గృహ్యా సకామేవ చ కామినీ॥

శ్లో. అన్యా కమలపత్రాక్షీ పూర్ణేనుసదృశాననా।
అన్యా మాలిఙ్గ్య సుశ్రోణీం ప్రసుప్తా మదవిహ్వలా॥(1)

శ్లో సీతాం పద్మపలాశాక్షీం మన్మథస్య రతిం యథా।
ఇష్టాం సర్వస్య జగతః పూర్ణచన్ద్రప్రభా మివ॥(2)

ఇక్కడ కమలలోచన యనఁగా కమలములవంటి కన్నులు గలది. స్త్రీ యని యర్థము. కమలపత్రాక్షి యనఁగా కమలపత్రములవంటి నేత్రములు గలది, స్త్రీ యని యర్థము. పద్మపలాశాక్షి యనఁగా పద్మపలాశము(దళము)లవంటి కన్నులు గలది. స్త్రీ యని యర్థము. 'కమలలోచన' అను సమాసములోని 'లోచన' శబ్దమునకు పర్యాయముగా 'కమలపత్రాక్షి' అను సమాసమున 'అక్షి' శబ్దము నేత్రార్థమునందు ప్రయోగింపఁబడినది. 'కమలపత్రాక్షి' అనుదానిలోని 'కమల' పదమునకు పర్యాయముగా పద్మపలాశాక్షి' అనుదానిలో 'పద్మ' శబ్దము ప్రయోగింపఁబడినది. మఱియు 'పత్ర' శబ్దమునకు పర్యాయముగా 'పలాశ' శబ్దముపయోగింపఁబడినది. పత్ర మన్నను, పలాశమన్నను పర్ణ మనియే అర్థమిచట. ఇట్లే పూర్ణేందుసదృశానన, సుశ్రోణి మున్నగుపదసముచ్ఛయవివరణము ను గ్రహింపవలసి యున్నది. ఇందువలన ఒకేయర్థము కలిగినపదములను వేలసంఖ్యలో సృజించుకొని కవులు తమసమయానుసారముగ ఇచ్ఛానుగుణముగ ప్రయోగించుకొనుటకు వీ లగు చున్నది. కనుకనే కవికల్పతలవంటి ప్రత్యేక గ్రంథములు, పలునిఘంటురాజములు వెలసి యున్నవి.

---

1. రామాయణము, సుందరకాండము, 10-40,48.
2. రామా. సుందర. 15-30.

ఇప్డు డీకువలయాశ్వచరిత్రమునందలి రెండుమూఁడర్థములకు చెందిన పర్యాయపదములు అకారాదిక్రమములో కూర్పఁబడు చున్నవి. ఇందు తత్సమములు, అచ్చతెనుఁగులు వేఱువేఱుగా చూపఁబడును. అవసరమయినతావుల అర్థవివరణము కూడ అనుబంధింపఁబడు చున్నది. ముందుగ -

# స్త్రీపర్యాయములు

## తత్సమములు :

౧. అంగన(2-58,120; 3-88; 5-22,95). ౨. అంబుజానన(3-184; 4-91,181). ౩. అంబురుహాక్షి (ఇట పార్వతిని శివుఁడు సంబోధించుట. 4-107). ౪. అంభోజాతాక్షి 4-99). ౫. అణుమధ్య(1-63). ౬. (అనంతా) కాంత (అనంతా =భూమి (1) (3-13) ౭. అనుపమగాత్రి (సంబోధన యిది, 3-125). ౮. అబల(3-46,117,122,162; 4-180;5-63 ఇట అవయవార్థకము,116). ౯. అబ్జపాద (3-83 సార్థకపద మిచట). ౧౦. అలికచ (4-149; 5-10). ౧౧. (అలి) వధువు(3-86). ౧౨. అలివేణి(3-83 సార్థక పదము). ౧౩. అవరోధగిరిపయోధర = అంతఃపురస్త్రీ. అవరోధ మనఁగా నంతఃపురము(2) (5-59,95). ౧౪. అవరోధబిసరుహాక్షి= అంతఃపురపురంధ్రి (4-101). ౧౫. (అహల్యా) కాంత (3-153). ౧౬. ఆననహసితైందవబింబ= మోము (సొగసు)చేత నవ్వఁబడిన (ఎగతాళిచేయబడిన, తృణీకరింపఁబడిన; మించిన) చంద్రబింబము గలది. అనఁగా చంద్రబింబమును మించిన యంద మయినమొగము గలది అని యర్థము (1-35 ఇది కోనమాంబకు విశేషణము). ౧౭. ఇందిందిరకచ= ఇందిందిర మనఁగా తుమ్మెద. తుమ్మెదల వంటి (నల్లని) జుత్తు గలది అని యర్థము (3-163). ౧౮. (ఇందిరా) జలజాక్షి =లక్ష్మిదేవి (1-44). ౧౯. ఇందీవరలోచన= ఇందీవర మనఁగా నల్లగలువ (3). నల్లగలువవంటి (యంద మయిన) కన్నులు గలది అని యర్థము

---

1. అనన్తా చ విశల్యాయాం..............విశ్వంభరాగుడూచ్యో స్స్యాత్-అని మేదిని.
2. అవరోధః పరాపిద్ధ శ్శుద్ధాన్తో ఽన్తఃపురం వృషమ్-అని వైజయన్తి.
3. ఇన్దీవరం కువలయే-అని విశ్వము.

(3-163) [స్త్రీలకన్నులను తామరలతోను, కలువలతోను పోల్చుట కవి సంప్రదాయము]. ౨౦. ఇందుముఖి (4-80;5-91). ౨౧. ఇందువదన(4-171; 5-106). ౨౩. (ఇంద్ర వనిత (4-183). ౨౪. ఉత్పలాక్షి (4-12; 5-45). ౨౫. (ఉరగ`కరిగమన– నాగస్త్రీ(5-95). ౨౬. (ఊర్వశీ) కాంత (5-43). ౨౭. (ఊర్వశీ) బిబ్బోకవతి= ఊర్వశి యను పేరు గల స్త్రీ. ఊర్వశి-అనుట, బిబ్బోక మనఁగా స్త్రీలయొక్క శృంగారచేష్టావిశేషము (1). బిబ్బోకము కలిగినది బిబ్బోకవతి. స్త్రీ (1-39). ౨౮. ఏణాంకవదన =చంద్రవదన, స్త్రీ. ఏణ మనఁగా జింక(2). అది అంకము(గుఱుతు)గా కలవాఁడు చంద్రుడు(4-45). ౨౯. కన్య= స్త్రీ యవియు నర్థము గలదు(3). (4-44). ౩౦. కన్యారత్నము (ఉత్తరపద మయినప్పుడు రత్న శబ్దము శ్రేష్ఠార్థకము, 4-170). ౩౧. కమల దళేక్షణ (4-176). ౩౨. కాంత(1-38శ్లేష,99; 2-27,32: 3-25,66,109; 4-28శ్లేష,33,35,161; 5-25,71,93.) ౩౩. కాంతవసుమనఃకుంతలసదపాంగ =కంతు(మదను) నకు చెందినపూ లనెడియీఁటెలచేత (పుష్పాయుధములచేత-అనుట) ప్రకాశించుచున్నఅపాంగములు (కడగంటిచూపులు) గలది (3-34). ౩౪. కామిని (3-46,58 4-37,56.97). ౩౫. కామినీమణి (మణి శబ్దము శ్రేష్ఠతావాచి,3-47). ౩౬. (కీర్తి)కాంత(1-36). ౩౭. (కీర్తి)లతాంగి(1-85). ౩౮. కుటిలకచాశిఖామణి ('శిఖామణి' శ్రేష్ఠతావాచి, 3-145). ౩౯. కుటిలాలక (4-165). ౪౦. కృశాంగి(3-19) ౪౧. (కేకి)కాంత = ఆఁడునెమిలి(2-61). ౪౨. (కేకి) రమణి= పెంటినెమిలి(1-76). ౪౩. (కైరవిణీ) వధూటి = నదీ కాంత (1-3). ౪. (కొండమా) హరిణనయన (1-42). ౪౫. (కోనాంబా) తామరసాక్షి (1-36). ౪౬. కోరకదశన= మొగ్గలవంటిపల్వరుస గలది (5.34). ౪౭. (గంగా) సరసిజముఖి (4-114). ౪౮. గంధగజసమానయాన (4-193). ౪౯. (గంధర్వకాంత (3-21). ౫౦. గగనమధ్య (శ్లేష, 4-20). ౫౧. గజయాన (3-74). ౫౨. (గౌరీ) కాంత (1-7). ౫౩. ఘనమోహన మోదకారికచ= మేఘమువలె మనోజ్ఞ మైనట్టి, సంతసము కలిగించునట్టి శిరోజ

---

1. హేలావిలాసబిబ్బోకలీలాలలితవిభ్రమాః స్త్రీణాం శృఙ్గారచేష్టాః స్యు ర్భావ పర్యాయవాచకాః-అని హలాయుఫకోశము.
2. ఏణః కురఙ్గ హరిణో మృగః స్యాత్-అని హలాయుధకోశము.
3. కన్యా కుమారికా నార్యోః-అని మేదినీకోశము.

ములు గలది (3-114). ౫౪. చంచలలోచన (1-7). ౫౫ చకోరాయతాక్షి
(4-138). ౫౬. (ఛాయా)శుభాంగి(1-20). ౫౭. (జయరమా) సతి (1-70).
౫౮. జలజేక్షణ (3-38). ౫౯. జలదాలక (3-51). ౬౦. జలరుహగంధి
(3-140; 4-53). ౬౧. (జలవిహంగ) మాంగన (3-132). ౬౨. తమోవి
భవేణి (2-63). ౬౩ తరళనయన (1-44). ౬౪. తరళాక్షి (5-89).
౬౫. తరుణి (1-76;3-128,159; 4-117,158; 5-97,108,110).
౬౬. తరుణీమణి (4-95). ౬౭. (తారకా)కామిని(3-153). ౬౮. (తారకా)
వనిత(2-117). ౬౯. (తారా)మదిరేక్షణ (5-42). ౭౦. (తారా) మృగాంక
వదన= (తారా)చంద్రముఖి 4-127). ౭౧. (తారా) వధూటి (4-173, 184).
౭౨. (తారా)వధూమణి(1-78). ౭౩. (తారా)వనజేక్షణ(5-77). ౭౪. తిమిర
వేణి(4-189). ౭౫. (తిలోత్తమా)వనజలోచన (1-39). ౭౬. తోయజముఖి
(5-70). ౭౭, దివిజాంగన (4-175). ౭౮. (దైతేయ) భామ (4-92).
౭౯. ధవళాక్షి(3-151). ౮౦. (ధారుణీ)వనజముఖి(1-53). ౮౧. నలినాక్షి
(4-97). ౮౨. నారి(3-85; 4-28శ్లేష,148,164). ౮౩. నీరజాక్షి(5-106).
౮౪. నీలచికురనికర(4-98). ౮౫. (నృప)ప్రమద(2-112). ౮౬. పర్వేందు
ముఖి(3-72), ౮౭. (పాంథ)రామ (4-15). ౮౮ పద్మగంధి(5-106).
౮౯. పద్మనయన(4-4). ౯౦. పద్మాంగన= పద్మ మనెడివనిత(3-91).
౯౧. పాటలాధర(5-14). ౯౨. (పార్వతీ)తరుణి(4-112). ౯౩. ప్రాగ్ది
శాంగన(4,16). ౯౪. (పెగరంగమాంబా)మృగాయతాక్షి(1-54). ౯౫. బల
భిన్నీలకచామణి= బలుఁడను రాక్షసుని భేదించినవాఁడింద్రుఁడు. బలభిన్నీల
మనఁగా ఇంద్రనీలము. ఇంద్రనీలములవలె (మనోహర మయిన) మిక్కిలి
నల్లని యానశిరోజములు గలది, స్త్రీ. మొత్తమునకు స్త్రీ. రత్నమని యిచటి
యర్థము 3-109). ౯౬. బాల 3-86,128,133,156,157; 4-192).
౯౭. బాలిక(3-143). ౯౮. బింబోష్ఠి(3-83సార్థకపదము). ౯౯. బిసరుహ
నయన( -35). ౧౦౦. భామ(1-38శ్లేష; 3-42; 4-26శ్లేష,156).
౧౦౧ భామిని(3-67). ౧౦౨. (భోగి)జలజాక్షి=నాగస్త్రీ(4-130). ౧౦౩. మంజు
వాణి(4-45). ౧౦౪. మందగమన 5-71). ౧౦౫. మదవతి(4-142; 5-42).
౧౦౬. (మదాలసా)విలాసవతి 5-102). ౧౦౭. (మదాలసా)సతి(4-117).
౧౦౮. మదాళినవాళీకుంతల=మదించినతుమ్మెదకుఱ్ఱలగుంపును పోలిన(నల్లని)కేశ

ములు గలది. 'వవ' శబ్దమున కిచట యువార్థమును చెప్పవలసి యున్నది. ఇతరకవు లీకీతివి ప్రయోగించినట్లు లేరు(3-34) ౧౦౯. (మధుపా)వరోధవధూమణి(3-132). ౧౧౦. (మరాళికా) బాలిక (3-132). ౧౧౧. మానవతి (3-131). ౧౧౨. మానిని(1-91). ౧౧౩. (మా)రాజముఖిమా=లక్ష్మి,3-154). ౧౧౪. మీనవయన(5-68) ౧౧౫. (మృగ)కాంత(2-25). ౧౧౬. మృగాంగవ(2-31,32). ౧౧౭ మృగాక్షి(4-116,167; 5-10). ౧౧౮. మృగాయతాక్షి(4-158). ౧౧౯. మృగేక్షణ(4-120). ౧౨౦. మృదువాణి (1-106). ౧౨౧. యోష(3-165). ౧౨౨. (రంభా)కాంత (5-10). ౧౨౩. (రంభా) పయోజాక్షి(4-213). ౧౨౪. (రంభా) మృగాయతాక్షి(5-36). ౧౨౫. (రతి) స్త్రీ(3-57). ౧౨౬. (రథాంగ) కామిని(3-1?2). ౧౨౭. రమణి(3-63, 153; 4-56; 5-93). ౧౨౮. రమణీమణి (5-5). ౧౨౯. రమణీలలామ (3-37). ౧౩౦. (రమా)వధూటి(1-71). ౧౩౧. రాకాశశాంకవదన [భక్తుఁడు (అశ్వతరుఁడు) జగన్మాతను (పార్వతీదేవిని) సంబోధించుట, (4-110)] ౧౩౨. రాకేందువదన(4-179). ౧౩౩. రాజముఖి (4-173). ౧౩౪. రాజముఖీమణి (3-30). ౧౩౫. రాజహంసగమన (శ్లేష. 4-152). ౧౩౬. రాజీవముఖి (3-71, 118). ౧౩౭. రాజీవాక్షి (3-103). ౧౩౮. రాజీవేక్షణ (4-146). ౧౩౯. రామ (3-154). ౧౪౦. రామాలలామ (4-25). ౧౪౧. (రుక్మిణీ) సరసిజాయతాక్షి(1-2). ౧౪౨. లలన(1-77). ౧౪౩. లతాంగి (2-6; 3-53, 56,111; 4-155,157,1?9; 5-10). ౧౪౪. లతాతన్వి (5-39). ౧౪౫. (లతా)వనిత (3-87). ౧౪౬. లలితలతాంగి(3-120). ౧౪౭. లోలనయన (3-39,67). ౧౪౮. వధువు (5-13) ౧౪౯. వధూటి (3-42,65, 79,124,166; 4-41,43,51,115,116; 5-10,98). ౧౫౦. వధూమణి (3-49,111). ౧౫౧. వనజనయన (పార్వతీదేవికి విశేషణము, 4-108). ౧౫౨. వనజలోచన (3-115). ౧౫౩. వనజవదన (5-107). ౧౫౪. వనజాక్షి (3-57,73; 4-175; 5-108). ౧౫౫. వనజాయతాక్షి (4-5). ౧౫౬. వనరుహాక్షి(4-191). ౧౫౭. వనిత (1-38శ్లేష; 2-27,54,63,71; 3-25,30,32, 104,128; 4-131,161,166,180; 5-5,25,41,75). ౧౫౮. వనితామణి (3-158; 4-121). ౧౫౯. వనితాశిరోమణి (4-43). ౧౬౦. (వసుధా)

సుధాకరాస్య (1-31). ౧౬౧. వామనయన=అందమయిన కన్నులు గలది (1) (3-48). ౧౬౨. (వార) కాంత (1-78). ౧౬౩. (వార) వనిత (1-87). ౧౬౪. (విద్వేషి)యోషిత్=శత్రుస్త్రీ(యోషిత్= స్త్రీ (2). 4-418). ౧౬౫. విలోలేక్షణ (3-119). ౧౬౬. వేదండగమన (5-102). ౧౬౭. (వేళా) సతి (4-14). ౧౬౮. (వైరి) సతి (1-24). ౧౬౯. శంబరలోచన=జింకకన్నుల వంటి కన్నులు గలది. శంబర మనఁగా జింక (3). (1-74). ౧౭౦. (శచీ) మత్తకాశిని (మత్తకాశిని యనఁగా ఉత్తమస్త్రీ (4). మదించినదివలె ప్రకాశించునది అని వ్యుత్పత్తి (5). (5-59). ౧౭౧. శాతోదరి(3-99). ౧౭౨. శుకాలాప (3-139). ౧౭౩. శోభనాంగి (3-105). ౧౭౪. (శ్రీ)రమణి (2-1; 3-1). ౧౭౫. సతి (3-44,49; 5-99). ౧౭౬. సరసిజగంధి (3-108). ౧౭౭. సరసిజాక్షి(4-118). ౧౭౮. సరసిజేక్షణ(5-20). ౧౭౯. సరసీరుహలోచన(3-59). ౧౮౦. (సరస్వతీ) శంబరనయన (2-37). ౧౮౧. సరోజానన (4-49). ౧౮౨. సరోరుహలోచన(2-25). ౧౮౩. సారసదళాక్షి(4-78). ౧౮౪.(సారస) వరారోహ(3-132). ౧౮౫. సారేందువదన=పూర్ణచంద్రసదృశముఖి(5-10). ౧౮౬. (సీతా) శాతోదరీమణి (1-21). ౧౮౭. సుదతి (3-13; 4-167; 5-5,110) ౧౮౮. సుదతీమణి (5-13). ౧౮౯. సుదృక్కు=అందమయిన కన్నులు గలది. దృక్ఛబ్దమునకు నేత్ర మనియు నర్థము గలదు (6). (1-38 శ్లేష). ౧౯౦. (హంస) కాంత (3-152). ౧౯౧. హంసగమన (4-75). ౧౯౨. హరిణాక్షి (4-4). ౧౯౩. (హరు) రామ=హరునిస్త్రీ, పార్వతి (1-43).

ఇందు నాయికాదులకు విశేషణవాచకములుగా ప్రయోగింపఁబడినపదములు కూడ గ్రహింపఁబడినవి. ఇఁక స్త్ర్యర్థకము లయినయచ్చతెనుఁగుపదము లకారాదిగ ప్రదర్శింపఁబడు చున్నవి.

---

1. వామౌ వల్గుప్రతీపౌ ద్వౌ-అని అమరము.
2. స్త్రీ యోషి దబలా-అని అమరము.
3. శమ్బర స్స్వల్పహరిణః-అని వైజయన్తి.
4. వరారోహోత్తమా నారీ సైవ స్యా న్మత్తకాశినీ-అని వైజయన్తి.
5. చూ. హలాయుధవివరణము.
6. దృ గక్షి చక్షు ర్నయనం దృష్టి ర్నేత్రం విలోచనమ్-అని ధనంజయ నిఘంటువు.

## అచ్చతెనుఁగులు :

౦. (అంచ) బిత్తరి=అఁచుహంస(4-53). ౨. (అచ్చర) చెలువ= అప్సరఃకాంత (3-10). ౩. (అచ్చర) నెచ్చెలి (4-184). ౪. (అచ్చర) మిటారికత్తియ (3-23). ౫. (అచ్చర) మెఱుంగుఁబోడి (5-59). ౬. అతివ (3-50,103128: 4-98). ౭, కల్కిమిటారి=కలికి, మిటారి రెండును వనితా వాచకములు. ఇట 'మిటారి' శ్రేష్ఠార్థకముగ వాడఁబడినట్లనిపించుచున్నది. లేదా 'కలికి'ని విశేషణముగా చేసి మనోజ్ఞురాలయినమగువ అనవలయును(4-168). ౮. అఁటది(3-70.101; 5-51). ౯. ఆఁడుది(5-63,64,70). ౧౦. ఇంతి (3-40,109.117,137; 4-50,101,120,139.146,167; 5-5,106,111). ౧౧. ఇగురుఁబోఁడి(3-159; 5-106). ౧౨. (ఉడిగంపఁ) జేడియ(4-12). ౧౩. (ఉడిగప్ప)టింతి(2-5). ౧౪. ఉగ్మలి(2-54). ౧౫. ఉవిద(3-133; 4-173 . ౧౬. (ఊడిగంపఁ)జేడియ(5-95). ౧౭. (ఊడిగవుటబ్బురపున్)వలిగుబ్బెత(4-137). ౧౮. ఎలజవ్వని(5-88). ౧౯. (ఒయారపుసంచుల)ముద్దుగుమ్మ (4-96). ౨౦. ఒయ్యారి(5-94) ౨౧. (కట్టిక)మిటారి(4-139). ౨౨. (కట్టిక)యింతి(4-127). ౨౩. కన్నియ(4-187;5-97). ౨౪. కన్నియమిన్న ('మిన్న' శ్రేష్ఠతావాచి. 'అన్నులమిన్న'వంటి దిది. 4-4). ౨౫. కన్నె(3-77, 128; 4-138; 5-47). ౨౬. కలికి(1-20; 2-32; 4-34,100,151; 5-93) ౨౭. (కలికిజక్కవలెక్కువ)గుబ్బలాఁడి(4-96). ౨౮. కలువకంటి(5-106). ౨౯. (కల్వ)చెల్వ(4-23). ౩౦. (కావలి) చెల్వ(4-169). ౩౧. కొమిరె (కుమారి ప్రకృతి.3-89). ౩౨. కొమ్మ(2-26,29; 3-103,118,158సాభిప్రాయము,161; 4-28శ్లేష,89,170; 5-98,110). ౩౩. గట్టివాల్చెలి=పైరంధ్రి 1-85 . ౩౪. గబ్బిగుబ్బెత=విక్కవచన్నులు గలది(2-3). ౩౫. గరిత (4-173). ౩౬. చక్కెరబొమ్మ=చక్కెరబొమ్మవలె ప్రియ మయినది-మనోజ్ఞురాలు. (1)(2-93; 3-35); ౩౭. చదురాలు=నేర్పు గలఆఁడుది.(2)(4-194).

---

1. చూ: సూర్యరాయాంధ్రనిఘంటువు.

2. సూ. ని. దీనిని గ్రహింపలేదు.

౩౮. చన్నులమిన్న=చన్నులతో మిన్న యైనది,(1)(5-91). ౩౯. చివురాకుంబోఁడి(3-102). ౪౦. చిల్కలకొల్కి(4-96). ౪౧. చుక్కలజవరాలు(3-147) ౪౨. చెలి (3-43.124.128;4-34,40,182;5-58,94); ౪౩. చెలియ(4-155) ౪౪, చెలువ (2-6,32,100,103,106,138,144,164; 4-139,145,164: 5-110). ౪౫. చెల్వ (3-81,128). ౪౬. చేడియ (1-77; 4-154). ౪౭. జక్కవమించుఁబోఁడి (3-132) ౪౮. జడదారి-చెలి=మునికాంత(2-29). ౪౯. జవరాలు (1-20,73,75; 4-199). ౫౦. జవ్వని (2-63; 4-115,143; 5-16). ౫౧. టెక్కులాఁడి (2-80). ౫౨. తలిరుఁబోఁడి(5-104,106). ౫౩. తేఁటి-నీటుకత్తియ(3-132). ౫౪. తేఁటి-లేజవరాలు(3-144). ౫౫. తొగ-కొమ్మ(1-25). ౫౬. తొయ్యలి (3-29,54,69,128). ౫౭. నాతి(3-71,72, 112; 4-156). ౫౮. నీటుకత్తియ(2-140). ౫౯. నెఱవన్నెలాఁడి(5-90). ౬౦. పసపుఁబోఁడి(3-83అవయవార్థస్ఫోరకము). ౬౧. పూవుఁబోఁడి(4-[illegible] 131). ౬౨ పైదలి (4-4). ౬౩. పొలఁతి (3-121,128, 4-131). ౬౪.బోగంపుఁ బడుచు=వేశ్యాస్త్రీ (1-86). ౬౫. బోటి (3-70,104,110,157;4-99; 523,49). ౬౬. మగువ(3-32,43; 4-167). ౬౭ మగువసిగమిన్న('సిగమిన్న' శ్రేష్ఠతావాచకము,5-81). ౬౮. మించుఁబోఁడి(2-151). ౬౯. మిటారి(3-142; 4-82,167,169; 5-10). ౭౦. ముదిత (2-120; 4-141: 5-51,93,110. దీనిని ఆంధ్రభాషార్ణవము గ్రహింపలేదు.(2). ౭౧. ముద్దరాలు (2-58). ౭౨. ముద్దియ (4-29; 5-95). ౭౩. ముద్దుగుమ్మ(1-80; 2-20,65; 3-141; 5-97). ౭౪ మెఱుంగుఁబోఁడి(1-85). ౭౫. మెఱుఁగుఁబోఁడి(3-100; 5-100). ౭౬. మెలఁత (3-134). ౭౭. రే-కొమ్మ=రేయి యనువనిత (4-12). ౭౮. లతకూన(ఇది మిశ్రమము,3-123,158 సారకము. 4-28శ్లేష). ౭౯. లేఁజిగురుఁబోఁడి(4-101). ౮౦. లేమ(1-20). ౮౧. వన్నెలాఁడి(3-27 5-72,106). ౮౨. వలిగుబ్బెత(3-30). ౮౩. వాలుఁగంటి(4-153). ౮౪.వెలఁది (3-128). ౮౫. వెల-కొమ్మ(5-59). ౮౬. వెల-చెలి(2-114). ౮౭. వెల-చేడియ(5-95). ౮౮.వెల-మిటారి(4-191). ౮౯.వెల-ముద్దుగుమ్మ(2-113).

---

1. ఇతరకవులు దీనిని ప్రయోగించినట్లు లేదు. దీనిని కూడ సూ. ని. గ్రహింప లేదు.

2. చూ. అచ్చతెలుఁగుకోశము, పుట 364.

# మన్మథపర్యాయములు

## తత్సమములు :

౧. అంగజాఁడు(3-161). ౨. అతనుఁడు(4-50). ౩. అనంగుఁడు (3-50). ౪. కంజకాండుఁడు=పద్మము బాణముగా కలవాఁడు. కాండ మనఁగ బాణము(1) (3-79). ౫. కంతుఁడు(3-59,109,111, 4-190). ౬. కమల శరుఁడు(4-27). ౭. కుశేశయబాణుఁడు=పద్మబాణుఁడు, కుశేశయ మనఁగా నూఱుఱేకులతామర(2). ౮. కుసుమధన్వి(4-19). ౯. తరుణేక్షుధనుష్కుఁడు (4-5). ౧౦. తామరసాస్త్రుఁడు(4-32). ౧౧. దర్పకుఁడు(2-155). ౧౨. నాళీ కాంబకుఁడు(4-37). ౧౩. పంచబాణుఁడు(3-152). ౧౪. ప్రసవకలంబకుఁడు= పుష్పబాణుఁడు. 'కలంబ' మనఁగా బాణము(3). 'కలంబ'శబ్దముకంటె స్వార్థిక 'క' ప్రత్యయము చేసిన 'కలంబక' యగును(1-35). ౧౫. ప్రసవబాణుఁడు (4-196). ౧౬. భావజన్ముఁడు(4-219). ౧౭. భావభవుఁడు(3-153). ౧౮. మకరాంకుఁడు(1-50). ౧౯. మదనుఁడు(3-157,159,165,5-13). ౨౦. మన సిజుఁడు(2-55; 3-92,116,160: 4-25). ౨౧. మనోజాతుఁడు(3-78). ౨౨. మనోజుఁడు(3-124). ౨౩. మన్మథుఁడు(3-86,88,94). ౨౪. మరుఁడు (3-44,157; 4-3; 5-38). ౨౫. మారాజముఖీమణీకుమారుఁడు=లక్ష్మీపుత్త్రుఁడు 'మా' యనఁగా లక్ష్మీదేవి.(3-154). ౨౬. మారుఁడు(2-23; 3-52,154; 4-130,142; 5-78). ౨౭. రతిస్త్రీవిభుఁడు(3-57). ౨౮. రమాకుమారుఁడు (3-148;4-28). ౨౯. వనజకృపాణుఁడు=పద్మము కృపాణము(కత్తి)గా కల వాఁడు. పుష్పములను మదనునిబాణకృపాణాద్యాయుధములుగా వచించుట సాంప్ర దాయికము(4-29). ౩౦. విషమబాణుఁడు=బేసిసంఖ్య(అయిదు)బాణములు గల వాఁడు(4-26). ౩౧. శ్రీరమణీనందనుఁడు=లక్ష్మీనందనుఁడు(2-1). ౩౨. సర

---

1. కాణ్డో బాణ స్తులా కాణ్డః కాణ్డః పఙ్క్త్యత ఇష్యతే-అని అనేకార్థధ్వనిమఞ్జరి.
2. సహస్రపత్రం కమలం శతపత్రం కుశేశయమ్-అని అమరకోశము.
3. పృషత్కో రోపణో బాణః కలమ్బో మర్మభేదనః—అని వైజయన్తి.

పిఙాస్త్రుఁడు(3-123). ౩౩. సుమచాపుఁడు(1-106). ౩౪. హిమరుగ్బాంధవుఁడు=హిమ మనఁగా శైత్యము. రుక్—అనఁగా కాంతి(1). హిమరుక్ అనఁగా చల్లనికాంతి(వెన్నెల) కలవాఁడు చంద్రుఁడు. అతనిబాంధవుఁడు(మేనయల్లుఁడు) మన్మథుఁడు.

## అచ్చతెనుఁగులు :

౧. అందపువిరిదమ్మితేకుదసెనాదొర=అంద మయినతామరతేకు ఆయుధముగా కలిగినదొర. 'దసెనా' అనఁగా ఆయుధవిశేషము(2). తామరతేకే ఆయుధమనుట యిట విశేషము. దీని నితరులు ప్రయోగింపలే దనిపించు చున్నది. (4-47). ౨. అలరువిలుకాఁడు(3-143). ౩. ఇంచువింటివాఁడు=చెఱకువిలుకాఁడు. పూలను, చెఱకును మదనునకు విల్లుగా వచించుట కవిసంప్రదాయము (3-48; 4-38). ౪. ఇంచువిలుకాఁడు (4-23; 5-35,110). ౫. ఇంచువిలువీరుఁడు(ఇట వీరుఁడు తత్సమము,3-33). ౬. ఇంచువిల్కాఁడు(3-37). ౭. కమ్మనివిలుకాఁడు = తియ్యనివిలుకాఁడు — ఇక్షుధన్వుఁ డనుట(3-118). ౮. కమ్మవింటియెమ్మెకాఁడు=కమ్మనివిల్లుగలిగినఅందగాఁడు. ఎమ్మెకాఁ డనఁగా అందగాఁడు(3). (3-161). ౯. కెందలిరుబొందళపుందొర =ఎఱ్ఱనిచిగురుటాకు కవచముగా కలిగినతేఁడు. బొందళ మనఁగా కవచము(4).(4-154). ౧౦. చిలుకగుఱ్ఱాలదునేదారి=చిలుకలు గుఱ్ఱములుగాఁ గలరాజు. దునేదారి యనఁగా రాజు(5).(3-95). ౧౧. చిలుకపటానితేరిదొర=చిలుక గుఱ్ఱముగా కలిగినరథము గలతేఁడు. పటాని(పటాణి) యనఁగా అశ్వము(6).(2-6).

---

1. రు గ్త్వాలేచ్ఛయోః కాన్తౌ—అని నానార్థరత్నమాల.
2. దసెన(నా)=వి.ఆయుధవిశేషము(శ.ర.)— అని సూ.ని. ఇట నీప్రయోగ మొక్కటే ఈఁబడెను.
3. సూర్యరాయాంధ్రనిఘంటువు.
4. అచ్చతెలుఁగుకోశము, పుట550.
5. సాంబనిఘంటువు, మానవవర్గము, 11.
   ,, 71.

౧౨. చిలుకదాడావజీరు- చిలుక అశ్వముగాకలిగినరాజు. దాడాఅనఁగాగుఱ్ఱము(1) (3-23) ౧౩. చిలుకముష్కీ-తేజీవారు = చిలుకమొకరంపు అశ్వము(వాహనము)గా కలవారు. సంస్కృతములోనిమయూరవ్యంసకసమాసము(తత్పురుషవిశేషము)వంటిది తెనుఁగున చిలుకమొకరి. మొకరికి బదులుగా 'ముష్కీ' అనుఅన్యదేశ్యమును ప్రయోగించినట్లున్నాఁడు కవి(3-148). ౧౪. చిలుకసాంబ్రాణితేజీవజీరుఁడు-చిలుక ఉత్తమాశ్వముగాఁ గలరాజు. సాంబ్రాణి అను పదమునకు ఉత్తమాశ్వ మనునర్థము కలదు(2). తేజి అనుదానికిని ఉత్తమాశ్వ మనువర్థమున్నది(3). రెండుపదములు సమసించినప్పుడు 'సాంబ్రాణి' పదము కేవలఅశ్వవాచియై 'తేజీ' పదము శ్రేష్ఠతావాచకమై మొత్తమునకు 'ఉత్తమాశ్వము' అనునర్థము శక్తిసంకోచన్యాయమున సిద్ధించును. దీనికి ప్రయోగాంతరము "సీ. గార్దభంబును వేయుగతుల దాఁటించిన- నోజతో సాంబ్రాణితేజి యగునె?"-కాళహస్తి49.(4) 3-97). ౧౫. చీనాచక్కెరఖాణప్పంబులుఁగుఁదేజీజోదు-ప్రశస్తమయినచక్కెర దాణాగా కలిగినపిట్ట(చిలుక) గుఱ్ఱముగా కలయోధుఁడు(3-156). ౧౬. చెల్వపుఁజెంగల్వపురిదికిరుసుదురుసుమాస్టీఁడు= అందమయినయెఱ్ఱగలువ అద్భుతమయినట్టి వంకకత్తిగా కలిగినదుడుకయిన శస్త్రదక్షుఁడు (లేక) దుడుకైనవీరుఁడు. కిరుసు—అనఁగా వంకలు గలఖడ్గవిశేషము(5).(4-30). ౧౭. జాజివిరినేజాజోదు=జాజిపూవు ఈఁటెగా కలయోధుఁడు. నేజా—అనఁగా ఈఁటె(6)(3-121). ౧౮. తమ్మిదోదుమ్మిజోదు=తామరయే వంకకత్తిగా కలిగినయోధుఁడు. దోదుమ్మి—అనఁగా వంకలు గలకత్తి(7) (2-4). ౧౯. తియ్యవిల్వింటిజోదు(3-69). ౨౦. తుమ్మెదకంటుకమ్మవిరిసుమ్మిపాదుషా-తుమ్మెదలకు శత్రువయినసంపఁగిపువ్వు ఆయుధముగా కలిగినరాజు.

---

1. సాంబశివనిఘంటువు, మానవవర్గము, 71.
2. బ్రౌనుదొరగారి'తెలుఁగు-ఇంగ్లీషు'నిఘంటువు.
3. అచ్చతెలుఁగుకోశము, పుట532.
4. బ్రౌనుదొరగారి'తెలుఁగు-ఇంగ్లీషు'నిఘంటువు.
5. అచ్చతెలుఁగుకోశము, పుట580.
6. ,, పుట576.
7. ,, పుట580.

చంపకపుష్పాయుధుఁ డనుట. కంటు—అనఁగా శత్రువు(1). రుమ్మి-అనఁగా ఖడ్గ మని యీతనిప్రయోగమువలన తెలియు చున్నది. కాని సూ.ని. రుమీచూరకత్తి, రుమ్మిపిరంగివంటిసమాసములను గ్రహించి యర్థాంతరములను చూపు చున్నది. ఆచటిప్రయోగములలో 'రుమ్మి' అనునది విశేషణ మనిపించు చున్నది(2). ౨౧. ననవింటికొమరుఁడు(1-31). ౨౨. ననదసెనాజోదు=పూవు ఆయుధముగా కలయోధ(5-34). ౨౩. ననవింటివాఁడు(1-86). ౨౪. ననవిల్ మొక్కలిదొర=పూవిల్లు గలసాహసికుఁ డయినరాజు. మొక్కలి—అనఁగా సాహసికుఁడు(3)(4-100). ౨౫. పచ్చవిలుకాఁడు(3-146). ౨౬. పువ్వింటిసాది (3-132). ౨౭. బొండుమల్లెవిరిబల్లిండాజగాజోదు=బొండుమల్లెపూవు అద్భుతమయినఖడ్గముగాఁ గలగొప్పయోధ. ఖండా—అనఁగా కత్తి(4)(4-99). ౨౮. రాచిల్కమేత్తేజీజోదు(4-146). ౨౯. లిబ్బిపడంతిపట్టి=లక్ష్మీసంతానము (3-30). ౩౦. వలరాజు(5-35). ౩౧. వలరాయఁడు(3-158). ౩౨. వెడవిలుతుఁడు=ఇక్షుధన్వుఁడు (లేక) పుష్పధన్వుఁడు. 'వెడ' యనఁగా చెఱకు (లేక) పువ్వు(5)(3-83). ౩౩. వెడవిలాకాఁడు(3-98).

# రాజన్ పర్యాయములు

అ

౧. అధినాథుఁడు(1-69). ౨. అధిపతి(2-106). ౩. అధిపమౌళి(1-105 ఇట 'మౌళి' శ్రేష్ఠతావాచి). ౪. అధిపవర్యుఁడు(4-84,164). ౫. అధిపుఁడు

1. అచ్చతెలుఁగుకోశము, పుట508.
2. ప్రయోగములకై చూ. సూ. ని.
3. అచ్చతెలుఁగుకోశము, పుట870.
4. ,, పుట570.
5. ,, పుట12.

(1-58; 2-84; 3-82; 4-85). ౬. అనంత—నృపాలుఁడు(1-60). ౭. అరి—జనపతి(1-62)=శత్రురాజు. ౮. అరి—ధరాధిపుఁడు(1-64). ౯. అరి—ధరా భుజుఁడు(1-59). ౧౦. అవనీధవనేత(3-26.నేతృశబ్దము శ్రేష్ఠతావాచి). ౧౧. ఇనుఁడు(1-20; 4-7శ్లేష). ౧౨. ఇలాబలారి(4-124)=భూమీంద్రుఁడు (ఇల యనఁగా భూమి. 'బల + అరి' అనఁగా బలునకు శత్రువు. ఇంద్రుఁడు). ౧౩. ఈశుఁడు(3-82). ౧౪. ఈశ్వరుఁడు(1-70,83). ౧౫. ఋతధ్వజ—నరేంద్రుఁడు(2-40; 3-59). ౧౬. ఋతధ్వజ—భూనగవరవైరి(1-89)=ఋతధ్వజ భూమీంద్రుఁడు(ఋతధ్వజరాజు—అనుట)(నగవరము లనఁగా పర్వతశ్రేష్ఠములు వానికి శత్రువు. ఇంద్రుఁడు). ౧౭. ఋతధ్వజ—భూవరుఁడు(3-41). ౧౮. ఋతధ్వజ—రాజు(3-52). ౧౯. ఋతధ్వజ—వసుంధరాపురందరుఁడు(4-42)=ఋతధ్వజభూమీంద్రుఁడు(ఋతధ్వజరాజు—అనుట)(వసుంధర యనఁగా భూమి; పురందరుఁ డనఁగా ఇంద్రుఁడు): ౨౦. ఋతధ్వజేంద్రుఁడు(3-54; 4-40)=ఋతధ్వజరాజు(ఇంద్రరాజశబ్దములు పర్యాయములు(1). ౨౧. ఋతధ్వ—జేశ్వరుఁడు (3-49,55): ౨౨. కస్తు—రీంద్రుఁడు(1-56). ౨౩. కుంభినీంద్రజంభారి (5-84)=భూమీంద్రశ్రేష్ఠుఁడు(రాజశ్రేష్ఠుఁ డనుట)(కుంభిని యనఁగా భూమి. దానికి ఇంద్రుఁ డనఁగా నాథుఁడు. భూనాథుఁ డనఁగా రాజు. జంభ + అరి=జంభాసురునకు శత్రువు(వధించినవాఁడు), ఇంద్రుఁడు. 'జంభారి' శబ్దము ఇంద్రశబ్దమునకు పర్యాయ మై, ఉత్తరస్థానమునం దున్నది. కనుక శ్రేష్ఠతావాచకమయినది). ౨౪. కుంభినీజంభవైరి(4-48)=భూమీంద్రుఁడు(రాజు—అనుట). ౨౫. కుతలపతి(3-166) = భూతలనాథుఁడు(రాజు— అనుట. 'కు' అనఁగా భూమి(2). ౨౬. కుభృత్తు(1-63)=భూమిని(భూప్రజలను) భరించువాఁడు (రాజు). ౨౭. కువలయాశ్వ—క్షితీంద్రుఁడు(4-204). ౨౮. కువలయా—శ్వాధిశుఁడు(5-71)=కువలయాశ్వరాజు(అధీశుఁడు=అధికుఁ డయినయీశుఁడు_కర్మధారయము). ౨౯. కృష్ణ—ధరాతలనాయకుఁడు(1-50); ౩౦. కృష్ణ—ధరాబిడౌజుఁడు(1-45) = కృష్ణభూమీంద్రుఁడు(కృష్ణరాజు—అనుట. బిడౌజుఁ డనఁగా

---

1. రాజా ఽధిపః పతి స్స్వామీ....భర్తేన్ద్ర ఇన ఈశితా-అని ధనంజయము.

2. పృథివ్యాం కుః సమాఖ్యాతః-అని ఏకాక్షరకోశము.

వింద్రుఁడు(1). ౩౧. కృష్ణ—నృపచంద్రుఁడు(1-29. చంద్రశబ్ద మిట శ్రేష్ఠతా వాచి). ౩౨. కృష్ణావనీంద్రుఁడు(1-57). ౩౩. కృష్ణాధిపుఁడు(1-5). ౩౪. క్షితివరుఁడు(5-85). ౩౫. గోత్రామరేంద్రుఁడు(1-60) = భూమీంద్రుఁడు(గోత్ర యనఁగా భూమి(2). అమరేంద్రుఁ డనఁగా అమరులకు ప్రభువు. ఇంద్రుఁ డనుట. ఇంద్రశబ్ద మిచట ప్రభ్వర్థకము). ౩౬. గోలకొండ—నరేంద్రుఁడు (1-60). ౩౭. గోవింద—జనవిభుఁడు(1-23). ౩౮. గోవిందభూపుఁడు(1-4) =గోవిందరాజు. ౩౯. జనపతి(2-54; 3-45: 4-87, 121. 59; 5-88). ౪౦. జనపాలుఁడు(4-104). ౪౧. జనలోకరసాకరపాకశాసి(3-57)=ఇది యొక అపూర్వప్రయోగము. జనలోక మయినభూలోకమునకు ఇంద్రుఁడు(ప్రభువు); భూమీంద్రుఁడు(రాజు-అనుట). భూమిపర్యాయములందు 'రసా' ఒకటి. దానికి 'మాధుర్యాదు లైనవివిధరసములు గలది' అని వ్యుత్పత్తి(3). 'రసా' శబ్దవ్యుత్పత్తినిబట్టి 'రసాకర' శబ్దమును 'భూ' వాచిగా ప్రయోగించినాఁడు నారాయణుఁడు. మాధుర్యాదివివిధరసములకు ఆకర(స్థాన) మైనది, భూమి—అని యిచటి యర్థము. పాకశాసి యనఁగా పాకుఁ డనురక్కసుని శాసించిన(వధించిన)వాఁడు, ఇంద్రుఁడు అని యర్థము. రసాకరపాకశాసి యనఁగా భూమీంద్రుఁడు(రాజు). జనలోక ప్రభువు—అని మొత్తమున కర్థము. ౪౨. జనవరమౌళి(2-59). ౪౩. జనవరాఖండలుఁడు(2-62)=రాజశ్రేష్ఠుఁడు. (ఆఖండలశబ్ద మిచట ఇంద్రపర్యాయ మై శ్రేష్ఠతాబోధక మైనది). ౪౪. జనవరాగ్రగణ్యుఁడు(2-105). ౪౫. తిప్ప—ధరాపాలుఁడు(1-47). ౪౬. తిప్ప—ధరారమణుఁడు(1-30). ౪౭. తిప్ప—నరపాలుఁడు(1-34). ౪౮. తిప్ప—నృపతి(1-31, 36). ౪౯. తిప్ప—నృపాలుఁడు(1-33, 45, 46). ౫౦. తిప్ప—భూపతిబిడౌజుఁడు(1-29. 'బిడౌజుఁడు. ఇంద్రపర్యాయ మై శ్రేష్ఠతావాచక మిచట). ౫౧. తిమ్మ—ధరణీపతి(1-24)'. ౫౨. తిమ్మ—ధరాకాముకుఁడు(5-1)=తిమ్మ—భూపతి(కాముకపద మిట 'పతి

---

1. సుత్రామాం బిడౌజా స్సితకుఞ్జరః-అని ఇంద్రపర్యాయములందు యాదవప్రకాశము.

2. గోత్రా వసున్ధరా ప్రోక్తా—అని శబ్దరత్నప్రదీపము.

3. హలాయుధవివరణము→"మాధుర్యాదిరూపో వివిధో రసోఽస్త్యస్యా మితి".

పర్యాయము(1). ౫౩. తిమ్మ-ధరాధిపుఁడు(1-36). ౫౪. తిమ్మ-ధరాధ్యక్షుఁడు (1-45)(అధ్యక్షుఁ డనఁగా అధికారి(2). భూమికి అధికారి యనఁగా-రాజు). ౫౫. తిమ్మ-ధరపాలుఁడు(1-39). ౫౬. తిమ్మ-నృపకంఠీరవుఁడు(1-45. 'కంఠీరవ' శబ్దము 'సింహ' పర్యాయ మయిన శ్రేష్ఠతావాచి). ౫౭. తిమ్మ-నృపతి(1-5) ౫౮. తిమ్మ-నృపశౌరి(1-25. 'శౌరి' శబ్దము స్పష్టముగ శ్రేష్ఠతావాచిగా ప్రయోగింపఁబడినస్థల మిది. ఇది సంజ్ఞావాచక మయిన 'తిమ్మ' శబ్దమునకు నుత్తర స్థానమున లేదు. కనుక నిది నుపమితసమాసము కాదు(3). ౫౯. తిమ్మ-నృపాలుఁడు(1-45). ౬౦. తిమ్మ-నృపుఁడు(1-40,41). ౬౧. తిమ్మ-భూపాగ్రగణ్యుఁడు 1-38). ౬౨ తిమ్మ-భూవరుఁడు(1-37). ౬౩. తిమ్మ-విభుఁడు (1-58). ౬౪. తిమ్మాధిపుఁడు(1-58). ౬౫. ధరణీపుఁడు(4-220). ౬౬. ధరణీంద్రుఁడు(2-11,25). ౬౭. ధరణీకాంతుఁడు(5-111). ౬౮. ధరణీనాయకమౌళి(1-48). ౬౯. ధరణీశుఁడు(1-59). ౭౦. ధరాజాని(3-19)=ధర(భూమి) జాయ(భార్య)కా కలవాఁడు('జాయ' శబ్దమునకు బహువ్రీహిసమాసమున నిజాదేశము వచ్చి 'జాని' అనురూప మేర్పడును 4). ఇట్లే గౌరీజాని, వాణీజాని, జానకీజాని మొదలగునవి). ౭౧. ధరాతలేంద్రుఁడు(2-22). ౭౨. ధరాధవపద్మబంధువు(1-60)=రాజసూర్యుఁడు(రాజశ్రేష్ఠుఁ డనుట)(ధరాధవుఁ డనఁగా భూభర్త రాజు). పద్మబంధు వనఁగా సూర్యుఁడు. "రాజా మార్తాండ ఇవ" అన్నట్లు "రాజా పద్మబంధు రివ" అని యుపమితసమాసము చెప్పవలయును). ౭౩. ధరాధిపతి(2-39;4-55). ౭౪. ధరాధిపసురాధిపుఁడు(3-49)=రాజోత్తముఁడు (ఇంద్రపర్యాయ మయిన 'సురాధిప' శబ్దము శ్రేష్ఠతావాచి). ౭౫. ధరానాథుఁడు (5-89). ౭౬. ధరావరుఁడు(3-58). ౭౭. దశరథ-నేత(1-21)=దశరథ-రాజు[నేత యనఁగా ప్రభువు(రాజు)(5)] ౭౮. ధారుణీశ్వరుఁడు(2-128).

---

1. ప్రియః కామీ చ కాముకః వల్లభో ఽథ పతిః-అని ధనంజయము.
2. అధ్యక్షో ఽధికృతే పుంసి స్యాత్-అని మేదిని.
3. చర్చావిశేషములకై చూ. వాజయవ్యాసములు, ద్వితీయసంపుటము, పుట51-61
4. జాయాయా నిఙ్(5-4-134). -అని పాణిని.
5. నేతా త్వీశ్వరో నాయకః ప్రభుః-అని వైజయన్తి.

౭౯. నాయకుఁడు(3-82)=రాజు. ౮౦. నరనాథుఁడు(2-87). ౮౧. నరనాథాగ్రణి(3-13). ౮౨. నరపతి(2-52,143,155; 4-152;5-190). ౮౩. నరవరుఁడు(2-74). ౮౪. నరాధిపుఁడు(3-9). ౮౫. నరేంద్రచంద్రుఁడు(2-79)=రాజశ్రేష్ఠుడు. ౮౬, నరేంద్రమౌళి(2-130; 3-81). ౮౭,నరేంద్రుఁడు(2-79: 4-74,105). ౮౮. నరేశుఁడు(4-133). ౮౯. నారాయణ—నరేంద్రమణి(5-1. 'మణి' శ్రేష్ఠతావాచి). ౯౦. నారాయణేంద్రుఁడు(1-29,51) = నారాయణరాజు. ౯౧. నారణేశ్వరుఁడు(1-52). ౯౨. నారనక్ష్మాపమౌళి(2-155). ౯౩. నారనజనప్రభుఁడు(1-4). ౯౪. నారన—ధరావజ్రి (1-6) =నారన — భూమీంద్రుఁడు (నారనరాజు)[వజ్రము(వజ్రాయుధము) కలవాఁడు వజ్రి. అనఁగా ఇంద్రుఁడు] ౯౫. నారన—భూపమౌళి(1-3). ౯౬. నారన—భూపుఁడు(3-1). ౯౭. నారనాధినేత(1-60). ౯౮. నారనాధిపుఁడు(1-1). ౯౯. నారనేంద్రుఁడు(1-58)= నారనరాజు. ౧౦౦. నారాయణక్షమాపాలమౌళి(1-16). ౧౦౧. నారాయణ—క్షమాపాలవరుఁడు(1-59). ౧౦౨. నారాయణ—ధరణీయువతినాయకమణి(1-65) ౧౦౩. నారాయణ—ధరణీతలనాయకమణి(1-14). ౧౦౪. నారాయణ—భూపచంద్రుఁడు(4-1). ౧౦౫. నారాయణ—భూపుఁడు(2-1). ౧౦౬. నారాయణ—వసుంధరాదేవేంద్రుఁడు(1-45) = నారాయణరాజు (లేక) నారాయణరాజోత్తముఁడు. ౧౦౭. నారాయణాధినేత(1-53). ౧౦౮. నారాయణాధిపుఁడు(1-5) ౧౦౯. నారాయణాధిపేంద్రుఁడు(1-2). ౧౧౦. నృపతి(1-23; 2-12,71; 3-47). ౧౧౧. నృపతిచంద్రుఁడు(4-53,215). ౧౧౨. నృపతిపుంగవుఁడు(4-93). ౧౧౩. నృపమౌళి(2-61; 3-113). ౧౧౪. నృపాగ్రణి(4-94,102). ౧౧౫. నృపాలుఁడు(2-49; 3-161). ౧౧౬. నృపుఁడు(1-81; 2-53,78,112,124, 125; 3-6; 4-149,150; 5-94). ౧౧౭. పతి(2-83,90,111; 3-82; 4-132,151,166). ౧౧౮. పరావనీపుఁడు(4-128)పర + అవనీపుఁడు=శత్రురాజు. ౧౧౯. పరిపంథిపృథివీపతి(1-59)=శత్రురాజు. ౧౨౦. పార్థివేంద్రుఁడు (3-19). ౧౨౧. ప్రతిపక్షభూమిపతి(3-165)=శత్రురాజు. ౧౨౨. ప్రభువు (1-60); ౧౨౩.భూకాంతుఁడు(4-131). ౧౨౪.భూధవసుధాధాముఁడు(5-

రాజచంద్రుఁడు[ధామ మనఁగా కిరణము(1). సుధాధాముఁ డనఁగా అమృతకిరణుఁడు—చంద్రుఁడు]. ౧౨౫. భూపవర్యుఁడు(2-34). ౧౨౬. భూపాలుఁడు (2-10,97;5-97). ౧౨౭. భూపవరుఁడు(4-121). ౧౨౮. భూవిభుఁడు(2-17). ౧౨౯. మణినాగనగర—కాంతుఁడు(1-63). ౧౩౦. మత్తప్రతీపభూపుఁడు(1-27)=మదించినశత్రురాజు [ప్రతీపుఁ డనఁగా శత్రువు(2). ౧౩౧. మనుజనాథుఁడు(4-90). ౧౩౨. మనుజాధిపుఁడు(2-51). ౧౩౩. మనుజేంద్రుఁడు (2-148; 3-12). ౧౩౪. మనుజేశ్వరుఁడు(2-104). ౧౩౫. మహికాంతుఁడు (2-24). ౧౩౬. మహిజాని(2-47)(ధరాజానివలెనే). ౧౩౭. మహిపచంద్రుఁడు (2-93). ౧౩౮. మహిపుఁడు(1-90;4-148). ౧౩౯. మహిభృత్తు(1-43). ౧౪౦. మహీకాంతుఁడు(3-14;4-78). ౧౪౧.మహీశుఁడు(2-70) ౧౪౨.మానవనాయకుఁడు(5-103). ౧౪౩. మానవాధీశుఁడు(2-81). ౧౪౪. మానవేంద్రుఁడు(3-115). ౧౪౫. మేదినీనాయకుఁడు(4-82). ౧౪౬. మేదినీయువతిజాని(4-101)(ధరాజానివలెనే). ౧౪౭. మేదినీవరుఁడు(2-76; 4-117). ౧౪౮. రంగరాయ—నృపవర్యుఁడు(1-45). ౧౪౯. రంగ-నృపుఁడు (1-57)=రంగరాజు. ౧౫౦. రంగాధిపుఁడు(1-56). ౧౫౧. రఘునాథ—ధరణీవిభుఁడు(1-54). ౧౫౨. రఘునాథ—నరనాథమౌళి(1-45). ౧౫౩. రాజచంద్రుఁడు(4-46). ౧౫౪. రాజవరుఁడు(1-91). ౧౫౫. రాజవర్యుఁడు(2-3). ౧౫౬. రాజసింహము(2-85). ౧౫౭. రాజు(1-2,71,73,91,93; 2-90,95,104,110,117,121,123, 144; 3-77; 4-80,88,93,146; 5-83). ౧౫౮. రామ—ప్రభుచంద్రుఁడు (1-45). ౧౫౯. రామాధిపమౌళి(1-22). ౧౬౦. లక్కా—జనపతి(1-25). ౧౬౧. లక్క—నృపవర్యుఁడు(1-29). ౧౬౨. లక్క—మహీపాలవర్యుఁడు (1-27). ౧౬౩. లక్క—విభుఁడు(1-32)=లక్కరాజు. ౧౬౪. లక్కావనీ

---

1. ధామ దేహే గృహే రశ్మౌ—అని మేదినీకోశము.
2. ప్రతికూలం ప్రతిలోమం ప్రతీపముక్తం ప్రసవ్యమేకార్థమ్—అని హలాయుధము.

క్షుఁడు(1-29). ౧౬౫. వసుధాధిపమౌళి(3-44). ౧౬౬. వసుధావరుఁడు(4-47). ౧౬౭. విభుఁడు(2-88; 3-82). ౧౬౮. విమతేంద్రుఁడు(2-139=శత్రురాజు(విమతుఁడు=శత్రువు(1). ౧౬౯. వీరవేంకటరాయ—భూవిభుఁడు(1-52, 59). ౧౭౦. వేంకట—నృపాధ్యక్షుఁడు(1-56) = వేంకటరాజశ్రేష్ఠుఁడు(ఇట 'అధ్యక్ష' శబ్దము శ్రేష్ఠతావాచిగా ప్రయోగింపఁబడుట యీకవివిరంకుశత్వమున కు విదర్శనము). ౧౭౧ వేంకటపతి—క్ష్మాకాంతచంద్రుఁడు(1-58). ౧౭౨. వేంకటపతీంద్రుఁడు(1-57)=వేంకటపతిరాజు. ౧౭౩. వేంగళవిభుఁడు(1-57). ౧౭౪. వైరి—జనపాలకుఁడు(1-59)=శత్రురాజు. ౧౭౫. శత్రుజిన్మహీకాంతుఁడు (2-18). ౧౭౬. శతారినృపుఁడు(1-37)శత + అరినృపుఁడు=శతుఁ డయిన శత్రురాజు. ౧౭౭. శ్రీరంగరాయ—జనపతి(1-47). ౧౭౮. శ్రీరంగరాయ—ధరాధినేత(1-55). ౧౭౯. శ్రీరంగిరాయ-నృపుఁడు(1-49). ౧౮౦. సర్వంసహానేత(5-91). ౧౮౧. సర్వసర్వంసహాధినాథజంభసంభేధి(2-2)(జంభసంభేది=జంభాసురుని భేదించిన(వధించిన)వాఁడు, ఇంద్రుఁడు. శ్రేష్ఠతావాచి). ౧౮౨. స్వామి(2-84)=ప్రభువు(రాజు) (2).

## అచ్చతెనుఁగులు:

౧. ఏలినవాఁడు(2-144). ౨. చిలువరాతేచెలిచెల్వుఁడు(5-87)=సర్పరాజేంద్రుఁడు తేచెలిచెల్వుఁ డనఁగా తేయి యనువనితకు మగఁడు, చంద్రుఁడు. ఇట నిది శ్రేష్ఠత్వావాచి). ౩.దొర(1-93; 2-3,104,110,140; 3-76; 4-60, 81,103; 5-19,96). ౪. పాదుషా(1-40)=రాజు(3). ౫. మన్నీఁడు(2-9). ౬. రాచదేవళ్ళు(2-95)(దేవర + లు=దేవళ్ళు = రాజశ్రేష్ఠులు(దేవరశబ్ద మిట శ్రేష్ఠతావాచి). ౭.రాచతేమగఁడు(5-92)(తేయి + మగఁడు=తేమగఁడు)=రాజచంద్రుఁడు(రాజశ్రేష్ఠుఁ డనుట)(తేమగఁ డనఁగా చంద్రుఁడు. శ్రేష్ఠతావాచి యిచట). ౮. సామి(2-99)(స్వామి ప్రకృతి)=రాజు.

---

1. తెలుఁగు—ఇంగ్లీషునిఘంటువు.
2. "స్వామ్యమాత్యసుహృత్కోశరాష్ట్రదుర్గబలాని చ। రాజ్యాంగాని...."
అని యమరకోశము.

3. సాంబనిఘంటువు, మానవవర్గము, 11.

ఇట్లే సరస్వతీదేవికి మరుగులపూఁబోఁడి, పలుకుబొయ్యారి, మాట మిటారి, మినుకుఁబ్రోయాలు(1)- అను పర్యాయములు అచ్చతెనుఁగున ప్రయోగింపఁబడినవి 1-5). ఇవి 'వాగ్వనితా' యను సంస్కృతపదమున కచ్చతెనుఁగు పర్యాయములు.

ఈకవిపర్యాయములను పరిశీలింపఁగా అన్యదేశ్యములు, అపూర్వప్రయోగములు, నిఘంటువుల కెక్కనిశబ్దములు మున్నగునవి కానవచ్చు చున్నవి. కొన్నిపదములను తానే సృజించుకొన్నాఁ డనియు తెలియు చున్నది. బహుకావ్య బహునిఘంటుపరిశీలనాదులవలననే కవు లిట్లు వశ్యవాక్కు లవుదురు. 'సంతత భారతభాగవతాదిశ్రవణానందుఁడ' నని ఆశ్వాసాంతగద్యమునందు తాను చెప్పుకొనుటలో బహుగ్రంథపరిశీలనశీలి ననియు చెప్పికొనినట్లు మన మూహింప వచ్చును. ఇట్లు సంపాదించినరచనాశక్తి పాఠకులను పదేపదే పఠించు వారినిగా చేయును.

కం. విరచించుశక్తి పుట్టని
పురుషుని చదువులు ప్రకాశములు గావు వసుం
ధర, దీపరహితసదనాం
తరమున రేయిఁ బడి యున్నద్రవ్యములక్రియన్.

— లాక్షణికకవి అప్పకవి.



1. మినుకు=మంచిమాట(అచ్చతెలుఁగుకోశము, పుట79).

# త్రయోదశదళము

# సందేహములు—సమాధానములు

ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ ప్రతియందు సంపాదకులచే ప్రశ్నార్థకము లుంపఁబడినతావులలో యథామతి అర్థవివరణము కావించుట ఈవ్యాసోద్దేశము.

౧. కరుణారవిందచరణా (1-17)→ కృతిపతి నారాయణరాజు వర్ణింపఁబడు చున్నసుదీర్ఘవచనమున" ...సర్వసర్వంసహాధూర్వహతానిరాకృతకమఠపరిబృఢ కాకోదరలోకాధిపదిశాస్తంబేలమూర్ధన్యుండును, కరుణారవిందచరణా(?)మణీ పరిణీతపరీరంభణోజ్జృంభణాలోకుండును........"(1-17) అని యొకచో కలదు.

ఇచట 'కరుణారవిందచరణా' అనుచో సంపాదకులచేత ప్రశ్నార్థక ముంపఁబడినది. దీనికి 'కరుణారవిందనయనా' అనుసంస్కారము జరపిన బాగుగా నుండు ననిపించును. అరవిందనయన, అరవిందవదన—ఇత్యాదులు స్త్రీ పర్యాయములుగా స్త్రీవర్ణనమున ప్రసిద్ధములు.

కరుణా + అరవిందనయనామణీ=కరుణ యనెడి — స్త్రీరత్నము(శ్రేష్ఠురాలయినస్త్రీ)యొక్క పరిణీత=పరిణయమునందలి [పరిణీతము అనుచోట 'త' ప్రత్యయము భావార్థకము. ఇపుడు 'పరిణీత, పరిణీతి'—శబ్దములు సమానార్థకములు. పరిణయ మనునర్థ మీశబ్దమున కి ట్లేర్పడినది]. పరీరంభణ=ఆలింగనముచేత నయిన, ఉత్ + జృంభణ=విజృంభణము(వికాసముతో(*) కూడిన, ఆలోకుండును=చూపు గలవాఁడును—అని యర్థము. ఒకనాయికామణిని వివాహమాడి తానుగా కౌఁగిలింప మహోత్సాహముతో నున్ననాయకుఁడుగా(నారాయణ

*. జృమ్భో మతో వికాసే చ—అని విశ్వము.

రాజా)చూపు వర్ణింపఁబడు చున్నది. ఇట కరుణ యనునది నాయికామణి. ఆయన చూపులు దయతో కూడి ఆశ్రితులపై మహోత్సాహముతో ప్రసరించు చున్న వనుట దీని కైవవరమార్గము.

ఇక్కడ 'నయనా' అనుసంస్కారము కూడ కవిహృదయము కాదేమో! అనిపించును. కవి తాను కావలయు ననియే అరవిందనయన. అరవిందవదన యట్లే 'అరవిందచరణ' యేల యుండరా దని భావించి స్త్రీలచరణములకుఁ గూడ నరవిందములయందలియొకవైశిష్ట్యము నాపాదింపఁదలఁచి 'అరవింద చరణా' అని అనినాఁ డనిపించును. ఈతఁడు క్రొత్తపోకడలయందు కొంత యభిరుచి కలవాఁడుగా నీగ్రంథమునం దటనట కానవచ్చును. పూర్వప్రకరణ ములయందు కొన్నిచోట్ల ఈవిషయము ప్రస్తావింపఁబడినది. అస లీతఁడే స్థలాం తరమున నాయిక 'వజ్రపాద' యని సార్థకముగా ననినాఁడు—

సీ. అడుగిడ వెఱచు నీయబ్జపాద సమీప
వికటానుభావహంసికలఁ గన్న (3-83).

ఔచిత్యదృష్టితో నూతనకవిసమయములను సృష్టించుకొనుటలో కవులకు స్వేచ్ఛ గలదు గదా!

మఱియొకవిషయము—ఇట 'పరీరంభణము' అనుట కూడ కొంచెము నవరింపఁబడి 'పరిరంభణ' అనవలసినట్లు కాన్పించును. సంస్కృతవ్యాకృతిచే ఘఞంత ముత్తరపదముగా నుండునప్పు డుపసర్గకు దీర్ఘము బహుళముగా విధిం పఁబడినది(*). ఇది ఘఞంతము కాదు. ఇఁక బహుళగ్రహణముచే నెట్లో సాధింత మనవలయును. అది స్వరస మనిపించదు. బహుళగ్రహణమున కిట్టి ప్రయోజనము పాణినీయము వచింపలేదు. వేఱుప్రయోజనమును వచించినది.

౨. సురపట్టణాధ్వాంతరోధి (1-76)→ అయోధ్యాపత్తనమునందలిసౌధయూ థౌన్నత్యము వర్ణింపఁబడు చున్నది—

---

*. ఉపసర్గస్య ఘఞ్యమనుష్యే బహులమ్(6-3-122).

సీ. గీ. తనరు, వనరుహనాభనూతనరుచిర్రప
చండపురనీలజాలక సౌధయూధ
కాంతిసంతాన మంతరధ్వాంతరోహ
వీథి సురపట్టణాధ్వాంతరోధి యగుచు. (1-73)

ఇట నధస్సూచికలో "పట్టన(?) ఇది అకారాంతము కదా!" అనినారు సంపాదకులు. పట్టనశబ్ద మకరాంత మనుట నిజమే! ఇక్కడను అకారాంతముగానే ప్రయోగింపఁబడినది. అయితే సంపాదకులు "సురపట్టణా + ధ్వాంతరోధి" అని పదచ్ఛేదము చేసికొనుటవలననే వారి కిట సంశయము కలిగినది. కాని, యీపదవిభాగమువలన నర్థహాని వాటిలి కవిహృదయము మఱుఁగుపడెడి ప్రమాదము కలదు. "సురపట్టణ + అధ్వ + అంత–రోధి" అని యిచటిపదచ్ఛేదము.

అంతర=(భూమ్యాకాశముల)మధ్యమునం దయిన, ధ్వాంతరోహ=తమోంకురములయొక్క, వీథి=పరంపరలతో కూడిన[వీథి=సమూహము (పంక్తి; పరంపర) 'వీథీ పంక్తౌ గృహాంగే చ రూపకాంతరవర్త్మనోః' అని మేదిని], సురపట్టణ=అమరావతియొక్క, అధ్వ + అంత=మార్గమును('అంత' శబ్దము స్వరూపార్థకము. రోధి=అడ్డుపెట్టు చున్నది. యగుచు చేదివ్వె సంతరించునట్లుగాను.........కాణాచిగా రమించునట్లుగాను తనరు నని యన్వయము. పరిశీలింపఁగా సంపాదకు లభిప్రాయపడినట్లు పట్టణశబ్దముమీఁదిది 'ధ్వాంత' శబ్దము కాక, 'అధ్వాంత'శబ్దముగా నున్నది.

3. తరుణేత్యుధనుష్క–తురుష్క–మాళి(4-5)→ఇటనధోజ్ఞాపికలో "ధానుష్క ?" అని యుంచినారు సంపాదకులు. అనఁగా నిచటి 'ధనుష్క' శబ్దము 'ధానుష్క' కావలదా? అని సంపాదకులసంప్రశ్నము. ధానుష్క–శబ్దము నీవిధముగా రూపొందింపవలయును–ధనుః ప్రహరణం అస్య(ధనుస్సు ప్రహరణసాధనముగా కలవాఁడు) అని విగ్రహము. ప్రహరణమ్(4-4-57) అనుసూత్రముచే ఠక్ ప్రత్యయము వచ్చి 'ధానుష్క' యగును. ధన్వీ ధనుష్మాన్ ధానుష్కో నిషంగ్యస్త్రీ ధనుర్ధరః–అని యమరము. ఇట్లు కాలే దేమి? యని సంపాదకుల సందేహము. కాని, చిననారాయణ ప్రయోగించినరూపమును క్రిందివిధముగా సాధింపవలయును–

ఇషుః ధనుః యస్య సః—అని విగ్రహము. సంజ్ఞావాచకమిది. మన్మథుం డనియీశబ్దమున కర్థము. ఇది బహువ్రీహిసమాసము. సంజ్ఞావాచకములకు వాసంజ్ఞాయామ్ (5-4-133) అని అనఙ్ఞాదేశము వికల్పము. అనఙ్ఞాదేశము రాని పక్షమున శేషాద్విభాషా (5-1-154) అనుసూత్రముచే 'కప్' ప్రత్యయవికల్పము. కప్ ప్రత్యయము వచ్చినపుడు 'ఇషుధనుష్కః' అని యగును. కప్ రానియపుడు ఇషుధనుః అని యగును. ఇట్లు ఇషుధన్వా, ఇషుధనుష్కః, ఇషుధనుః అను మూఁడురూపములను సాధువులే! ఇషుధనుష్కః—అనెడియీరూపము కవికిఁ గలవ్యాకరణపాండిత్యమును విశదపఱచును. ప్రశ్నార్థకచిహ్నముతో చిహ్నింప వలసినఆవశ్యకత యిం దే మున్నదో తెలియదు.

ర. నారి (4-15)→ చంద్రోదయము శ్లేషభాసురముగ వర్ణింపఁబడు చున్నది—

సీ. రహిఁ బాదమహిమచే ఱాతి నారి నొనర్ప
నభవోగ్రధర్మ మొప్పారఁజేయ

గీ. తూర్పుదెస రామచంద్రుఁడు తోఁచె నపుడు (4-15)

'ఱాతి నారి నొనర్ప' అనునది 'రాతి నాతి నొనర్ప' అని కావలదా? అని సంపాదకులసందియముగా వర్ణోజ్ఞాపిక సూచించు చున్నది. కాని, పైపారమే సాధువు. సంపాదకులపాఠమువలన నాతియనఁగా స్త్రీ యని రామునిపక్షమున కుదురును గాని, చంద్రునిపక్షమున నర్థము చెప్పు టెట్లు? అని ప్రతిప్రశ్నము వేసినచో ప్రత్యుత్తరము శూన్యము. కనుక పైపాఠముప్రకారము నారి యనఁగా రామునిపక్షమున స్త్రీ(అహల్య) అనియు, చంద్రునిపక్షమున నీఱు కలిగిన దనియు నర్థము చెప్పవలయును. నారము అనఁగా జలములు. నారములు కలిగి నది నారి[నారా స న్తీతి నారిన్(*)]. చంద్రోదయమున ఱాయి(చంద్రశిల) చెమరించుట యిట చెప్పఁబడినది. కనుక సంపాదకులసవరింపు నంగీకరించిన యెడల పాణినీయపాండితీస్ఫోరక మయినకవిప్రయోగరత్నము మాసిపోవు ప్రమాద మున్నది.

---

*. అత ఇని ఠనౌ(5-2-115).

౫. చే యెచ్చువలెను (4-80)→ మదాలసాయుతధ్వజులకల్యాణఘట్టమును పౌరకాంత లూహించి వచించుకొను చున్నసందర్భము—

సీ. చెలికత్తె చే యెచ్చువలె నన్న సిగ్గుతోఁ
దలఁబ్రాలు వోయుబి త్తరముఁ జూచి　　(4-80)

ఇట చే యెచ్చువలె ననుదానికి చే యెత్తవలె నని కదా! అన వలసినది— అని సంపాదకులసందియ మయినట్లు అధోజ్ఞాపిక తెలుపు చున్నది. కాని పైపాఠమే సందర్భశుద్ధి గలది. [చే(యి) + ఎచ్చు=చేయెచ్చు] చెలికత్తె మదాలసప్రక్కనుండి రాజును మించునట్లుగా తలఁబ్రాలు పోయవలయు నని ఉసికొల్పుటకు 'చేయెచ్చువలె' నని మదాలసతో ననుట యిచటి సందర్భము. పెండ్లిండ్లకడ తలంబ్రాలఘట్టములో నీయుసికొల్పు లెల్ల రేఁగిఱేఁగినవే! కవి 'జాతివార్తాకవిజనామోదసంధాయకుఁడు' గనుక ఈచమత్కారము నిట బిగించినాఁడు. చేయెచ్చు—అనునది మనవలుకుబడి కూడ. ఈవిశేషము లన్నియు చేయెత్తు మనుటలో రావు.

౬. పలుకనియ్యఁడు (4-183)→ తారకు జయంతుఁడు విధించినయాంక్షలు—

సీ. పలుకనియ్యఁడు కమ్మవలపు పెచ్చున నాన
వములు దెచ్చినయింద్రవనితతోడ　　(4-183)

ఇట 'పలుకనియ్యఁడు' అనునది వ్యాకరణరీత్యా పలుకనీఁడు (1) అని కావలదా? అని సంపాదకులసందేహము. నిజమే! కాని, యీకావ్యనిర్మాత వ్యాకృతి నతిక్రమించినప్రయోగములు చేయుటలో వెనుకాడఁ డని నవమదశము నందు ప్రదర్శింపఁబడినప్రయోగములలో నికొన్నింటినిబట్టి తెలియు చున్నది. అందీప్రయోగ మాదరణీయ మనియు సూచింపఁబడినది. కనుక వ్యాకరణనియమముతో దీని నధిక్షేపింపవలసినపని లేదు. నాయకరాజులకవులలో నిట్టిప్రయోగములు కోకొల్లలు.

1. ఇచ్చునకు సర్వంబున కీ యగు-బాల. క్రియా. 92.

ఉదా:- కం. ఇయ్యాఁగ నిష్పించఁగల
యయ్యాలకే కాని మీాస మాఁదటి కేలా?
రొయ్యకు లేదా బారెఁడు
కయ్యమునకుఁ గుందవరపు కవి చౌడప్పా!(1)

౭. దాశాధినాథుఁడు (4-214) → నలకూబరునియమరావతీ ప్రయాణము నందలిది—

సీ. దాశాధినాదు(?)ఁ డందలము మూఁదర నిల్పి
తమిసపొత్తులతోడ నండ మొసఁగ (4-214)

అర్థము స్ఫురింపనికతమున నిట ప్రశ్నార్థక ముంపఁబడినది. అంతే కాక అధోజ్ఞాపికలో "ధాత్రధినాథ(ధాతృ+అధినాథ) కావచ్చు నేమో! (పదాతివర్గమునకు సంబంధించినరక్షకభటాధికారి?)" అను లఘుచర్చ చేయఁబడెను. ఇది 'దాశాధినాథుఁడు' కాని సంపాదకు లనుకొనినట్లు ధాత్రధినాథుఁడు కాదు. పదాతి వర్గమునకు సంబంధించినరక్షకభటాధికారి అంతకన్నను కాదు. దాశుఁ డనఁగా బెస్తవాఁడు(2). దాశాధినాథుఁ డనఁగా బెస్తలరాజు(బెస్తలనాయకుఁడు). కావున నిట మందవలసినది "దాశాధినాథుఁ డందలము........"ఇత్యాది. బెస్తలు పల్లకీలు మోయుదురు. అతఁడు అందలము తెచ్చి ముందఱ నిల్పి పొత్తులతోనే(పల్లకీలు మోయునప్పుడు బుజములపై నుంచుకొనుగుడ్డపొత్తికలతోనే) దండము పెట్టినాఁ డని యిచటిభావము. 'తమిస' అనునది 'తమిన' అని యుండవలయును. తొందరతో నని యర్థము. తొందరలో పొత్తులు చేతులయం దుంచుకొనియే నమస్కరించె ననుట. ఈయవధారణార్థకము(తమిని+అ) తోడకు తరువాత నున్నచో గజిబిజి లే కుండును.

౮. చౌకమ్మ గానివింత(5-35)→ నలకూబరునిపై మనసుపడినతార జయంతునిపడకపై చేయుచేష్టలు వర్ణింపఁబడు చున్నవి—

---

1. కవిచౌడప్పశతకము-18.

2. కైవర్తో ధీవరో దాశః-అని విశ్వము. "లుబ్ధకధీవరపిశునాః" అని భర్తృహరి (నీతి.దుర్జన.51).

సీ. వ్రేఁకటియలుక కల్పించి మంచముకోడుఁ
గౌఁగిలించు చొకమ్మ గానివింత (5-35)

అధస్సూచికలో "గౌఁగిలించుసుకము గానివింత (?)" అని వ్రాయఁబడి నది. పైదానికన్న నిది రమణీయ మని పీఠికలంప్ష కాఁబోలు! చొక్కమనఁగా ఒప్పిదము. చొక్కమునకు రూపాంతరము చొకము. ఒప్పిదము దప్పి (రతి కనుకూలింపక) మంచముకోడును కౌఁగిలించిన దని యర్థము. ఇదే సందర్భాను కూలము. సూర్యరాయాంధ్రనిఘంటువు కూడ చొకము అనుపదమునకు ఈకువల యాశ్వప్రయోగమునే యిచ్చి స్పష్టముగా 'చొకమ్మ గానివింత'మ చూపు చున్నది*.

ఇవి ప్రధానము లయినసందియములుగా నెంచి తోఁచినసమాధానము లీఁ బడినవి. సమర్థము లయినపాఠములుగా చేర్పఁబడినవి, మార్పులు లేకుండ సమ ర్థింపఁబడినవి ఎంతవఱకు రమణీయార్థప్రతిపాదకములో పెద్దలు నిర్ణయింతురు గాక!

"సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణప్రవృత్తః"

—కాళిదాసు.



* సీ. వ్రేఁకనియలుక కల్పించి మంచముకోడు గౌఁగిలించుచొకమ్మ గాని వింత. కువల. 5-35" అని సూ.ని. 'వ్రేఁకటి' అని పైయకాడమీ ప్రతిపాఠము.

# చతుర్దశదళము

# ప్రమాదపరిశీలనము

"ప్రమాదో ధీమతా మపి" అని ఆర్యు లనిరి. ధీమంతులకు కూడ ప్రమాదము తప్ప దని యర్థము. అయినప్పుడు సామాన్యులసంగతి చెప్పవల యునా? కావ్యనిర్మాణములో కూడ పొరపాటునకు గుఱి కానికవి కానరా(దనవచ్చును. ఈకువలయాశ్వమున నటనట కొన్ని ఛందఃప్రమాదములు కన(బడు చున్నవి. వీనియందు కవికృతము లెన్నియో, ఊహ తెలియనిలేఖకాదులు చేసిన వెన్నియో చెప్పట కష్టము. వీనిని ప్రదర్శించుటకు ముందు ముం దున్నమహా కవులఛందః ప్రమాదములు కొన్ని ప్రదర్శింప(బడు చున్న విచట—

శ్లో॥ తదన్వయే శుద్ధిమతిప్రసూతః శుద్ధిమ త్తరః ।
దిలీప ఇతి రాజేన్దు రిన్దుః క్షీరనిధా వివ॥ (1)

ఈశ్లోక మనుష్టుప్ఛందమునకు చెందినది. అనుష్టుప్పునకు "నాల్గుపాదము లందును అయిదవయక్షరము లఘువుగాను, రెండునాలుగు పాదములయం దేడవ యక్షరము లఘువుగాను, నాలుగుపాదములయందును ఆఱవయక్షరము గురువు గాను ఉండుట" లక్షణము(2).

పైకాళిదాసుశ్లోకమున ప్రథమపాదమున ఛందోభంగదోషము దొరలినది. "శుద్ధిమతి" యనుచోట పంచమాక్షరమయిన 'శు' గురు వగుట, షష్ఠాక్షర మయిన 'ద్ధి' లఘు వగుటయు లక్షణవిరుద్ధము. వ్యాఖ్యాతృచూడామణి మల్లి నాథు( డీదోషమును స్పృశింపనే లేదు. ఇ(క తిక్కనపద్యము—

---

1. రఘువంశము. 1-12.

2. శ్లో॥ పంచమం లఘు సర్వత్ర, సప్తమం ద్విచతుర్థయోః।
షష్ఠం గురు విజానీయా, దేతత్ పద్యస్య లక్షణమ్॥—శ్రుతబోధము—11.

చ. అజునియనుగ్రహంబున విహంగమవల్లభుఁ డట్లు చాల న
క్కజ మగుశౌర్యసంపద ప్రకాశతఁ బొందఁగఁ గేలి సల్పి యిం
ద్రజయమహోత్సవంబున సుహృత్తయశఃపరిపూరితంబు లై
త్రిజగములున్ వెలుంగ వెసఁ దెచ్చె సుధారసపూర్ణ
భాండమున్ (1).

ఇందు తృతీయపాదమున యతిభంగము కన్పడు చున్నది. ఇది ముద్రారాక్షస మనిపించు చున్నది. ఇచట 'సుదాత్తయశఃపరిపూరితంబు లై' అనునది తిక్కనగారిపాఠ మై యుండును. ప్రత్యంతరమును పరికింప వలయును. మఱియొక పద్యము-

క. అని మఱియుఁ బెక్కు పేర్లన్
వినుతించుచు శరణువేఁడి వినతశిరస్కుం
డును ముకుళీకృతహస్తుం
డును నై యే నుండ దేవుఁ డతిశయకరుణన్ (2).

ఇందును నాలవపాదమున యతిభంగము తోఁచు చున్నది. ప్రసిద్ధసంస్థా ముద్రణమును పరిశీలింపవలయును. పైపద్యములు రవీంద్ర పబ్లిషింగ్ హౌస్ (హైదరాబాదు) ప్రతిలోనివి. వసుచరిత్రమునుండి యొకటి-

మ. అమరుం దత్పురిచెంతఁ గాంతకనకాబ్జాలంబరోలంబశు
క్తిమతీవాహిని సారసారణులు తత్కేదారకోదారస
స్యము ముక్కారును బండఁజేయ దివివారల్ వీటిసత్రాన్నభా
గము లాసింపఁగఁ దత్పురాలయనదీఖ్యాతిన్ విడంబించుచున్ (3).

1. ఆనుశాసనికపర్వము, 1-260.

2. ఆనుశాసనికపర్వము, 1-374.

3. వసుచరిత్రము, 1-110.

మూఁడవపాదమున యతి తప్పినది. ఇట్టి వింకను వసుచరిత్రమున కలవు. మఱొక్కటి దూబగుంట నారాయణునిది-

సీ. ఒదుగక పగఱపై నుఱికి చంపుట యొండె
రణమున వారిచేఁ జచ్చు టొండె (1)

ఉత్తరార్ధమున యతిభంగము. 'సమరాన వారిచేఁ జచ్చు టొండె' అని వచో డొనఁగు సవరింపఁబడిన ట్లుండును గాని, అన్ని యక్షరములు మార్చుట సాహస మవవలయును. ఇవి యన్నియు ప్రథమాశ్వాసములనుండియే చూపఁ బడుట గమనింపఁ దగును. ఇ ట్లుదాహరించుచుఁ బోయినచో లెక్కకు మిక్కిలిగా నిట్టి ప్రమాదములు వెల్లడి యగును.

మహాకవి కాళిదాసు హిమవద్వర్ణనము సేయుచు 'ఏకో హి దోషో గుణ సన్నిపాతే, నిమజ్జ తీన్దోః కిరణే ష్వివాఙ్కః' అనెను (2). దీని నాతనికావ్యము లకు కూడ నన్వయపఱచి 'బహుగుణవిలసిత కావ్యమునం దొకానొకదొసఁగు దొరలినప్పటికి నయ్యది కావ్యరామణీయకమును కా దనఁజాల దని విమర్శకు లందురు. నిజమే! కాని, దీనిని మఱికొంత సడలించి విపులార్థఘటిత మొనర్ప వలయును. అనఁగా సకలగుణసంభరిత మయిన కావ్యమున ఒకదోష మున్నను అనక, కొన్ని చిన్ని చిన్ని లోపములు దాపరించినను కావ్యత్వమునకు భంగము వాటిల్ల దని చెప్ప నొప్పు. లాక్షణికమహాకవి దండ్యాచార్యులవారు కృతియందు కించిద్దోషము కూడ నుండరా దని శాసించుట అతిదారుణమే! (3). దోషస్పర్శ లేనికావ్యము లేనే లే దాయె. అందుకనే కనుపర్తి అబ్బయామాత్యుఁ డిట్లు విన్నవించుకొన్నాఁడు-

1. పంచతంత్రము, 1-241.

2. కుమారసంభవము, 1-3.

3. కావ్యాదర్శనము, 1-7.

తే॥ కాళిదాసాదులకు నైనఁ గలవు తప్పు
లనిరి పెద్దలు, మాదృశు లనఁగ నెంత ?
తప్పు గలిగిన దిద్దుఁడీ ! యొప్పు గాను
బాలునకు బుద్ధి నేర్పినభంగిఁ గవులు. (1)

ఒకలక్షణగ్రంథము దోషముల నిట్లు చూపు చున్నది - పదదోషములు పదునేడు(2). వాక్యదోషము లిరువదినాలుగు(3). అర్థదోషములు పదునెనిమిది(4), రసదోషములు పండ్రెండు(5) - మొత్తము డెబ్బదియొక్క దోషములు. ఇన్నిదోషము లున్నపు డేదో యొకటి కావ్యతనువును తాఁక కుండునా? ఈ దోసఁగులపట్టిక నెదురుగా పెట్టికొని విమర్శింపఁబూనినచో సర్వాంగసుందర మయినకావ్యమే కన్పడదు. రసభంగమును కలిగింపనిది దోషము కాదు. రసభంగమును కలిగించునది అనౌచిత్యము కాని వేఱు కాదు(6). అది కలుగనంత వఱకు కావ్యకన్య కంగారుపడవలసినపని లేదు. రసవిషయము రసప్రకరణము ననే చర్చింపఁబడెను గదా! ఇఁక నీకువలయాశ్వమందలి చిఱుదోసఁగులు చూపఁబడు చున్నవి-

మ. అల తిమ్మాధిపునారసేంద్రుఁడు దయాధారుండు నన్నుం జయో
జ్జ్వలుఁ గృష్ణాధిపుపుత్రు వేంకటపతిక్ష్మాకాంతచంద్రుం గుమా
రులుగాఁ గైకొని ప్రోచెఁ గాన నతఁడే రూపింపఁగాఁ దల్లిదం
డ్రులు దైవంబును నయ్యె నిద్దఱకు నెందున్ సందియం
జేటికిన్ (1-58)

---

1. అనిరుద్ధచరిత్రము, అవతారిక-10.
2. ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము, పుట 348.
3. ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము, పుట 363.
4. ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము, పుట 380.
5. ఆంధ్రప్రతాపరుద్రయశోభూషణము, పుట 388-389.
6. అనౌచిత్యా దృతే నాన్య ద్రసభఙ్గస్య కారణమ్- అని ఆనందవర్ధనాచార్యులు (కావ్యాలంకారసంగ్రహము, పుట 103)

ఇది మత్తేభవిక్రీడితము గదా ! దీనికి 14వ యక్షరము గదా ! యతి స్థానము. కాని, తొలిపాదమున 13వ యక్షరముతో యతిమైత్రి చేయఁబడినది.

సీ॥గీ॥ అనుచు గుమిగూడి మృగి నొక్కయలరుఁదోఁటఁ
బూవుఁబొదరింటఁ దార్చి యింపులు జనింప
నున్నతటి మాయ గైకొని యుట్టె పడిన
సరణిఁ జెట్టునఁ దెగిపడ్డకరణి వాఁడు. (2-23)

మూఁడవపాదమున యతి తప్పిపోయినది. '......మాయ గైకొని యుట్టె(ట్టి) పడినసరణి' నని సవరింపఁదగు నేమో ! 'ఉట్టి తెగిపడ్డట్లు' 'ఉట్టి పడ్డట్లు' అని వ్యవహారము. గీ. ఉట్టి పడ్డట్లు యోగిని యొద్దు వచ్చి, లీల నారాజశేఖరుఁమ్రోల నిలిచి - అని మాదయ గారిమల్లన్న.*

సీ. ఇంటి కావలికి న న్నిచట నిల్పరు గదా !
యని వేల్పులకు మ్రొక్కి వేఁడువారుఁ (2-125)

ఉత్తరార్ధమున యతిభంగ మయినది. కాని, యిచట 'మ్రొక్కఁ జనెడు వారు' అనుపాఠాంతరము అధోజ్ఞాపికలో కలదు. ఈ పాఠాంతరమువలన ప్రాసయతి చక్కఁగా నమరఁగలదు. ఇట్లు సాధుపాఠముల నధస్సూచికలకు చేర్చి, అసాధుపాఠములను మీఁదికి చేర్చుట సంపాదకుల ప్రమాదము.

తే. ఆర్తిఁ దీర్పంగఁ గొందఱు చారవరులు
వచ్చి నతి సల్పి, కువలయాశ్వక్షితీంద్రు
చేత నైనట్టిపాతాళకేతుపాటు
తోఁపఁ దెల్పినఁ దాళకేతుండు కసలి. (4-73)

ప్రథమపాదమున యతిభంగము. కాని, యిట 'ఆరితి ఘటిల్ల' అను పాఠాంతరము గలదు. దీనివలన ప్రాసయతి కుదురును. అర్థమునకు కూడ నిదియే తగినది. కనుక నిదియు పైయట్లే సంపాదకులపొరపాటు.

---

* రాజశేఖరచరిత్రము, 2-94.

తే. ఇది మదాలస యగునేని యిచటి కెట్టు
లరుగుదెంచెనో ? దీని ప్రాణంబు లైన
యల్ల కుండలయిప్పు డేమయ్యె నొక్కొ
వీరి కెడఁబాయ వలసెనో విధికృతమున. (4-160)

ద్వితీయపాదమున యతి పోయినది. యతిస్థానమునకు ముందటియక్షరముతో (ప్రాణ=ప్ర+అన) యతి ఘటింపబడినది. పరిశీలింపఁగా నిది లేఖకాడుల ప్రమాద మనిపించు చున్నది. ఏల యనఁగా నర్థగతినిబట్టి యిచటి ప్రాణంబులైన అనుబహువచనము సరి కాదు. 'ప్రాణ మైన' అనునేకవచనము సరియైనది. ఏకవచనమే కవి ప్రయోగించి యుండును. అప్పుడు ప్రాదియతి (ప్ర + అన) పట్టును. అయితే, యతిస్థానమునకు ముంగల గణభంగ మేర్పడును కనుక నిచట కవికృతపదస్వరూపములను కనిపట్టి కూర్పవలసి యున్నది. అర్థగతినిబట్టి కవి యిచట నిట్లు వ్రాసియుండు ననిపించు చున్నది—

తే. ఇది మదాలస యగునేని యిచటి కెట్టు
లరుగుదెంచెనో ? మఱి దీని ప్రాణ మైన
యల్ల కుండల యిప్పు డే మయ్యె నొక్కొ ?
వీరి కెడఁబాయ వలసెనో విధికృతమున – అని. పెద్దలు గాక !

సీ॥ ... ...వారిలో నెంచఁగఁ దారఁ గానె ?
యిటు నిల్వ నెవ్వతె వైన నేమిభయంబు ?
నిలువఁ దీరదు పోవలయు మాకు (4-167)

క్రీగీటులకడ యతి చెడినది. ఇది యచ్చుత ప్పనుకొన నగును. కనుక 'యటు నిల్వ నెవ్వతె వైన నేమిభయంబు' అనునది సవరింపు. సందర్భమును బట్టియు నిదే సంగతము. లోపలకు రానున్నతారను నిలువరించుచు కావలికత్తె యను చున్నమాట లివి.

తే. ఎదురుగా నేఁగి చూానె కా! యచట నిలిచి
యెంతవింత నటించితి విందువదన ! (4-171)

త్రిగట్లకథ యతి నిలువ కున్నది. పైయన్నే లేఖకాదుల ప్రమాద మిది. 'యిచట నిలిచి' అనుసవరింప సందర్భసంగతము. దగ్గరకు వచ్చినమదాలస తారతో నను చున్నమాట లివి. తార నిలిచినచోటికే వచ్చినమదాలస 'ఇచట నిలిచి యెంతవింత నటించితివే !' అనును గాని 'అచట నిలిచి యెంతవింత నటించితివే !' అనదు గదా !

కం. అని వినిపించి కుబేరుని
గని, చెంద్రికమీఁద వ్రాసి, యందు సికా వే
సినకమ్మ గద్దెచేరువ
నునిచినఁ జూచుకొని చుట్టి యున్మ్ముఖుఁ డగుచున్. (4-205)

పూర్వార్ధమున యతి పోయినది-ఇట కవి వ్రాఁతను కనిపట్టినచో యతియు, కవిమతియు, సందర్భగతియు నవగతము లగును. ఇచట కవి-

కం. అని వినిపించి కుబేరుని
కని చెంద్రికమీఁద వ్రాసి యందు సికా వే
సినకమ్మ గద్దెచేరువ
నునిచినఁ జూచుకొని చుట్టి యున్మ్ముఖుఁ డగుచున్

అని రచించి యుండును. ఇదియే సందర్భశుద్ధి గలది. ఎట్లనఁగా - ఇంద్రునిదూతుఁడు కుబేరునికడకు వచ్చి (204వ పద్యములో కొన్ని) మాటలు పలికిన తరువాత తెచ్చిన జాబును ఇచ్చెను. మరల 'కుబేరుని గని' అనుట అసంగతము గదా ఇట 'కుబేరునికిన్ + అని = కుబేరుని కని' అని కవి వ్రాఁత. అనగా కుబేరునికోస మని (కుబేరుఁడు గారికి - అనుట) చెంద్రిక మీఁద వ్రాసి— ఇత్యాదిగా నర్థాన్వయము. అనఁగా 'కుబేరునకు' అని విలాసము (అడ్రెస్సు) వ్రాసి దానిమీఁద సికా (సీలు) వేయఁబడినది. 'అని' అనున దిచట ఉద్దేశార్థమునందు ప్రయుక్తము. తెలుఁగునాట విశేషప్రచారము గలవాడుక

యిది. 'సాంబశివరావు కని వ్రాసి పంపించాను' ఇత్యాదులు వ్యవహారములు. పై సందర్భమున కమ్మలు, వానిమీఁద వేయుసీళ్లు, గద్దెచేరువ నుంచుటలు నాయకరాజులనాఁటియాచారవిశేషములకు దర్పణములు. సందర్భమును గమనింపక 'కుబేరుని' అనుదానిని ద్వితీయాంతముగా భ్రమపడి 'క' వర్ణమును 'గ' వర్ణముగా మార్చినా రూహతెలియనివారు. ఒక్కయక్షరమును పరుషమును సరళముగా మార్చుటవలన సంధి చెడుటయే కాక, యతిగతి తప్పుటయే కాక, కవిహృదయము కూడ బ్రద్దలు చేయఁబడినది. పైనవరింపే కవిహృదయము నావిష్కరింపఁగలది. మఱియు నిచట 'సికా నేసినకమ్మ' అని ముద్రింపఁబడినది. ఇదియు 'సికా వేసినకమ్మ' అని పరిష్కరింపఁబడిన దని మనవి.

ఉ. నంటున నొక్కవేళ సురనాథకుమారునిఁ దోడికొంచు మా
యింటికి వచ్చి, సిగ్గువడి యేఁ జన నానలు వెట్టి పిల్చి క్రీఁ
గంటనె నన్నుఁ జూచి యరుగుం గద! యేమిటికో! యతండు చొ
క్కంటఁగ మోవి నొక్కికొని యాదల యూచు నొయార
మేర్పడన్ (5_11)

తృతీయపదమున యతి కుదుర కున్నది. 'అరుగం దగ వేమిటికో' అని యిచటికవికూర్పు - అని యనిపించు చున్నది. అర్థావబోధమునకుఁ గూడ నిదియే అనుకూలముగ నున్నది.

ఉ. ఒక్కటి రంభ యే మను నొకో! యని లోఁగుట,
యంతె కాక నా
కెక్కడియాజ్ఞ? యాసరసిజేక్షణకైనఁ బ నేమిః? యెమ్మెకాఁ
డొక్కతె పొమ్మగా నిలుచునే? యది యేలికసానియే? యిదే?
మక్కట! యైన దానినిలయంబున నుండఁగ
హత్తుకొంటినో? (5-20)

తృతీయపాదమున చెడినయతికి 'నిలుచునో' అనునది సవరింపు.

సీ. రాజతాచలరాజ రాజహంసవిరాజి
తం బగుతనుకాంతి యోజ మెఱయఁ (5_40)

ఉత్తరార్ధమున యతి తొలఁగినది. అనుప్రాసభాసురముగా నున్నయీ పాదము మార్పు వీలు గానిదిగా నున్నది. కవి యిట్లే వ్రాసి యున్నచో నీ ప్రమాదము కవిదే యగును. కాని, యిచట చిననారాయణ 'రాజతాచలరాజరాజ హంసతనువి. రాజితం బగుకాంతి యోజ మెఱయ' నని వ్రాసినాఁ డేమో ! అనిపించు చున్నది నారదవర్ణనాసందర్భమునందలి దీపద్యము. అనుప్రాసము నకుఁ గాని, అర్థసంగతికిఁ గాని యిబ్బంది లేవిమార్పిది.

సీ.గీ. ఓర్వ కిద్దఱు తమలోన నెవని కొక్కొ-
యీచెలి? యటంచు మదిలోన హెచ్చరించి (5_58)

ఇచట సవరించుట కష్టమేమీ కాదు గాని, పదములకూర్పు చెడిపోవు నవిపించు చున్నది. పై పాఠము కవిదే యనిపించు చున్నది. ఇట్టిదే-

చ. ప్రకటగుణాంక! యోపురుషసింహము! నీమహనీయ
మూర్తి మా ... (3_60)

అనునది కూడ. 'పురుషరత్నమ !' అనవచ్చును గాని, పదస్వరూప మంతయు మాఱిపోవు చున్నది. ఇది కూడ కవియేమఱిపాటుగా తలంప నగును.

ప్రధానప్రమాదములు ప్రథమదళముననే ప్రస్ఫుటపఱపఁబడినవి. వ్యాక రణాతిక్రమణములు ప్రయోగవిశేషములుగా తద్దళమున సమర్థింపఁబడినవి, కేవల మిట ఛందస్ఖాలిత్యములు మాత్రము చర్చింపఁబడినవి,

"అపి మాషం మషం కుర్యా చ్ఛందోభంగం న కారయేత్"
(మాషమును మష మైనను చేయవచ్చును గాని ఛందోభంగము మాత్రము చేయరాదు) అని పెద్దలవక్కాణ. అందుకనియే విరురి వేదాద్రి (విరూరి వేదాద్రి) గొబ్బురి తిమ్మభూవిభుఁడు (గొబ్బూరి), కోనెటి (కోనేటి) చిన్నతిమ్మ - ఇత్యాదిగా నామవాచకములను కూడ హ్రస్వములు చేసి ఛందోబద్ధము కావించి నారు కవులు. పరిశీలింపఁగా మహాకవులకే యిట్టి ప్రమాదములు తప్పలే దని

కావ్యజాలము చాటు చున్నది. చమత్కారావహము లయినకృతులయం దిట్టి పొసఁగు లుపేక్షింపఁదగినవే కాని అపహసింపఁదగినవి కావు. కవిలాక్షణికుఁ డయినగణపవరపు వేంకటకవి యిట్లను చున్నాఁడు.

తే॥ తప్పు లని తోఁచునవి యెల్ల నొప్పు లగును
మధుమధురమత్కవిత్వచమత్కృతిఁ గన,
రీతి రీతిగఁ గన్పట్టు జాతికనక
మొరయఁ బదియాఱువన్నె యై యున్నయట్లు. *

రసభంజకములు కానియిట్టిఛందోదోషములపట్ల పట్టువిడుపులతో ప్రవర్తించుట విమర్శకుల లక్షణములయం దొక్కటి.

తే॥ గీ॥ తప్పు గలిగినచోటనే యొప్పుఁ గలుగు
సరసకవితావశోక్తులసరణియందుఁ
గప్పు గలిగిననీహారకరునియందు
నమృతధారాప్రవాహంబు లడరుఁ గాదె!

— శ్రీ తెనాలి రామకృష్ణుఁడు



* ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము - 20.

# పంచదశ దళము

# కవికాల సాంఘికాచారములు

భారతీయ సంప్రదాయమునకు శిరోభూషణము లనఁదగినవేదములలోనే ప్రపూర్వకాలసాంఘికరీతులు తోఁచు చున్నవి. ఇఁక మనపురాణము లలనాఁటి సమాజసమాచారముల నన్నింటిని భద్రపఱచినఖజానాలు. అట్టిపరిస్థితులలో కావ్యాదులయందు సామాజికవాతావరణము ప్రతిఫలించుటలో నబ్బుర మేమి ? లోకవృత్తమునకు ముకురప్రాయము లైనకావ్యములలో కవికాలసాంఘికాచారములు తప్పక గోచరించును. ఈప్రబంధకర్త పౌరాణికవృత్తమునందు చారిత్రికాచారములు పీ లయినచోట నిబంధించి రచించినాఁడు. అవి యిట దిఙ్మాత్రముగ నమబంధింపఁబడు చున్నవి.

తిప్పనరపాలునిచేత నిహతు లయినతురుష్కులు స్వర్గమునకుఁ బోయి దంతు విడిసి, తమవేషముతో వచ్చిననే కాని యింద్రునితో మాటాడ మనుచు మంత్రితో కబురు చేయుదు రఁట ! ఈయతిశయోక్త్యలంకారమునందు భంగ్యంతరముగ తిప్పభూపాలుని ప్రతాపముతోపాటు, నాఁటితురుష్కులు హైందవులను వేధించినవిధములు గూడ మాహింప పీ లగు చున్నది. ఆపద్దియ మిది—

సీ. నలుపుఁగస్తురిగీఱునామంబుఁ దుడిచి యే
తెంచినఁ గాని సంధింప మనుచు,
నిడుదముత్తెపుటొంట్లు సడలించుకొని చెవు
లూడ్వవైచినఁ గాని చూడ మనుచుఁ,
గమనీయమణికిరీటము డించి పైఠాణి
పాగ చుట్టినఁ గాని పలుక మనుచు,
దంభోళి విడిచి క్రొందళుకుసింగిణివిండ్లు
చేకొన్నఁ గాని హర్షింప మనుచు,

గీ. జిష్ణుతో మాట లాడ హేజీబు ననుతు
కార! తిప్పనృపాలబాహాసినిహతు
లైనయలహిందుఖానసేనాధిపతులు
నిండి సురపట్టనముచెంత దండువిడిసి. (1-33)

నాఁడు పిఱికిబంటులు ఎటువంటివంకలు చూపి కదనకార్యములనుండి తప్పించుకొందురో క్రిందిపద్యమునందు రాక్షసభీరువుల నడ్డు పెట్టుకొని చిననారాయణ చెప్పుచున్నాఁడు—

సీ. పసవాళ్లగమికిఁ జే పుడికి దబ్బఱనొప్పి
పై కైచుకొని మూలఁ బడినవారు,
నిండ్లలోసన యుండి యెటు వోయిరో కాన
మనిపించి కనిపించ కడఁగువారు,
నింటికావలికి న న్నిచట నిల్పరు గదా!
యని వేల్పులకు మ్రొక్కఁ జనెడువారుఁ,
దొలునాఁడె నృపునివార్తలు విని యొకలేని
పనిఁ బూని యెందెందొ చనెడువారు,

గీ. గ్రాసములు చెల్లలే దని గాసి చేసి
కొలువుజీవితముల కొప్పుకొననివారు
నగుచుఁ గోఁచపిశాచముల్ దిగులుపడఁగఁ
దక్కురక్కసిదొరలు ముందఱను నిల్వ. (2-125)

తననాఁటి దాడులలో నుపయోగించు తుపాకీలను దనుజవీరుల కిచ్చి రణరంగమునకు రప్పించినాఁడు చిననారాయణుఁడు.

కం. దనుజులతుపాకిగుండు
ల్గనఁబడు డాబాలపలకలం దాఁకి బిఱ్ఱ
లునఁ దిరుగుఁ దమునియోగిం
చినవారల నొంచ మగుడుచెలువం బమరన్. (3-11)

సీ॥ సమయ మనుయాత్ర నాళీక సార్వభౌముఁ
డంబుజంబులఁ జెందురోలంబపంక్తి
యనుతుపాకిని గగనలక్ష్యంబు నైవఁ
దగులు సీసంపుగుండ్లనాఁ దార లమరె. (4-13)

వనపద్యమువందు కూడ తుపాకులు, సీసపుగుండ్లు సూచింపఁబడినవి.

తాళకేతువిదూత అమరావతికిఁ బోయి సభాప్రవేశమునకై యెవరెవరి కేయే లంచము లిచ్చి యెన్నిపాటులు పడినాఁడో వచ్చి తనదొరతో చెప్పు చున్న ట్లొక సీసపద్యము పీకవి విర్మించెను. ఇందలనాఁటిసమాజములోని లంచగొండితనము మున్నగుదురాచారములు స్పష్టపడు చున్నవి. ఆపద్య మిది—

సీ. దొర కాప్తులై కావ్యసరణిఁ దెల్పెడి కవీ
శ్వరులకు లంచపంపంబు లొసఁగి,
సమ్ముఖమ్మునుండి చనుదెంచునలవ్రాయ
సమువారి కాశపాశలు ఘటించి,
బోనవెచ్చము గొంచుఁ బోవుశచీదేవి
దాదులకును బరిదాన మిచ్చి,
పిలువ నేతెంచువేగులవారివెంటనే
యరుగుని యోగుల ననుసరించి,

గీ. కినిసి వాఁకిటివా రడగించుకతన
నేను వచ్చినమాట దేవేంద్రుతోడఁ
దెలుపుఁ డని యెంత వేఁడినఁ దెలుప రైరి
వినివినమి చేసెనో కాని వేల్పుఱేఁడు. (4-60)

ఇందు తృతీయపాదమును పరిశీలింపఁగా నాఁటియంతఃపురపుదాదులద్వారా కూడ ఎటువంటిప్రయత్నములు జరగుచుండెడివో ఊహింప వీ లగు చున్నది. అధికారులస్త్రీలను మంచిచేసికొని పనులు నెఱవేర్చుకొనుటలు నేఁటి సమాజమున కూడ కా దనరానిసంగతులే కదా !

నలకూబరునివిహారముల నాసరాగా చేసికొని నాఁటిరాచకొమరుల విహారములు, వేఁటలు, యువజనులపందెములు, ఆటలు క్రిందిపద్యమందు నారాయణకవి అందముగా పొందుపఱచు చున్నాఁడు.

సీ. సంగీతమేళ ముప్పొంగఁ దేజీ నెక్కి
　　కంద మంటుచు రవగాలు చూపుఁ,
బగటుపావలు మెట్టి బంట్లు కైవారముల్
　　జోడింప మారిగెలనీడ కేఁగు,
పిచ్చుకత్తులవారు వెంటరా నందలం
　　బును నిబ్బరఁబుగాఁ బోవనిచ్చు,
డేగను బూని మాష్టినిసుద్దులు చెప్పి
　　కొనుచు నెచ్చెలికాండ్రఁ గూడి యరుగుఁ,

గీ. బికిలిపిట్టలఁ గొట్లాటఁ బెట్టి చూచు,
దిట్టతనమునఁ జెఱకుపందెంబు లాడు,
డీకొనఁగఁ జేసి యనికిఁ బొట్టేళ్ళ విడుచు
రంభచుట్టంబు వైభవప్రాభవమున. (5-9)

ఎక్కడియలకాపురము ? ఎక్కడిచెఱకుపందెములు ? ఎక్కడినలకూబరుఁడు ? ఎక్కడిపొట్టేళ్ళపోట్లాట ? కేవలము తననాఁటిరాచవారు, యువకులు చేసెడిషికారులు, వేసెడిపందెములే యిందు కవిచే పొందుపఱపఁబడిన వని వేఱ చెప్పనక్కఱ లేదు గదా ! చిననారాయణ రాజవంశకవి కనుక తన లేక తమవారియలవాట్ల నిందు కూర్చినాఁ డని భావింపవచ్చును. ప్రకృతిపరిశీలనశీలి యయినకవి యిట్లే రచించును. శ్లాఘనీయుఁడు నారాయణుఁడు.

తారకోసము జయంతనలకూబరులు ద్వంద్వయుద్ధము చేయుటకు బయలుదేఱినారు. వారి రణవార్తలు విన్నవా రందఱు చూచుటకు పరువురెత్తు చున్నారు. ఈ సందర్భమును సంవీక్షించినచో నాఁటిసంగతులు కొన్ని తెలియఁగలవు.

వ. "........ఇట్టియెడం బుట్టినరోసంబులు వారింప నెవ్వరితరం? బనుచుఁ బొడిఁబడినపాగ లడ్డాదిడ్డిగఁ బట్టుకొనుచుఁ దమయేలికలకు నెప్పటి సమాచారంబు లప్పటికిఁ జీటులు వ్రాయుచుఁ, గ్రక్కునం జనవలెఁ జుమ్మీ! యనుచు వేగులవారి నెచ్చరించువియోగులును, ఘొల్లునఁ గేకలు వైచి కేరుచుఁ బంగున దాఁటుచు నేఁడు గదా! వేడుక చూడఁగలిగెఁ గదా! యనుచు గమకించు కోడెకాండ్రును, గాయంబులు గట్టుటకు మందుసంచులు బుజంబుల వ్రేలాడ బొజ్జ లదరం బనువేలుపువెజ్జలును, జేటికావిదితతదీయ వృత్తాంతంబు విని యమ్మక్క! యీచక్కివిటొరల కెక్కడ నుండి వచ్చెనే! యనుచు మేడ లెక్కి కనుంగొను వవరోధగిరిపయోధరలును........! (5-59)

ఇందు వియోగులు, వైద్యులు, అంతఃపురపురంధ్రులు గమనింపఁ దగిన వారు. ఒక్కమాటలో చెప్పవలె నన్న నారాయణకవి నాఁటిసామాజిక వాతావరణమును కావ్యమునిందు గుంఫించినాఁ డనవలయును. తీసికొన్నది పౌరాణిక కథ యైనను ఇంతగా చారిత్రికవాతావరణమును వింపుట చిననారాయణస్వేచ్ఛా నిర్మాణమునకు నిరుపమనిదర్శనము. కనుకనే పరిశోధకకవి ఆరుద్ర-

"సోముని ఉత్తరహరివంశంలో ఆనాటి తురకదాడులు, ముట్టడులు, కొల్లలు కనబడినట్టే చిననారాయణకావ్యంలో కనబడతాయి. పురాణగాథను కథనం చేస్తున్నా తుపాకులు, ఫిరంగులువంటి ఆయుధాలు, రబాబులవంటి వాద్యాలు ఉపయోగిస్తాడు. 'పారసీలిపిని జొప్పడ భగవద్గీత లెన్నిక వ్రాసిన చిన్ని పలక'లు కూడా మనకు చూపిస్తాడు (2-88)*. చిననారాయణ ఇరవయ్యో శతాబ్దంలో జీవించిఉంటే కువలయాశ్వచరిత్రలో ఆటంబాంబులు, ఉపరికార్డర్లు, సోఫా-కట్-బెడ్లు వాడగల్గినంత వర్తమానకవి" అని యోగ్యతా పత్ర మిచ్చెను. ౨

ఇంకను నాఁటిరాజుల దినకృత్యములు (1-93), వేసవిలో నలనాఁ డుపయోగింపఁబడువస్తువులు (1-98), సైన్యప్రవిడిదివిశేషములు (2-86, 87,

* ఈ పద్యసంఖ్య అకాడమీప్రతిలో (2-87)

౨ సమగ్రాంధ్రసాహిత్యము, 11వసంపుటము, పుట 156.

88), దండువిడిదిలోని కోలాహలములు (2-107 నుండి 115 దాఁక), కోటల నిర్మాణములు (3-18), ఓడినబటులతో చేయించునట్టివెట్టిచాకిరీలు (3-20), స్త్రీలకై సేఁత (4-188), కోడివందెములు (4-207 నుండి 211 దాఁక), రాచవారు స్త్రీలతో నాడుపరిహాసవిలాసములు (5-5), యుద్ధమునకు బయలుదేఱువారితీరుతెన్నులు (5-57, 58) మున్నగువిషయము లీకావ్యమునుండి గ్రహింపవచ్చును.

దృశ్యకావ్యములం దభినయము పౌరాణికకథను సమకాలీన మొనర్చి చూపుటకు సహకరించును. శ్రవ్యకావ్యములందు వర్ణనాదులు సమకాలీనపఱచి కథను కవికాలపుసహృదయులహృదయనేత్రములకు కట్టి చూపును. ఏండ్లు పూండ్లు కడచినవెనుక తత్కావ్యములను పఠించువారు పౌరాణికచారిత్రికవాతావరణములను విశ్లేషపఱచి కవిస్వాతంత్ర్యమును కనుఁగొందురు.

శ్లో॥ కో ఒన్యః కాల మతిక్రాన్తం నేతుం ప్రత్యక్షతాం క్షమః ?
కవిప్రజాపతిం త్యక్త్వా రమ్యనిర్మాణశీలినమ్ ॥

— కల్హణపణ్డితుఁడు



## షోడశ దళము :

# ముక్తవిషయ సంగ్రహణము

పూర్వదళములయందు స్పృశింపఁబడనికొన్ని విషయములు పరామర్శింపఁబడుటకు ఈదళ ముద్దేశింపఁబడినది. వివిధవిషయము లిందు పొందుపఱుపఁబడుట గనుక నిది ప్రకీర్ణక మనఁదగినది. సాభిప్రాయపదపరామర్శము, అపూర్వపదప్రయోగచాతుర్యము, ఇతరకవికృతకువలయాశ్వచరిత్రకృతులు, ప్రబంధమండలిలో కువలయాశ్వచరిత్రస్థానము, కావ్యప్రయోజనవివేచనము - అనుశీర్షికలు కలిగినవిషయము లీదళమున చర్చింపఁబడు చున్నవి.

## సాభిప్రాయపదపరామర్శము

అవయవార్థముచేతఁ గాని, తత్పదార్థగుణముచేతఁ గాని ఒకపద మత్యంతరమణీయార్థము నిచ్చినచో దానిని సాభిప్రాయపదము లేక సార్థకపద మందురు. అనఁగా నచటిశబ్దమును తొలఁగించి వేఱొకశబ్దము నుంచినచో తద్రామణీయకమునకు భంగము వాటిల్లు నన్నమాట. ఈ రమణీయత కలిగిన యొకటి రెండుపద్యము లిట పరామర్శింపఁబడును.

మదాలసావిరహవర్ణనసందర్భమునం దొకపద్యము క్రిందిరీతిగ నిర్మింపఁబడినది.-

సీ. తల చూప వెఱచు నీయలివేణి, సమరంద
      సుమబృందనవకాంచనములఁ గన్నఁ,
   బెద వెత్త వెఱచు నీబింబోష్ఠి, తరువార
      సుకుమారతతధీరశుకముఁ గన్నఁ,
   బొడఁగట్ట వెఱచు నీపువుఁబోఁడి, ఝుంకార
      భారాతిభయదషట్పదముఁ గన్న,
   నడు గిడ వెఱచు నీయబ్జపాద, సమీప
      వికటానుభావహంసికలఁ గన్న

గీ. వెడవిలుతుచేత నగునలజడియుఁ దేనె
జడియుఁ, గమ్మనితెమ్మరల్ తొడరుజడియు
నలయునెమ్మనఁ జలువతోఁ గలవరించుఁ
గలవరించు నొకానొకకల వరించు. (3-83)

ఈ పద్యమునందు పైనాలుగుపాదములం దున్న అలివేణి, బింబోష్ఠి, పువుఁబోఁడి, అబ్జపాద - అనునాలుగుపదములు సార్థకములు. ఇవి స్త్రీ పర్యాయములుగ ప్రయోగింపఁబడి అవయవార్థవిశ్లేషణమున తమయర్థసార్థక్యమును సాధించుకొనఁజాలినవి. అలివేణి యనుపదమునకు అళుల (తుమ్మెదల) వలె వల్లనయినవేణి గలది యని అవయవార్థము. కనుకనే కాంచన (సంపెంగ) పుష్పములను చూచినచో తనతల చూపుటకు భయపడును. సంపెంగపువును వాసన చూచినచో తుమ్మెదలకు తలదిమ్ము క్రమ్ముట విదితవిషయము. ఈవిషయమును దృష్టియం దుంచుకొని అలివేణి అనుపదము సాభిప్రాయముగ ప్రయోగింపఁబడినది. దీనిని తీసి ముదిత, చంద్రవదన ఇత్యాదు లుంచినచో ఈసొగసు చెడును, పర్యాయము లయిన భ్రమరవేణి, ఇందిందిరకచ - ఇత్యాదు లుంచవచ్చును. ఇట్లే బింబశుకములకు, పుష్పషట్పదములకు, అబ్జహంసికలకుఁ గల సంబంధవిశేషములను దృష్టియం దిడికొని తక్కినమూఁడుపదములు కూర్పఁబడినవి. ఇట్టిదే క్రిందిపద్దియము కూడ-

ఉ. కొమ్మ! చిగుళ్ళు తెమ్ము, లతకూన! విరుల్గొని రమ్ము, పద్మినీ!
తమ్ములు గొంచు రమ్ము, వనితామణికిన్ నవశీతలోపచా
ర మ్మొనరించ కున్న వలరాయనిరాయిడి నేమి పుట్టునో?
యమ్మకచెల్ల! యింక, దడయం బని లే దని సంభ్రమంబునన్.
(3-158)

ఇందు కొమ్మ, లతకూన, పద్మినీ - అనుసంబోధనములు స్త్రీవాచకము లయినను అవయవార్థగ్రహణమున కొమ్మ కనుకనే చిగుళ్లు తెమ్మనుట (ఇచట కొమ్మ అనుదానికి అవయవార్థము లేకున్నను దానికి అర్థాంతర మయిన 'వృక్షశాఖ' అనునది గ్రహింపఁబడినది), లతకూన కనుకనే విరులు తె

మ్మనుట. పద్మిని కమకనే తమ్ములు (పద్మములు) తె మ్మనుటయు జరగెను. ఇట్టి పద్యము లటవట మందుటవలన కావ్యచమత్కారము పరిపోషింపఁబడును.

ఈ సాభిప్రాయపదప్రయోగచాతుర్యమే విశేషణవిశేష్యములందు వర్తించి పరికరపరికరాంకురాలంకారములుగా నంకురించెను.

కం. "తెలుగుకవిత్వము చెప్పం
దలఁచినకవి యర్థమునకుఁ దగి యుండెడు మా
టలు గొనవలె" నని తిక్కన
తెలిపెను రామాయణమునఁ దెల్లము కాఁగన్.

## అపూర్వపదప్రయోగచాతుర్యము

ప్రతికవియు నవకాశ మున్నంతలో నటనట కొన్ని క్రొత్తపదములను ప్రయోగించి కావ్యకవ్యకకు వన్నె కూర్చుటతోపాటు పరోక్షముగ వాఙ్మయ వికాసమునకు తోడ్పడు చుండును. ఈతఁడును కొన్నిప్రయోగములు క్రొత్తవి చేసి యాకబ్బమున కబ్బురపువిగ్గును కలిగించినవాఁ డయ్యెను. ప్రకరణవశమున మున్ను కొన్ని చూపఁబడినవి. మిగిలినవానిలో ముఖ్యము లయినకొన్నిప్రయోగములు ఆశ్వాసక్రమముగా చూపఁబడు చున్నవి.

౧. బృందము : సమూహార్థక మయినబృందశబ్దమును సుధామరందశబ్దములతో సమసింపఁజేసి ప్రయోగించినాఁడు. సుధాబృందాతిమాధుర్య(1-1). మరందబృంద(1-7; 2-60; 3-96) అనునవి అవి.సుధాబిందుబృంద, మరందబిందుబృంద_ అనువిధముగా వీనిని గ్రహియించి సుధాప్రవాహము, మరందప్రవాహము అనునర్థములు చెప్పికొనవలయును.

౨. ధరాదేవుఁడు : ధరాదేవుఁడు, ధరామరుఁడు మున్నగునవి బ్రాహ్మణార్థకములు.కాని, ధరాదేవపదమును రాజార్థకముగ ప్రయోగించి

నాఁ డీకవి.నారాయణధరాదేవుఁడు(1-17) అనునది ప్రయోగము.స్వామి, పతి మున్నగు పదములలో విపర్యాయముగ 'దేవ' శబ్దము గ్రహింపఁబడి ధరాశబ్దముతో సమాసము చేయఁబడిన దిచట.నారాయణరాజు-అని దీనియర్థము.

3. పద్మబంధువు : అనఁగా సూర్యుఁ డని యర్థము.సమాసమం దుత్తరపద మయినచంద్రపదము తత్పర్యాయములు శ్రేష్ఠార్థకము లగుట సర్వకవిసాధారణ మై యుండఁగా, నీకవి సూర్యార్థక మయిన పద్మబంధుశబ్దము నుత్తరస్థానమున చేర్చి శ్రేష్ఠతావాచకముగ చేసినాఁడు.ధరాధవపద్మ(1-60) అనున దీతనిప్రయోగము. రాజశ్రేష్ఠులు-అనుట. నరపతికులహేళీ(2-155) అని మరి యొకచో కూడ ప్రయోగించినాఁడు. హేళి యనఁగా సూర్యుఁడు, వీనింబట్టి "కవిరవి"(కవిశ్రేష్ఠుఁడు) ఇత్యాదులు సృజించుకొన వచ్చును. [ధరాధవః పద్మబంధు రివ]

4. జయంతుఁడు : తఱచుగా కవులు స్త్రీలపాలిటిమదనుఁడు అని పురుష సౌందర్యమును వర్ణించుట కలదు.కాని, చిననారాయణ మదనునకు బదులు జయంతుని చెప్పుచున్నాఁడు. 'అణుమధ్యాజన మనోజయంతునకు అని ప్రయోగము(1-63).మదననలకూబర నలజయంతాశ్వినీదేవతాదులు అందగాండ్రవట్టికలోనివారు. కనుక విశేషప్రయోగము చేయ నెంచి జయంతుని గ్రహించిన ట్లున్నాఁడు కువలయాశ్వకవి.

5. యూథము : దీనికి సజాతీయసమూహము అర్థము. దీనిని పశుపక్ష్యాదిజాతులపై చేర్చి సమాసము కూర్చుట పూర్వకవీంద్రులు చేసిన పని. తథా చేంద్రజితో వేశ్మ జగామ హరియూథపః (1), తంత్ర కుంజరయూథాని మృగయూథాని చైవ హి(2)-అని

1. సుందరకాండము, 6-21.

2. రామాయణము, 2-54-41, (చూ.హలాయుధవివరణము).

వాల్మీకిమహర్షి; ఇతో గజయూథపతి లులితకమలినీపరిమళః(1) ఇతో వరాహయూథమ్(2), గజయూథపతీనాంకంఠర్జితేన(3), వనమహిషయూథమ్(4), గజయూథపతికుమారమ్(5)-అని బాణభట్టారకుఁడు; స్వయూథాద్ భ్రష్టోష్ట్ర్యపవిష్టా(6)-అని పంచతంత్రము; కిలకిలారావములకీరయూథ మనువైతాళికావళి చేత మేలు కాంచి(7) - అని గంగాధరకవియు ప్రయోగించి యున్నారు. కుంజరయూథమ్ము దోమకత్తుకఁ జొచ్చెన్- సమస్య సర్వు లెఱిఁగినదే. కాని, చినరాయణుఁడు సౌధ యూథము (1-78; 2-155; 4-78), రథయూథము (3-15) అని యప్రాణివాచకములపై ప్రయోగించినాఁడు. అంతేకాక తిర్యగితర మయినమనుజ శబ్దముపయి కూడ దీనిని జతపఱచి మనుజయూథము (2-103) అని ప్రయోగించెను.

౬. జడజననబంధువు : సూర్యార్థకములుగా జలజబంధువు, జలజాతమిత్రుఁడు ఇత్యాదులు పూర్వకవిప్రయుక్తములు. కాని, యీతఁడు జడజననబంధువు (1-104) అని సూర్యార్థమున ప్రయోగించెను. లడయోరభేదః - అనున్యాయమున జడ మనఁగా జల మని యర్థము. అందు జననము కలిగినది కమలము. దానికి బంధువు సూర్యుఁడు. 'డ' కార మిచట ప్రాసఘటితము.

౭. యదాయదలు : తెనుఁగుపలుకులకు మొదట లేవవి చిన్నయసూరి(8). కాని, 'రయంబున యదాయదలై పఱతెంచి' (2-32) అని ఛందోబద్ధముగా చినరాయణ.

---

1. కాదంబరి, పుట 28.
2. ,, పుట 28.
3. ,, పుట 29.
4. ,, పుట 30.
5. ,, పుట 30.
6. చూ. ఇంటరు సంస్కృతవాచకము (1982-85), పుట 105.
7. తపతీసంవరణము, 3-81.
8. బాలవ్యాకరణము, సంజ్ఞా, 17 సూ.

౮. ఆకాశవాణి : అనుటకు గగనవాణి, వియద్వాణి మున్నగుపర్యాయము లెఱిఁగినవే.కాని, దీని నీతఁడు 'జడధివసనావిరాలంబజనితం బగునొక్కవచనంబు(2-37) అని విచిత్రఫణితిని ప్రయోగించెను.జడధి(జలధి)వసన యనఁగా భూమి(సముద్రము వస్త్రముగా కలిగినది.సముద్రముచేత చుట్టఁబడి యున్నది-అనుట). అది ఆలంబము కాకుండ జనించిన (శూన్యమున, ఆకాశమున జనించిన-అనుట)వచన మని యర్థము. మొత్తమునకు ఆకాశవాణి అనునది పరమార్థము.పూర్వకవులు భూమిని జలధిమేఖల, సముద్రరశన(సముద్రము మొలనూలుగా కలది)-ఇత్యాదిగ ప్రయోగించినతావు లెక్కువగ నున్నవి కాని 'జడధివసన' అనినవారు కనరారు.

౯. జాతము : ఈపదము సమూహార్థకమై మూర్తపదార్థములపై ప్రయోగింపఁబడుట విదితము. కాని, దీనిని ప్రతాపజాతము(2-51) అని అమూర్తముపై ప్రయోగించె నితఁడు. ప్రతాపములసమూహ మని యర్థము.

౧౦. భిదురి వజ్రార్థక మయిన 'భిదుర' శబ్దము నపుంసకలింగము* కాని, భిదురీమృదురీతి(2-76) అని స్త్రీలింగమున ననుప్రాసమున ఛందోబంధనమున ప్రయుక్తము.

౧౧. తుపారము : బహుశః ఈపదము 'ఒకవిధ మయినసరోవరము' అను నర్థమున ప్రయోగింపఁబడిన దనిపించు చున్నది. '...ఘమ్మను వట్టివేళ్ల చప్పరముకుఅంగటం దగుతుపారము చేరువ....' (2-87) నం దున్న గుడారములో రాజు కొలు వున్నట్లు వర్ణన. తుపారములోని 'పా' యతిసలఘటితము. ఈ పదమును ప్రసిద్ధనిఘంటువు లేవియు గ్రహింపలేదు. చప్పరములు సరోవరములు చేరువలో నున్నట్లు వర్ణించుట కవుల కలవాటు.

---

* ప్రోదినీ వజ్ర మస్త్రీ స్యా త్కులిశం భిదురం పవిః — అని అమరము.

౧౨. చెట్టుగులు : చెట్టులు అనుటకు 'చెట్టుగులు లేనిపెనుగారుచిచ్చు వచ్చె' (3-10) వని ప్రయోగము.

౧౩. అచ్చరమిటారికత్తియలు (3-23) : మిటారముమీఁద మత్వర్థమున 'ఇ' వర్ణకము. దానిమీఁద స్వార్థమున 'కత్తియ'యు చేర్చఁబడియెను.

౧౪. జేజేలయొజ్జలయిల్లాలిని వ్రాసినట్టివలువలు 3-134 : జేజేలయొజ్జ బృహస్పతి. అతనియిల్లాలు తార (తారాశబ్దమునకు నక్షత్ర మనునది అర్థాంతరము). ఆమెను వ్రాసినట్టివలువలు అనఁగా చుక్కలచీరలు.

౧౫. నవమధుద్రవరాజి 3-148 : ద్రవశబ్దముమీఁది 'రాజి' సమూహార్థకము.

౧౬. అరుసుపట్టి 4-30 : 'అరుసు' తఱచుగ నామాంతములయందే ప్రయోగింపఁబడు నని సూ. వి.కావి, యిట వ్యస్తముగ ప్రయుక్తము. దీనిని సూ. వి. గ్రహించినది.

౧౭. హృదయార్ద్రిదయాభ్యుదయాప్తిచేత 4-5 : దయార్ద్రిహృదయ మనుటకు బదులు హృదయార్ద్రిదయ యని ఛందమున ప్రయుక్తము.

౧౮. వేఁడిదొరలు 4-33 = సూర్యాగ్నులు.

౧౯. కొమ్మనిక్క 4-170 = స్త్రీవార్త లేక స్త్రీయాథార్థ్యము (కొమ్మ + నిక్కము).

౨౦. డిల్లబొట్టు 4-188 = తిలకవిశేషము (డిల్లము + బొట్టు). దీనిని నిఘంటువులు కైకొనలేదు.

౨౧. చీటినిబుచ్చు 4-199 = నిర్లక్ష్యము చేయు.దీనిని కూడ నిఘంటువులు గ్రహింపలేదు.

౨౨. కుక్కుటకంఠీరవంబు 4-210 = శ్రేష్ఠ మయినకోడిపుంజు.కంఠీరవ శబ్దము సింహపర్యాయ మై ఉత్తరస్థానమున శ్రేష్ఠతావాచిగ ప్రయుక్తము.

౨౩. సారేందువదనలు 5_10 = పూర్ణేందువదనలు. 'ప్రౌఢేందుబింబాననల్' అని శ్రీనాథుఁడు.

౨౪. చన్నులమిన్నలు 5-91 : 'ఘర్మాంబుకందళపుంజమ్నులమిన్నలు' అని ప్రయోగము.ఘర్మాంబుకందళపుంజమ్నులమిన్నలు అనఁగా ఘర్మాంబుకందళపుంజమ్నులు గలిగినస్త్రీలు అని యర్థము. అన్నులమిన్న, కన్నియమిన్న-ఇత్యాదులయం దుత్తరస్థానమున శ్రేష్ఠతావాచి యగు 'మిన్న' శబ్ద మిచట కేవల స్త్ర్యర్థకముగ ప్రయుక్త మాయె నని భావింపవలసి యున్నది.

౨౫. కన్నియమాటకరణిఁ దనరుమధుపర్కము 5_97 = కన్నియమాటవలె మధుర మయినమధుపర్క మనుట.వక్రోక్తిమాధుర్య మిట నతివేలము.

## ఇతరకవికృతకువలయాశ్వచరిత్రకృతులు

ఈమదాలసాకువలయాశ్వులప్రణయవృత్తాంతము సంస్కృతప్రాకృతాదులలో దృశ్యశ్రవ్యకావ్యములుగా నిర్మింపఁబడినట్లు తెలియవచ్చు చున్నది.

౧. విశ్వనాథకవిరాజు ఈ కథ నాశ్వాసవిభాగములతో సంతరించినట్లు

శ్లో॥ ప్రాకృతై ర్నిర్మితే తస్మిన్ సర్గాః ఆశ్వాససంజ్ఞకాః।
ఛందసా స్కంధకే నైతత్ క్వచి ద్గళితకై రపి॥

యథా సేతుబన్ధః యథా వా మమ కువలయాశ్వచరితమ్- అనువచనముల వలన తెలియు చున్నది(*).

---

* సాహిత్యదర్పణము, 6_326.

౨. శ్రీకృష్ణదేవరాయలు 'మదాలసచరిత్ర' సంస్కృతమున రచించినట్లు క్రింది పద్యమువలన తెలియు చున్నది.

సీ. పలికె తుత్ప్రేక్షోపమలు జాతి పెం పెక్క

రసికు లౌ నన మదాలసచరిత్ర (1)

౩. తిరుమలదేవరాయలకాలమునకు చెందినరాయసం అహోబలమంత్రి కువలయవిలాసనాటకమును వ్రాసెను. ఇందు మదాలసాకువలయాశ్వులకథ వర్ణింపఁబడినది(2).

౪. భాగవతషష్ఠస్కంధమును వ్రాసిన ఏర్చూరి సింగయ్య కువలయాశ్వ చరిత్రమును కూడ రచించెను."ఇతనికవిత శ్లేషప్రధానమై కొంతరసవంతముగా నుండును, శైలి మృదువైనను మధురముగా నుండదు" అని మానవల్లి రామ కృష్ణకవిగారియభిప్రాయము(3). దీనినుండి ప్రబంధమణిభూషణ మీక్రిందిపద్య మును గ్రహించెను.

సీ. తిమిరమంతయుఁ బాసి దిక్కులు తెలి వొందె

నమృతాంశువులఁ జెందె నభ్రవీథి

కువలయానందమై కోరిక లిగురొత్తె

విబుధులమదిలోన వెట్ట లోదవె

నక్తంచరశ్రేణినయ మెల్ల దిగజాఱెఁ

జిత్తజోల్లాసంబు చెలువు మిగిలె

దివ్యసీరంబులతేఁట లల్లన పర్వె

భువనాధిపతి వేడ్కఁ బొంగిపొరలె

---

1. ఆముక్తమాల్యద, 1-13.
2. తెలుగువారిసంస్కృతభాషాసేవ, పుట 29.
3. మానవల్లి కవి-రచనలు, ప్రథమభాగము, పుట 90.

గీ. దీపికాజాలమెల్లఁ జిక్కించినట్టి
రమణ దోఁపంగ దృక్చకోరములు మెచ్చ
నమితతేజోవిరాజమానాత్ముఁ డగుచుఁ
బుత్రచంద్రుండు జననంబు వొందునడు. (1)

పుత్త్రోదయచంద్రోదయముల నిందు శ్లేషించినాఁడు. చిననారాయణ చంద్రోదయవర్ణనమును రామవిపక్షమున శ్లేషించి యున్నాఁడు(4-15). ఏర్చూరి సింగయయొక్క పైపద్యమే కాక మఱి పదునొకండుపద్యములు కూడ ప్రబంధరత్నావళియందు గ్రహింపబడి యున్నవి (2). అందుండి ఒక్కటి యుదాహరింపఁబడు చున్నది.

ఉ. వైరితమస్తమం బడఁగ వంశమహార్ణవ ముబ్బ బాంధవో
ద్దారచకోరసంతతి ముదంబునఁ దేలఁగ నర్థివర్గస
త్కైరవజాతమెల్లను వికాసముఁ బొందఁగఁ బుత్రచంద్రజ
న్మారవచంద్రికానుభవ మబ్బినఁ జిత్తము మిన్ను ముట్టదే?(3)

౫. మొట్టమొదట ఆంధ్రదేశచరిత్రమును వ్రాసినబుక్కపట్టణము రాఘవాచార్యులవారు అవధానము చేయుటయే గాక కువలయాశ్వచరిత్రము అను నొకప్రశస్తప్రబంధమును రచించిరి (4).

ఇట్టివా రింకను కొంద ఱుండవచ్చును.

## ప్రబంధమండలిలో కువలయాశ్వచరిత్రస్థానము

కథావిధానములోను, రసపరిపోషణలోను, అలంకారనిర్మాణములోను, వర్ణనాచాతుర్యములోను, శ్లేషవైచిత్రిలోను, సంభాషణచారుత్వములోను కవిప్రతిభ

1. ప్రబంధమణిభూషణము—345.
2. ప్రబంధరత్నావళి—470నుండి481 వఱకు.
3. ,, 480.
4. విజ్ఞానసర్వస్వము, నాలుగవసంపుటము, పుట 1173.

స్పష్టపడు చున్నది. తారాచాపల్యవృత్తాంత మొక్కటిమాత్రము కాలమహిమకు లోనై కొంత అతివేలముగ వర్ణింపఁబడినది. ఐనను ఆయంతఃకథలోని శిల్ప రామణీయకమును కాదనఁజాలము. కనుక కావ్యమును ఉత్తమమధ్యమాధమ ములుగా విభజించినప్పుడీకావ్యము మధ్యమజాతికి చెందిన దగు ననఁదగును. కాని, పండితరాజజగన్నాథునిమతానుసారముగ ఉత్తమోత్తమ, ఉత్తమ, మధ్యమ, అధమము లని నాలుగుతెఱఁగులుగా గ్రహించినప్పుడు దీని నుత్తమ కావ్యముగానే గ్రహింపవచ్చును. ఏవిధముగఁ జూచినను అధమజాతికి మాత్ర మీకావ్యము రాదు. ఇందుల కీసిద్ధాంతవ్యాసపారమే సాక్ష్యము. ఇఁక పెద్దల యభిప్రాయములను కూడ గమనించినచో ఈ యభిప్రాయము మఱింత బలపడఁ గలదు.

౧. "ప్రతిభాతిశయమునను కల్పనాసామర్థ్యమునను వీరిరువురును (సూరన, చిననారాయణరాజు) సమానులే. ఐనను చిననారాయణరాజు కవిత్వ మందలిశిల్పపరిపక్వతయు, ప్రసన్నతయు, నిగ్గును సూరనార్యునియందు కానరా" వని శ్రీడా.వేలటూరి వేంకటరమణయ్యగారిఅభిప్రాయము(1).

౨. "పింగళిసూరన కళాపూర్ణోదయము తరువాత ఇంతకథారామణీయ కము గలప్రబంధము మఱొకటి లేదని విమర్శకులయభిప్రాయము. కథాకల్పనము నందును, సహజవర్ణనములందును, ఔచిత్యపోషణమందును, సహజసంభాషణ నిర్మాణనైపుణ్యమునందును చిననారాయణరా జద్వితీయుఁడు.

ఇతఁడు సూరనవలె సంస్కృతమందు గొప్పపండితుఁడే అయ్యును దీర్ఘసమాసములజోలికి పోక తంజావూరుకవులకు సాధారణమైనతియ్యనితేట తెలుఁగుమాటల ప్రయోగించుటయం దెక్కువనేర్పుఁ బ్రదర్శించెను" అని డా. దివాకర్ల వేంకటావధానిగారియభిప్రాయము(2).

1. ఆంధ్రవాఙ్మయచరిత్రము, పుట 69.

2. ,, పుట 69.

3. "కథాసంవిధానమున కొలికిపూసవలె వమర్చుటయందున చిన నారాయణనాయకుఁడు పింగళిసూరనకు సాటి రాగలఁడు. పాత్రసంభాషణములు మంచినీళ్ళప్రాయముగా జలజలప్రవహించుసెలయేళ్ళవలె పరుగెత్తును. పింగళి సూరనతరువాత నింతమధురకవి మరియొకఁడు లేఁడు" అని ఆచార్య ఖండవల్లి

4. "నాకు మాత్రం చిననారాయణలో కొద్దిగా పింగళి సూరపరాజుగారు, ముద్దుగా నాచనసోముడు కనబడుతున్నారు. మార్కండేయపురాణంలో మారన చెప్పినతీరు చూశాక చిననారాయణకథనం వింటే మనస్సు చివుక్కుమంటుంది. మూలంలోలాగు నాగకుమారులు అశ్వతరునికి కథ చెప్పినక్రమంలోనే కథ వ్రాస్తే ఎంతో ఔచిత్యం ఉండేది. మారనకథనక్రమమే శిల్పదృష్ట్యా మెరుగని పిస్తుంది. అందులో బిగువు కనబడుతుంది. అశ్వతరుడు కైలాసానికి వెళ్ళడానికి తగినంతకారణం తొలినుంచీ మారన చెప్పినకథలో మారుమ్రోగుతూ ఉంటుంది. మారనకథలో కువలయాశ్వుడు భార్యావియోగానికి ఉదాత్తంగా శోకిస్తాడు. చిన నారాయణకథలో విప్రలంభశృంగారపుపైపొరలే అతికినట్టు ఉంటుంది. మారన కథలో భార్యతోపాటు తాను మరణించనందుకు, గట్టిగా ఏడవలేనందుకు కువలయాశ్వుడు ధార్మికకారణాలు తలపోసుకుంటూ తపిస్తాడు. చిననారాయణ చిత్రించినకువలయాశ్వుడు కామాతురునిలాగే కనబడతాడు. సాధారణ ప్రబంధ నాయకుల స్థాయిని మించడు" అని ఆరుద్రగారియభిప్రాయము(2). మఱియు "ఈకావ్యం ఆంధ్రసాహితికి సవరమే కాని నిజవేణి కాదు అని ఎవరైనా అన వచ్చు. అయితేనేం? నైలానుసవరంలాగా చాల మెత్తన" అని కూడ వారి వక్కాణ (3).

ఆరుద్రగారివిమర్శము పునఃపరిశీలనార్హము. నాయకరాజులకాలము స్వేచ్ఛాశృంగారమును కూడ ఆదరించినట్టి తనిపరిశోధకులయభిప్రాయము గదా! అట్టి కాలమునకు చెందినకవి నాయకునిలో విప్రలంభశృంగారపుఁబాళ్లు పెంచుటలో

1. సమగ్రాంధ్రసాహిత్యము, 11వసంపుటము, పుట 156,157.
2. ,, ,, పుట 157.
3. ,, ,, పుట 158.

వింతయేమి ? మూలములోని కరుణమును తొలగించి విప్రలంభమును ప్రవేశ పెట్టుటకుఁ గలకారణము షష్ఠదళమున వివరింపఁబడినది. ఇఁక మూలమునందు వలెనే నాగకుమారులచేత కథ చెప్పించుట ఔచిత్యవంత మని ఆరుద్రగారియభిప్రాయము. కాని, యింతశృంగారఘట్టములను నాగకుమారులు తండ్రితో చెప్పుట యెంతమాత్ర మౌచిత్యవంతమో విజ్ఞు లరయుదురు గాక ! ఈమార్పిట ఔచితిని దృష్టియం దుంచుకొనియే చేయఁబడిన దనిపించు చున్నది. మఱియు నీభూతకథా (FLASH BACK) కథనశిల్పమును తారోపాఖ్యానమున ప్రవేశపెట్టి కేవల మిరువురుస్త్రీల(మదాలసాతారల)నడుమ నేకాంతమున శృంగారకథనమును నడపినాఁడు నారాయణుఁడు.

౫. "..... ఈకవికి(అనంతభూపాలునికి) సంస్కృతభాషయందలిపాండిత్యము మిక్కుట మైన దని కొన్నిప్రయోగములవలనఁ దెలియవచ్చు చున్నది. మాటలు కూర్చుటలోఁ గూడా నీతఁడు మిక్కిలి తెలివి గలవాఁడు. చిననారాయణునికల్పన కించుమించుగ సమకాలికుఁ డగునీతనికల్పనలే కారణ మని తోఁచు చున్నది. కాని తరువాతివాఁ డగుటచేఁ గాఁబోలు దీనికంటె నదియే (కువలయాశ్వచరిత్రయే) యందముగా నున్నది"-అని సరస్వతీపత్త్రికాధిపతులు కకుత్స్థవిజయపీఠికలో వ్రాసి రని చాగంటివారు వ్రాసినారు(1). ఇందు కువలయాశ్వచరిత్ర మే అందముగా నున్న దనువిషయము గమనింపఁదగినది.

౬. "రెండుకావ్యముల(కకుత్స్థవిజయకువలయాశ్వచరిత్రల)యందును కథాభాగ మత్యల్పమును వర్ణనాంశము అధికముగాను నుండి యున్నవే. రెండు కావ్యములును సంస్కృతపదబాహుళ్యము కలవియే. ఇరువురికవిత్వమును ప్రౌఢమయినదియే. మనోహర మైనదియే. భావములు నూతనము లై రెండిటియందును సరసహృదయానురంజకముగా నుండును"—అని చాగంటివారివ్రాఁత(2).

౭. "వరదేంద్రునిచెంజిపరిపాలనకాలము(క్రీ.శ.1645-1649)".

"కువలయాశ్వచరిత్ర మను ప్రౌఢప్రబంధమును రచించినసవరము చిన నారాయణనాయకుఁడు నీవరదేంద్రుఁడును సమకాలికులును బంధువులును నై

1. ఆంధ్రకవితరంగిణి, 11 వ సంపుటము, పుట 77.
2. ,, ,, పుట 78.

యుందు రసమాహకు కొంతయుపాధి గలదు" అనివిజ్ఞానసర్వస్వము(1). ఇందు ప్రౌఢప్రబంధ మనుమాట గుర్తింపఁదనది.

ఆ. "ఈ ప్రబంధములో సజీవపాత్రములు తారకుండలలు. వారిచుఱుకు దనమంతయు వారిమాటలలో మిసమిసలాడును. ప్రబంధమున పదునేడవశతాబ్ది నాటిసంఘము, సంఘర్షణము ప్రతిబింబిత మగుట దోష మనుకొనవచ్చును తెలియనికాలమును తీర్చుటకంటె తెలిసియున్నకాలగతిని చిత్రించుట నయము. ఎవ్వరేమన్ననేమి ? సమరమున కూడ సమకాలపరికరములే ప్రయోగించి యున్నాడు. జంకుగొంకులు లేనికవి.

పదునేడవశతాబ్దికవులలో ఒకగొప్పగుణ మున్నది. అది వారితెనుగుబాస. ఆభాషతీరుతీయములు చదివి ఆనందింపవలసినదే. 'చిఱుసానబట్టించి చికిలిసేయించిన' ఆఅచ్చతెనుగుపదములసంపదకు కువలయాశ్వచరిత్రము తఱుగనిపాతఱ' సహృదయు లాడుకొందురు గాక!" అని డా. దేవళ్ళ చిన్నికృష్ణయ్యగారియా శంసనము(2).

ఇందర ఱ కిన్నివిధముల నచ్చినయీాకృతి ఆరుద్రగారితిరస్కృతికి గుఱియగుట అచ్చెరియము. "భిన్నరుచి ర్హి లోకః"

## కావ్యప్రయోజనవివేచనము

స్వప్రయోజనమును గాని, పరప్రయోజనమును గాని ఆశింపక యేకవియు కావ్యమును నిర్మింపఁడు. కావ్యమే అన నేల ? కళలన్నియు నేదో యొకప్రయోజనమును దృష్టియం దుంచుకొనియే సృష్టింపఁబడును.

ఉత్తమకావ్యము యొక్క పఠనము ధర్మార్థకామమోక్షము లందును, కళలయందును నేర్పును; ఆనందమును, కీర్తిని కలిగించునని భామహాని

1. నాలుగవసంపుటము, పుట 833.

2. కువలయాశ్వచరిత్రము(ఆం.సా.అకాడమీప్రతి), సంపాదకీయము, పుట 27.

ప్రబోధము (1). మమ్మటాచార్యుఁడు కీర్తిసంపాదనమునకు, ధనలబ్ధికి, వ్యవహార విజ్ఞానమునకు అమంగళ పరిహారమునకు, సద్యఃపరనిర్వృతికి, కాంతాసమ్మితత్వముచేత నుపదేశమునకును కావ్యము సమర్థ మై యున్న దని బోధించెను(2).వీనిలో ఆనందోపదేశములు ప్రధానప్రయోజనములని పరిశోధకుల యభిప్రాయమై యున్నది.ఈరెండింటిలో కూడ కాలమహత్త్వమునుబట్టి ఒకప్పు డొకటి ప్రథమము, మఱియొకప్పు డింకొకటి ప్రథమము నగును.

ఈప్రబంధకర్త ప్రధానముగ రసానందమును దృష్టియందుంచుకొని యీకావ్యమును రచించె ననువిషయము విదితపూర్వమే. అయినప్పటికి నంతర్గతముగ నానుషంగికముగ నున్నయుపదేశమును కూడ గ్రహింపవలసి యున్నది. ఋతధ్వజుఁడు గాలవమునివెంట వెడలి పాతాళకేతువును వధించుటలో క్షత్రియ ధర్మనిర్వహణతత్పరతను గ్రహిప గగును.మఱియు నతఁడు మదాలసను పరిణయ మగుటకు సిద్ధముగా నుండఁగా మాయామౌని వచ్చి ఆశ్రమరక్షణము నకు పిలుచును.వెంటనే అతఁడు మునివెంట వెడలును.ఇట కామమునకన్న ధర్మరక్షమునకు ప్రాధాన్య మనువిషయమును గ్రహింపవలసి యున్నది. ఇట్లే యీతఁడు మదాలసావియోగముతోనే కాలము కడపుచు, వేఱొకకన్యను పరిణయ మాడ కుండెను. ఇట్లుండుటలో సీతనియేకపత్నీవ్రతానురాగము నూహింపనగును.

నాగకుమారులు తమచెలికాఁ డయినకువలయాశ్వునకు కలిగినకష్టమును తండ్రికి విన్నవించి, ఆతనివేదన తీఱుటకై కృషిచేయవలసినదిగా ప్రార్థించుటలో స్నేహమాధుర్యము, మిత్త్రకర్తవ్యము సూచింపఁబడు చున్నవి. మఱియు నశ్వతరుఁడు తనకొడుకులనేస్తగానికి వచ్చినబాధను వైదొలఁగించుటకై

---

1. శ్లో. ధర్మార్థకామమోక్షేషు వై చక్షణ్యం కలాసు చ।
ప్రీతిం కరోతి కీర్తిం చ సాధుకావ్యనిషేవణమ్ ॥

— కావ్యాలంకారము, 1-2

2. కావ్యం యశసే ఽర్థాయ వ్యవహారాయ చ శివేతరక్షతయే ।
సద్యఃపరనిర్వృతయే కాన్తాసమ్మితత యోపదేశాయ ॥

— కావ్యప్రకాశము, 1-2

కైలాసనాథునికడ కేఁగుట అనిర్వచనీయ మయినయుత్తమాదర్శమును లోక మున కందించుచున్న దని పలుకనగును.

ఇఁక తారోపాఖ్యానము = దీనివలనియుపదేశమును వ్యతిరేకమార్గమున స్వీకరింపవలసి యున్నది వేశ్యాప్రణయమును విశ్వసింపరా దనియు, విశ్వసించి నచో నలకూబరజయంతులవలె ప్రాణమిత్రులు పైతము కత్తుల దూసికొనుదుస్థితి దాపరించు ననియు తెలియవలెను. రామాయణము కూడ రావణునివలె ప్రవర్తించి నచో నాశనము, రామునివలె నున్నచో కీర్తియు లభించు నని వ్యతిరేకమార్గమున నుపదేశము మొసఁగు చున్నది కదా !

ఋతధ్వజున కంతునట్టనితాళకేతువును బృహస్పతి శపించి, అరక్కసు నియు క్కఁడగించుటలో ధర్మతత్పరుఁ డయినవానికి అర్థించకుండనే దేవత లనుకూలింతు రనువిషయమును స్వీకరింపవలయును.

ఇట్లాయాఘట్టములనుబట్టి ఆయాయుపదేశవిశేషములను ఈకావ్యము నుండి గ్రహింపవలయును.

"విశ్వశ్రేయః కావ్యమ్"

— నన్నయభట్టారకులు

## ముగియిక

మదాలసాకుండలాఋతధ్వజాదినామములను యోగశాస్త్రసబంధము లయిన పారిభాషికపదములుగా గ్రహించి కొందఱు కుండలినీయోగమును సూచించు చున్నారు*. ప్రబంధమునందు మాత్రము ఆనందోపదేశములకే ప్రాముఖ్యము ఇప్పటివఱకు ఈసిద్ధాంతవ్యాసమునం దుదాహరింపఁబడినపద్యములనుబట్టి ఆయా సందర్భములయందలిశైలీవిశేషము లభ్యూహ్యములు.అటనట ధ్వనివిశేషాదులు కూడ సూచింపఁబడినవి.మొత్తమునకు సవరము చిననారాయణనాయకకవి

* చూ. కువలయాశ్వచరిత్రము (ఆం. సా. అకాడమీప్రతి), సంపాదకీయము. పుట 4.

మార్కండేయమునుండి గ్రహించినమదాలసాకువలయాశ్వులకల్యాణవృత్తాంత మును చిత్రవిచిత్రగమనములతో స్వర్గమర్త్యపాతాళములయందు త్రిప్పి, అద్భుతజాతివార్తల కాలవాలము చేసి,సహృదయావతంసములప్రశంసలకు పాత్ర మగునట్లుగా ముగించి చిరయశోభాసురమూర్తి యయినాఁడు.

ఇట్లు షోడశదళకువలయమువలె "కువలయాశ్వచరిత్రము-ఒకపరామర్శము" అనుపీసిద్ధాంతవ్యాసము షోడశదళములతో నిర్మింపఁబడినది. సహృదయచంద్రుల వలన నిది చక్కఁగా వికసించు నని విశ్వాసము. లో నారసినవారి కిం దానంద మధుబిందువు లందఁగల వని విన్నపము.

శ్లో॥ సంసారవిషవృక్షస్య ద్వే ఫలే అమృతోపమే।
కావ్యామృతరసాస్వాదః సంగమ స్సజ్జనైఃసహ ॥

హితోపదేశము



అనుబంధము I

# ఉపయుక్తగ్రంథమాలిక

## ౧. సంస్కృతము

### నిఘంటువులు

| గ్రంథము | గ్రంథకర్త | ముద్రణసంస్థ | ముద్రణకాలము |
|---|---|---|---|
| 1. అనేకార్థధ్వనిమంజరి | మహాక్షపణకుఁడు | శ్రీహరికృష్ణనిబంధభవనము | 1960 |
| 2. అనేకార్థసంగ్రహము | హేమచంద్రుఁడు | చౌఖమ్బా విద్యాభవనము | 1969 |
| 3 అమరకోశము | అమరసింహుఁడు | వా. రా. శాస్త్రులు & సన్స్ | 1973 |
| 4. ఏకాక్షరకోశము | పురుషోత్తమదేవుఁడు | నిర్ణయసాగరప్రెస్సు | 1950 |
| 5. ధనంజయనిఘంటువు | ధనంజయుఁడు | వా. రా. శాస్త్రులు | 1949 |
| 6. నానార్థరత్నమాల | ఇరుగపదండనాథుఁడు | వా. రా. శాస్త్రులు | 1950 |
| 7. మేదినీకోశము | మేదినికవి | వా. రా. శాస్త్రులు | 1932 |
| 8. విశ్వకోశము | మహేశ్వరసూరి | వా. రా. శాస్త్రులు | 1958 |
| 9. వైజయన్తి | యాదవప్రకాశుఁడు | వా. రా. శాస్త్రులు | 1958 |

| గ్రంథము | గ్రంథకర్త | ముద్రణసంస్థ | ముద్రణకాలము |
|---|---|---|---|
| 10. శబ్దరత్నప్రదీపము | సంపా. డా. హరిప్రసాదశాస్త్రీ | రాజస్థానపురాతత్త్వాన్వేషణ మందిరము | 1956 |
| 11. హలాయుధకోశము | హలాయుధభట్టు | హిందీసమితి | 1967 |

## లక్షణగ్రంథములు

| గ్రంథము | గ్రంథకర్త | ముద్రణసంస్థ | ముద్రణకాలము |
|---|---|---|---|
| 12. కవికంఠాభరణము | క్షేమేంద్రుఁడు | మోతీలాల్ బనారసీదాసు | 1967 |
| 13. కావ్యప్రకాశము | మమ్మటుఁడు | జమ్ములమడక మాధవరామశర్మ | 1963 |
| 14. కావ్యాదర్శము | దండి | ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ | 1981 |
| 15. కావ్యానుశాసనము | వాగ్భటుఁడు | నిర్ణయసాగరప్రెస్సు | 1915 |
| 16. కావ్యాలంకారము | భామహుఁడు | సురభారతీసమితి | 1979 |
| 17. కావ్యాలంకారసూత్రవృత్తి | వామనుఁడు | వాణీవిలాసముద్రాలయము | 1909 |
| 18. చంద్రాలోకము (పంచమమయూఖము) | జయదేవుఁడు | చౌఖమ్బా విద్యాభవన్ | 1965 |
| 19. తర్కసంగ్రహము | అన్నంభట్టు | శ్రీ హరికృష్ణనిబంధభవనము | 1976 |
| 20. ధాతుపాఠము | పాణినిముని | చౌఖమ్బా విద్యాభవనము | 1969 |
| 21. ప్రతాపరుద్రీయము | విద్యానాథుఁడు | టి. వి. విశ్వనాథ అయ్యర్ | 1979 |

| | | | | |
|---|---|---|---|---|
| 22. | వృత్తరత్నాకరము | : కేదారభట్టు | - చౌఖమ్బా విద్యాభవన్ | - 1976 |
| 23. | శబ్దరత్నావళి | : శ్రీగరణి వైయాకరణ కృష్ణాచార్యులు | - ఆం. సా. అ. | - 1978 |
| 24. | శమ్బురహస్యము | : వేదవ్యాసుఁడు? | - విద్యాతరంగిణీ ముద్రాక్షరశాల | - 1890 |
| 25. | శ్రుతబోధము | : కాళిదాసు | - చౌఖమ్బా విద్యాభవనము | - 1981 |
| 26. | సరస్వతీకంఠాభరణము (ప్రథమసంపుటి) | : భోజదేవుఁడు | - ఆం. సా. అకాడమీ | - 1982 |
| 27. | సాహిత్యదర్పణము | : విశ్వనాథకవిరాజు | - నిర్ణయసాగర ప్రెస్సు | - 1936 |
| 28. | సాహిత్యరత్నాకరము | : వారణాసి ధర్మసూరి | - సరస్వతీనిలయముద్రాక్షరశాల | - 1871 |
| 29. | సిద్ధాన్తకౌముది | : భట్టోజిదీక్షితులు | - నిర్ణయసాగర ప్రెస్సు | - 1913 |

## లక్ష్యగ్రంథములు

| | | | | |
|---|---|---|---|---|
| 30. | అనర్ఘరాఘవము | : భట్టమురారి | - చౌఖంబావిద్యాభవనము | - 1960 |
| 31. | అభిజ్ఞానశాకున్తలము | : కాళిదాసు | - నిర్ణయసాగర ప్రెస్సు | - 1983 |
| 32. | కాదంబరి | : బాణభట్టు | - వా. రా. శాస్త్రులు | - 1965 |
| 33. | కుమారసంభవము | : కాళిదాసు | - నిర్ణయసాగర ప్రెస్సు | - 1923 |
| 34. | దశకుమారచరితము (పూర్వపీఠిక) | : దండి | - వేదము వేంకటరాయశాస్త్రి & బ్రదర్స్ | - 1977 |

| | గ్రంథము | గ్రంథకర్త | ముద్రణసంస్థ | ముద్రణకాలము |
|---|---|---|---|---|
| 35 | నైషధీయచరితము | శ్రీహర్షుఁడు | నిర్ణయసాగర ప్రెస్ | 1952 |
| 36 | బాలకాండము | వాల్మీకి | Govt. Central Book Depot. | 1883 |
| 37. | భగవద్గీత | వేదవ్యాసుడు | హిందూసమాజము (రాజమండ్రి) | 1931 |
| 38 | మధురావిజయము | గంగాదేవి | బహ్మశ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి | 1975 |
| 39 | మహాభాగవతము (ద్వితీయార్థము) | వేదవ్యాసుఁడు | వా. రా. శాస్త్రులు | 1941 |
| | మహాభారతము (వనపర్వము) | వేదవ్యాసుఁడు | చిత్రశాలముద్రాలయము | 1930 |
| 1. | మార్కండేయపురాణము (మదాలసాచరిత్రము) | వేదవ్యాసుఁడు | వ్యాసాశ్రమము | 1958 |
| 2 | రఘువంశము | కాళిదాసు | చౌఖంబావిద్యాభవనము | 1961 |
| 3 | శిశుపాలవధము | మాఘకవి | నిర్ణయసాగర ప్రెస్సు | 1914 |
| 4 | సుందరకాండము | వాల్మీకి | వా. రా. శాస్త్రులు | 1951 |
| 5 | సుభాషితత్రిశతి | భర్తృహరి | వేమూరు వెంకటకృష్ణమసెట్టి అండ్ సన్సు | 1909 |
| 6. | హర్షచరితము | బాణభట్టు | చౌఖంబావిద్యాభవనము | 1982 |
| 7. | హితోపదేశము | నారాయణపండితుడు | పండితపుస్తకాలయము | 1971 |

## ఇతరములు

48. ఆంధ్రవేదములు (ఋగ్వేదము) (ప్రథమసంపుటము) : అనువాదకుఁడు బంకుపల్లె మల్లయ్యశాస్త్రి - వినయాశ్రమము - 1940
49. కావ్యప్రబంధము : బాలకృష్ణభట్టశాస్త్రి - చౌఖంబావిద్యాభవనము - 1978
50. భాషామంజరి : (కర్త తెలియదు) - వా. రా. శాస్త్రులు - 1948
51. సంస్కృతవాచకము (ఇంటరు) : - ఆర్. కె. ప్రింటర్సు - 1982
52. సంస్కృతవాచకము (జూనియరింటరు) : - ఆర్. కె. ప్రింటర్సు - 1985

# ౨. ఆంధ్రము

## నిఘంటువులు

53. అచ్చతెలుఁగుకోశము : బ్రహ్మశ్రీ వోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి - వో. సు. శాస్త్రి - 1979
54. ఆంధ్రపదకోశము : బ్రహ్మశ్రీ వోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి - వో. కు. అంబరీషశర్మ - 1981

| గ్రంథము | గ్రంథకర్త | ముద్రణసంస్థ | ముద్రణకాలము |
|---|---|---|---|
| 55. ఛందఃపదకోశము | సంగ్రాహకుఁడు : కోవెల- సంపత్కుమారాచార్య | తెలుగు అకాదమి | 1977 |
| 56. తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు | సి. పి. బ్రౌను | మార్వా పబ్లికేషన్సు | 1982 |
| 57. శబ్దరత్నాకరము | బహుజనపల్లి సీతారామాచార్యులు | చెన్నపట్టపు దేశభాషా గ్రంథకరణసభ | 1958 |
| 58. సాంబనిఘంటువు | కస్తూరి రంగకవి | ది మోడరన్ పబ్లిషర్సు | 1946 |
| 59. సూర్యరాయాంధ్ర నిఘంటువు | జయంతిరామయ్య పరిష్కృతులు | ఆం. సా. అకాదమి | 1979 |

## లక్షణగ్రంథములు

| గ్రంథము | గ్రంథకర్త | ముద్రణసంస్థ | ముద్రణకాలము |
|---|---|---|---|
| 60. అప్పకవీయభావప్రకాశిక | రావూరి దొరస్వామిశర్మ | త్రివేణిపబ్లిషర్సు | 1976 |
| 61. అప్పకవీయము | కాకునూరి అప్పకవి | వా. రా. శాస్త్రులు | 1970 |
| 62. అహోబలపండితీయము | అహోబలపండితుఁడు | ఆంధ్రరచయితలసంఘము | 1965 |
| 63. ఆంధ్రప్రతాపరుద్ర యశోభూషణము | చెలమచర్ల రంగాచార్యులు | శివాజీప్రెస్ | 1967 |
| 64. ఆంధ్రశబ్దచింతామణి | నన్నయభట్టు | వా. రా. శాస్త్రులు | 1968 |

| గ్రంథము | గ్రంథకర్త | ముద్రణసంస్థ | ముద్రణకాలము |
|---|---|---|---|
| 65. కావ్యాలంకారచూడామణి: | విన్నకోట పెద్దన | - వే. వేం. శాస్త్రి అండ్ బ్రదర్స్ - | 1972 |
| 66. కావ్యాలంకార సంగ్రహము | : సన్నిధానము సూర్య నారాయణశాస్త్రి | - ఎమెస్కో - | 1976 |
| 67. ఛందోదర్పణము | : అనంతుఁడు | - వా. రా. శాస్త్రులు అండ్ సన్సు - | 1968 |
| 68. ప్రౌఢవ్యాకరణము | : బహుజనపల్లి సీతారామాచార్యులు | - వా. రా. శాస్త్రులు - | 1915 |
| 69. బాలవ్యాకరణము | : పరవస్తు చిన్నయసూరి | - వా. రా. శాస్త్రులు - | 1937 |
| 70. లక్షణశిరోమణి | : పొత్తపి-వేంకటకవి | - ఆం. సా. అకాడమీ - | 1979 |
| 71. లక్షణసారసంగ్రహము: | చిత్రకవి పెద్దన | - ఆంధ్రసాహిత్యపరిషత్తు - | 1940 |
| 72. వికృతివివేకము | : అథర్వణుఁడు | - వా. రా. శాస్త్రులు - | 1967 |
| 73. సుకవిమనోరంజనము : | కూచిమంచి వేంకట రాయలు | - ఆం. సా. అకాడమి - | 1976 |

## లక్ష్యగ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 74. అనిరుద్ధచరిత్రము | : కనుపర్తి అబ్బయామాత్యుఁడు | - ఎమెస్కో - | 1973 |
| 75. ఆంధ్రపద్మపురాణము | : బ్రహ్మశ్రీ పిళుపాటి చిదంబరశాస్త్రి | - పి. విశ్వేశ్వరశాస్త్రి - | 1953 |

| గ్రంథము | | గ్రంథకర్త | ముద్రణసంస్థ | | ముద్రణకాలము |
|---|---|---|---|---|---|
| 76. ఆంధ్రమహాభాగవతము | : | బమ్మెర పోతన | - రామా అండ్ కో | - | 1939 |
| 77. ఆంధ్రమహాభారతము (ఆదిపంచకము) | : | కవిత్రయము | - ద్వారకానాథ్ అండ్ కంపెనీ | - | 1937? |
| 78. ఆంధ్రమహాభారతము (భీష్మనుండి స్వర్గారోహణ) | : | తిక్కన సోమయాజి | - రవీంద్ర పబ్లిషింగ్ హౌస్ | - | 1968 |
| 79. ఆముక్తమాల్యద | : | శ్రీకృష్ణదేవరాయలు | - వే. వేం. శాస్త్రి అండ్ బ్రదర్స్ | - | 1964 |
| 80. ఉత్తరహరివంశము | : | నాచన సోమనాథుఁడు | - ఆం. సా. అకాడమి | - | 1979 |
| 81. ఉషాపరిణయము | : | దామెర్ల అంకభూపాలుఁడు | - ప్రదీపప్రచురణము | - | 1984 |
| 82. కకుత్స్థవిజయము | : | మట్ల అనంతభూపాలుఁడు | - ఆం. సా. అకాడమి | - | 1980 |
| 83. కళాపూర్ణోదయము | : | పింగళి సూరన | - వా. రా. శాస్త్రులు | - | 1958 |
| 84. కాశీఖండము | : | శ్రీనాథుఁడు | - వా. రా. శాస్త్రులు | - | 1969 |
| 85. కుమారసంభవము | : | నన్నెచోడుఁడు | - వా. రా. శాస్త్రులు | - | 1961 |
| 86. కువలయాశ్వచరిత్రము | : | సవరము చిననారాయణ | - ఆం. సా. అకాడమి | - | 1982 |
| 87. క్రీడాభిరామము | : | వినుకొండ వల్లభరాయలు | - ఎమెస్కో | - | 1972 |
| 88 జైమినిభారతము | : | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు | - ఆం. సా. అకాడమి | - | 1984 |
| 89. తపతీసంవరణము | : | అద్దంకి గంగాధరకవి | - శ్రీపరమేశ్వరపబ్లికేషన్స్ | - | 1972 |

| గ్రంథము | గ్రంథకర్త | ముద్రణసంస్థ | ముద్రణకాలము |
|---|---|---|---|
| 90. నిరంకుశోపాఖ్యానము | కందుకూరు రుద్రకవి | వా. రా. శాస్త్రులు | 1954 |
| 91. నిర్వచనోత్తరరామాయణము | తిక్కనసోమయాజి | ఆం. సా. అకాడమి | 1968 |
| 92. నీలాసుందరీపరిణయము | కూచిమంచి తిమ్మకవి | వా. రా. శాస్త్రులు | 1965 |
| 93. నృసింహపురాణము | ఎఱ్ఱాప్రెగ్గడ | వా. రా. శాస్త్రులు | 1968 |
| 94. పంచతంత్రము | దూబగుంట నారాయణ | ఆం. సా. అకాడమి | 1980 |
| 95. పాండురంగమాహాత్మ్యము | తెనాలి రామకృష్ణకవి | వా. రా. శాస్త్రులు | 1968 |
| 96. పారిజాతాపహరణము | నంది తిమ్మన | వా. రా. శాస్త్రులు | 1968 |
| 97. ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసము | గణపవరపు వేంకటకవి | ఆం. సా. అకాడమి | 1977 |
| 98. ప్రబోధచంద్రోదయము | నంది మల్లయ, ఘంట సింగయ | ఆం. సా. అకాడమి | 1976 |
| 99. ప్రభావతీప్రద్యుమ్నము | పింగళి సూరన | వా. రా. శాస్త్రులు | 1968 |
| 100. బిల్హణీయము | పండిపెద్ది కృష్ణస్వామి | ఎమెస్కో | 1971 |
| 101. భాస్కరరామాయణము | భాస్కరుడు | ఆం. సా. అకాడమి | 1969 |
| 102. భీమేశ్వరపురాణము | శ్రీనాథుడు | అద్దేపల్లి అండ్ కో | 1958 |
| 103. మార్కండేయపురాణము | మారన | ఆం. సా. అకాడమి | 1984 |
| 104. రాఘవపాండవీయము | పింగళి సూరన | వా. రా. శాస్త్రులు | 1968 |

| గ్రంథము | గ్రంథకర్త | ముద్రణసంస్థ | ముద్రణకాలము |
|---|---|---|---|
| 105. రాజశేఖరచరిత్ర | : మాదయగారిమల్లన | - ఆం. సా. అకాదమి | - 1967 |
| 106. రామాభ్యుదయము | : అయ్యలరాజు రామభద్రుఁడు | - ఆం. సా. అకాదమి | - 1967 |
| 107. వరాహపురాణము | : నంది మల్లయ, ఘంట సంగయ | - ఆం. సా. అకాదమి | - 1978 |
| 108. వరాహపురాణము | : హరిభట్టు | - ప్రదీపప్రచురణము | - 1978 |
| 109. వసుచరిత్రము | : రామరాజభూషణుఁడు | - వా. రా. శాస్త్రులు | - 1962 |
| 110. విజయవిలాసము | : చేమకూర వేంకటకవి | - వా. రా. శాస్త్రులు | - 1969 |
| 111. వైశ్యపురాణము | : భాస్కరాచార్యులు | - వా. రా. శాస్త్రులు | - 1929 |
| 112. శివరాత్రిమాహాత్మ్యము | : శ్రీనాథుఁడు | - ఆంధ్రసారస్వతపరిషత్తు | - 1968 |
| 113. శుకసప్తతి | : పాలవేకరి కదిరీపతి | - వా. రా. శాస్త్రులు | - 1935 |
| 114. శృంగారనైషధము | : శ్రీనాథుఁడు | - వా. రా. శాస్త్రులు | - 1966 |
| 115. శృంగారశాకుంతలము | : పిల్లలమఱ్ఱి పినవీరన | - వా. రా. శాస్త్రులు | - 1970 |
| 116. శ్రీకాళహస్తిమాహాత్మ్యము | : ధూర్జటి | - వా. రా. శాస్త్రులు | - 1966 |
| 117. శ్రీరాధామాధవము | : చింతలపూడి యెల్లనార్యుఁడు | - ప్రకాశకుఁడు శ్రీబులుసు బుచ్చి సర్వారాయఁడు, జమీందారు కపిలేశ్వరపురము | - 5036 |
| 118. సింహాసనద్వాత్రింశిక | : కొఱవి గోపరాజు | - ఆం. సా. అకాడామి | - 1982 |

| గ్రంథము | గ్రంథకర్త | ముద్రణసంస్థ | ముద్రణకాలము |
|---|---|---|---|
| 119. స్వారోచిషమనుచరిత్రము | అల్లసాని పెద్దనార్యుఁడు | ఆనందముద్రణాలయము | 1936 |
| 120. హంసవింశతి | అయ్యలరాజు నారాయణ | ఆం. సా. అకాడమి | 1977 |

## ఇతరములు

| గ్రంథము | గ్రంథకర్త | ముద్రణసంస్థ | ముద్రణకాలము |
|---|---|---|---|
| 121. ఆంధ్రకవితరంగిణి (11వ సంపుటము) | చాగంటి శేషయ్య | హిందూధర్మశాస్త్రగ్రంథనిలయము | 1954 |
| 122. ఆంధ్రవాఙ్మయచరిత్రము | దివాకర్ల వేంకటావధాని | ఆం. సా. పరిషత్తు | 1981 |
| 123. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక | సంపుటము 18, సంచిక 2 | పరిషత్కార్యాలయము | 1929 |
| 124. "కుచేలోపాఖ్యానము -ఒకపరిశీలన" | పుయ్యూరు లక్ష్మీనరసింహారావు | మదరాసువిశ్వవిద్యాలయ - అముద్రితలఘుసిద్ధాంత వ్యాసము | డిసెంబరు,1982 |
| 125. తెలుఁగువారిసంస్కృత భాషాసేవ | పి. శ్రీరామమూర్తి | ఆం. సా. అకాడమి | 1976 |
| 126. దాక్షిణాత్యాంధ్ర సాహిత్యము | నేలటూరు వేంకటరమణయ్య | వే. వేం. శాస్త్రి | 1980 |

| | గ్రంథము | గ్రంథకర్త | ముద్రణసంస్థ | ముద్రణకాలము |
|---|---|---|---|---|
| 127. | "నన్నయభట్టురాచదారి-నానాకవులపయనము" (వ్యాసము) | పుయ్యూరు లక్ష్మీనరసింహారావు | సమాలోచనపక్షపత్రిక | 1-6-'84 |
| 128. | పంపభారతము(కన్నడము) (ప్రథమభాగము) | పంపకవి | మైసూరువిశ్వవిద్యాలయము | 1976 |
| 129. | ప్రబంధమణిభూషణము | సంపా. నిడదవోలు వేంకటరావు, పోణంగి శ్రీరామఅప్పారావు | ఆం. సా. అకాడమి | 1971 |
| 130. | ప్రబంధరత్నావళి | సంపా. వేటూరి ప్రభాకరశాస్త్రి | ప్రభాకరపరిశోధకమండలి | 1976 |
| 131. | ప్రాచీనాంధ్రచారిత్రక భూగోళము | కుందూరి ఈశ్వరదత్తు | ఆం. సా. అకాడమి | 1979 |
| 132. | మానవల్లికవి-రచనలు | సంపా. నిడదవోలు వేంకటరావు, పోణంగి శ్రీరామఅప్పారావు | ఆం. సా. అకాడమి | 1972 |
| 133. | వరూధినీప్రవరాఖ్యము-8 (వ్యాసము) | డా. వి. రామచంద్ర | మదరాసువిశ్వవిద్యాలయము | 1982 |
| 134. | వసుచరిత్రవిమర్శనము | వజ్ఝల చినసీతారామశాస్త్రులు | వా. రా. శాస్త్రులు | 1965 |
| 135. | వాఙ్మయవ్యాసములు | బ్రహ్మశ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి | పో. కు. సు. శాస్త్రి | 1983 |

| గ్రంథము | గ్రంథకర్త | ముద్రణసంస్థ | ముద్రణకాలము |
|---|---|---|---|
| 136. విజ్ఞానసర్వస్వము (నాలుగవసంపుటము) | : సంపా. శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మ ప్రభృతులు | - తెలుఁగుభాషాసమితి - | 1961 |
| 137. సంస్కృతవాఙ్మయచరిత్ర: (ద్వితీయసంపుటము) | మల్లాది సూర్యనారాయణశాస్త్రి | - ఆం. సా. పరిషత్తు - | 1961 |
| 138. సమగ్ర ఆంధ్ర సాహిత్యం: (11వసంపుటము) | ఆరుద్ర | - యం. శేషాచలం అండ్ కంపెనీ - | 1967 |
| 139. సారస్వతవ్యాసములు (తృతీయసంపుటము) | : సంపా. డా. జి. వి. సుబ్రహ్మణ్యం | - ఆం. సా. అకాడమీ - | 1980 |
| 140. సారస్వతవ్యాసములు (నాలుగవసంపుటము) | : పరిష్కర్త పురిపండా అప్పలస్వామి | - ఆం. సా. అకాడమి - | 1971 |

శ్లో. ఇద మంధంతమః కృత్స్నం జాయేత భువనత్రయమ్ ।

యది శబ్దాహ్వాయం జ్యోతి రాసంసారం న దీప్యతే ॥

\- మహాకవి దండి

## అనుబంధము II

# ఆర్థికసాహాయ్యము

సహాధ్యాయులు (నవంబరు, 1986)

| | | |
|---|---|---|
| 1. | శ్రీ పి.హెచ్. నరసింహారావుగారు | రూ. 116-00 |
| 2. | ,, ఎమ్. రవీంద్రనాథ్‌గారు | 116-00 |
| 3. | ,, కె. ఎస్. రామకృష్ణగారు | 35-00 |
| 4. | ,, వై. ఎస్. ఆర్. కె. మూర్తిగారు | 35-00 |
| 5. | ,, కె. రమేష్‌గారు | 35-00 |
| 6. | ,, జి. వెంకటేశ్వరరావుగారు | 3 -00 |
| 7. | ,, టి. సత్యనారాయణగారు | 35-00 |
| 8. | ,, ఎస్. ఎమ్. బాషాగారు | 35-00 |
| 9. | ,, టి. వి. ఎస్. రావుగారు | 35-00 |
| 10. | ,, ఎ. హరిహరరావుగారు | 35-00 |
| 11. | ,, వై. రాఘవరావుగారు | 35-00 |
| 12. | ,, కె. నగేష్‌కుమార్‌గారు | 35-00 |
| 13. | ,, కె. లక్ష్మణప్రసాద్‌గారు | 35-00 |
| 14. | ,, జి. గౌరీనాథమ్‌గారు | 35-00 |
| 15. | ,, ఆర్. హేమంతకుమార్‌గారు | 35-00 |
| 16. | ,, ఎమ్. రవికిరణ్‌గారు | 35-00 |
| 17. | ,, జి. రమేష్‌గారు | 35-00 |
| 18. | ,, పి. వీరాంజనేయులుగారు | 30-00 |
| 19. | ,, కె. హరశంకర్‌గారు | 25-00 |
| 20. | ,, కె. వి. ఎస్. ఆర్. మూర్తిగారు | 25-00 |
| 21. | ,, ఐ. పాషాగారు | 25-00 |
| 22. | ,, ఎ. వి. రామమూర్తిగారు | 25-00 |
| 23. | ,, ఎన్. రామారావుగారు | 25-00 |
| 24. | శ్రీమతి వి. గిరిజగారు | 25-00 |

విద్యార్థులు

25. జూనియరింటరు విద్యార్థులు (నవంబరు, 1986) 1,992-00
26. సీనియరింటరు విద్యార్థులు ( ,, ,, ) 974-00
27. జూనియరింటరు విద్యార్థులు (జనవరి, 1988) 1,380-00

"కృతం సుదానం చ సదైవ తిష్ఠతి"

* * *

అనుబంధము III

## గ్రంథకర్త పరిచయము



పేరు :
వ్యయ్యూరు లక్ష్మీనరసింహారావు.
కలముపేరు : పృథ్వీశ్రీ.
జననము : 26-3-1955.
జననీజనకులు : మల్లికాంబ, కృష్ణమూర్తి.
నివాసము : సెలపాడు గ్రామము.

విద్య → ప్రాథమికవిద్య : ఎలిమెంటరీస్కూలు (సెలపాడు).
ఉన్నతవిద్య : జడ్. పి. హెచ్. స్కూలు (సంగంజాగర్లమూడి).
భాషాప్రవీణ : కె. ఎల్. ఎన్. సంస్కృతకళాశాల (తెనాలి).
P. O. L., : ఆంధ్రవిశ్వవిద్యాలయము (ప్రైవేటు).
M. A. Litt., : ,, ( ,, ).
M. Phil., : మదరాసువిశ్వవిద్యాలయము.
Ph. D., : నాగార్జునవిశ్వవిద్యాలయము.

గురువులు → పరోక్షగురువు : శ్రీ మైసూరుమహారాజాస్థానమహావిద్వాన్,
కావ్యకలానిధి, ఆశుకవికేసరి,
విద్యాభూషణ, శతావధాని,
శ్రీమదాంధ్రపద్మపురాణాదిబహుగ్రంథకర్త
కీ.శే. బ్రహ్మశ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రిగారు.

పాణినీయగురువు : 'వ్యాకరణవిద్యాప్రవీణ', 'ఉభయభాషాప్రవీణ'
బ్రహ్మశ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.
(రిటైర్డ్ లెక్చరరు, K. L. N. సంస్కృతకళాశాల, తెనాలి.)

కావ్యగురువు : 'సాహిత్యవిద్యాప్రవీణ' 'భాషాప్రవీణ'
బ్రహ్మశ్రీ మల్లాపూడి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.
(లెక్చరరు, K. L. N. సంస్కృతకళాశాల, తెనాలి.)

ఎమ్. ఫిల్., డైరెక్టరు : డా॥ శ్రీవి. రామచంద్రచౌదరి, M. A., Ph. D., గారు
(తెలుగుశాఖాధ్యక్షులు, మదరాసు విశ్వవిద్యాలయము)

పిహెచ్. డి., డైరెక్టరు : డా॥ శ్రీవై. బాలగంగాధరరావు M. A. Ph. D., గారు
(తెలుగురీడరు, నాగార్జున విశ్వవిద్యాలయము)

అముద్రితరచనలు : ౧. కుచేలోపాఖ్యానము - ఒకపరిశీలన.
(ఎమ్. ఫిల్., పట్టము పొందినలఘుసిద్ధాంతవ్యాసము)
౨. ప్రణయతరంగిణి (ఖండకావ్యము).
౩. పుష్పవిలాసము (ఖండకావ్యసంపుటి).
౪. రండిటు రండోయ్! (గేయకవితాసంపుటి).
౫. చంద్రశేఖరశతకము.
౬. సులోచన (నవల).
౭. ప్రణయారాధన (నవల).
౮. వ్యాసజ్యోత్స్న (సాహిత్యవ్యాససంపుటి).